# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౫.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩

# ఆరోగ్యసాధనము

గాంధిమహాత్మునిచే వ్రాయబడినది

వెల 8 అణాలు

# మహాభాషిత రత్నాకరము

గాంధిమహాత్ముని ఉపదేశములు

వెల 4 అణాలు

5 ప్రతులు రూ. 1-0-0

(వి. పి. ఖర్చులు ప్రత్యేకము)

ఒకప్రతి కావలసినచో అయిదు అణాలు
పోస్టుబిళ్లలు పంపిన వి. పి. ఖర్చులు తగలవు

## ఆంధ్రపత్రిక ఆఫీసు,

7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# స్వదేశీ కెమేరా

రు. **2-8-0** లకు మాత్రమే.

మంచి నిపుణుడగు ఫోటోగ్రాఫరువలె ఎంత చిన్నపిల్లవాడైనను యీ కెమేరాతో ఒకనిముసము




లోనే దేనినైనను ఫోటో దీయనచ్చును. ఒకనెల వరకు మేము సగమువెల 2-8-0 లకే యిచ్చెదము. మొదటిరకము 1-వ నెంబరు 5-0-0 లు. ప్రతి కెమేరాతోపాటు, అది వుపయోగించవలసిన విధమును, 24 పర్యాయములు ఫోటోదీయుటకు కావలసిన పరికరములు పంపబడును. పోస్టేజి ప్యాకింగు ప్రత్యేకము. మాషాపులో అన్నివిధములయిన ఫోటోలు, ఫోటో సామానులు దొరకును. ప్రతిచోటను యేజంట్లు కావలసియున్నారు. వివరములకు వీరికి వ్రాయుడు.

**BAJPEYEE & Co.,**
7, Neebutolla, Burra Bazar, Calcutta.(B.H.)

---

# బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి    పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకుడగు బసవేశ్వరునియు, తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు, గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గురిపించినాడు. గ్రంథము భిన్నభిన్నమండలములకు జెందిన పెక్కు తాళపత్రమాతృకలతో పరిశీలించి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందుగలదు. ఆకాలపుటపూర్వసారస్వత చారిత్రకవిశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త చేర్చికూర్చినారు. విద్యార్థిలోకమునకు, ఆధునికకవికుమారులకు నిది యత్యంతోపకారకము.

మేనేజరు : **ఆంధ్రగ్రంథమాల,** నెం. 7, తంబుశెట్టి వీధి, జి. టి. మద్రాసు.



విషయసూచిక

## చిత్రములు

త్రివర్ణములు—అక్షరాభ్యాసము; జడభరతుడు.

సాధారణములు—ప్రాచీనచిత్రములు ౮; థేమ్సు తపాలా బంట్రోతు; ప్రాణరక్షణి; ఇసుక మొసలి; సాయంసూర్యుని ముసిముసి నగవులు; అస్తమయము; డొరోతీ హెర్బర్టు కన్య; గురువు, శిష్యులు; పొంగలిపండుగకు; కామదహనము; నైగారా జలపాతము; వేలూరి దేవాలయ ద్వారపాలకుడు; శివసముద్ర జలపాతము; 'సలామ్'; విజయనగరం మహారాజావారి సంస్కృత కళాశాల; పుదుచ్చేరి లైటుహౌసు; పుదుచ్చేరి హార్బరు రెండు దృశ్యములు; వ్యంగ్య చిత్రములు ౩; ఇతర చిత్రములును.

---

ఈ సంచికలో పుటల అంకెలు తప్పుపడినవి. వానిని దిద్దుకొన ప్రార్థన.




చెన్నపట్టణము, మే ౧౯౩౩

సంపుటము ౧౦ శ్రీముఖ సంవత్సరము, వైశాఖమాసము సంఖ్య ౫


## ఎవడు చరితార్థుడు!


మం. వేంకటశర్మగారు


తనదొడ్డిలోనె పండినప్రత్తి సమకూర్చి
తను సొంతముగ నేకులను రచించి
తన చేతితో వడికిన నూలు తనయూరి
సాలె నేసినయట్టి చేలగట్టి
తనచేనిలో ఫలించిన పంటదినుసులు
తనయింటి పాడినే యనుభవించి
తన జన్మభూదేవతను చాల ప్రేమించి
తనబాసలో పాండితిని గడించి
తనదు మతసాంప్రదాయపద్ధతిని నడిచి
తనదు తనువు పరార్థదత్తము నొనర్చి
మించు సత్కీర్తిచే ప్రకాశించునట్టి
జనుడె చరితార్థు డాతని జన్మె జన్మ!

---

# ఆవృత్తి

శ్రీ ముక్తేవి లక్ష్మీనృసింహదాసుగారు, బి. ఏ.

నీదు కనుగొనలన్ భ్రమించినది, యొక్క
  తుది మొదలు లేక పెనవడ్డ దృష్టి మదీయ
జీవితాచ్ఛాదముగ నేర్పు సేసికొన్న
ధన్యజీవిని ప్రణయైకతత్పరుడను.

నీతనువు నిండి సౌందర్యనిభృతమైన
దివ్య మాకృతి కనులందు దీప్తి పుట్టి
వేయిజోతుల నారతి వెలుగ జూచు
ధన్యజీవిని ప్రణయైకతత్పరుడను.

నీకనులనీడ ప్రవాలి లోనికి చరించి
నామనోజవమునను పుణ్యము ప్రబుద్ధ
మాత్మ, జ్యోతిస్సు సంచార మలమికొన్న
ధన్యజీవిని ప్రణయైకతత్పరుడను.

కౌదమతనముల జీవితకుట్మలమ్ము
నరవిరియు లోన సర్వ మభ్యస్త మగుచు
అంతరింద్రియవిడుడ నై యలరు నేను
ధన్యజీవిని ప్రణయైకతత్పరుడను.

నీదు కనుగూడులందున నిలువలేక
తిరుగుడుల్ వడు దృష్టి లోబరచుకొన్న
త్రిభువనంబుల వెలిగించు దీప్తి తఱచు
ధన్యజీవిని ప్రణయైకతత్పరుడను.

ఈపరిభ్రాంతి మొదలయి యిగిరిపోవు
తుదిని కైవసముంగొన్న మొదలు వచ్చు
మగ్గమున నాసువోలిక మరలి మరలి
కెరలు ముక్తపదగ్రస్తకేళియట్లు.

---

# సూరిగారి దంత్యతాలవ్యములు

మిక్కిలినేని భగవంతరావుగారు

ప్రథమమునఁ బాణినీయవ్యాకరణము "ఇ చు య శా నాం తాలు", "ఌ తు ల సా నాం దంతాః" యని దంత్యతాలవ్యములఁ గూర్చి చెప్పినది. అనఁగా, ఇకారమునకు, చవర్గమునకు, య, శ, వర్ణములకుఁ దాలు వుత్పత్తిస్థానమనియు, ఌ వర్ణమునకు, తవర్గమునకు, ల, స వర్ణములకు దంతము లుత్పత్తిస్థానమనియు నర్థము. భాషాశాస్త్రజ్ఞులొక్కొకదాని కించుకంత భేదముతో జిహ్వాగ్ర దంతమూలముల సంయోగము శ్వాసనాదములచే విభక్తమగునపుడు దంత్యములు పుట్టుననియు, జిహ్వోపాంత్యకఠిన తాలువుల సంయోగము శ్వాసనాదవిభక్త మగునపుడు తాలవ్యములు పుట్టుననియు నించుకంత వివరించియున్నారు.

నన్నయగారు చింతామణి సంజ్ఞాపరిచ్ఛేదమున లఘ్వలఘువులగు నంతస్థల మైత్రీప్రసంగమున దంత్యతాలవ్యచజల మైత్రినిఁ జూపు సందర్భమున దంత్యతాలవ్యముల స్వరూపమును వివరింపక, "అద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వక్ర స్సాన్య స్మిథ స్సవర్ణశ్చ" యని చెప్పినాఁడు. అనఁగా "దంత్యచజ లత్వవిశిష్టములు, తాలవ్యచజ లెత్వవిశిష్టము"లని దీని యర్థము. ఈపైసూత్రమురచననుఁబట్టి చూడ నన్నయగారు దంత్యతాలవ్యములు సంస్కృతవ్యాకరణములలోఁ జెప్పఁబడినవనియు, నదియుంగాక తక్కిన యచ్చులతోఁ గూడిన దంత్యచజలుచ్చారణనుఁబట్టియే తెలియుచుండుననియుఁ దలంచి, "చేట, చేప, చేద" మున్నగుపదములు పామరజన వ్యవహారమున, "చాద, చాట, చాప"—ఈస్వరూపముగ నుచ్చరింపఁబడుటఁ గాంచి గ్రంథములలోఁగూడ నట్లే వ్రాయుదురనుభీతిచే నవి గ్రంథస్థము లగునపుడుమాత్ర మెత్వవిశిష్టములయియే యుండవలయు నను నూహతో "అ ద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వక్ర" యని దంత్యమున కత్వవిశిష్టత్వమునుఁ, దాలవ్యమున కెత్వవిశిష్టత్వమును నియమించిరి.

కాని సంస్కృతవ్యాకరణములలో, "ఇ, చు, య, శా నాం తాలు, ఌ, తు, ల, సా నాం దంతాః" యనిమాత్రము వాని కాయాస్థానము నిర్దేశింపఁబడ్డది. చవర్గమునకుఁ దాలవ్యతయే నిర్దేశింపఁబడ్డది గాని దంత[illegible]మెచటను నిర్దేశింపఁబడలేదు. అదియుంగాక, చేట, చేప, చేద, చాప మున్నగువానికిఁ దాలవ్య దంత్యతానిర్ణాయకము కాఁజాలదు. ఏయచ్చుఁ గూడిన తాలవ్యమో, యేయచ్చుఁ గూడిన దంత్యమో యందు నిర్దేశింపఁబడలేదు. కాన సంస్కృతవ్యాకరణములవలన నాంధ్రమున దంత్యతాలవ్యచజల భేదము నిర్ధరింప సాధ్యము గాదు. ఇఁక దంత్యతాలవ్యముల స్వరూప

ముచ్చారణమును బట్టి విదిత మగు ననుమాట పొసఁగని మాట. 'పిల్లను చంకఁబెట్టుకొని యూరంత వెతకిన'ట్లనుసామ్యము మనము వినుటలేదా? ఎంత విద్యావంతుఁడైనను భాషాశాస్త్ర మెఱుంగనిచో 'నీ వుచ్చరించు వర్ణములెట్లు పుట్టిన'వని ప్రశ్నించుచో నుచ్చరించినఁ బుట్టుననిమాత్రము సమాధాన మిచ్చును. నిగ్గఁదీసి యడుగుచో ఖసూచి కాఁగమానఁడు. మనము నిత్య ముచ్చరించు వర్ణములేగదా? వాని యుత్పత్తి మనము తెలిసికొనలేకపోవుటకుఁ గారణ మేమి? అందులోని రహస్యమే అది. భాషాశాస్త్ర మెఱుంగుచో వాని యుత్పత్తిప్రకార మంతయుఁ దేటతెల్లమగును. ఇట్లే శారీరకశాస్త్ర మెఱుంగనివాఁడు భూమి మీఁదినుండి లేచి యెట్లు నిలువఁగల్గినాఁడో, యెట్లు తిరుగఁ గల్గుచున్నాఁడో యెఱుఁగఁడు. అట్లే మనము దంత్యతాలవ్యములఁ నుచ్చరించుచున్నను వాని నిజస్వరూపము గుర్తెఱుంగుట కష్టము.

ఇట్టి పైయసమగ్రతను వారించి దంత్యతాలవ్యముల నిజస్వరూపమును దేటపఱుప నెంచియే చిన్నయసూరిగారు "ఇ, ఈ, ఎ, ఏ లం గూడిన చ, జ, లు తాలవ్యములు" (బాల. సం. ౮ సూ.); అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ లం గూడిన చ, జ లు దంత్యములు" (బాల. సం. ౮ సూ.): అని దంత్యతాలవ్యములకు నిష్కృష్టలక్షణముఁ జెప్పినారు. దీనివలన నాంధ్రభాషలో ఇ, ఈ, ఎ, ఏ లతోఁ గూడిన చవర్గ మెక్కడ కనఁబడునో యవి తాలవ్యములనియు, "అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ లం గూడిన చ వర్గ మెచట గనఁబడునో యది దంత్యమనియుఁ దెలిసికొననగును. చిన్నయసూరిగారి వివరణవలన పై నన్నయగారు చెప్పిన నియమము దంత్యతాలవ్యముల పూర్ణస్వరూపముగూడ లభించుట నన్నయకారిక (అ ద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వక్ర స్స్యా న్మిథ స్సవర్ణశ్చ) కంటె విశేష మున్నందున సవిశేష స్మరణీయము.

"దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు" (బాల. సంజ్ఞా. ౭ సూ.). ఈసూత్రము నన్నయగారి "అ ద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వక్ర స్స్యా న్మిథ స్సవర్ణశ్చ" అనుదానిలో "స్స్యా న్మిథ స్సవర్ణశ్చ" యనుపదములఁ దీసికొని రచింపఁబడ్డది. ప్రథమమునఁ జింతామణికి విపులవ్యాఖ్యానము వ్రాసిన యహోబలపండితుఁడు "అ ద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వక్ర స్స్యా న్మిథ స్సవర్ణశ్చ" అను శ్లోకపాదముయొక్క వ్యాఖ్యానసందర్భమున, "అన్యోన్యం యతిప్రాసయోః సవర్ణశ్చ భవే"త్తని వ్రాసి, "చదలేటి బంగారుజలరుహంబుల తూండ్లు భోజనంబులు మాకు పువ్వుఁబోఁడి" యనుపద్యము నుదాహరించినాఁడు. ఇట్లుదాహరించి" "సవర్ణశ్చ" యనుదానికి యతిప్రాసములలోనే దంత్యతాలవ్యములకు సవర్ణప్రతిపాదకముగా వ్యాఖ్యానము చేసియుండుటను జూచి యిచటి చిన్నయసూరిగారి "సవర్ణములు" అనుపదమునకు నదే యర్థము కల్పించుచున్నారు.

కాని "క, చ, ట, త, పాః పరుషాఖ్యాః" అను ద్వంద్వసమాసఘటిత శ్లోకపాదమును దీసికొని దాని నట్లే "క, చ, ట, త, ప లు పరుషంబులు, గ, జ, డ, ద, బ లు సరళంబులు" (బా. సం. ౫ సూ.) అని చిన్నయసూరిగారు వ్రాసిరి. నన్నయశ్లోకములోని చకారము తాలవ్యమని వ్యాకరణశాస్త్రము నెఱింగిన వారి కెల్లరకు విదితమే గదా? ఆద్వంద్వసమాసము నట్లే దీసికొన్న "క, చ, ట, త, ప లు పరుషంబు"లను చిన్నయసూరిగారి సూత్రములో చవర్ణము గూడఁ దాలవ్యమగును గాని దంత్యము గాదని వేఱ చెప్ప నవసరము లేదు. దీనినిబట్టి "క, చ, ట, త, పాః పరుషాఖ్యాః" యను నన్నయకారికలోను, "క, చ, ట, త, ప లు పరుషంబు" లను చిన్నయసూత్రములోను దంత్య చ జ ల కుఁ బ్రవేశమే లేదు. కాఁగా, చిన్నయసూరిగారు "ప్రథమలమీఁది పరుషంబులకు గసడదవలగు" (బా. సం. ౧౩ సూ.) అను సూత్రమునకు లక్ష్యము లిచ్చుసందర్భమున: అపుడు + చనియె = అపుడు సనియె | అపుడు చనియె | నను రూపముల నుదాహరించిరి. ఇచట 'చనియె' ననుపదములోని 'చ' వర్ణము దంత్యమగుట నిర్వివాదము. "క, చ, ట, త, ప, లు పరుషంబు" లను సూత్రములోఁ దాలవ్యమునకే పరుష సంజ్ఞ చెప్పఁబడినది గాని దంత్య చజలకుఁ జెప్పఁబడలేదు. దంత్యచజలకు బరుషసంజ్ఞ లేదు గాన "అప్పుడు + చనియె"ననుచోఁ, గ, స, డ, ద, వా దేశప్రాప్తియే లేకపోవలసి వచ్చుచున్నది. కావున "సవర్ణములు" అనుదానికి దంత్యచజలకుఁగూడ పరుషసరళసంజ్ఞాప్రతిపాదకత్వరూపార్థమును చెప్పవలసియున్నది. యతిప్రాసలయందుఁగూడ ప్రయోజన మైనను పరుషసరళసంజ్ఞాప్రతిపాదకత్వమందే తాత్పర్యము. కేవలము యతిప్రాసములయందే "సవర్ణములు" అనుపదమున కర్థము పొసఁగుబాటు కాదు. సూరిగారి ప్రధానోద్దేశ్యమదియే యని "దంత్యతాలవ్యంబులయిన చ, జ లు సవర్ణంబు" లను సూత్రమునకు వ్రాసిన వృత్తిలో "గ్రాహకము" లను శబ్దముయొక్క నిగూఢార్థము చెప్పుచున్నది. ఈ విషయమునే యహోబలపతి "స్థిరా ఇతరే" యను చింతామణిసూత్రవ్యాఖ్యాన సందర్భమున, "క, చ, ట, త, పాః పరుషాఖ్యాః, గ,జ,డ,ద,బా స్తు సరళాః" యని పరుషసరళసంజ్ఞల విధించి ద్వంద్వసమాసమగు నాశ్లోకములో దంత్యచజ లంతర్గతములు గామింజేసి "స్థిరా ఇతరే" యనుదానిచే దంత్యచజలకు స్థిరత్వము వచ్చిపోవు నను భీతిచే "సూత్రద్వయే సవర్ణత్వా ద్గ్రహ్యేతే దంతజౌ చజౌ; సా సంజ్ఞైవ తయో స్తేన నాన్యా సంజ్ఞా ప్రవర్తతే; సా సంజ్ఞైవ పరుషసరళసంజ్ఞైవ" అని సవర్ణశబ్దముచే దంత్యచజలకును బరుషసరళసంజ్ఞా ప్రతిపాదకత్వమును స్పష్టపఱచినాఁడు.

---

# ప్రతిబింబము

రాయప్రోలు సుబ్బారావుగారు



ఎందు కింత క్రూరంబుగా నెడలఁ బెడలఁ
జీల్చి చిందరవందర జేసివైతు,
వ్రేలఁబడిన యాకుటిలతమాలశిఖల
నిలువుటద్దాన కెదురుగా నిలిచి నెలఁత?

జొంపములుగొన్న యెలదోఁట శోకపెట్టి
చిక్కుఁడల్చు ఘాతుకులు నా స్మృతికి వత్తు
రబల, పరిమళపిచ్ఛిల మయిన నీదు
నీలసూత్రకులాయ దుఃష్పాలనమున.

మృదుల రుచిరుచిరము లయి కదలికల యొ
యారముల్ గురియఁగ మనోహరములైన
ఈ సుబద్ధ పుష్పంధయ న్యాస మేడ?
వెలఁది, నీచేతిధవళలవిత్ర మేడ?

ముసురుమోమును కినిసితో, కొసలు సాఁగి
వెనుదగులు నంచుఁ గోపింతె వనిత! యేఁ
అణఁచి స్నేహము లేక యాయంజనాద్రి
కాటుకపులుంగుమెఱుఁగు రెక్కలను ముడుతు?

శందెగాలికిఁ జెదరు నాషాఢమేఘ
పింఛములవలె నటు నిటు విరిసి కలియు
నట్టి యాయతసీకుసుమార్ద్రశయ్య
నగునె, తెల్లరంపముమీఁద నాఱవేయ?

---

# జనమంచి వెంకట్రామయ్యగారి కవిత్వము*

నిడమర్తి సత్యనారాయణ మూర్తిగారు, బి. ఏ. (సారస్వత సమాజము)

12

శ్రీ వెంకట్రామయ్యగారిని రాజమహేంద్ర పుర ప్రాంతవాసులు పెక్కుమంది యెఱుఁగుదురు. వీరు సహజముగ వినయగుణ సంపన్నులు. అపరిచితులకు మితభాషి, పరిచితులకు మధురభాషి. కవితయే జీవితసర్వస్వముగఁ గల వీరు కవిత్వమును గూర్చి మాటాడునపుడును, తమ పద్యములను జదివి విన్పించునపుడును స్వోత్కర్షకు స్థాన మీయక ఉత్తమ కవితయెడఁ దమకుఁ గల యాదరమును వెలిఁబుచ్చు చుందురు.

నేఁటి మనకవులను యంత్రములతోఁ బోల్పవచ్చును. యంత్రమునుండి యొకేమాదిరి వస్తువులు అరమర లేక వేనవేలు తయారగుచుండును. అటులే మనకవులును రీములకొలఁది కాగితములపై పద్యములను వ్రాయుచున్నారు. అవి యన్నియు నొకేమాదిరివి. భావమునందు గాని, భాషయందు గాని భేదమగోచరము. వెంకట్రామయ్యగారు ఏఁబదియైదు సంవత్సరములు దాఁటి ఉద్యోగమును విరమించిన వృద్ధులు; ఇప్పటికి వారు ౧౦,౧౧ సంపుటములను వ్రాయవచ్చును. కాని వారి పద్యరచన మంతయు గలిపి ౧౨౫ పేజీలకు మించదు. దీనినిబట్టి వారి కవితయందలి ప్రాశస్త్యమును గ్రహింపఁదగు. తుమ్మచెట్టు కాచినంత విరివిగ జహంగీరుమామిడి యెన్నఁటికిని గాయదుగదా!

ఏతత్ఫలములందలి రసనిష్పత్తి వాని సంఖ్యకు అవిలోమసంబంధమున (in the inverse proportion) నుండును. వీరి జీవితము అనేక కష్టములకు లోనైనది. వాని యన్నిటి నుండియు వీ రనేకగుణపాఠములను నేర్చుకొనిరి. సముద్రమును మథించినఁ గాని యందున్న వెలగల వస్తువులు పైకిరావు.(?)రసపూర్ణ ముగు హృదయమును కష్టపరంపరాగతమైన గాని సత్కవిత-హృదయమును ద్రవీభూతముచేయఁ గల కరుణగీతము—బహిర్గతము గాదు. వెంకట్రామయ్యగారి గీతము లిట్టివే. వీరి నవకుసుమాంజలి, అమృతకలశి, సోదరస్మృతి ఇందుకు నిదర్శనములు. మూఁటియందును వారియాదర్శములు, నమ్మికలు స్వచ్ఛములై ప్రకాశించుచున్నవి.

కష్టము లొక్కొకటిగ తన్నెదుర్కొని యాశాలతలు త్రెంపఁబడునపుడు,

* ఈ వ్యాసము భారతీ కార్యాలయము 12-12-32 దిన చేరినది. ఇటీవల శ్రీ వెంకటరామయ్యగారు దివంగతులయిరి. భా. సం.

సాగర యోగము మంచు(గొండపయి ని
శ్చలంబుగా నీవు(, గ
ల్పాగచ్ఛాయ సుఖాసనంబు గిరిక
న్యాసేవయుం గల్గ; నే
డీ! గర్గొందును బూను మింక(గలహా
ధివ్యాధిదారిద్ర్య సే
వాగర్వ్యాం బగు నాదు సంసరణమన్
పంచాగ్ని మధ్యంబునన్.

అనుచు నీశ్వరు నుద్దేశించి పలికి ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుచున్నాడు. ఇప్పు డీతనిస్థితి యేమన్న—

ఆరోగ్యంబు నెడెం; గుటుంబభరణా
యాసంబు హెచ్చెన్; సుతు
ల్వారల్ పైయధికారులైరి, మరి నే
నాముక్తి భాగ్యంబునన్
మారస్థంబగు; జీవితంబు వెగటై
తోచున్; మఱేమన్న ని
న్నారాధింతు నటన్నయాశ యొకటే
యాలంబమై నిల్పెడున్.

అందుచేతనే యితడు వినీతుండై,

నేలం బ్రాకెడి పూవు(దీగవలెనే
నే నుందు నోదేవ! న
న్నీలోకంబున కేల దెచ్చితివొ నా
కెచ్చోటు నేమించితో,
పూలా పూవను, మొగ్గలా తొడువనున్,
ప్రేమోడ్డైన( గానుం, బసుల్
కాలం ద్రొక్క(గ సుక్కు చుందు నిది నా
కర్మంబె సర్వేశ్వరా.

తన రోగార్తిని జెప్పుకోదగును వై
ద్యశ్రేష్ఠుతో, మందు ని
మ్మని కోరందగు, నంతె గాక యిదుమి
యాహందు నీమందటం

చనరా, దట్టులె నేను నీకృప నే
యాచింతు నన్నింటికిం, బని
లేదొక్కటి నొక్కి వేడ(గ నహం
భావంబుతో నీశ్వరా!

ఇతడును పూర్వకవిప్రవరులవలె 'భగవత్పాద నిరంతరస్మరణ తత్పరభావముకల్మి నాత్మసమ్మోదము వొందు కావ్యరసముంగొని యాడుచునుండు నెప్పుడున్'. అట్టివానికి కవనము చెప్పుట 'ఉబుసుపోకపని' కాజాలదు. ఇతనికి కవితయెడల గల భావ మిది:

కవనం బన్నను గాజుకుప్పె(గొనితే(
గాసంతగంగాజలం
బవునే? పెద్దల కెల్ల దాహశమనం
బై యొలలాడంగ(ద
చ్ఛివమూర్థోపరిఖేలదంబరధునీ
దివ్య ప్రభావంబులన్
భువి( బాటింపవలెన్ భగీరథతపః
పుణ్యంబునన్ గన్యుడై.

క్రొత్తత్రోవ ద్రొక్కి క్రొత్తసీమల( జూపి
క్రొత్తచవుల( దేల్చి చిత్తములకు(,
క్రొత్తవికసనంబు( గూర్పని యాకైత,
సెప్పి యేమి యింక( జెప్పకేమి?
తత్త్వవేత్తకు నేది సత్యముగ( దోచు
నదియె సౌందర్యరూపమై యమరు( గవికి,
జండమార్తాండ తేజః ప్రసారమె గద
నిండుచందురు పండువెన్నెలగ మాఱు!

ప్రకృతి యను రాణి యాస్థానరమ్యభూమి(
జేరి సేవింతు రెందఱో వారిలోన,
నాంతరంగికు లెవ్వారు నరయ( గారు
యోగమహితుండు కవివరుండొకడుదక్క.

ఇట్టి భావములచే బ్రేరితుండైన యితడెంతవఱకు( గృతకృత్యు( డాయెనో చూత

14

ము. ఇందు కీతని సోదరస్మృతి చూడఁదగినది. ఈసోదరుఁడు బి. ఏ., యల్. టి. ప్యాసయి యుపాధ్యాయపదవియం దుండఁగ మృతినందెను. అన్నదమ్ము లిర్వురును నపూర్వవాత్సల్యబద్ధులు. అందుఁ దమ్ముఁడు—

తనువుఁ బీడు క్షణంబుదాఁక నిజక
 ర్తవ్యంబులన్ వర్తిలం
జను మర్త్యుం డనుచున్ వచింతు వటులే
 సారించి తౌరా తగన్
శనివారంపుబడిం బనుల్ సలిపియా
 సాయంబెనీవయ్యయో,
కనులన్ మూసితి, మూసి మాకనుఁగవల్
 కన్నీటితోఁ దమ్ముఁడా.

వీరియపూర్వబంధము లెట్టి వన,

అన్న యశక్తుఁ డం చెపుడు
 నారయుచుందువు నాసుఖంబునే,
చిన్న యటంచు నేమరక
 నేమముఁ గోరుదు నీదు నేమమే
యెన్నఁగ సత్యముద్రితము
 నీమన ప్రేమధనంబు నింక నీ,
చిన్ని యనుంగుబిడ్డలకుఁ
 జేర్చెద నమ్ముడి సొత్తుపోలికన్.

ఇట్టితమ్ముని గూర్చి వ్రాసిన యీగీతము మిక్కిల హృదయాకర్షకముగ నున్నది. దీనిని ఆంగ్లకవిచంద్రుఁడగు టెనిసను వ్రాసిన Inmemorium తోఁ బోల్పనగు. కరుణమునకును, జీవితము నెడల నితనికిఁ గల యభిప్రాయములకు నిది యొక పసిండిగని.

మొట్టమొదటగనే,

ఏడ్చెను రాఘవుండు మును
 పిమ్మటి సొమ్మసిలంగ లక్ష్మణుం
డేడ్చెను భీమసేనుని సు
 కృత్రిమపు స్మృతి వించు ధర్మజుం
డేడ్చిరి యంతవారె యెటు
 లేడ్వకయుందును భామరుండనై
యేడ్చితి నేను గూడ నిను
 మృత్యువె యీడ్చుకపోవఁ దమ్ముఁడా.

అని యారంభించెను. అంతటితో నాఁగక వారి పరస్పరసాహచర్య స్మృతిచిహ్నముల నిట్లు చెప్పెను:

నీకూర్పాసము నేఁ బయిం దొడుగుదున్
 నీపాగ నేఁ జుట్టుదున్
నీ కష్టంపడి కట్టినింట నిలుతున్
 నిత్తీవు నాయాత్మలో
నీ కన్నట్టి యనుంగుబిడ్డల నికన్
 న్నేఁ జూతు నీకంటెనే
నీకు న్నాకు విభేద మెక్కడిది నే
 నే నీవుగా తమ్ముఁడా.

అశీగితి వొక్కనాఁడు హృద
 యార్తి ఘటిల్ల నపాయశంక న,
న్నిడుకొని నీవు ప్రక్క నిఁక
 నీశ్వరతత్త్వముఁ జెప్పుమంచు, నాఁ
డడిగినదానిఁ దెల్పుటకు
 నాదరు వేదియు లేనివాఁడనై
యడఁకు నీవువచ్చిన భ
 యంబిపు డేమని యూఱడించితిన్.

ఎంపం గట్టెలు గొట్టు మాలలకు నో
 రెండం గృపన్ వాంఛ దో,
కుండం బోసితి వత్తి నీవు మెతుకుల్
 కొం కింతయు న్లేక నీ
యండం జేరిన కుక్కపుండులకు మం
 దంటించి కాపాడి తీ
రెండుం జెప్పకె చెప్పు నీదు సమద
 ర్శిత్వంబు నోతమ్ముఁడా.

నామార్గంబులు కొన్ని నీ కలవడన్
 సంతోషముం బొందితిన్
నీమార్గంబులు నాకుఁ బట్టువడమిన్
 జింతింప నంతగా
నే మన్నన్ నినుఁ గూడియుండఁగను నా-
 కేలోపమున్ లేక పూ-
ర్ణామోదంబును జేరుఁ బెంపుఁ గల వం-
 చాసించితిం దమ్ముఁడా.

జీవితము, మృత్యువు నను నీ రెండు విషయములయెడ కవికిఁ గల భావము లిందు వ్యక్తములు. ఇవి రెండును ఒకే విలాసము యొక్క స్థితిభేదము లనియు, వీనియందు మన మడలవలసిన దేమియు లేదనియు నితఁడు మనోహరముగ వర్ణించినాఁడు—

ఆవలియొడ్డుఁ జేరి కుతి
 యారఁగఁ గ్రోలుము స్వచ్ఛజీవనం,
బీవలియొడ్డునం బసుల
 యొక్కుడు ద్రొక్కుడుచే జలంబు పం-
కావిల మయ్యె నైన నదె
 యంబరగంగ యటన్న పూర్ణసం
భావనఁ జేసి త్రావుదుము,
 వాస్తవ మట్టిద కాదె తమ్ముఁడా?
మన గోదావరిమీది వంతెనగ సం
 భావింతునో తమ్ముఁడా!
అనుభూతం బది నీ కయోమయము నా
 కామృత్యు వా సేతువ
ట్లనువై యుండును రాకపోకలకు భూ
 మ్యాకాశ సీమంబులన్
జనుచుండ్రే పటువాసనాపశు లటన్
 సంసార యాత్రాపరుల్.
పామం దాత్మకు నూత్న జీవితము సం
 భావింపగా గల్గుటన్
మరణం బెట్లగు దుఃఖకారణము?
 జన్మం బేయదొ నచ్చటన్;
మరణంబే యగు మర్త్యలోకమున జ
 న్మం బందుటల్ తర్చుగా
మరణంబున్ జననంబు రెండు నొకటే
 మాయావిలాసం బహో.

ఈ భావమును స్థిరపరుచుకొనుట కితఁడు ఐనిసనువలెనే నవీనశాస్త్రార్థములను సుగమముల నొనర్చి గైకొనుటలో నేర్పరి:

కదలిక లేక యేయణువు
 గాని జగంబున నిల్చియుండ నే-
రదు; పరిణామముం గనుచుఁ
 బ్రాఁకెడు మెల్లగ ముందుముందుకుం
గదలని ప్రానిక్కఁ జీమవలె
 గమ్యముఁ జేరెడుదాఁక; నంతటన్,
గదిసి మహేశుఁ బంటగడి
 కాయ విఘంబునఁ బొల్చుఁ దమ్ముఁడా.

ఉత్తమ కవితకు వలసిన యుత్సాహమును, యోగబుద్ధియు నితనియం దమరియున్నవి. కవితావేశ మంకురించిననే గాని యితఁడు వ్రాయఁడు.

ఆడక యాడుదున్ శ్రుతిర
 హస్య మెఱింగినవాఁడవోలె నేఁ
బాడక యట్లె పాడుదు న-
 పారముగా సుఖపారవశ్యముల్
మూడక మూఁగ నర్థమును
 సూరిజనంబులు తత్త్వముం బలెన్,
నేఁ డిది యేమొ నాహృదిని
 నిల్చి వెలుంగ శివుండు తమ్ముఁడా.

అనుట యితనియం దతిశయోక్తి కాదు. ఇట్టి స్థితి యితనికి సర్వసామాన్య మనుట కీ పద్యము సాక్షి:

ఒడలన్ దుర్గతి యంటినట్టు లగు, నా
యుస్పర్శముం గాదు; న
న్నిడలం జేర్చెడు నొక్కబోటి కయినం
గా దంధకారంబునన్;
గడెయుం గంటయు జామునుం దెలియవై
నన్ నిద్రయుం గాదు బ
ల్విశిష్టమై వృత్తివిశేష మొండు హృదయా
విర్భూతమై యీశ్వరా.

ఈ భావ మితనియందు తిరమగుటచే నిట్లు పల్కుచున్నాఁడు:

జననీ, నీదు కృపాకటాక్షమున వా
క్సామ్రాజ్యధౌరేయతం
గనఁగంటిం గనఁగల్గి క్రొత్తవెలుగుం
గల్యాణి, నీమోమునన్,
జననం బందుచు నేఁడు క్రొత్తగను నీ
సౌవర్ణగర్భంబునం
గనెదం గ్రొత్తప్రపంచ మొం డిదె నమ
స్కారంబు వాగీశ్వరీ.

తన్మయుఁడై యితఁడు పల్కిన పల్కులు మనసు నాకర్షింపఁజాలినవి యై యున్నవి. 'నవకుసుమాంజలి', 'అమృత కలశి', 'సోదరస్మృతి', 'కరుణగీతము' మొదలగునవి ఎన్నిసారులు చదివినను చదువవలెననెడి యాసను బుట్టించును. వీనియందు వ్యక్తమగు విషాదము మధురమై, హృదయాకర్షకమై, భావప్రబోధకమై యున్నది. పోతనామాత్యుని భ్రమరగీతములు, గోపికావిరహవేదన మొదలగువానిని చదివిన నెట్లుండునో పైఁజెప్పిన యితనిపద్యములను జదివిన నట్లుండును. ఇతని కవిత గుణమునందు ఉత్తమమైనది.

కాని యితనిరచన లత్యల్పములు—అనఁగా విరివి తక్కువ. గుణమునకు తగిన విరివి లేదు. సత్కవిత యరుదుగఁ గన్పించుచున్న యీ రోజులలో వీరి గీతములు పలువుర నలరింపవలసినదే. కాని యేలాకో, వానికి రావలసిన ప్రచారము లభింపలేదు. దీనికి కారణము చదువరులలోఁగల రుచిలోపమని నాయూహ.

'క్రొత్తత్రోవ ద్రొక్కి క్రొత్తసీమలఁ జూపి
క్రొత్తచవులఁ దేల్చి చిత్తములకుఁ
గ్రొత్తవికసనంబు' గూర్చు కవితఁ గూర్చి
ధన్యజన్ముఁ డయ్యెఁ దథ్య మితఁడు.

# వసంత శ్రీముఖము

వోలేటి పార్వతీశము గారు
(కవిరాజహంస)

౧

పట్టుదప్పినజీర్ణ పత్రంబు లూడ్చి
పల్లవించెడువనస్పతులను జూచి
పొగమంచుముసుఁగుదూ బూచులఁ ద్రోచి
నెఱనిగ్గు నించువెన్నెలనీటుఁ జూచి,
కట్టి గొంతు బిగించు కాలంబుఁ గడపి
గాన మాలాపించు కలకంఠిఁ జూచి,
నవనవోజ్జ్వలతరానంద తేజమున
విలసిల్లి కళదేఱు విశ్వంబుఁ జూచి,
మరల నార్యావర్తమంగళాస్థాని
శాంతిసౌభాగ్యముల్ సవరింపఁ జూచి,
ఘనవసంత శ్రీముఖముతీరుఁ జూచి,
సాధనంబును జూచి, సమయంబుఁ జూచి
మడిమ ద్రిప్పక స్వధర్మపథంబుఁ బట్టి
నడువుఁడీ కవ గూడి నాయన్నలార !

౨

కొలఁదిగొప్పతనాలు కొఱకొఱ వెట్టఁ
బదవులయదవద భ్రమసిపోయితిరి ;
బొట్టులు, జుట్లు, తప్పలు కుప్పవెట్ట
నంటుముట్టుల గోల నదరిపోయితిరి ;
లోవెలివాడలు లోపాలు రేప
వెలివిడుగడలతో విసిగిపోయితిరి ;
సౌభ్రాత్రసౌహార్దసహనముల్ దొలఁగ
నన్యోన్యవైరాల నలసిపోయితిరి ;
నిలిచిన స్వర్గంబు నిరయంబుఁ జేసి
పడరానిపాటుల బడలిపోయితిరి ;
చేసినపాపాలు చెప్పుచు నోట
నిఁకనైన నన్యోన్య హితమతు లగుచు
మడిమ ద్రిప్పక స్వధర్మపథంబుఁ బట్టి
నడువుఁడీ కవ గూడి నాయన్నలార !

౩

పరమార్థనిధియైన భారతభూమి
పైనకుఁ గొఱగాని పాడగుచుండ,
పరమర్షిమయమైన భారతభూమి
పలుగాకి మూఁకల పాలగుచుండ,
పరమపావనమైన భారతభూమి
పాపతాపంబుల భారమౌచుండ,
పరమధామంబైన భారతభూమి
బానిసతనములోఁ బడి క్రుంగుచుండ,
సత్యదయాధర్మ శాంతవీచికల
దీనభారతమాతఁ దేలింపకుండ,
నార్యసంతతివార మనుకొనుమనము
కనుమూసికాలంబు గడపుట తగునె ?
మడిమ ద్రిప్పక స్వధర్మపథంబుఁ బట్టి
నడువుఁడీ కవ గూడి నాయన్నలార

---

# సారంగధర చరిత్ర

(గ్రీకు, రోమక, కథామూలములు)

రుద్రాభట్ల ప్రకాశరావుగారు, బి. ఏ., యల్. టి.

/8

౧

సారంగధరచరిత్ర మనదేశములో బాగుగా వ్యాపించియున్నది. ఈవిచిత్రకథ విననివారు తెనుగుదేశములో లేరని చెప్పవచ్చును. ఈకథను మూడువందల సంవత్సరములక్రిందట విజయవిలాస ప్రబంధకర్తయగు చేమకూర వెంకటకవి పద్యకావ్యముగా రచించెను. జైమినీభారతవచనకర్తయగు సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు వచనగ్రంథముగా రచించెను. 'చంద్రశేఖరా, మంగళాకరా' అనుమకుటముతో శారదరామాయణమువంటి పదరూపమునకూడ నీకథ రచింపబడి పాటకజనులలో విశేషవ్యాప్తి గనుచున్నది. భీమన యనునొకకవి దీనిని ద్విపదకావ్యముగా రచించెనని తెలియుచున్నది. ఇటీవల శ్రీమాన్ ధర్మవరం కృష్ణమాచార్యులవారు దీనిని విషాదాంత నాటకము (Tragedy) గా రచించియున్నారు. రాజమహేంద్రవరపురములో స్థలజ్ఞులొక మెట్టను చూపి "ఇదిసారంగధరుని మెట్టు" యని చెప్పుచున్నారు. 'చిత్రాంగి' యనగా స్వప్రయోజనార్థమై యెట్టిఘోరమునకైన సంశయింపని సాహసముగల పాపిష్ఠిస్త్రీ యనునర్థము రూఢమగుచున్నది.

లోకములో నిన్నివిధములుగా వ్యాపించియున్న యీచిత్రకథకు చరిత్రమూల మేమియు గాన్పింపదు. రాజనరేంద్రునకు రత్నాంగియనుభార్య యున్నట్లుగాని, చిత్రాంగియను చిన్నభార్య యున్నట్లుగాని, లోకములో నిపుడు వ్యాప్తిలోనున్న విషాదకథ నిజముగా జరిగినట్లుగాని శాసనాదులను చరిత్రసాధనము లేవియు లేవు. పద్యకావ్యము రచించిన చేమకూర వెంకటకవి రాజరాజనరేంద్రునకు 'మాళవపతి' అని నామాంతర మిచ్చుటచే నాయనయైన రాజనరేంద్రుని యాంధ్రరాజుగా తలపవలసియున్నది.

చెనో లేదో తెలియదు. రాజనరేంద్రుని యాస్థానమందుండిన నన్నయభట్టారకుని మరణానంతరము ఆరువందల సంవత్సరములకు బయల్పడిన 'ఆంధ్రశబ్దచింతామణి' ప్రశంసలో, అప్పకవీయమునందున్న యీక్రింది పద్యములలో సారంగధరుని పేరు మొదట వినవచ్చుచున్నది.—

గీ. "రాజరాజనరేంద్రతనూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బకనంబొనర్చె
నన్య లెవ్వ రెఱుంగ రీయాంధ్రఫక్కి."

క. "ఆలోకనుతుఁడు మున్నటి
కీలకసమ నామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలిఁ దెనుఁగు టీక దాని కొప్పుగఁ జేసెన్."

ఇదియంతయు తనయద్భుతకల్పనల కాధారముగా నుండుటకయి బుద్ధిమంతుడగు నప్పకవియే కల్పించినాడని కీ. శే. రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగముగారు తమకవులచరిత్ర ప్రథమభాగము (Revised in ౧౯౧౭) లో నన్నయభట్టు చరిత్రమునందును, అథర్వణాచార్యుని చరిత్రమునందునుగూడ వ్రాసి ప్రకటించియున్నారు. అప్పకవియు, సారంగధరచరిత్రను పద్యకావ్యముగ రచించిన చేమకూర వెంకటకవియు, వచనకావ్యము రచించిన సముఖము వేంకటకృష్ణప్పనాయకుడునుకూడ ౧౭-వ శతాబ్దములో నుండినవారే. అప్పటినుండియే యీకథ యీదేశములో వ్యాపించిన ట్లున్నది. చరిత్రాత్మకము కాకున్నను దేశములో నిట్లు వ్యాపించియున్న యీకథకు మూల మేమైన కలదా? అని యోచిం

## ౨

ఈమధ్యను నేను గ్రీకు రోమకకవులు రచించిన కొన్ని ప్రాచీననాటకముల చదువుచుంటిని. క్రీస్తుశకమునకు పూర్వమువాడైన 'యూరిపిడస్' (Euripedes) అను గ్రీకుకవిసత్తముడు రచించిన 'హిప్పొలిటస్' (Hippolitus) అనునాటకమును చదివితిని. మన సారంగధరనాటకముఆగ్రీకునాటకమును పోలియున్నదని నాకు తోచినది. పిమ్మట కొంతకాలమునకు 'సెనెకా' (Seneca) అనురోమకకవి రచించిన (Hippolitus or Phaedra) 'హిప్పొలిటస్ లేక ఫేడ్రా' అను నాటకమును చదివితిని. ఇది చదివినతరువాత మనసారంగధరనాటకము తప్పక యీరోమకనాటకమువిూద నాధారపడియున్నదని నాకు స్పష్టమైనది. ఇట్లుండగా నీమధ్యనొకనాడు నేను మామిత్రులు, ఇచటివకీలు నగు మ. రా. శ్రీగొబ్బూరు వెంకటానంద రాఘవరావు పంతులు (B. A.) గారితో ప్రాచీనవాఙ్మయాంశములను గూర్చి మాటలాడుచుంటిని. ఆసందర్భములో మన వేదబ్రాహ్మణపురాణాదులందు గల కథలు, గాథలు, అనేకములు గ్రీకు. రోమకగాథలలో నగుపడుచున్నవని వారు నాకు తెలిపిరి. మనసారంగధరచరిత్రకు మాతృకలని చెప్పదగిన నాటకములు రెండు గ్రీకు, రోమకవాఙ్మయములలో కానవచ్చెనని నేను చెప్పినపైని, ఆమూలములను వ్యాసరూపమున వెంటనే ప్రకటింపవలయునని వారు నన్ను ప్రోత్సహించిరి. ముందు, మూలకథను క్లుప్తముగా చెప్పి పిమ్మట యూరిపిడస్ వ్రాసిన నాటకకథను, తరువాత సెనెకా వ్రాసినకథను వరుసగా వ్రాసెదను. ఆరెండింటిని శ్రద్ధగాపోల్చి పరిశీలించినపక్షమున ఆరెండునాటకములకును, మనసారంగధర నాటకమునకును గల సామాన్యధర్మములన్నియు ప్రత్యక్షముగా గోచరింపగలవు.

## 3

మూలకథ—గ్రీసుదేశమున థీస్యూస్ (Theseus) అను రాజుండెను. అతనితొలి భార్యకుమారుడు హిప్పొలిటస్. ఆరాజకుమారు డతిసుందరుడు, నీతిమంతుడగు యువకుడు.

రాజు రెండవసారి ఫేడ్రా అను క్రీటనురాజపుత్రిని వివాహమాడెను. ఈమెకు సవతికుమారునిపై మోహావేశము కలిగెను. అంతలోనే రాజు కార్యాంతరాసక్తుడై దేశాంతర మరిగెను. కొంతకాలమైనగాని తిరిగి రాలేదు. ఫేడ్రాకు సవతికుమారునిపై మోహ మతిశయించి దుర్భరమగు నవస్థ కలిగించుచుండెను. విరహాగ్నిచే నామె తపించుచుండగా రాకుమారు డొకనాడామెయంతఃపురమునకే వచ్చెను. కొంతతడ వామెయాతనితో సాభిప్రాయముగా సంభాషించి, ప్రయోజనము గానక పట్టరాని ప్రేమావేశముతో తనకామ్యమునాతనికి స్పష్టముగా తెలిపి, కనికరింపుమని ప్రార్థించి తుద కాతనిమీద పడెను. ఆగ్రహపరవశుడై హిప్పొలిటస్ పిశాచమువలె మీదపడిన కాముకిని చంపనెంచి కత్తినెత్తి, స్త్రీహత్య పాపమని చింతించి ఆప్రయత్నము మాని ఖేదముతో మతిచెడి కత్తి నక్కడనే విడిచి యరణ్యమార్గము పట్టెను. ఫేడ్రా మూర్ఛపడిపోయెను. నిజము బయల్పడినచో ఆమెకు గౌరవహానికలుగునని భయపడి ఆమెదాసి రాకొమారుడు సవతితల్లిని బలాత్కరించి పారిపోవు చున్నాడని కేకలు పెట్టెను. యువకు డచ్చట విడిచినకత్తి నిదర్శనముగా వచ్చినవారి కామె చూపసాగెను.

అంతలో రాజు స్వగృహమునకు మరలివచ్చి చిన్నిభార్య ప్రాయోపవేశ నిశ్చయములో నున్నట్లు విని సంభ్రమముతో నామెమందిరము ప్రవేశించెను. హిప్పొలిటస్ తన్ను బలిమిని చెఱచెననియు, తొందరలో కత్తిమరచి పారిపోయెననియు ఫేడ్రా రాజుతో కొండెములు చెప్పి కత్తి చూపించెను. రాజు కోపముచే మండిపడి కుమారుని పిలిపించి మరణదండన విధించెను. ఇట్లకాలమృత్యువు పాలబడిన తనమనోహరుడగు రాకుమారునిశవమును చూచి, ఫేడ్రా విరహతాపముచేతను పశ్చాత్తాపముచేతను జీవింపనేరక తానుచేసినఘోరకృత్యమును బహిరంగముగా తెలియచెప్పి ఆకత్తితో పొడుచుకొని తాను చచ్చిపోయెను. ఉత్తరక్రియలు జరిపి దుఃఖము పట్టలేక రాజుకూడా మరణము నొందెను.

# ४

## ప్రోలోగ్ ¹

రంగము: ఏతెన్సుకోటముందు

యూరిపిడస్ రచనము:

వీనస్ ² అను దేవతకు హిప్పొలిటసు పైని కోపము వచ్చినది. కారణ మేమనగా ఆరాజకుమారుడు డయానా ³ నే పూజించునుగాని వీనస్‌ను పూజింపడు. వీనస్‌కు డయానాపై విరోధమున్నది. కాబట్టి వీనస్ దేవత, హిప్పొలిటస్ పైని ఫేడ్రకు గాఢమైనప్రేమ జనింపజేయును. రాజున కీయంశము తెలిసి కుమారుని చంపగలడు. అందువలన హిప్పొలిటస్ పైని వీనస్‌కు గల కసి తీరును. ఇట్టికుట్ర పన్నుటకు వీనస్ ఏర్పాటు చేసుకొనెను.

హిప్పొలిటస్ వేట చాలించి డయానాదేవత నారాధించును. వృద్ధుడు, అనుభవశాలియైన యొకఉద్యోగస్థుడు వచ్చి వీనస్ దేవతనుకూడ ఆరాధింపుమని హిప్పొలిటస్‌కు హితవు చెప్పును. రాజకుమారు డది వినక ఆయుద్యోగిని కసిరి వెళ్లిపోవును.

'కోరసు' ४ ప్రవేశించును. కొంతమందిస్త్రీలు వచ్చి ఫేడ్రరాణి దుఃఖముతో కృశించుచున్నదని తెలుపుదురు.

అసమయమున రాణి మేలిముసుగు వేసుకొని ఒకముసలిదాసితో కోటద్వారమున వచ్చును.

సెనెకా రచనము:

హిప్పొలిటస్ రాజకుమారుడు వేటాడుదుస్తులతో వలలు మొదలగునవి పట్టుకొని అనుచరులకు వేట విషయమైనపనులు ఏర్పాటుచేసి వేట జయప్రదముగా జరుగుటకు డయానాదేవతను ప్రార్థించును.

### మొదటి ఎపిసోడ్ ⁵

యూరిపిడస్ రచనము:

ఫేడ్ర సవతికుమారుడయిన హిప్పొలిటస్ పైగల గాఢప్రేమచే కృశించుచున్నదని ఆమెదాసి కనిపెట్టి అస్వాభావికచర్యకు నిస్గ్రహించును. ఫేడ్ర అది తెలుసుకొని కామము బలవత్తరమైనదనియు, చెడుబుద్ధి మరల్చుకోరాని దనియు, అందుచే తనకు చావే గతియనియు చెప్పగా దాసి ఓదార్చి, రాకుమారుని కీవృత్తాంతము తెలియచెప్పుదునని చెప్పును. ఫేడ్ర అందుకు సమ్మతింపకపోగా మందు తెత్తునని మిషతో దాసి పైకి వెడలిపోవును.

సెనెకా రచనము:

ఫేడ్రరాణి దాసితో ప్రవేశము. సంభాషణ. హిప్పొలిటస్‌పై జనించిన మన్మథాగ్నిచే రాణి కుంది కృశించుచున్నదని దాసి గ్రహించును. అట్టిమోహము కూడదని దాసి వారింప యత్నించును. ఫేడ్ర తనజీవనము దుర్భరమనియు, మరణమే శరణ్యమనియు తెలియపలుకును. మరణోద్యోగము మానుమనియు, హిప్పొలిటస్‌ను ఒప్పించి తీసుకొనివచ్చెదననియు దాసి ధైర్యము చెప్పి పైకి వెడలును.

### మొదటి కోరల్ ఇంటర్ లూడు ⁶

యూరిపిడస్ రచనము:

కామాంధులై అపరిమితప్రేమకు ఆహుతి కాకుండుటకు కోరస్‌గాయకుడు దైవమును ప్రార్థించును.

---

1. ప్రోలోగ్ అనగా నాటకారంభ మందలి ప్రస్తావన.

2. వీనస్ (venus)—ఈమె రోమనులచే పూజింపబడు నొకదేవత. ప్రేమసౌందర్యము లీమెవశములు. ఈమెనారాధించువారి కీమె వాటిని ప్రసాదించును.

3. డయానా: ఈమెకూడ రోమను లారాధించు నొకదేవతయే. చంద్రసంబంధమైనదేవత. మనము చంద్రుని పురుషునిగా నెంతుము; పాశ్చాత్యులు స్త్రీగా నెంతురు. పాశ్చాత్యుల వేటకును ఈమెయే అధిదేవతయని పాశ్చాత్యులమతము.

४. కోరస్ అనగా గ్రీకు నాటకములలో గాయకుడు కథాసందర్భములనుగూడ ప్రేక్షకులకు తెలుపుచుండును.

5. ఎపిసోడ్ (Episode) అనగా ఉపాఖ్యానము.

6. కోరల్ ఇంటర్‌లూడ్—పాశ్చాత్యనాటకములలో గాయకుడు తెల్పుమధ్య కథా సందర్భము.

సెనెకా రచనము:

మన్మథావేశమునుండి మనస్సును మరల్చుకొనుట ఎవరికిని సాధ్యముకాదని కోరస్‌గాయకుడు పాట పాడును.

## రెండవ ఎపిసోడ్

యూరిపిడస్ రచనము:

ఫేడ్ర భయకంపితయై గాయకుడు కోరస్‌తో లోపలజరుగుచున్న సంభాషణధోరణి వినుమని చెప్పును. లోపల దాసి రాకుమారునితో సంభాషణలో ఎవరికిని చెప్పనని ఒట్టుపెట్టించుకొని పిమ్మట అతనిపై సవతి తల్లికి దుర్భరమైన మోహము కలిగెనని తెలియచెప్పును. అది విని రాజపుత్రు డాగ్రహోదగ్రు డగును. తాను పెట్టుకొనిన ఒట్టునకు కట్టువడి యుండవలసివచ్చెనుగాని లేకున్నచో నీదురంతము తండ్రిగారికి తెలియచేసియుందునని బెదిరించును.

ఫేడ్ర దాసిపై కోపపడును. గతించినదానికి వగచిన ప్రయోజనము లేదనియు, గౌరవహాని రాకుండ ప్రాణత్యాగము చేయక తప్పదనియు నిశ్చయించును.

సెనెకా రచనము:

దాసి కోరస్‌తో రాణిపడుచున్న విరహబాధ సంగతినిగూర్చి మాటలాడును. ఈసమయముననే కోట తలుపులు తెరువగా రాణి మంచముపై కూరుచుండి చెలికత్తెలతో నుండును. ఆమె అలంకారములను, తన పదవికి తగిన దుస్తులుధరింపక వేటదుస్తులనుమాత్రము ధరింప కోరికగలిగినట్లు తెలుపును.

దాసి, రాజకుమారుని కిష్టదేవతయగు డయానా నుగూర్చి ప్రార్థించును. "తల్లీ, రాజకుమారునికి మా రాణిపై ప్రేమోదయము కలుగునట్లు వర మనుగ్రహింపుము" అని ప్రార్థించుచుండగా రాజకుమారుడు ప్రవేశించును. దాసి అతనితో ప్రసంగించును. "సుందరోజ్వలుడా, నీతులు, నియమములు నీకేల? యువజనయోగ్యములైన భోగభంగు లనుభవింపుము. లెమ్ము; ర"మ్మని యతనిని ప్రోత్సహించుచుండును. రాకుమారుడు పాపమూర్తు లగుస్త్రీలను దూషించి ఇంద్రియనిగ్రహ, బ్రహ్మచర్యాది నియమములను, నీతులను శ్లాఘించును.

ఇంతలో ఫేడ్రరాణి ప్రవేశించును. మోహనమూర్తియైన రాకుమారుని చూచి మన్మథపీడితయై మూర్ఛపోవును. అపుడు రాజకుమారుడు అవసరమైన ఉపచారములు చేయించి మూర్ఛనుండి ఆమెను తేర్చును. పిమ్మట ఆమె విచారించుటకు కారణ మడుగును.

ఇచ్చట ఫేడ్రా హిప్పొలిటస్ లకు జరిగిన సంభాషణవాక్యముల నిచ్చుచున్నాను—

*హిప్పొలిటస్

"అమ్మా! నీవ్యసనహేతువు లేమో నా చెవిలో చెప్పుము.

---

* Hippolytus

Into my ears, my mother, tell thy cares.

Phaedra

The name of mother is too proud and high.
My heart dictates some humbler name than that.
See, at thy feet I kneel and pray, resolved.
This day shall end my misery or life.
Oh, pity her who loves thee.

Hippolytus

God in heaven,
Great ruler of all gods, dost thou this sin,
So calmly hear, so calmly see? If now
Thou hurlest not thy bolt with deadly hand,
What shameful cause will ever send it forth?

Phaedra

Again, O haughty one,
I fall in suppliance and embrace thy knees.

Hippolytus

Away from my chaste body with thy touch impure
What more? she falls upon my breast.

ఫేడ్ర

మాతృ శబ్ద మీసందర్భమున ప్రయోగయోగ్యము కాదు. మాతృస్థానము మహనీయమై మహోన్నత మయి నది. నాయట్టియల్పురాలి కది యందరానిది. ఈ నా యవస్థ కనుగుణమై వినయబద్ధమైన వేరొక సంబోధన మును నీవలన నామన స్సాకాంక్షించుచున్నది. మాడు: నీపాదముల పడి మ్రొక్కి వేడుచున్నాను. నా మనో దుఃఖమో, జీవనమో నేటితో కడగనవలెనని నిశ్చయ ముతో నున్నాను. మనశ్శరీరముల నీయధీనముచేసి నిన్నే ప్రేమించుచున్న యీదీనురాలిపై కనికరముంచి యేలు కొనుము.

హిప్పో

ఓ స్వర్గలోకనివాసా! ఓ సకలదేవతా ప్రభూ! అతి ఘోరము. ఈమహాపాతకమును కనులార చూచి, చెవులార విని, నీ వింకను చలింపక యుండగలిగితివా? సకలపాపజన సంహారశీలమైన నీదివ్యాయుధ మిపుడే ప్రయోగింపక, ఇంక నెవు డేఖలులపై ప్రయోగింప దాచియుంచుకొన్నావు, మహాప్రభూ!

ఫేడ్ర

ఓదురహంకారుడా! నే నిదే నీకాళ్లమీద పడి కౌగిలించుకొని మరల ప్రార్థించుచున్నాను.

హిప్పో

ఓసీ, నీపాపపుటొడలితాకుడుచే నాపుణ్యశరీరము మ అపవిత్రము కానింపకుము. దూరముగా పొమ్ము. అయ్యో! ఇక నేమున్నది? నన్ను వదలక యీ పిశా చము వెంబడినదే!”

ఈసంభాషణ చిత్రాంగిసారంగధరుల సంభాషణ వలె మన్నదనుట స్పష్ట మేకదా!

యూరిపిడీస్

*    *    *    *    *

సెనెకా

ఇట్లు ఆమె తన మనోభావమును వెల్లడిచేసి రక్షింపుమని ప్రార్థింపగా, విషాదముతో రాజపుత్రు డామెను కత్తితో చంప నెంచి, చేతులార అట్టి ఘోరము చేయజాలక కత్తి నటు పారవేసి అరణ్యమునకు పారిపోవును.

దాసి తనరాణిని రక్షించుటకై రాజకుమారునిపై నేరము మోపి, సాయమునకై యాక్రోశించినట్లు పెద్ద కేకలు వేసి చూడవచ్చినవారితో రాజకుమారుడు యౌవన మదోన్మత్తుడై సవతితల్లిపై పడెనని చెప్పుచు నిదర్శన మిదుగో యని కత్తిచూపును.

## రెండవ కోరల్ ఇంటర్ లూడ్

యూరిపిడస్ రచనము:

ఈ దుఃఖమునుండి తొలగింపుమని కోరసు భగ వంతుని ప్రార్థించును. రాణికై విచారించును.

సెనెకా రచనము:

కోరసు రాజకుమారుని సౌందర్యమును ప్రశం సించును. సౌందర్యమునవలన కలుగుచిక్కు లెటువంటివో కోరసు పేర్కొనును.

## మూడవ ఎపిసోడ్

యూరిపిడస్ రచనము:

రాణి ఆత్మహత్య చేసికొనినట్లు ఒకడు తొంద రగా ప్రవేశించి తెలియజెప్పును. కోరసు విచారించినను ఆశ్చర్యపడక ఏమిచేతునాయని యాలోచించును. అప్పు డు రాజు తీస్యూస్ ప్రవేశించి దుఃఖమునకు కారణము తనచిన్నరాణిమరణ మని తెలుసుకొనెను.

కోటతలుపులు తెరవగా రాణిశవము కనిపించును. మరణహేతువు తెలిసికొనవలెనని రాజు ప్రయత్నిం చెను. రాణిచేతిలో నొకయుత్తరము కనబడును. రాజ కుమారుడు బలిమిని మీదపడి చెఱుపగా అవమానము భరింపలేక ఆమె ఆత్మహత్య చేసికొనినట్లుఆయుత్తరము లో నుండును. అది చదువుకొని ఆగ్రహపరవశుడై రాజు తాను నెప్ట్యూను అనుదేవునివలన పొందిన వరము వలన కొడుకు చావవలెనని కోరును. హిప్పోలిటస్ తండ్రియొద్దకు రాగా రా జుత్తరమును చూపి కుమా రుని దూఱును. ఒట్టుకు బద్ధుడై, రాకుమారుడు దాసికిని తనకును జరిగినసంభాషణాంశములు దాచి తాను నిర్దో

షిననిమాత్రము తెలియజేయును. రాజు తనకుమారుని దేశభ్రష్టుని చేయును. తనదుర్గతి యిట్లున్నదని మిత్రులకు తెలుపుటకు రాకుమారుడు వెడలిపోవును.

సెనెకారచనము:

తీస్యూసు దేశాంతరమునుండి వచ్చి హెర్క్యులీస్ తనకు తోడ్పడి విడిపించిన సంగతి తెలియజేయుచుండగా రోదనధ్వనులు వినబడును. ఈఏడ్పు ఏమియని రాజడుగగా దాసివచ్చి రాణిఫేడ్ర ఆత్మహత్య చేసికొన నిశ్చయించినట్లు తెలుపును. రాజు తొందరగా లోనికి పరుగెత్తి బ్రతిమాలి, భయపెట్టి కారణమడుగగా మానముకొరకు ప్రాణము విడుచుచుంటినని రాణి తెల్పెను. అంత సాహసముగల పాపాత్ము డెవ్వడని యడుగగా పేరుచెప్పక రాణి కత్తినిమాత్రము చూపును. రాజది తనకుమారుని కత్తియని పోల్చి వానిం జంపెదనని నిశ్చయించి తనకు నెప్ట్యూన్ దేవత ఇచ్చినమూడవ వరముగా కుమారుని మరణమును కోరును.

చేరవచ్చును. కుమారుని చావునకు తండ్రి దుఃఖించుచుండును.

నాటకము ముగియును.

సెనెకా రచనము:

వార్తావహుడు రాజుగారితో కుమారుని మరణవార్త చెప్పును. తనమూలముగా కుమారుడు మృత్యువువాత పడెనని తండ్రి దుఃఖించును. విధివశము గడువ నెవరితరమని కోరస్ రాజు నోదార్చును.

ఈసమయమునసే ఫేడ్ర కత్తి చేబూని దుఖముతో ప్రవేశించును. హిప్పోలిటస్ శవముపైబడి యామె యేడ్చుచు తనసేరము నొప్పుకొని రాజకుమారుడు నిర్దోషియని చెప్పి ఆకత్తిపైబడి మరణము నొందును. తీస్యూసు రాజు దుఃఖముచే మరణమును కోరును. కుమారుని ఉత్తరక్రియలు జరిపి రాజాగ్రహముతో ఫేడ్రను తగులబెట్టుమని ఆజ్ఞాపించును.

నాటకము ముగియును

## మూడవకోరల్ ఇంటర్లూడ్

యూపిడరిస్ రచనము:

మనుష్య జీవితమును గూర్చి, దాని అనిశ్చితస్వభావమును గూర్చి కోరస్ ప్రస్తావించును.

సెనెకా రచనము:

న్యాయమునకు, ధర్మమునకు గ్లానికలుగుటయు, పాపము,అధర్మమువర్ధిల్లుటయు ననువిషయములను గూర్చి కోరస్ భగవంతుని నిందించును.

## ఎక్సోడి (నాటకాంతము)

యూరిపిడస్ రచనము:

వార్తాహరుడు తొందరగా ప్రవేశించి హిప్పోలిటస్మరణవార్త రాజునకు తెలుపును. కోరస్ వీనస్ దేవతయే ముఖ్యదేవత యని యొప్పుకొనును. డయానా దేవత ప్రవేశించి రాజునకు నిజము తెలుపును. రాజు దుఃఖపడగా, ఆపాపమునకు భగవంతుడు రాజును శిక్షింపడని యామె తెలుపును. అప్పుడు మరణవేదనతో హిప్పోలిటస్ ప్రవేశించును. మిత్రభావముతో తండ్రి

ఈరెండు నాటకముల కథలు చదివిన తరువాత సారంగధరచరిత్ర కల్పించి వ్రాసిన తెనుగు కథకుడు, సెనెకారచించిన రోమనునాటకకథ ననుసరించి వ్రాసెనని స్ఫురింపగలదు. క్రీస్తుశకము రెండవ శతాబ్దమునకు పూర్వమునుండి రోము మొదలగు పాశ్చాత్యదేశములతో మన హిందూదేశములో దక్షిణాపథమునకు వర్తకవ్యాపారములు విశేషముగా జరుగుచుండుట వాస్తవమైన చరిత్రాంశము. నెల్లూరుప్రాంతములందు రోమకచక్రవర్తుల నాణెములు దొరికినట్లు బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్ర ప్రథమభాగమున (౧౮౦ పుట) వ్రాసియున్నారు. కీ. శే. లక్ష్మణరావుగారు హిందూమహాయుగమునందును (చూ. పు. ౩౧౧౦) Marsden దొరవారు History of India (Part I, page, 297) లోను, ఇందును గూర్చి వివరములు వ్రాసిరి. మే మెరిగినంతవరకు హిందూవేద బ్రాహ్మణ పురాణాదివాఙ్మయములలో నెక్కడను ఒకయువతి తన

సవతికుమారుని కామించి కవయగోరిన వృత్తాంతము ఇట్లు తెలియుట లేదు.

మామిత్రులాకరు ఊర్వశీ అర్జునుల వృత్తాంతమును గమనింపుమనిరి. ఊర్వశి అప్సరస, వ్యభిచారజీవి; అర్జునుని కామించినది. కాని అతడు "మదీయవంశకర్తయగు పురూరవుని పత్నివైనకారణమునను, పురందరునకు పరిచర్యయొనర్చుటను నాకు జననివనుటకు సందియంబు లేదు. తల్లీ, నన్నుం బుత్రవాత్సల్యంబునం జూడు" మనెను. ఊర్వశి కోపించి "మర్త్యలోకంబున మానవర్జితుండవై మానినీమధ్యంబున నపుంసకుండవై యుండు"మని శాపమిచ్చెను. అది యజ్ఞాతవాససమయమున నర్జునుని కుపకరించెను. కాన నిచ్చట వర్తింపదని విన్నపము.

ఇట్టి వృత్తాంతములు పాశ్చాత్య వాఙ్మయములందు అనేకములు గలవు. పదునారవశతాబ్దమున నింగ్లండులో ఎలిజబెత్ మహారాణికాలములో నుండిన 'సిరిల్ టూర్నేర్' (Cyril Tourneur) అనునాటకకర్త ఒకరాణికి ఆమెభర్తవలన నొకనీచురాలికి జన్మించిన జారజుడు (Bastard) 'స్పూరియో' (Spurio) అనువానిపై మోహము కలిగినకథను నాటకముగా రచించినాడు. ఆ ౦పలివాక్యములు మూడు వ్రాయుచున్నాను.

*"రాణి:—ఏమి, నన్ను గూర్చి యోజించినావా?

స్పూరి:—అమ్మా! మిమ్మెప్పుడును నేను మరచిపోనే- నాధర్మము- నాకు మీయందుగల గౌరవమూ-

రాణి:—పోవోయి, అవన్నీ యెవరికి గావలెను? నే నన్నది నాకు నీపైగల ప్రేమమాట.

స్పూరి:—ప్రేమా? మీమనోభావమును ప్రేమయని చెప్పుకొనుటయా? చిత్తకుక్కల యుద్రేకముకంటె నీచతరమైన దీనినా ప్రేమయనుట? మీరు నాజనకుని సహధర్మచారిణి.

రాణి:—నీ వాతనికి జన్మించుట నిజమేనా? నీ వాతనివలన కలిగితివో, మరియొకరివలన కలిగితివో నిర్ధారణగా చెప్పగలవా రెవరు?

పాపము గీప మనెదవు. పుంస్త్వహీనులుతప్ప పాపముచేయనివా రెవరు?

ఇంకను చల్లగా నూరకొనియున్నావా? ఈరాణి హృదయమున జనితమైన ప్రేమవాహిని వ్యర్థముగా పోవలసినదేనా?"

పాశ్చాత్యవాణిజ్య ప్రభావముచే పదునారవ శతాబ్దమున నీదేశమునకు క్రొత్తగా నటనుండి తేబడిన పొగాకు, మిరియపుకాయలు, మిరపకాయలు, మనజాతియొక్క దేహదార్ఢ్యమును మందముచేయుచున్నట్లే పాశ్చాత్యదేశములందు వ్యాప్తములై వావివరుసల శంకింపక, నీతిబాహ్యములై మనస్సునకు కష్టమైతోచునట్టి కథలుగూడ పదునారు పదునేడవ శతాబ్దములనాటికి మనదేశమున బాగుగా వ్యాపించినట్లు గనపడుచున్నది. సిరియబ్బదుగాని చిడుముబ్బును గదా? ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టు దనిపించుకొనుటకు అప్పకవ్యాదులు పదునేడవశతాబ్దములో నీకథను రాజనరేంద్రుని కల్పితపుత్రుడగు సారంగధరునికిని, అతని కల్పితభార్యయగు చిత్రాంగికిని ముడిపెట్టినట్లు తోచుచున్నది.

---

*The Revenger's Tragedy, Act. I, Sc. II.

**Dutchess:**—What, have you thought of me?

**Spurio:**—Madam, I ever think of you in duty, regard.

D:—Pooh—upon my love, I mean.

S:—I would it were love, but it is a fouler name than lust. You are my father's wife.

D:—Why, thou art his son but falsely;
It is a hard question whether he forget thee.

........................................................

Who but a eunuch would not sin?

........................................................

Cold still? In vain then, must a dutchess woo?

## ౬

కాని కళాపోషణ సందర్భములో నాంధ్రకథకులు పాశ్చాత్యకావ్యములకు సహజగతులు కల్పించి వన్నె తెచ్చిరని వ్రాయక తప్పదు. సారంగధరునకై తెచ్చిన యౌవనవతిని వార్ధక్యమున రాజరాజు వివాహమాడుటచే కథకు విషాదహేతువు సహజముగా నాశ్రయమైనది. ఇందు ఆంధ్రకథకుని అద్భుతప్రతిభ వ్యక్తమగుచున్నది.

గ్రీకుకవి యూరిపిడస్ తన నాటకములో హిప్పొలిటస్ ఫేడ్రలను ఒకచోట సమావేశము చేయనే చేయడు. రోమకకవి-సెనెకా తనకృతిలో నీయువతీయువకుల నొకచో సమావేశము చేయించును గాని అట్టి సమావేశమునకు తగుహేతువు నిరూపింపడు. ఆంధ్రకథకుడన్ననో చిత్రాంగి మేడలో వ్రాలినపావురమును తెచ్చుకొనుటకు సారంగధరు డాయువతి మేడలోనికి వెళ్లినట్లు కారణము చెప్పుచున్నాడు. ఇది సహేతుకమును, స్వభావసిద్ధమును నైయున్నది. తుదకు నిజము బయటపెట్టు విషయములో గ్రీకుకవి డయానాచేత నిజము చెప్పించెను. ఆంధ్రకథకుడు అశరీరవాణిచే నిజము చెప్పించెను. సెనెకామాత్రము నాయిక పశ్చాత్తాపముచే నిజము చెప్పినట్లు రచించినాడు. సెనెకారచించినదే యీసందర్భమున సహజము, స్వభావసిద్ధము నైయొప్పుచున్నది. శ్రీమాన్ కృష్ణమాచార్యులవారు ఈసందర్భమున సెనెకాపద్ధతినే అవలంబించి కళాధర్మమును విషాదసారంగధర నాటకములో చక్కగా పోషించిరని వ్రాయక తప్పదు.

---



పొంగలి పండుగకు

ఛాయాచిత్రకారుడు: వి. యస్. గోపాలదేశికాచార్లుగారు.

# ఉచ్చారణ—విభేదపుగుర్తులు

టి. కామేశ్వరరావుగారు

26

ఆంధ్ర భాషయందు శబ్దజాలం నానాటికి వృద్ధి అవుతూంది. అనేక నూతనవిషయాలను గురించి తెలుసుకోడాని కనేక నూతన పదాలను వాడుతున్నాం. ఈపదాలలో కొన్ని భాషాంతరపదా లున్నాయి. వీటి ఉచ్చారణ ఒకొక్కప్పుడు మనభాషలోని శబ్దాల వుచ్చారణకు భిన్నంగా వుంటుంది. అటువంటి భిన్నోచ్చారణలకు సరిపోయే అక్షరసంజ్ఞలు మనలిపిలో లేవు. కనుక ఆయాశబ్దాలను తెలుగులో రాసేటప్పుడు క్రొత్త అక్షరాలను వుపయోగించవలసి వస్తుంది కాని క్రొత్త అక్షరాలను చేర్చకుండా తక్కినభాషల్లో చేసుకున్నట్లుగానే వున్నఅక్షరాలకే కొన్ని గుర్తులు పెట్టుకుని నూతనధ్వనులను తెల్పే అక్షరాలుగా చేసుకోవచ్చు.

Bank, Mail, Catholic, Firman, Furlong, Factory etc. ఇలాంటి సామాన్యపదాలు;

Calomei, Manganese, Platinum మొదలైన శాస్త్రీయపదాలు, ఇంకా అనేకరకాల పదాలను ఎన్నెన్నో మనం సాధారణంగా సంభాషణల్లో వుపయోగిస్తున్నాం, గ్రంథాల్లో వాడుతున్నాం. సంభాషించేటప్పు డేమీ చిక్కులేకపోయినా, వాటిని తెలుగులో రాసేటప్పుడు చదువరులకు వాటి పోలికధ్వనులు గల అక్షరాలను రాసి వాటి ఉచ్చారణభేదాన్ని తెలుపడానికి ఆఅక్షరాలకిందో, పైనో అడ్డగీటుకాని, నిలువుగీటుకాని పెడుతున్నారు. ఒక్కొక్క రొక్కొక మాదిరి గుర్తును వరుస, తీరు లేక పెడుతున్నారు. అలాగుగాక వొక్కొక్కప్పుడు ఆమాటలనే వాటి వుచ్చారణ ధ్వంస మయేటట్లు బ్యాంకు, గ్యారంటీ, మెయిలు, ప్యాక్టరీ, ప్యామన్, పర్లాంగు, కాలమెల్, మాంగనీస్, ప్లాటినమ్ అని రాస్తున్నారు. అప్పటికీ ఆమాటలను తెలిసినవాళ్లు, ఇంగ్లీషువచ్చినవాళ్లు సరియైన వుచ్చారణలతోనే వుచ్చరిస్తున్నారు. కాని సామాన్యస్త్రీపురుషులుమాత్రం వాటిని పైన రాయబడిన వంకరటింకరలైన వుచ్చారణలతోనే చదువుతున్నారు. ఇలాంటి లోటు-అనగా వుచ్చరించే టట్లు రాయలేకపోడం, సవరించి ఉచ్చారణకు సరిపోయే టట్లానే రాయడం యేర్పరచుకోవచ్చు.

పైన ఉదాహరింపబడ్డ మాటల్లో గమనించవలసిన విషయాలు రెండున్నాయి—

౧. బాంకు, గారంటీ, మొ. మాటల్లో పదముల మొదట మన అక్షరమాలలోవున్న హల్లులుగాక మరొకరకమైన హల్లులో, లేక మరొకరకమైన అచ్చులతో గూడిన హల్లులో వున్నాయి. ఈవర్ణాల్లో మన అక్షరమాలలో వున్న 'అ'గాక మరొకరకమైన 'అ'వుందని కొందరి అభిప్రాయం.* ఇది అచ్చా లేక హల్లా అన్న విషయం చర్చచేయవలసివుంది.

మన అక్షరమాలలో వున్న ప్రతిహల్లుకు చ, జ, శ, యలకుతప్ప ఈరకమైన క్రొత్తధ్వని కలిగించవచ్చు. ఆహల్లును తాలువుల సహాయంతో వుచ్చరిస్తే, ఈరకమైన క్రొత్తధ్వని పుడుతుంది. చర్చమాట అటుంచి ఈక్రొత్తధ్వని కేదో ఒక విభేదపుగుర్తు పెట్టవలసివుంది. అడ్డగీట్లను, నిలువుగీట్లను ప్రత్యేకగుర్తులుగా యేర్పరచలేము. ఇవి అన్నిటికి సామాన్యంగా వాడబడే గుర్తులే. కనుక దీనికి ప్రత్యేకగుర్తు ఏదేనా యేర్పరచవలసివుంది. రెండుచుక్కల గుర్తు పెడదాం. ఆపోలిక అక్షరాలపైన అడ్డుగా రెండుచుక్కల గుర్తు పెడితే దాన్ని ఆమోస్తరుగా వుచ్చరించాలన్నమాట. అప్పుడు బాంకు, గారంటి అని రాయవలసి వస్తుంది.

* బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్రభాషానుశాసనంయొక్క ప్రథమభాగంలో ౯-వ పుటలో చూడండి.

## ఈకొత్తధ్వని అచ్చా హల్లా?

మామూలు హల్లులమీద ఈకొత్తఅచ్చు కలియడంచేత ఈధ్వని వస్తూందని కొందరంటున్నారని చెప్పేవున్నాము. వారి నిర్ణయప్రకారం యిది అచ్చు. దీనిని అచ్చుగా భావిస్తే వుండే లాభనష్టాలు చూద్దాం. మాజిక్ (Magic) అన్నమాట వుంది. మకారంమీద కొత్తఅకారం చేరిందన్నమాట. సరే యింతవరకు కష్టం లేదు. మైల్ (Mail) అన్నమాటను తీసుకొందాం. ఈవర్ణంలో మకారంమీద కొత్తఅకారమేకాక దాని మీద ఐకూడా కలిసింది. అచ్చుమీద మళ్లా అచ్చు కలిసిందనడం అసందర్భం. కనుక కొత్త 'అ' వంటి కొత్త 'ఐ' కలిసిం దనవలసి వస్తూంది. ఇలాగే ప్రతి అచ్చుకు కొత్తఅచ్చు యేర్పాటు చెయ్యవలసివస్తూంది. కాని మైల్ (Mail) అన్న మాటను బాగా వుచ్చరించి చూస్తే ఇది మామూలు ఐకారమేకాని కొత్తఐకారం కాదని తెలుస్తుంది. అందుచేత కొత్తఅచ్చు కలిసిందనడం తప్పు. అచ్చుభేదం కాదని తేలుతూంది. ఇంకా—

అచ్చులలో వేటికివాటికి వేరువేరు ధ్వనులున్నాయి కదా. అవి ఒకొక్క హల్లుమీద పరమైనప్పుడు వేరేవేరే ధ్వనులు వస్తాయి. కాని ఒకొక్కప్పుడు ఆ కొత్త అచ్చులు హల్లులతో కలిసినప్పుడు సామాన్య అచ్చులు హల్లులతో కలిసినపుడు వచ్చేధ్వనులతో సమమైన ధ్వనులేకాని కొత్తధ్వనులు రాకుండా వున్నాయి. ఉదా:— జకారంమీద కొత్త 'ఈ' సామాన్య 'ఈ' కలిసినప్పుడు ఒకేధ్వని వస్తుంది. ఇది సరికాదు. అచ్చుయుక్తములైన హల్లులకు వేరువేరు ధ్వనులు రావాలి. కొత్త అచ్చు అన్న సిద్ధాంతం ఈ నియమానికి సరిపడటం లేదు. కాబట్టి యిది అచ్చుభేదం కాదని తలచవలసి వస్తూంది.

ఇది హల్లుభేదమేమో చూద్దాం. ప్రతిహల్లును తాలువు సహాయంతో వుచ్చరిస్తే ఈధ్వని పుడుతూంది. మాజిక్ అన్నదానిలో 'మ్' అనే హల్లుగాక, ఆమకారాన్నే తాలువుసహాయంతో వుచ్చరిస్తే ఈధ్వని పుడుతూంది. దీనిని 'మ్' అని రాద్దాం. ఈకొత్త హల్లుమీద అచ్చులు సామాన్య హల్లుమీద చేరినట్లే చేరుతున్నాయి. మాజిక్ అన్నప్పుడు 'మ్' మీద 'ఆ' అనే అచ్చు కలిసిందన్నమాట. బాంక్ అన్నప్పుడు 'బ్' అనే కొత్తహల్లుమీద 'ఆ' కలిసిందన్నమాట. మైల్ (Mail) అన్నప్పుడు 'మ్' అనే కొత్త హల్లుమీద 'ఐ' కలిసిందన్నమాట. రైల్ (Rail) అన్నప్పుడు 'ర్' అనే కొత్తహల్లుమీద 'ఐ' కలిసిందన్నమాట. ఈప్రకారంగా యిది హల్లుభేదంగాకనబడుతూంది.

ఒకొక్కప్పుడు ఈకొత్తహల్లుమీద అచ్చులు చేరేటప్పుడు సామాన్య హల్లులమీద అచ్చులు చేరేటప్పుడు కలిగేధ్వనులే కలుగుతున్నాయి. అప్పుడు వాటి రెండింటికి ఉచ్చారణభేదం లేదనిమాత్రమే తెలుసుకోవాలి. ఇ ఈ, ఎ ఏ లతో కలిసినప్పుడీధ్వనిభేద మంతగా కనబడదు.

## కొత్తహల్లుయొక్క ఉత్పత్తిస్థాన మేది?

హల్లువర్గంలో కొన్నిహల్లులు దంత్యాలు, కొన్ని కంఠ్యాలు మొదలైనవిగా వున్నాయి. ఈహల్లులన్నిటినీ చ, ఛ, జ, ఝ, శ, యలుతప్ప దవడలసహాయంతో వుచ్చరిస్తే ఈధ్వని పుడుతూంది. అనగా-క కంఠ్యం. దీనినే తాలువుసహాయంతో వుచ్చరిస్తే 'క' అవుతుంది. కనుక 'క' అనేది కంఠంనుంచి దవడలనుంచికూడా పుడుతూందన్నమాట. కనుక 'క' కంఠతాలవ్యం. చ దంత్యం. 'చ' వర్ణం వుచ్చరించడానికి తాలువుసహాయం కావాలికనుక 'చ' దంతతాలవ్యం. ట మూర్ధన్యం. 'ట' ను వుచ్చరించడానికి తాలువుసహాయం కావాలికనుక 'ట' మూర్ధతాలవ్యం. ప ఓష్ఠ్యం. 'ప' ఓష్ఠతాలవ్యం. ఇట్లే తక్కిన వొత్తులులేని హల్లులకు, ఒత్తులుగలహల్లులకు.

చచ ; జజ ; శస ; య.

పైనున్నవాటిలో 'య' తప్ప తక్కినవన్నీ మూడుజత లున్నాయి. మొదటి రెండుజతల్లోను మొదటి

అక్షరాలు అనగా చజలు సంస్కృతంలోంచి తెలుగులోకి తెచ్చుకోబడ్డాయి. కాని రెండో అక్షరాలుమాత్రం అనగా ౘౙలు సంస్కృతంలో లేక తెలుగులో వున్నాయి. ఈ అక్షరాలను ఒకదానినుండి ఒకటి వేరు చెయ్యడానికిగాను ౨ గుర్తును ఆ అక్షరాలమీద పెట్టేరు. పై గుర్తు ఉచ్చారణభేదాన్ని సూచిస్తూంది. చ, జ లు, క, గ, ట, త మొదలైనవాటిలాగే తాలువుసహాయం లేకుండానే వుచ్చరించబడుతున్నాయి. వాటిలాగే వుంచడానికి ఈ ౨ గుర్తును వాటిమీంచి తీసివేద్దాం. సరే.

ఇంక చ, జలవిషయ మేమిటంటే. ఇవి సంస్కృతంలోను, తెలుగులోనుకూడా వున్నాయి. చ, జలను దవడలసహాయంతో వుచ్చరిస్తే ('క' ను దవడల సహాయంతో వుచ్చరిస్తే క̈ యేర్పడినట్లు) ౘ, ౙ లేర్పడుతున్నాయి. అంటే ౘౙలు చజలకు యేర్పడ్డ కొత్తహల్లు లన్నమాట. కనుక చజలను రాసేటప్పుడు కొత్తహల్లులను రాసినట్టే వాటిమీద రెండుచుక్కల గుర్తు పెట్టవలసివస్తుంది. అప్పుడు 'చ̈' 'జ̈' అని రాయాలి. చజలు, చజలని; ౘౙలు 'చ̈' 'జ̈' లని రాయబడుతాయి.

మరొక సంగతి—లాక్షణికులు ౘౙలను దంత్యాలని, చజలను తాలవ్యాలని వ్యవహరించేరు. కాని చజలు (తక్కిన కొత్తహల్లులలాగే) దవడల సహాయంతో ఉచ్చరించబడ్డ ౘౙలని అంటున్నాను కనుక చజలు దంతతాలవ్యాలు అవుతాయికాని, ఉత్తతాలవ్యాలు కావు. వీటియొక్క ఒత్తు హల్లులకుకూడా అంతే. తెలుగులో ఒత్తు చ వుందికాని ఒత్తు ౘ లేదు, ఒత్తు జ వుంది కాని ఒత్తు ౙ లేదు. ౘఛ, ౙఝ అన్నవి. చ 'చ̈' 'ఛ̈' జ 'జ̈' 'ఝ̈' అని రాయబడుతాయి.

### శ, స

సవర్ణం దంత్యం. 'స' ను తాలువులసహాయంతో వుచ్చరిస్తే 'శ' అవుతూంది. అంటే 'స'కు కొత్తహల్లు 'శ' అన్నమాట. కనుక శను 'స̈' అని రాయవలసివస్తుంది. అందుచేత 'శ' అని వేరే స్వరూప మక్కరలేదు. 'స' పైన రెండుచుక్కలు పెడితే సరిపోతుంది.

సను దంత్యంగాను, శను తాలవ్యంగాను లాక్షణికులు చెప్పివున్నారు. 'శ' వర్ణం 'స'ను తాలువు సహాయంతో వుచ్చరిస్తే యేర్పడుతూం దంటున్నాను. కాబట్టి 'శ' వుత్తతాలవ్యంగాక దంత తాలవ్య మవుతుంది.

### య

య వర్ణం తాలవ్యమని లాక్షణికులు చెప్పేరు. యహల్లుకు తక్కినహల్లులికి యేర్పాటుచేసినట్లుగానే కొత్తహల్లును యేర్పాటు చెయ్యలేం. ఎందుచేతంటే దీని వుచ్చారణ కొత్తహల్లువుచ్చారణసమం. తక్కిన హల్లులకులాగ భిన్నంగా లేదు. అనగా యను, 'య̈' ను ఒక్కలాగే వుచ్చరించగలంగాని వేరుగా వుచ్చరించలేం. శాస్త్రవిషయంగా ఆ యేర్పాటును చూపించుకో వలసిందేకాని ఉచ్చారణలో చూపించలేం. ఉత్త యకు, తాలువుసహాయంతో ఉచ్చరించబడ్డ యకు ధ్వనిభేదం కనబడదు. య తాలవ్యం కదా. అప్పుడు 'య̈' ను తాలు తాలవ్య మనవలసివస్తుంది. ఇది అర్థం లేని మాటకనుక 'య̈' కూడ యలాగే తాలవ్యం. ఈ రెంటికి ధ్వనిభేదం లేదు కాబట్టి 'య'కు కొత్తవుచ్చారణ లేదన్నాను.

### కొత్తహల్లు పేరు

హల్లులను దవడల సహాయంతో వుచ్చరించడం వల్ల యీ ధ్వని పుడుతూందంటున్నాను. హల్లులు కొన్ని కంఠ్యాలు, కొన్ని మూర్ధన్యాలు మొదలైనవిగా వున్నాయి. ఇవన్నీ కొత్తధ్వనులు కావాలంటే తాలువ సహాయ మవసరం. ఈ కొత్త ధ్వనికి సగం కారణం తాలువ అన్నమాట.

క కంఠ్యం......... క̈ కంఠతాలవ్యం.

చ దంత్యం......... చ̈ దంతతాలవ్యం

ట మూర్ధన్యం.........ట̈ మూ, తాలవ్యం

ఇట్లే తక్కినవన్నీ. ఒత్తు అక్షరాలకుకూడా యింతే. ఈకొత్తహల్లు పుట్టుకకు సగంకారణం తాలువ అని చెప్పేవున్నాము కదా. కనుక దీనికి పేరు తాలువ సహాయ హల్లు(?) అని పెడదాం.

ఈస్థితిలో అక్షరమాల యెలాగ వుంటుందంటే, హల్లువర్గంమాత్రం (తాలువసహాయ హల్లులు (?) విడిచి పెట్టబడ్డాయి.)

క ఖ గ ఘ ఙ
చ జ
ట ఠ డ ఢ ణ
త థ ద ధ న
ప ఫ బ భ మ
య ర ల వ వ఼* ష స హ ళ క్ష

(ఇందులో ఞ విడిచిపెట్టడానికి కారణం ముందు చెప్తాను) కాని తెలుగులో తక్కిన తాలువసహాయ హల్లులలా గాక 'చ̈', 'ఛ̈', 'జ̈' 'ఝ̈', 'స̈' లతో ప్రారంభించేమాటలు చాలా వున్నాయిగనుక వీటినిగూడ అక్షరవర్గులో చేర్చి రాస్తూవుండవచ్చు.

ఉత్పత్తిస్థానాలనుబట్టి అక్షరమాలవిభజన:—
అ ఆ క ఖ గ ఘ ఙ హ......కంఠ్యాలు
ఇ ఈ య..............తాలవ్యాలు
ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష ళ...మూర్ధన్యాలు
ఌ ౡ చ జ త థ ద ధ న ల స...దంత్యాలు
ఉ ఊ ప ఫ బ భ మ.........ఓష్ఠ్యాలు
ఎ ఏ ఐ...............కంఠతాలవ్యాలు
ఒ ఓ ఔ...............కంఠోష్ఠ్యాలు
వ వ఼...................దంతోష్ఠ్యాలు

(పై విభజనలో ఞ విడిచివేయబడింది. దానిని గురించి ముందు చెప్తాను.) తక్కిన తాలువసహాయ హల్లుల(?) లాగాక 'చ̈' 'ఛ̈' 'జ̈' 'ఝ̈' 'స̈' లతో ప్రారంభించే మాటలు చాలా వున్నాయి గనుక వీటినిగూడా పై విభజనలో చేర్చుకోవచ్చు.

* దీనిని గురించి ముందు చెప్తాను.

'చ̈' 'ఛ̈' 'జ̈' 'ఝ̈' 'స̈'...దంతతాలవ్యాలు

'ఞ' విషయం

ఞ అనునాసికం. 'జ̈' ను నాసికసహాయంతో వుచ్చరిస్తే ఞ పుడుతూంది. 'జ̈' తాలువ సహాయ హల్లు కదా. అప్పుడు ఞ మాత్రం తాలువ సహాయ హల్లు కాకపోతుందా? కనుక ఞను తక్కినతాలువ సహాయహల్లులను రాసినట్లే పైన రెండుచుక్కలగుర్తు పెట్టి రాయవలసివస్తుంది. 'ఞ̈' అని రాయాలన్నమాట. దీనికికూడా తాలువసహాయ రహితమైన హల్లు ఒకటి వుండాలికదా. అది ఞ అవుతుంది. ఞను తాలువసహాయంతో వుచ్చరిస్తే 'ఞ̈' అయిందన్నమాట. ('జ' ను నాసికసహాయంతో వుచ్చరిస్తే ఞ అవుతుంది.)

౨. పర్మాన్, పార్మసీ మొదలైనమాటల్లో మనం మామూలుగా పఫలను రాస్తున్నాం. కాని హిందీలో వున్నట్టుగా ఈ అక్షరాలకే ఒకచిన్నగుర్తు పెట్టి కొత్త వుచ్చారణను సూచించేటట్లూ రాసుకోవచ్చు. ఆ అక్షరాలకింద ఒక చిన్నచుక్కను పెట్టడమే. కాని దీనివల్ల కొంచెం నష్టముంది. ఒత్తు పకు అడుగున ఒత్తు వుంది. ఈచుక్కను ఆగీతతో తడబాటు పడవచ్చు. కనుక ఈపద్ధతికాక మరొకపద్ధతి చూద్దాం. పర్మాన్ అన్నమాటలో మొదటివర్ణం తెలుగులో వున్న 'వ' లాగే దంతోష్ఠ్యం. అనగా వుత్పత్తినిబట్టి ఈకొత్త ధ్వనికీ పకంటె వతో యెక్కువసంబంధం వుంది. కనుక ఈకొత్తధ్వనియొక్క సంజ్ఞను వ కింద చుక్కబెట్టి యేర్పరచుకోవచ్చు. ఏవిధమైన తడబాటు కలుగదు. అప్పుడు వ఼ర్మాన్, వ఼ార్మసీ, వ఼ర్లాంగు అని రాయాలి. ఈరకమైన సంజ్ఞను శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు యేర్పాటుచేసేరు†

ఇంకా యేమిటంటే పాక్టరీ, పాషన్ మొదలైన మాట లున్నాయి. తక్కినహల్లుల్ని వుచ్చరించినట్లే వను కూడా తాలువుల సహాయంతో వుచ్చరిస్తే ఈధ్వని వస్తుంది. ఇది తాలువసహాయహల్లు. కనుక ఈమాట లను రాసే పద్ధతి.

† ఆంధ్రభాషానుశాసనం. ౧౦ వ పుట.

ఫా̈క్టరీ, ఫా̈మిలీ అని.

ఇదిగాక మరొక విషయం. మన మిప్పుడు సామాన్యంగా మన రచన లన్నిటిని వ్యావహారికభాషలో రాస్తున్నాం. దీనిలో పై వుచ్చారణలుగల కొత్తధ్వనులు వస్తున్నాయి. ఉదా:—వచ్చాము, నవ్వారు, కావాలా, తాటాకు, విడాకులు, మొ. వీటికికూడా యేదోరకమైన గుర్తులు పెడతున్నారు. కాని యివికూడ తాలువసహాయహల్లు-యుక్తములే కాబట్టి వీటికికూడా రెండుచుక్కల గుర్తు పెట్టవచ్చు: వచ్చా̈ము, నవ్వా̈రు, కా̈వాలా, తా̈టాకు, విడా̈కులు, మొ.

ఇంతకీ పైన జెప్పబడిన సామాన్యపదాలకు ప్రత్యేకగుర్తులు లేకుండానే వాటితో మనకు గల పరిచయంవల్ల వాటిని తిన్నగానే వుచ్చరిస్తూవుంటాం. అందుచేత వాటి కిలాంటి ప్రత్యేకగుర్తులు పెట్టనక్కర లేదు. నిష్కారణశ్రమ అని యెవరైన అనవచ్చు. దానికి జవా బేమిటంటే: కేవలం పైన ఉదాహరింపబడ్డమాటల కోసమే ఈవిభేదపు గుర్తులు యేర్పరచ బడలేదు. ఉదాహరణలకోసం వాడుకభాషలోంచి పదాలు తీసుకోబడ్డాయి. ఇవిగాక మనం భూగోళశాస్త్రం లోను, విదేశచరిత్రలోను, రాజకీయ రచనల్లోను, రసాయనపదార్థ విజ్ఞానాదిశాస్త్రాల్లోను అనేక భాషాంతరపదాలను వాడుతున్నాం. వాటి కిలాంటి గుర్తు లవసరం. అనూతనపదాలను తెలుగులోకి తర్జుమాచేసుకుంటాం. అటువంటప్పుడు ఈగుర్తుల అవసరం వుండనేవుండదని యెవరైనా ఆక్షేపణ చెయ్య వచ్చు. ఆమాట కొంతవరకు నిజమే. రసాయనపదార్థ విజ్ఞానాదిశాస్త్రాల్లోని మాటలను తెలుగులోకి తర్జుమాచేసుకోవచ్చు. కాని భూగోళశాస్త్రం, విదేశచరిత్రల్లోని మాటలకు తర్జుమా లేమిటి? వీట్కోసమైనా ఈగుర్తులు పెట్టుకోక తప్పదు.

‘మ’ నుగురించి

మనం సాధారణంగా వాడుకలో మ అనే అక్షరాన్ని దాని సరియైన వుచ్చారణలో వుచ్చరించక మరొకమోస్తరుగా వుచ్చరిస్తున్నాం.

ఉదా:—మామ, ఏమి, రామమ్మ, మొ.

ఈ భేదాన్ని అందరు అనేక రకాలుగా జూపకుండా ఒకేమోస్తరుగా చూపిస్తున్నారు. ఈమోస్తరు చాలాకాలంకిందటే వాడుకలోకి వచ్చింది. కన్యాశుల్కకర్త యేర్పరిచేడు. అదేమిటంటే వ పక్కన (మపక్కన కాదు) అరసున్న పెట్టడం. ఈ పద్ధతి కేవలం విపరీతమైనది కాదు. ఎందుచేతంటే ‘మ’ ఓష్ఠ్యమై వుండగా ఈ క్రొత్తధ్వని ‘వ’ లాగే, దంతోష్ఠ్యం. అందుచేత ‘వ’ లాగ రాయబడి దాని పక్కన అరసున్న పెట్టబడింది. కాని ఈమార్పుకు మొదటి అక్షరానికి యేమి పోలిక లేకుండావుంది. దీన్ని ‘మ’ యొక్క తప్పు వుచ్చారణ అనుకోడానికేమీ అవకాశంలేదు. ఏమార్పైనా మూల అక్షరం మీద చెయ్యాలి కాని మరొక అక్షరంమీద చేస్తే యేం లాభం? ఈమార్పు ‘మ’ మీద యేర్పడాలికాని ‘వ’ మీద యేర్పడకూడదు. అయితే ‘మ’ మీద యేరకమైన మార్పు చెయ్యాలి? మునపటి అరసున్నే ‘మ’ మీద పెడితేనో అంటే. అరసున్నలతో గ్రాంథిక భాష మునుపే నిండివుంది. వాటియొక్క వుపయోగం, ప్రయోజనం వేరు. కనుక ఈ స్థితిలో అరసున్నను విభేదపుగుర్తుగా యేర్పరచడం శ్రేష్ఠంకాదు. ‘మ’ మీద ఒక చిన్నచుక్క పెట్టి ఈభేదాన్ని సూచించుకుంటే మంచిది. అప్పుడు

మామ, ఏమి, రామమ్మ అని రాయవలసివస్తుంది.

‘ఉ’ ను గురించి

ఇంకా యేమిటంటే, మనం మనయొక్క సమ్మతిని, అసమ్మతిని ఔను, కాదు అని మాటల్లో చెప్పడానికి బదులుగా సూక్ష్మంగా ఉ, ఉఊ అని అనునాసిక ధ్వని కలిగేటట్లా అంటున్నాం. దీనిని రాతలో చూపించేటప్పుడు కొంతమంది ఉ పక్కన అరసున్న పెడుతున్నారు. మరికొందరు ఉపైన చంద్రవంక వేసి దానిలో ఒకచుక్క పెడుతున్నారు. ఈరెండోపద్ధతి సంస్కృతంలోను, హిందీలోను కూడా వుంది. ఉ పక్కన

అరసున్న పెట్టడాన్ని గురించి—అరసున్నను గుర్తుగా యేర్పరచడానికి వీలులేదని పైనే చెప్పివున్నాను కదా. కనుక ఉ పైన చంద్రవంకబొట్టుగుర్తును వాడవచ్చు. అప్పుడు,

ఉ̐, ఉ̐ ఉ̐ అని రాయవలసివస్తుంది.

ఈ విభేదపుగుర్తుల అవసరం మొదట్లోనే చెప్ప బడింది. వీటిలో వేరే యేమి అసందర్భాలు, అనైక్యం కనబడకపోతే రచయితలంతా వీటినే వాడుకచేస్తూ వుండవచ్చు.

---



కామదహనము

చిత్రకారుడు: కీ. శే. నరసింహ శతశిల్పి.

# ప్రాచీన చిత్రములు



౧. షా అబ్బాస్ కొలువు



౨. షా సెఫీ కొలువు ౧

౧

శ్రీ కృష్ణుడు

అమ్మా, అమ్మా, నే వచ్చేశా.

యశోద

వచ్చావా, నాయనా! నాతండ్రే, ఇప్పటిదాకా ఏం చేస్తున్నావు నాయనా?

శ్రీ కృష్ణుడు

అమ్మా, మరేం, నేనేం, మరీ, మరీ ఆడుకుంటున్నా నమ్మా.

యశోద

అయ్యో నాయనా! ఎక్కడాడుకొంటున్నావురా? ఇప్పుడేగదా ఇల్లంతా వెతికేను, నీకోసం.

శ్రీ కృష్ణుడు

అమ్మా, నా కేమన్నా పెట్టవుటే, ఆడుకొంటాను.

యశోద

ఎక్కడాడుకొంటున్నావురా ఇంతసేపటినుంచీని.

శ్రీ కృష్ణుడు

ఏవే అమ్మా, నాకేమేనా పెట్టవుటే?

యశోద

ఆడుకోవడంలేదు; అల్లరిచేస్తున్నావు, అవునా?

శ్రీ కృష్ణుడు

లేదే, అమ్మా, ఆడుకొంటున్నానే. తువ్వాయిలూ ఆవీ పరిగెడుతూంటే చూస్తున్నానే.

యశోద

వెన్నముద్ద పెట్టనా?

శ్రీ కృష్ణుడు

ఉహుఁ.

యశోద

వెన్నెందుకు వద్దురా, నీకిష్టమేగా?

శ్రీ కృష్ణుడు

నాకేం, నాకేం......

యశోద

పోనీ, పాలు తాగుతావా?

శ్రీ కృష్ణుడు

ఉహుఁ.

యశోద

ఏమిరా నాయనా, ఏమీ వద్దంటున్నావూ; ఇలా దగ్గిరసా రా; ఏదీ చూడనియ్యి నీ కడుపు.

శ్రీ కృష్ణుడు

వద్దే అమ్మా, వద్దే...పోనీలే నాకేమీ పెట్టకపోతే—నేను వెళ్లిపోయి ఆడుకొంటాను.

యశోద

నాతండ్రివిగా; దగ్గిరసా రావూ; రా అమ్మా రా! ఏదీ కళ్లుమూసుకొంటాను, ఎవరొస్తారో, ఎవరొస్తారో.

శ్రీ కృష్ణుడు

ఊఁ, ఊఁ, ఊఁ—నేను రానూ—నేను వెళ్లిపోయి ఆడుకొంటానూ—ఊఁ, ఊఁ.

యశోద

నాతండ్రివి గావూ, ఎవరొస్తారో ఎవరొస్తారో; కంచె వస్తుందో కాసులపేరు వస్తుందో; నా చిన్నిబొజ్జ కృష్ణమ్మ వస్తాడో; నా బంగారుగజ్జెల కృష్ణమూర్తి వస్తాడో; ఎవరొస్తారో, ఎవరొస్తారో.

శ్రీ కృష్ణుడు

ఊఁ, అమ్మా, నేరాను, నే రాను—నే వెళ్లిపోతాను. నే రాను......

యశోద

రావు కాదూ, నా వరహాలమూటవు కాదూ, నా కన్నతండ్రివి కాదూ, నా ముత్యాల పేరువు గాదూ, నా

నాయనవు కాదూ రా, అమ్మా, రా. ఎవరొస్తారో, ఎవరొస్తారో.

శ్రీ కృష్ణుడు

అమ్మా, మరేం, నాన్న మొన్న తెచ్చాడు—ఆ బొమ్మ యియ్యవూ? గదిలో కూచుని ఆడుకొంటాను—

యశోద

రావు కాదూ; వస్తున్నా ఉండు, పారిపోకురా, చూశావా, చూశావా, ఎలాపరుగెత్తుతున్నాడో—నా నాయన కాదూ—దా, ఇలా దా; నీకు బొమ్మ యియ్యనా?

శ్రీ కృష్ణుడు

ఇయ్యి మరీ.

యశోద

నాదగ్గిరికి రా; ఒక్క ముద్దు ఇయ్యి; తరవాత బొమ్మిస్తా, ఏం?

శ్రీ కృష్ణుడు

నన్ను పట్టుకొని కొడతావూ.

యశోద

కొట్టనులే, రా; రా, అమ్మా, రా. పారిపోకమ్మ పారిపోకు—ఆఁ, దొంగా, దొరికేవులే—

శ్రీ కృష్ణుడు

అమ్మా, నాకు మరి బొమ్మియ్యవూ?—

యశోద

ఇస్తానమ్మా, ఇస్తాను—ఏమిరా నాయనా, కడుపు ఇంత గట్టిగా ఉంది; పొంగిన ట్లుందేమిటి?

శ్రీ కృష్ణుడు

ఏమో!—మరి ముద్దు పెట్టుకొన్నావు కాదూ—బొమ్మియ్యి—

యశోద

ఇదేమిట్రా, వళ్లంతా ఈజిడ్డు, ఏదీ చూడనియ్యి, అయ్యో, అయ్యో, నాతండ్రీ, ఇదేమిట్రా ఈపెదివిల మీద ఈనెత్తురు చారలూ?

శ్రీ కృష్ణుడు

ఏం లేదు.

యశోద

అయ్యో నా తండ్రీ—ఎక్కడికేనా వెళ్లి ఏమైనా తిన్నావా ఏమిట్రా.

శ్రీ కృష్ణుడు

ఊఁహు.

యశోద

ఎవరితోనైనా గిల్లి కజ్జాలు తెచ్చుకొన్నావా ఏమిటి?

శ్రీ కృష్ణుడు

ఊఁహు.

యశోద

నాతండ్రికి దిష్టి తగిలిందమ్మా; దిష్టి తీస్తా నుండు.

శ్రీ కృష్ణుడు

బొమ్మియ్యవుటే అమ్మా?

యశోద

ఉండు, దిష్టి తీస్తాను—తప్పమ్మా తప్పు, దిష్టిదీపం ఊదేసి ఆర్పెయ్యకూడదు—ఊదకురా—

శ్రీ కృష్ణుడు

మరియ్యవుటే బొమ్మా?

యశోద

ఇస్తాను గాని,—చూడు నిజంగా చెప్పు—ఈ కడుపు ఇంత ఉబ్బరంగా ఉందిగదా—ఎక్కడేమి తిన్నావో చెప్పు —

శ్రీ కృష్ణుడు

ఊఁ.

యశోద

చెప్పవు గామా—చెప్పకపోతే ఏం చేస్తానో ఎరుగుదువా?—

శ్రీ కృష్ణుడు

మరి, పొద్దున్నే, పాలుతాగానుకామా.

యశోద

ఛా, ఉట్టిది—

శ్రీ కృష్ణుడు

అవునే.

యశోద

చెప్పవూ? చెప్పవూ?—

శ్రీ కృష్ణుడు

ఉండు, ఉండు, చెబతా ఉండు—కొట్టకు మరి—మరేం, ఇందాకాను, మన పెద్దావుంది కామా—

యశోద

గబగబా చెప్పూ.

శ్రీ కృష్ణుడు

తువ్వాయి దానిదగ్గిర పాలు తాగి ఆడుకొంటోందే—అప్పుడేం, నేనేం, మరేం—

యశోద

ఏమి చేశావు, చెప్పూ—

శ్రీ కృష్ణుడు

నేనేం, అప్పుడూ, పెద్దావుదగ్గిరికి వెళ్లానే—వెళ్లి, తువ్వాయి పాలు తాగుతుంది కాదూ—అలాగ—

యశోద

అలాగ, ఏమిటి?

శ్రీ కృష్ణుడు

దానికాళ్లసందు కెళ్లి పాలు తాగేనే—

యశోద

అయ్యో అయ్యో నాయనా, అది తన్న లేదుకదా?—

శ్రీ కృష్ణుడు

లేదే—ఆపాలు ఎం చక్క వెచ్చగా తియ్యగా ఉన్నాయే—

యశోద

ఈ నె త్తురుచార లందుకా— అది తన్నిందా ఏమిటి—

శ్రీ కృష్ణుడు

లేదే—పాలు తాగుతూంటే తువ్వాయిని నాకుతుంది కామా—అలాగే నన్నూ నాకిందే—పెద్దావు.

యశోద

అయ్యో నీ అగడం బంగారం కాను—ఇం కెప్పుడూ ఆవుకాళ్లసందుకి వెళ్లవేం—

శ్రీ కృష్ణుడు

వెళ్లనే అమ్మా.

యశోద

మరింద బొమ్మ—[illegible] లక్క పిడతలు—అరుగుమీద కూచుని ఆడుకో[illegible] కాదూ?

శ్రీ కృష్ణుడు

నే నరుగుమీ[illegible]ళ్లను—ఇంట్లోనే నీదగ్గిర కూచుంటాను—

యశోద

అరుగుమీ[illegible]ంటే ఏం, నాయనా?—

శ్రీ కృష్ణుడు

నాకు భ[illegible]దమ్మా, నే వెళ్లను.

యశోద

నా అల్లరి[illegible] భయంకూడాను! అయితే ఈ పీట మీద కూ[illegible] పాలుపితుక్కు వస్తా—

౨

గోపికలు

ఏమమ్మా, [illegible]దమ్మా, తలుపు తియ్యవమ్మా ఒక మాటు.

యశోద

ఎవరమ్మా అక్క[illegible]?

గోపికలు

మేమమ్మా గోపిక[illegible]—ఒక్కమాటు తలుపు తియ్యవమ్మా.

యశోద

నాకృష్ణు డేడీ? ఈపీట[illegible] కూర్చోకుండా ఎక్కడికి వెళ్లావురా, నాయనా?

గోపికలు

తియ్యవమ్మా తలుపు, ఓ[illegible]దమ్మా.

యశోద

ఉండవమ్మా వచ్చేను—నా[illegible] కృష్ణా, ఎక్కడున్నావురా?

శ్రీ కృష్ణుడు

ఊఁ.

యశోద

ఈమూల నక్కే వేమిరా, నాయనా?

శ్రీ కృష్ణుడు

ఏం లేదు—

గోపికలు

అదేవమ్మా, పలికిన్నీ తలుపు తియ్యవూ? మాకుమాత్రం పనులు లేవటమ్మా?—ఏమమ్మా, యశోదమ్మా, తలుపు తియ్యరాదుటమ్మా ఒకమారు?

యశోద

వస్తున్నానమ్మా—అల్లా తొందర పడతారేం?—రా, నాతండ్రీ, రా, నిన్నెత్తుకొని వెళ్లి తలుపు తీస్తాను.

శ్రీ కృష్ణుడు

నేను రానే, నాకు భయం.

యశోద

గోపికలను చూస్తే భయమేమిటి? నీవు రోజూ వాళ్లతో ఆడుకొంటూ ఉంటావు కామా!—

శ్రీ కృష్ణుడు

నేను రానే అమ్మా—తలుపు తియ్యకే.

గోపికలు

యశోదమ్మా; ఓ యశోదమ్మా!

యశోద

వస్తున్నానమ్మా, తొందరపడకండి—రా అమ్మ రా, ఎత్తుకొంటాను—అమ్మ దొంగా; ఎత్తుకోనా, ఎత్తుకోనా.

శ్రీ కృష్ణుడు

వద్దే.

యశోద

అలాగ కాదమ్మా—ఆఁ—ఎత్తుకున్నానా మరి—ఈ మాటు తలుపు తీద్దాం, ఏం?

గోపికలు

ఇక్కడే నిలబడిపోతిమమ్మా యశోదమ్మా, తలుపు తియ్యవమ్మా—

యశోద

ఇదిగోనమ్మా తలుపుతీశాను—ఎందుకమ్మా ఇంతమంది గోపికలు వేళ గాని వేళ మా ఇంటికి వచ్చారు?—

గోపిక

అవునమ్మా యశోదమ్మా—మీపిల్లవాడి ఆగడం మీకు ఇష్టమయితే కావచ్చును గాని—ఊరివారందరికీ ఇష్టమాతుందమ్మా?

యశోద

అదేమే గోపమ్మా, అంతకోప మెందుకే?—మాపిల్లవాడేమి చేశాడో చెప్పవే.

గోపిక

ఏమి చేశాడో నేను చెప్పడ మెందుకమ్మా? మీ పిల్లవాడి ఆగడం మీకు తెలియదటమ్మా?

ఇంకో గోపిక

మీపిల్లవాణ్ణి అదుపాజ్ఞలలో పెట్టుకోక—ఏమి చేశాడంటా వేమిటమ్మా యశోదమ్మా?

మూడో గోపిక

మీకృష్ణమ్మ ఏమీ ఎరగని నంగనాచమ్మా!—నోట్లో వేలుపెడితే కరవలేడు పాపం!—

యశోద

మాపిల్లవాడు పొద్దిటినుంచీ మా ఇంట్లోనే ఉన్నాడు గాదటమ్మా.

గోపిక

అవునమ్మా నీ ఇంట్లోనే ఉన్నాడు—

ఇంకో గోపిక

మీ ఇంట్లోనే ఉండి మా ఇళ్లన్నీ చక్కబెట్టుతున్నాడు—కాదటమ్మా, యశోదమ్మా?

మూడోగోపిక

చంకలో నక్కి కూచుని ఎలా చూస్తున్నాడో ఏమీ ఎరగనట్లు—నాలి ముచ్చులా అలా చూస్తున్నావుగా ఏమీ ఎరగనట్లు కృష్ణా!

యశోద

అయితే మీరందరూ కలిసి ఏమితప్పు చేశా డంటారు మాకృష్ణమ్మ?

గోపిక

అవునే, యశోదమ్మా, మ మ్మెందు కడుగుతావమ్మా, మీపిల్లవాణ్ణే అడగవమ్మా—

ఇంకో గోపిక

ఏమిరా, కృష్ణా, చెప్పరా మీ అమ్మతోటి—

యశోద

ఏమి చేశావు, నాయనా, ఏమి చేశావు?—నాకు చెప్పవూ?

శ్రీ కృష్ణుడు

ఏమీ చెయ్యలేదే—

గోపిక

ఏమీ చెయ్యలేదుట్రా పెంకే?

ఇంకో గోపిక

ఏమీచేయలేదుగా—నంగనాచీ?

మూడో గోపిక

అవును ఏమీ చెయ్యలేదు—ఏమైనా చెయ్యగలవా అల్లరి—పాపం—అవునా కొంటే?

యశోద

ఎందుకమ్మా, మా అబ్బాయిని మాటలంటారు?—ఏమి చేశాడో మీరే చెప్పరాదుటమ్మా?—

గోపిక

మే మెందుకు చెప్పాలమ్మా యశోదమ్మా?

యశోద

చెప్పకపోతే ఎట్లా తెలిసేనమ్మా, గోపమ్మా?

గోపిక

తెలియ దంటా వేమిటమ్మా?—అంతా విడ్డూరం!—మీ అబ్బాయివల్లు చూశావుటమ్మా?—

ఇంకో గోపిక

ఆజిడ్డంతా ఒంటికి ఎందుకు వచ్చిందో అడగరాదుటమ్మా ఆ దొంగకృష్ణుణ్ణి?—

యశోద

ఏమిరా, నాయనా, ఒంటికి జిడ్డు ఎందుకు వచ్చిం దంటావురా? చెప్పమ్మా?

గోపిక

ఆపెదవిమీద చార లేమిటో అడగవే మమ్మా, యశోదమ్మా!

శ్రీ కృష్ణుడు

అమ్మా, వాళ్లని వెళ్లిపొమ్మనవే, భయం వేస్తోంది—

యశోద

అదేమిటమ్మా అందరూ కలిసి మాకృష్ణమ్మను బెదర గొడుతున్నారు—వెళ్లండమ్మా, మీ ఇళ్లకు మీరు వెళ్లండి—ఎవళ్లని చూచి ఎవ రనుకొన్నారో—

గోపిక

ఎంతచిత్రంగా మాట్లాడతావమ్మా నువ్వు—మీ కృష్ణ మూర్తినే మే మెరగము కాబోలు!

ఇంకో గోపిక

మా కెప్పుడూ కనిపించకుండానే ఉంటున్నాడు కాబోలు రోజుకు రోజు!—

యశోద

అయ్యో ఎంత ఖర్మం వచ్చిందమ్మా! మానాయన ఏమీ చెయ్యలే దంటూంటే ఏమో అల్లరి చేశాడని అంటు న్నారు కాబోలు—ఆ అల్లరి ఏమిటో చెప్పరాదు టమ్మా?—

గోపిక

పిల్లలని అదమాయించుకోకుండా మే మేమో అన్నా మంటా వెందుకమ్మా?—మీ అబ్బాయినే అడగవమ్మా! మాటలు రావా ఏమిటి పాపం మీవాడికి?

యశోద

చెప్పు, నాయనా, ఏమి చేశావో చెప్పు.

శ్రీ కృష్ణుడు

నే నేమీ చెయ్యలేదే అమ్మా.

యశోద

మాకృష్ణమ్మ ఏమీ చెయ్యలే దంటున్నాడమ్మా.

గోపిక

అంటాడమ్మా, అంటాడు—అనడు మరి?—మీ వాడు బుద్ధిమంతుడు—చూడమ్మా, నువ్వే చూడు—దీని పెదివి ఎలా కొరికివేశాడో చూడు—చూపవే మేగోపీ, పెదివి చూపు—అల్లా సిగ్గుపడతావేం?

శ్రీ కృష్ణుడు

ఉత్తిదే అమ్మా!

ఇంకో గోపిక

చూడవమ్మా యశోదమ్మా, మీ బుద్ధిమంతుడు మా చెల్లెలిపెదవికూడా రక్తాలొచ్చేటందుకు ఎలా కొరికేశాడో!

శ్రీ కృష్ణుడు

ఊఁ—నే కొరికేనా ?

ఇంకో గోపిక

చూడమ్మా యశోదా, చూడు ఈ పిల్లబుగ్గ—పళ్లు ఎలాగ దిగాయో - మాపిల్లలుమాత్రం పిల్లలు కారటమ్మా!

శ్రీ కృష్ణుడు

నాకు వెన్నముద్ద ఇస్తానని ఆశ పెట్టి—

యశోద

అయితే నిజంగా కొరికేవుట్రా—చూడు నిన్నేం చేస్తానో ?—ఏమి చేశావో నిజంగా జెప్పు.

శ్రీ కృష్ణుడు

కొట్టకే అమ్మా! మరి చెబతాను—

యశోద

చెప్పు మరి—

శ్రీ కృష్ణుడు

మరేం, ఈపిల్ల నాకు వెన్నముద్ద పెడతా నందే—

యశోద

ఎప్పుడూ ?

గోపిక

ఎప్పుడేమిటి—ఇందాకానే.

యశోద

అవునా ?

శ్రీ కృష్ణుడు

"నాకు వెన్నముద్ద పెడతా నన్నావు. పెట్ట"మంటే, చేత్తో తట్టుకు ఊరించిందే—"పోనీలే, పోనీలే, పెట్టవూ, పెట్టవూ" అంటే నోట్లో పడేసుకొని ఆకాశం చూపించిందే.

పిల్ల

అన్నీ అబద్ధాలే.

యశోద

నిజం చెప్పవుట్రా.

శ్రీ కృష్ణుడు

అప్పుడు నే నన్నాను గదా—మా అమ్మతో చెప్తానందు—అన్నాను. అంటే నన్నెత్తుకొని వెన్నముద్ద బుగ్గను పెట్టుకొని—బుగ్గకొరికి తీసుకోమందే—అంటే నేను బుగ్గ—

యశోద

ఏమమ్మా, మీరే మాపిల్లవాడికి అల్లరి నేర్పి మాపిల్లవాడు అల్లరి చేస్తున్నాడని ఎదురుచెప్పుతారమ్మా ?

గోపిక

మీపిల్లవాడు మహానిజమరిలాగ చెప్పుతా వేమమ్మా!

యశోద

అయితే నిజ మేమిటమ్మా ?

గోపిక

పోనీ చిన్నవాడుగదా అని ఎత్తుకొంటే "నీబుగ్గ వెన్నముద్దలాగ ఉం"దని కొరికేడే నీకొడుకు యశోదమ్మా!

ఇంకో గోపిక

పెదవి ఎందుకు కొరికాడో అడగవమ్మా ?

యశోద

నిజం చెప్పరా; నీ మూలాన్ని మాకు ఉండరాములు లేకుండా ఉన్నాయి.

శ్రీ కృష్ణుడు

ఆ అమ్మాయి నన్నెత్తుకోలేదా ఏమిటి మొదట—నన్నెందుకెత్తుకోవాలి ?

గోపిక

చిన్నపిల్లాడవని ముద్దుకొద్దీ ఎత్తుకొంది—ఎత్తుకొందని పెదవి కొరికేస్తావా ?

శ్రీ కృష్ణుడు

నే కొరికేనా ఏమిటి? నన్నెత్తుకొని పాట పాడింది—ఆ పాట తియ్యగా ఉందన్నాను—

యశోద

అంటే?

శ్రీ కృష్ణుడు

అతీపి ఎక్కడి దనుకొన్నావు—అంటే ఆ అమ్మాయి. అంటే పెదివిల్లోంచి వస్తోం దన్నానే—అంటే పాట తీపి పెదవిల మూలాన్నే—కావలిస్తే చూడు అందే—అంటే కొరికేనే.

యశోద

మీకు న్యాయమేనమ్మా? ఇటువంటి బుద్ధులు పిల్లవాడికి నేర్పుతారుటమ్మా.

గోపిక

మీపిల్లవాడిమాటే నిజమనుకుంటా వేమమ్మా యశోదా?—మీకృష్ణుడు పట్టి మాయలాడమ్మా—ఎత్తుకొని ముద్దుపెట్టుకోమని అడిగి పెదివిలమీద ముద్దుపెట్టుకొంటూంటే గోపిక పెదివి కొరికివేశాడమ్మా!

యశోద

అవునుట్రా కృష్ణా?

శ్రీ కృష్ణుడు

కాదే అమ్మా!

యశోద

ఏమిరా నాయనా ఇంత అల్లరి చేస్తారురా! నిన్నేమి చెయ్యమన్నావు చెప్పు?

గోపిక

ఇంకా వినవమ్మా మామాటలు?

యశోద

ఇంకా ఏముందమ్మా?

ఒక గోపిక

మాగూనలో వెన్నంతా తినేశాడే ఓయమ్మా!

ఇంకో గోపిక

మాపెరుగంతా దిమ్మరించేశాడే యశోదమ్మా!

ఇంకో గోపిక

మాపాలన్నీ పంచిపెట్టేశాడే ఓసెమ్మా!

గోపిక

ఏమిబుద్ధులు చెబతావో చెప్పమ్మా మీపిల్లవాడికి—మమ్మల్ని యిక్కడ ఉండమంటావో ఇంకో ఊరు మాచుకోమంటావో.

యశోద

ఇక్కడ కూర్చో కృష్ణా. ఇంట్లోకి వెళ్లి తాడు తెచ్చి నిన్ను స్తంభానికి కట్టివేస్తాను.

శ్రీ కృష్ణుడు

వద్దే, అమ్మా.

గోపిక

నీవు వెళ్లి తాడు తేవమ్మా; పారిపోకుండా మేము చూస్తూ ఉంటాము.

యశోద

ఇదిగో వెడుతున్నానమ్మా—పారిపోనివ్వకండమ్మా.

## 3

ఒక గోపిక

నన్నుకూడా ఒకమారు ఎత్తుకోనియ్యవమ్మా మాచిన్ని కృష్ణుణ్ణి!

ఇంకో గోపిక

ఉండవమ్మా, నువ్వా ఎత్తుకొందువు గాని—అయితే కృష్ణా—మీ అమ్మదగ్గిర ఎందుకు చెప్పావు అన్నేసి అబద్ధాలు?

శ్రీ కృష్ణుడు

మా అమ్మతో మీ రెందుకు చెప్పా లేమిటి?

గోపిక

నేనుకూడా ఎత్తుకుంటాను ఒకమాటు రావూ? నా కృష్ణమ్మవు కావూ?

శ్రీ కృష్ణుడు

నే రాను, మొన్న నెందుకు నన్ను కొట్టావు.

గోపిక

చూశావా, చూశావా, నేను కొట్టానా?

శ్రీ కృష్ణుడు

ఊఁ, కొట్టలేదు కామోసు?

గోపిక

నా రవిక చింపేస్తే నే కొట్టనూ—నాదగ్గిరికి రావు కామా? రావు కామా? ఎందుకు రావో చూస్తాను—ఏం, ఏం—ఈమాటు వచ్చావా!

శ్రీ కృష్ణుడు

మా అమ్మతో చెబతా ఉండు!

గోపిక

చెబతావా—చెబతావా—నీబుగ్గలు చిదిమి బూర్లొండే శెయ్యనా? వండెయ్యనా?—చెప్పు కృష్ణా, చెప్పు?

శ్రీ కృష్ణుడు

నా ఊపిరి సలపడం లేదు.

గోపిక

నీబొజ్జ కరిగించెయ్యనా? నీ చిన్ని బొజ్జ—ఏదీ నీ చిన్నిబొజ్జ ఏదీ?—

శ్రీ కృష్ణుడు

నన్నొదిలెయ్యి.

ఇంకో గోపిక

అలాగ నలిపివేస్తా వేమమ్మా చిన్నికృష్ణమ్మని?—ఇలా ఇయ్యవమ్మా—మేముమాత్రం ఎత్తుకోవద్దుటమ్మా?

గోపిక

ఇందవమ్మా, అల్లరి కృష్ణమ్మని ముద్దుగా ఎత్తుకొంటే తలంతా ఎలా రేపేశాడో—ఇంకెప్పుడూ రేపెయ్యవు గదా?—నల్లగా జీడిగింజలా ఒళ్లూ నువ్వూను!

ఇంకో గోపిక

ఏడీ నాకృష్ణమ్మ ఏడీ? నాముద్దులమూట ఏడీ?—కృష్ణా ఏదీ నీబుగ్గ?—ముద్దుపెట్టుకోనియ్యి.—కాకటిని కూడా ముద్దెట్టుకోనియ్యి?—ఏదీ నీవరహాలబొజ్జ?—ఇదేనా?—ముద్దుపెట్టుకోనా?—

శ్రీ కృష్ణుడు

నాకు కితకిత లవుతున్నాయి.—

గోపిక

ఏదీ నీగజ్జెలమొలతాడు?—ఒక్క ముద్దు పెట్టుకోనియ్యి. నీచిన్నపాదా లేవీ?—చిన్నపాదాలు—ఎర్రటి మెత్తని పాదాలు—ఒక్క ముద్దు.

ఇంకో గోపిక

అస్తమానం నువ్వే ఎత్తుకోవాలిటమ్మా?—పాపం! అక్కడ కూర్చోబెట్టవేనా కూర్చోబెట్టమ్మా—పిల్లవాడు నలిగిపోతున్నాడు.

శ్రీ కృష్ణుడు

నేను కూచోను, కూచుంటే అమ్మ వచ్చి కొడుతుంది.

గోపిక

పోనీ మా ఇంటికి తీసుకుపోమా?

శ్రీ కృష్ణుడు

నే రాను.

గోపిక

ఉండు, కృష్ణా—ఈచీరచెంగుతో నీ ఒంటి జిడ్డంతా తుడిచేనియ్యి—నెమిలి పింఛం సరిగా పెడతా నుండు—కదలకు. పువ్వులు సరిగా పెట్టనియ్యి—అయ్యో. మా కృష్ణమ్మబొట్టు చెరిగిపోయిందమ్మా, ఏమి చేశాడోగాని.

గోపిక

నీవు అలా నిలబడవమ్మా, నీబొట్టు కొంచెం తీసి కృష్ణమ్మకు పెడతాను—

శ్రీ కృష్ణుడు

అమ్మొస్తూంది.

గోపిక

అక్కడ కూచోబెట్టవే, అక్కడే కూచోబెట్టు—మన మిక్కడే ఇదివరకులాగే నిలబడదాము.

యశోద

ఏడమ్మా, కృష్ణుడు పారిపోలేదుగదా—ఎక్కడా వాడు తాడు కనిపించడమే లేదు. ఇప్పుడే వస్తాను—చూస్తూ ఉండండమ్మా మాపిల్లాన్ని.

గోపిక

వెళ్లవమ్మా చూస్తూ ఉంటాము—మీఅమ్మ వెళ్లింది లే—రావూ నే నెత్తుకుంటాను, కృష్ణా, రావూ.

శ్రీ కృష్ణుడు

నేను రాను.

ఇంకో గోపిక

పోనీ, నాదగ్గిరికి రా.

శ్రీ కృష్ణుడు

ఊహుం, రాను.

ఇంకో గోపిక

నా దగ్గిరికో?

శ్రీ కృష్ణుడు

నే రాను.

గోపిక

పోనీ అమ్మా మరీ. నువ్వు రాకపోతే మీ అమ్మతో చెప్పి కొట్టిస్తా ఉండు.

శ్రీ కృష్ణుడు

ఊఁ—మా అమ్మతో నేను చెబతాను—అమ్మా, అమ్మా, నేను పారిపోలేదు. నేను అల్లరి చెయ్యలేదు. మరేం, నన్నెత్తుకుంటా నంటే వెళ్ళన్నానే అమ్మా—అంతేనే అమ్మా—అంటాను.

గోపిక

రావు కాదూ, రాకపోతే మొట్టికాయలు తింటావు సుమా?

ఇంకో గోపిక

ఏవేలితో మొట్టానో చెప్పు.

ఇంకో గోపిక

నే నేవేలితో మొట్టానో చెప్పు.

గోపిక

అయ్యో, పాపం మా కృష్ణమ్మని అందరూ అలాగ మొట్టికాయలు మొట్టుతా రేమిటమ్మా పాపం!—రా కృష్ణా, రా, నే నెత్తుకుంటాలే.

గోపిక

వాచీర చింపేశాడే, అయ్యో!

ఇంకో గోపిక

వాహారాలు తెంపుతావురా ఇలాగ?—

శ్రీ కృష్ణుడు

వన్నెందుకు కొట్టాలి?—

గోపిక

కొట్టములే—నేను ఎత్తుకున్నానా మరి—ఏదీ ఎక్కడ నొప్పెట్టింది చూపించు. అక్కడ ఒక్క ముద్దు పెట్టుకుంటే పోతుంది.

ఇంకో గోపిక

పాపం, నొప్పెట్టిందా—ఉండు నేను ముద్దెట్టుకుని నొప్పి తీసేస్తాను—ఏం—ఈమాటు పోయిందా?—

ఇంకో గోపిక

అందరినీ ఒక్కొక్కమా రెత్తుకో నియ్యండమ్మా—అస్తమానం ఒక్కరే ఎత్తుకుంటే ఏలాగమ్మా మా చిన్ని కృష్ణమ్మని?

గోపిక

ఇదుగోనమ్మా, నువ్వెత్తుకోవమ్మా, మా చిరిబొజ్జ కృష్ణమ్మని.

ఇంకో గోపిక

నువ్వూ ఎత్తుకోవే నల్లకృష్ణమ్మని!

ఇంకో గోపిక

ఇదుగోనమ్మా కృష్ణమ్మా, పెద్దతామరరేకుల్లా కళ్లూ వీడూను—నలిపెయ్యకుండా ఎత్తుకోండమ్మా.

ఇంకో గోపిక

ఇలా తేవే, నేనూ ఎత్తుకుంటాను—

ఇంకో గోపిక

పాపం ఊపిరి సలపదే—అంతగా మొహంమీద మొహంపెట్టి ముద్దులాడుతా వేమిటే?

గోపిక

అందరూ ఇలా గుమిగూడే రేమిటమ్మా?

యశోద

ఏడమ్మా, మాకృష్ణమ్మ?

గోపిక

ఇదుగోనమ్మా, బిక్కమొహం వేసుకు కూచుంటే పోనీ పాపం అని ఎత్తుకున్నాము.

యశోద

అదేవమ్మా, అంతాం చోద్యంగా చెప్పుతావు—ఇప్పుడే కాదటమ్మా, మాకృష్ణుడు అల్లరిచేశాడని ఆడిపోశారు?

గోపిక

అల్లరిచెయ్యలేదంటున్నావమ్మా ఇప్పుడుమాత్రం ?

యశోద

నేను చూడ్డంలేదటమ్మా—మా కృష్ణమ్మ నెత్తుకొని అందరూ ముద్దాడడం లేదుటమ్మా ?—

గోపిక

చిన్నపిల్లాడుగదా అని ముద్దాడితే తప్పుటమ్మా?—

యశోద

బుద్ధులు చెప్పమనీ, దండించమనీ ఎంతో కోపంతో చెప్పి—ఇంతట్లోకే ఎలా ముద్దాడుతున్నారమ్మా ?

గోపిక

అల్లరిచేశాడు గనక అల్లరి చేశాడన్నాము కాని—ఇంతట్లోకే పాపం, కృష్ణమ్మని తాడుతో స్తంభానికి కట్టి వెయ్యాలమ్మా ?

యశోద

మీరే కాదటమ్మా మాకృష్ణమ్మమీద నేరాలు మోపారు?

గోపిక

అదేమిటమ్మా, అలా గంటావు—మేము మాత్రం కనీ పెంచేవాళ్లము కాదుటమ్మా—ఆమాత్రానికి పిల్లలిని తాళ్లతో స్తంభాలకి కట్టివేస్తారుటమ్మా ?

యశోద

నే నప్పుడే అనుకొన్నాను— మాకృష్ణుడు అల్లరి చేసేవాడు కాడని—ఎందుకమ్మా ఈలాటి నీలాపనిందలు మా కృష్ణమ్మమీద వెయ్యడం ?— ఇది న్యాయమేనటమ్మా ?

గోపిక

ఉండవమ్మా ఒక్కమారు కృష్ణుణ్ణి ముద్దు పెట్టుకొని వెళ్లిపోతాము.

యశోద

అలాగ అందరూ మీద పడి నలిపేస్తారేమమ్మా చిన్నపిల్లాడిని ?—మా అబ్బాయిని ఇలా యియ్యండమ్మా—బెదిరిపోతాడు—

గోపిక

ఇదుగోనమ్మా తీసుకోవమ్మా—ఇంతటి మహా మాఅబ్బాయిని—మేము వెళ్లిపోతున్నాము—

యశోద

రారా, నాయనా, రా, అమ్మా, రా, నీమీద ఎలాంటి నేరాలు మోపేరో—తీరా మోసి వాళ్లమాటలు నమ్మి నిన్ను స్తంభానికి కట్టేను కాను—ఇంకా నయం—ఎంతటివాళ్లేనా ఉంటారు.

శ్రీ కృష్ణుడు

అమ్మా, నాకు బువ్వెట్టవులే ?

యశోద

పెడతానమ్మా, పెడతా—భయ మన్నావు, భయం పోయిందా నాయనా—

శ్రీ కృష్ణుడు

పోయిందే.

యశోద

అయినా ఇంకోమారు దిష్టి తీస్తానుండు—ఎవరి కళ్లు ఎలాంటివో.

శ్రీ కృష్ణుడు

అస్తమానం నాచుట్టూరా మిరపకాయలు తిప్పుతానంటావెందుకే—నా కక్కర లేదమ్మా—నాకొద్దు.

---

"పరిచయంకోసం ఏం తంటాలుపడి పోతు న్నాయి ఈ హృదయం, ఈ కళ్లు, ఈ నొసలు, ఈపెదవులు, ఈమనస్సు, ఈఆత్మ." అని అనుకొన్న తనసంగతి తన కనుతెప్పల నన్నా వాటివాటి చిట్టి చిట్టి చిటికె చిటికె చప్పళ్లుగుండా వెల్లడిపఱుపనీనంత నిశ్శబ్దంగా చటక్కన నోమాటు కన్ను వీథికేసి మలసి, నత్తల్లే యింట్లోకి వెళ్లిపోయింది, అరుంధతి. దానిలో నేముంది అంటే ఎవరూ ఏమాటా చెప్పలేరు గాని, 'ఏమైనా ఉండకుండా వుంటుందా' అని నిజంగా తెలిసికోవాలనే కుతూహలంకొద్దీ గమనిస్తే మాత్రం ఏవో ఉండకుండాపోదని నా తాత్పర్యం.

కన్ను వీథివైపు మలపితే మలపవచ్చును గాని, నత్తలాగు ఇంట్లోకి జాఱటాని క్కారణం ఏముంటుంది? లోకమంతా మురిసిపోయే అందం ఆ అరుంధతిది. ఆమెకు భయమెందుకు? లోకమంతా జిలిబిలిపుచ్చే ముద్దు పలుకు ఆ అరుంధతిది. ఆమె కంత ముగ్ధత్వమెందుకు? లోక మంతను వెల్లడికి దెచ్చే కళాకాంతులు ఆ అరుంధతివి. ఆమె కంత తబ్బిబ్బు ఎందుకు?—ఓ మగవాడు ఆచూపులో తనచూపు ఆక్షణమందు చటక్కన గలిపినాడు. అది వినా మఱొకకారణం కనిపించదు—ఆబిడ ఆఘక్కి నొక్కుమ్మడి సర్వేంద్రియాలు లోనికి లాగుకొను తాంబేలు మచ్చుగా కొంచివేసికొని తిరోహిత అగుటకు—అది వినా మఱొకకారణం కనిపించదు. ఆ మగవా డెవరూ అంటే పేరు మనకు తెలీదు. ఊరు మనకు తెలీదు. నవలల్లో అనేటట్టు క్రొత్తపురుషుడు అని అనుకోవాలి, అంతే.

ఆ క్రొత్తపురుషుడు ఆ వెళ్లడం వెళ్లడం ఆవీథికొనకంటా వెళ్లి తిరిగి వెనక్కి మళ్లి వచ్చినాడు. తిరిగి మళ్లివచ్చేలో అదివఱకరుంధతి నిలుచున్న గుమ్మంలో అరుంధతి లేదు. ఆగుమ్మం శూన్యంగా వుంది. గుమ్మం శూన్యంగా వుండడంలో అతని హృదయం ప్రేమశూన్య మైపోయిన ట్టయిపోయి ఓపుడియ, తాఱుమాఱుగా ఎదర గుమ్మంకేసి, పక్క గుమ్మంకేసి చూస్తూ కళ్లను బండి కండ్లల్లా త్రిప్పేశాడు. ఎవరూ కనబడలే. 'ఇదేనా ఇందాకా చూచిన గుమ్మం?' అని ఎదో ఆనవాలుగా తెలిసికోని, 'ఇదే' అని అనుకోని ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ లోపలకు చొఱబాఱి, పరికిస్తూవున్నా 'డెవరైనా వస్తారా పలుకరిద్దామా' అని.—ఎవరూ రాలేదు గాని అతనికి చూచాయగా లోలోపల ఒకమంచంమీాద ఒక వనిత పరున్నట్టు గోచరించింది—వనితా? లేక వనితయొక్క పవళింపు ప్రతిమా అనే సంకోచం గలిగింది,

అతను తన కనుతెప్ప వ్రాల్చి తిరిగి యెత్తడం లో.—పట్టిమంచం, అందుమీద పరుపెత్తు, పరుపెత్తుమీద కలంకారా దుప్పటీ, దుప్పటి మీద తలాటిదిక్కున రెండు తలగడాలు తెల్లనివి, జాలరు వోసిన గలేబులు తొడిగినవి ఎత్తుగా ఉంచబడి యున్నాయి. ఆతలగడాల మీద ఆవనిత మోమానుకొని బోర్లా పరుండి చేతులు రెండూ తలగడాలను కావిలించు



"ఆ తలగడాలమీద.........బోర్లా పరుండి"

కొన్నట్లుంచి, జబ్బలయొక్క గుండ్రందనము, నవకము, పొందిక, చాయ చూపఱకు వదలి వైచి, గడ్డం తలగడలపై నాని, మోమెత్తి తెప్ప లఱవాల్చి నిశ్చేష్టత నుంది, అప్పటి కప్పుడే. అది శిల్పం అనుకోక ఒకడుమాత్రం నిజంమనిపి. అని అనుకోవడం ఏలా? తల్పం మీద ఇటూ అటూ జోగితేగా, ఇటూ అటూ జరిగితేగా?

క్రొత్తపురుషుడు 'తనకేసే చూస్తోంది ఆస్త్రీ' అని అనుకున్నాడు. మళ్లీ అనుకు న్నాడు, "రవంత తన్ను చూచియుంటే లేచి నిలబడదా? జంకనైనా జంకదా? కొంక నైనా కొంకదా?" అని. ఆ జంకకపోవడం, కొంకకపోవడం మఱింత బలపఱిచింది నిజంగా చెక్కడపుబొమ్మే నని.

ఒకనిమిష మవగాహన కవకాశం వుంచుకుంటేగా— క్రొత్త పురుషుడు గిరుక్కున మళ్లి వీథిగుమ్మం దాటివచ్చి, దాటుతో గుమ్మంతలుపు అంకె గుర్తిం చుకొని, తెట్టతెన్నె ఇంకా నడచి, వీథి చివర వీథి పేరుగుర్తించుకొని, "ఇసుక పల్లి వారి వీథి, ౧౦౩ ఇల్లు అదే. కాని నిరర్థక మైపోయింది వెళ్లడం" అని అనుకొన్నాడు.

క్రొత్తపురుషుడు తిన్నగా ఒకగమ్య స్థానానికి జేరుకొని "ఆర్యా! నన్ను మోసపుచ్చినావు. ఇంట నెవ్వరూ లేరు." అన్నాడు అవత లో పెద్దమని షితో.

ఆపెద్దమనిషి యీక్రొత్తపురుషుని వెం టనే నఖశిఖపర్యంతం చూచి, "లోపలకు వెళ్లినారా? తలుపుతీసి లేదండీ? లోపల ఆ అమ్మాయి లేదండీ?" అని అడిగినాడు. "అమ్మాయి యేమిటి గాని ఆవిడ—ఆవిడే

అనుకుంటాను—గుమ్మంలో నిలబడి కనిపించింది ముందు. ఆవెంటనే ఆగుమ్మం ఆలా ఎక్కితే బాగుండదని వీధిచివరకు వెళ్లి తిరిగి వచ్చినాను. ఆలోపున గుమ్మంలో ఎవరూ కానరారు. ఎవరును లేరు గదా అని లోపలకు వెళ్లినాను. ఎవరూ ప్రత్యక్షం గాని, మాట్లాడ్డం గాని కనబడలేదు, వినబడలేదు. వెనక్కి వచ్చేశా" నన్నాడు, మన క్రొత్త పురుషుడు. "లోప లెవరూ మీ కగుపించ లేదూ?" అన్నాడు మళ్లీని ఆ పెద్దమనిషి. "ఇదంతా దగాలాగు తోస్తుంది" అన్నాడు క్రొత్తపురుషుడు. "ఏదంతా?" అన్నాడు పెద్దమనిషి. "ఈవార్తాపత్రికలో 'సొగసైన పిల్ల, చదువుకొన్నపిల్ల, ౧౮ ఏళ్లపిల్ల పెళ్లికుంది. వలసినవారు—పెద్ద మనిషి సంరక్షణలో, ఇసుకపల్లివారి వీధి, ౧౦3 నెం. ఇల్లు' అని వ్రాసిందంతా" అన్నాడు క్రొత్తపురుషుడు. పెద్దమనిషి వెంటనే "నీకు వరించడం తెలీక పైపెచ్చు నన్ను దగాకోరంటావు? ఆపె అక్కడనే వుండాలి. నేను చెప్పి వచ్చినాను 'ఒకరొస్తారు చూచుకోవలసింది' అని. ఆమె అక్కడ లేకపోవడమంటూవస్తే ఆమె నన్నూ నిన్నూ కూడా దగాచేసి వుండాలి" అన్నాడు.

అంటూ వెంటనే ఆపెద్దమనిషిన్నీ, యీ క్రొత్తపురుషున్నూ పైని వివరించిన ఇంటికి వెళ్లినారు. పెద్దమనిషి లోపలకు వెళ్లడంతోనే, "అరుంధతీ! అరుంధతీ!" అని కేకేసినాడు. లోపల నుంచి అరుంధతి నడవలోకి



"పెద్దమనిషి వెంటనే...అన్నాడు క్రొత్తపురుషునితో."

వచ్చి "ఇక్కడున్నాను" అంది. పెద్దమనిషి వెంటనే "ఇక్కడుంటేనండీ?" అన్నాడు క్రొత్తపురుషునితో. వెంటనే అరుంధతివైపునకు దిరిగి "వీరే నే నన్నవారు. వార్తాపత్రికప్రకటన చూచి నిన్ను వరింప వచ్చినారు. వీరిప్పుడిలా మనింటికి వచ్చినారట. నీ వెందరిగినావు?" అని అన్నాడు. అరుంధతి అంది, "ఎక్కడికీ వెళ్లలేదే, యీ మంచం మీద పరుండి యున్నాను" అని. క్రొత్త పురుషుడు "ఆ పడుకున్నవారు మీరేనా? నే నది శిల్పి చెక్కడ మనుకున్నా" అన్నాడు. పెద్దమనిషి "శిల్పం అనుకోడానికి మనిషిచలనమున్నా పోల్చలేకపోతివయ్యా,

సామీ!" అన్నాడు. అరుంధతి "మీరు కారు వచ్చింది. మీరు వస్తే పోల్చలేక పోయేవా దాన్నా? మీ రంతక్రితమే అలా వీథంట వెళ్లిన ట్లున్నారు" అంది. క్రొత్తపురుషుడు "అవును వెళ్లినాను" అన్నాడు. "మీరు కాక ఆలోపల మఱెవరు వచ్చినారు" అన్నాడు పెద్ద మనిషి.

అనేసరికి అరుంధతి సామాన్య స్త్రీలా నిరుత్తర గాక, "అతడే, ఆ గోపాలుడే, ఆ గోపికాలోలుడే—ఆవేణు వ్రూద కుంటూనే" అంది. పెద్దమనిషి నమ్మలేక పోయినాడు. క్రొత్తపురుషుడు అర్థంచేసుకోలేకపోయినాడు. పెద్దమనిషి, "ఆర్యా! మీరు వచ్చినవేళ మంచిది కాదు. మీరు గుమ్మంలో ఆపెను చూచినప్పుడే ఇంటిసంఖ్య గుర్తించి లోపలకు వెళ్లి పలుకరించవలసి యుండేది" అన్నాడు. క్రొత్తపురుషుడు "నే నాచివరకు వెళ్లి తిరిగి వచ్చే ఇంతలోనే అంతవైరాగ్యం ప్రబలి వుంటుందా?" అన్నాడు. పెద్దమనిషి "వైరాగ్యం కాదు. ఆమె మఱొకర్ని గుఱించి యోజిస్తూ వుండవచ్చును" అన్నాడు. క్రొత్త పురుషుడు 'సెల విప్పించండి' అని కూడా అనకుండా వచ్చినదార్నే వెళ్లిపోయినాడు.

ఆ అరుంధతికి నాటికీ నేటికీ వివాహం కాలేదు. ఆమెహృదయం నాటికీ నేటికీ అనన్యార్పితం.

పెద్దమనిషి యెప్పుడన్నా అరుంధతిని "నీ వానాడు వచ్చిన క్రొత్తపురుషుని ప్రేమించినావా?" అని ఓమాటంటే, "ప్రేమించ కేం? వెళ్లిపోయినాడు గిరుక్కున. నే నీలోకంలో ప్రేమించివుంటే ఆయన్నే" నంది.



"మఱెందు కాలా గోపాలుడు.........అని అడిగితే"

"మఱెందు కాలా గోపాలుడు కనబడ్డాడని బొంకినావూ" అని అడిగితే, "నాహృదయ పరిణామముయొక్క సత్యమును చెప్పినాను" అంది. "ఒక స్త్రీ ఒక మగవానిని ప్రేమించిందీ అంటే ఆ స్త్రీ ఆమగవాణ్ణితప్ప దేవుణ్ణి అయినా ప్రేమించినట్టు చెప్ప వలను గాదు. అదీ ప్రేమరహస్యం" అన్నాడు పెద్దమనిషి.

అయితే అటువంటి వివాహం నా కక్కఱలే దంది అరుంధతి.

# అయితే పాపము! లలిత గతేమిటి?

శ్రీమతి క. వరలక్ష్మమ్మగారు

౧

జగన్నాథం రాత్రిమెయిలులో యింటికి వచ్చాడు.

తెల్లవారుజామునసే మొదలు పెట్టింది తల్లి "నాయనా నీకు మళ్లీ పెళ్లి చేస్తానురా" అని. జగన్నాథం ఆమాట విని ఉలికిపడి "ఇదేమిటే అమ్మా" పెండ్లి అయినవాడికి పెండ్లి చేస్తానంటావు?" అన్నాడు.

"వాళ్ల తరహా యేమీ బాగాలేదు."

"ఏమి?"

"ఆపిల్లను ఇంగ్లీషుచదువుకోసం విశాఖపట్నం పంపారుట. ఇక ఆవిడ ఎప్పే బియ్యే అయ్యే దెప్పటికో, యింటికొచ్చే దెప్పటికో"

"పోనీ! నేనూ చదువుకుంటున్నానుగా! నా చదువింకా నాలుగేళ్లున్నది. ఈలోపల ఆపిల్లా చదువుకుంటుంది. ఇంట్లో ఉండి ఏమిచెయ్యాలె?"

"అదీసరస. మీ మగకుంకలకు ఇట్లాంటి బుద్ధులు పుట్టబట్టే వాళ్ల కట్లా పొయ్యేకాలం వచ్చింది. లేకపోతే పెండ్లయి ఈడేరిన పిల్లను యెవరట్లా సాహసించి చదువుకోసం పొరుగూరు పంపుతారు? నాలుగేండ్లు నీవు చదువుకుంటూఉంటేమాత్రం ఆవిడకూడా చదువుకోవలెనా? పెద్దదాన్ని రేవులుమాపులు చేసుకోలేక చస్తున్నానుగదా, ఆముక్క కాస్తా తీర్చుకొని యింట్లో తీసుకొచ్చి పడేసుకుంటే, కాస్త చేతికి ఆసరాగా ఉంటదూ. ఏదీ లేదాయె, పైగా నీవే, 'చదువుకుంటే— ఏమో' అంటూ ఉంటివి."

"అయితే యేమంటావు?"

"అది నిన్ను మించి చదువుకుంటే అసలు నీకు లొంగుతుందా? అంట."

"అయితే చదివించవద్దని వాళ్లకు వ్రాయించకపోయినావా?"

"వ్రాయించలేదనుకున్నావా? మీనాన్నగారేగా ఉత్తరాలు వ్రాసింది? మాయింట ఆడవాళ్లు చదువుకునే ఆచారంలేదనీ, మాకోడలును చదువుకోసం పొరుగూరు పంపవద్దనీ, మామాట వినకుండా పంపితే అందువల్ల వచ్చే కష్టాలకు మీరే బాధ్యులౌతారనీ యెన్నెన్నివిధాలో వ్రాశారు. వ్రాస్తేమాత్రం ఏమి."

"ఏమీ? దానికి జవాబు వ్రాయలేదూ?"

"ఆఁ వ్రాశారు, ఒకమాటు పిల్ల చదవాలని కుతూహలపడుతున్నదనీ, ఒకమాటు తల్లి కూతురును చదివించాలని సరదాపడుతున్నదనీ, ఏవేవో వంకరజవాబులు మీ మామగారు వ్రాశాడు. అయినా ఆయనమాత్రం ఏమి చేస్తాడు? ఆయన పట్టి డూడూబసవన్న. పెళ్లామూ, కూతురూ ఎట్లాచెప్పితే అట్లా. ఆయనకో అధికారం యేడిస్తేగా? ఆతల్లిబిడ్డల్లోనే ఉన్నది, కుట్రంతా. మళ్లీ మీనాన్నగారు వ్రాసిన ఉత్తరానికి జవాబు లేకపోతే యింకా చదువుకు పంపడం మానుకున్నారేమోనని సంతోషిస్తున్నా. మొన్న సాంబశివరావుగారి మేనగోడలు, అధీనంతప్పినపిల్ల విశాఖపట్నంలో చదువుతున్నదే, అది వచ్చి 'మీకోడలు మాస్కూల్లో చదువుతున్నదే'అన్నది, వాళ్లింటికి పోతే. పుటికిక్కిన నలుగురిలోను నాకు తల గొట్టినట్లయింది. వాళ్లంటే సంపాదించిపెట్టే మొగుడు పోయినాడుగనుక చేసేదేమీ లేక చదువుకుంటున్నారు. దీని కేమికర్మం వచ్చిందని చదువుకోడం. లక్షణంగా అత్తా, మామా, పెనిమిటీ ఇంతకలిగిన కాపురంగదా, ఏమిలేక యీప్రారబ్ధం?"

"వాళ్లు చేసినపని తెలివితక్కువపనే అనుకో. అయితే యిప్పు డేమి చేస్తాము?"

"చేసే దేమున్నదీ? దీని కొక్కటే మందు."

"ఏమి మందు?"

"మొదటనే చెప్పితినిగా! నీకు మళ్లీ పెళ్లిచేస్తాము"

"సరిసరి; బా వున్నది. చదువుకుంటున్నదని పెళ్లి, సంగీతం నేర్చుకుంటున్నదని పెండ్లి, ఆడుకుంటున్నదని పెండ్లి, పాడుకుంటున్నదని పెండ్లి, అందంగా లేదని పెండ్లి, చదువుకు సాయంచేయలేదని పెండ్లి, ఇదేనా పని? కాస్తకు కూస్తకూ పెండ్లాన్ని వదిలిపెట్టి పెండ్లి చేసుకోడమేనా ?"

"నీవెక్కిరింపులూ, కొక్కిరింపులూ పనికిరావబ్బాయి. ఆ పెండ్లాము వచ్చి నీకేమైనా వరిగిస్తుందని అనుకుంటున్నావేమో! అది వట్టిమాట. ఒకవేళ ఆపిల్ల వస్తానన్నా ఆతల్లి రానియ్యదు. ఒకవేళ వచ్చినా ఆ తల్లి మిమ్మల్ని సుఖంగా ఉండనియ్యదు. ఆవిడ యెటువంటి దనుకున్నావు, యేమికథ? పెండ్లిలో చూడలేదూ? ఒక్కమాటూ సరిగా భోజనానికి పిలువక ఒక్కవేడుకా సరిగా జరపక ఒక్కలాంఛనము సరిగా యివ్వక యెట్లా చేసిందో!"

"మనంమాత్రం వారిని సరిగా జరపనిచ్చామూ? వియ్యపురాళ్లిద్దఱూ డీ అంటే డీ అని ముచ్చటగా జరగాలిసిన పెండ్లి ఆగాలతో భోగాలతో అల్లరి హంగామా చేశారు ?"

"అదిగో నీ కుండే తెగులదే! పేడా బెల్లం కలుపుతావు. నేను అల్లరి చేశానూ? మీ నాన్నను అడుగుదా ముండూ. ఏమండీ, అబ్బాయి పెండ్లిలో తగాదాలు పెట్టిం దెవరు ?" అని కళ్లనీళ్లపర్యంతమై గాఢనిద్రలో ఉన్న రాఘవయ్యగారిని లేపడానికి సిద్ధమైంది, కాంతమ్మ.

"అబ్బా యేమిటమ్మా! మాటకుమాట సమాధానమియ్యాలెగాని హాయిగా నిద్రబోతున్న నాన్నను లేపబోతా వెందుకు? ప్రత్యక్షంగా చూచినదానికి సాక్ష్యంతో పనేమిటి ?" అని తిన్నగా తల్లిని కోప్పడి తండ్రిని లేపకుండా అడ్డగించాడు జగన్నాథం.

"లేకపోతే ఒక్కగానొక్క బిడ్డే, అయ్యో, వీడికిటువంటి భార్యా, అత్తగారూ దాపురించిరే! ఏమిరా స్వామీ! విచారించి విచారించి ఆఖరు కిట్టి భ్రష్టాకారపు సంబంధం చేస్తిమి. ఒక్క అచ్చటా ముచ్చటా జరగక పోయెనే, ఏమిరా స్వామీ అని నేను రాత్రిం బగళ్లు యేడుస్తుంటే నీవు ఆవిడకూ నాకూ పోల్కి దెచ్చి కాలి చచ్చేమాట లంటావా? నాకుమాత్రం నిన్నగాక మొన్న రెండుసంచులు పోసి పెండ్లిచేసి మళ్లీ చేయడం సంబరమా? ఆపిల్ల నట్లా చదువుకు పంపడం, ఎంత గొప్ప పండుగలు వచ్చినా యెన్నాళ్లు సెలవులువచ్చినా అత్తవారని ముచ్చటగా పిలుచుకుపోవడం, బట్టా పాతా పెట్టడం, అల్లుడని అపేక్షపడడం, ఏమీ లేకపోవడం చూచి మనస్సులో యెంత మఱిగిపోతున్నానో నీ కేమి తెలుసు? కడుపు కన్నాం, కంటికి కూర్కు యెఱగను. ఈ మాయసంబంధం యేమని వచ్చిందో! నే నిట్లా అల్లాడుతుంటే పైగా నీమాటలివా ?"

కాంతమ్మ కండ్ల నీళ్లు బలబలా కార్చింది. ఈమహాస్త్రప్రయోగంతో జగన్నాథం నిరుత్తరుడైనాడు. భూమ్యాకాశాలను బ్రద్దలు చేసే యేదో మహా సంక్షోభంలో నిలిచిపోయింది అతనిమనస్సు. రెండు చేతులతో తల గట్టిగా పట్టుకొని మంచంమీద వెల్లకిలా బడ్డాడు.

౨

తనతండ్రి కేవలం నెలకు ౨౦ రూపాయల వేతనం గల మున్సబుకోర్టుగుమాస్తా. తాను గొప్ప ఆస్తి గలవాడని భావించుకుంటూ, తాను ఉన్నతవిద్య నభ్యసించుటకూ, తనకు హెచ్చుముత్తము కట్నముగా వచ్చుటకూ, యే ఆస్తి అయితే ఉన్నదో అది తల్లిది. పుట్టినింటివా రెవరూ లేనికారణంచేత తండ్రి ఆస్తిఅంతా కాంతమ్మకు వచ్చివేసింది. కాబట్టి తనతల్లికి వ్యతిరేకించడం అంటే ఆస్తికి నీళ్లు వదులుకోడం అన్నమాట. వదులుకోని యేమిచేయడము? చదువు అసంపూర్తిగా ఉన్నది. చేతిలో కానీ లేదు. నేను మళ్లీ పెళ్లిచేసుకోనూ అంటే 'పొండి, నీవూ, నీభార్యా ఎట్లా బ్రతుకుతారో బ్రతకండి' అంటుంది. మహాపెంకెపట్టుదల గలది. ఆమెకు అంతటా చెల్లవలసినది తనఆజ్ఞా, తన అధికారంగాని, వేఱేమీ కాదు. దీనికి వ్యతిరేకం చేసిరా పెనిమిటికాని, కొమారుడుగాని మఱెవ్వరుగాని

నెత్తిమీద చేట వేసికొనిపోవలసినదే! తల్లి యొక్క స్వభావం, ఆమె అధీనమైయున్న ఆస్తిపాస్తుల విషయం సమస్తము తెలిసినవాడగుటచేత యేంచేస్తునా అని ఆలోచనాసాగరంలో మునిగిపోయినాడు జగన్నాథం. తనకున్న ఆస్తిచేత తన్నూ, తండ్రిని, బానిసల క్రింద కొనేసుకున్నది తన అమ్మ. ఈఅధికారంక్రింద జీవించడం యెంతదుస్సహంగా ఉన్నదో అంత అవిలంఘనీయంగా ఉన్నది. కనుకనే యెంతయోచించినా ఆతని యోచన తీరమునుచేరలేదు. అబ్బా! ఈసెలవులకు యింటికి రాకుండా ఉండకపోతినే. ఈవేదనచేత తల పేలిపోయేటట్లున్నదే అని అనుకున్నాడు కాని అక్కడున్నా రావలసిందని తల్లి వద్దనుండి తాఖీదు వచ్చినట్లయితే తత్క్షణం రావలసిందేగా అని తోచినప్పుడు తన నిస్సహాయత బాగా గోచరమైంది జగన్నాథానికి. ఈతెంపులేని యోచనలో మూడుదినాలు గడచిపోయినాయి. 'ఆపిల్ల అభిప్రాయమైనా తెలుసుకోకుండా పెండ్లాడటం నాకిష్టంలేదు. విశాఖపట్నంవెళ్లి ఆఅమ్మాయితో మాట్లాడి తీసుకొనిరావడానికి ప్రయత్నిస్తాను. ఆపిల్ల వస్తే తీసుకొస్తాను. రాకపోతే అప్పుడు ఆలోచిద్దా'మని కొంచెం మొండిధైర్యంతో గట్టిగా యెదిరించాడు తల్లిని జగన్నాథం. చాలాకాలంనుంచీ ప్రబల శత్రువుగా ఉన్నవాడు తన అధీనమౌతాడంటే వాడిపై కసిదీర్చుకోవచ్చునని సంతోషబడినట్టుగా, కోడలే తన యింటికి తనకుదానై వచ్చినట్లయితే ఆపిల్లనూ, తల్లినీ కూడా బాగా బాధించి కసితీర్చుకోవచ్చునను ఆశతో కాంతమ్మ ఒప్పుకున్నది. నరమాంసాశనులు నరరక్తపోషులు అంటూఉంటే చాలామంది అనుకుంటూ ఉంటారు: ఒకమనుష్యుడిని. తీసుకొచ్చి వాడిని కోసి వాడిరక్తంత్రాగి వాడిమాంసం ముక్కలుక్రింద చేసుకొని తినేవాళ్లని. అది చాలా పొరబాటు. ఎవరైతే తమ నిర్దయాత్మకమైన ప్రవర్తనవల్ల యితరుల మనస్సును శోభపెట్టి వాళ్ల రక్తమాంసాలను శుష్కింపచేస్తున్నారో వారే మానవభోజులు. ఆహారంక్రింద ఒక ప్రాణిని ఉపయోగించేవాళ్లల్లో దయారసం ఉంటుంది. కాని వీళ్లకు ఉండదు.

౩

జగన్నాథం చివర కెట్లాగో విశాఖపట్నం [illegible] హాస్టలు మేనేజరమ్మగారికి వ్రాసి మధ్యాహ్నం ఒకటిన్నర రెండున్నరగంటలమధ్య లలితతో మాట్లాడవలసినట్టుగా ఉత్తరువు పొందినాడు. ఆ ఉత్తరువు యిస్తూనే మేనేజరమ్మగారు లలితను పిలిచి చెప్పింది. "లలితా! నీభర్త మధ్యాహ్నం వచ్చి నీతో యేమో మాట్లాడుతాడట. కనుక ఎండ అని స్కూలులోనే ఉండిపోక హాస్టలుకు రా." అని. చక్కని నందనోద్యానంలో హేలగా ఆడుకుంటున్న లేడికి ఎక్కడినుంచో ఆకస్మికంగా బాణం వచ్చి గ్రుచ్చికొన్నట్లయింది, లలిత కావర్తమానం. వెనకకు పోలేదు. ముందుకు రాలేదు. అక్కడ నిలబడలేదు. గుండెలలో యేదో అదురు పుట్టింది. సీలలుతీసిన యంత్రంలాగు అవయవాలన్నీ కుప్పబడిపోవటం మొదలుపెట్టినవి. అతిప్రయత్నంమీద తిన్నగా మేనేజరమ్మగారి యెదుటినుండి చాటుకు వచ్చింది. కాని ఆ అదురు, ఆ విహ్వలత పోలేదు. ఆరోజున అన్నము అఱిగాలు, బడిలో పాఠాలు పూజ్యము! అత్తవారినిగూర్చి తాను విన్నవిషయాలు, పెండ్లిలో తానుచూచిన విషయాలు, జరుగబోయేదాన్నిగూర్చి తాను ఊహించుకుంటున్న విషయాలు, అన్నిటినీ అన్నిరంగులుగా చేసికొని కల్పనాబలంచేత గొప్ప భయానక భీభత్సచిత్రాలను రచిస్తున్నది ఆమెమనస్సు. ఆపటాలను చూచి హడలిపోతూ గడపివేస్తున్నది ఆపగలును లలిత. బడిని విడిచే గంట కొట్టారు. భయం భయంతో లలిత హాస్టలుకు వచ్చింది. గేటుకు ప్రక్కగానే ఇతరులు వచ్చినప్పుడు మాట్లాడడానికి యేర్పడి ఉన్న గదిలో కూర్చుండి ఉన్న మేనేజరమ్మగారు 'లలితా!' అని పిలిచింది. జింకపిల్లలాగు బెదరిబెదరి చూస్తూ లలిత గదిలోకి వెళ్లి మేనేజరమ్మగారి కుర్చీ నానుకొని తల వంచి నిలుచున్నది. విశాలమైన ముఖము, పలుచని చెక్కిళ్లు, నమ్రతచేతా సిగ్గుచేతా అరమోడ్పులై ఉన్న చక్కని కన్నులు, నిడుపైన వాలుజడ, అందులో లలిత ముఖ కమలమువలెనే వసివాడియున్న గులాబిపువ్వు,

మనస్సులో ఉన్న భయంచేతా, ఎదుట భర్తను చూడడం చేతా పిల్లగాడ్పులకు తూగాడు వల్లరివలె కంపించు తనూలత కలిగి మధురమధురముగా నున్న లలితనుచూచి పులకితుడైనాడు జగన్నాథం. నేను బోయి ఆ అమ్మాయిని చూచి మాట్లాడి ఆ అమ్మాయి కాదంటేనే తప్ప నేను మళ్లీ పెళ్లిచేసుకోనని తల్లితో పోరాడి వచ్చాడు కాని ఇక్కడ లలితతో యేమి మాట్లాడవలెనో అతనికి బోధపడలేదు. కేవలము ఆమె లావణ్యరసం నేత్రేంద్రియాలతో పానంచేస్తూ కూర్చున్నాడు. ఈచిత్రప్రతిమలను రెంటినీ యెదుట బెట్టుకొని కూర్చోడానికి మేనేజరమ్మగారికి ఓపిక లేకపోయింది. "ఏమండీ! యేమి మాట్లాడడానికి వచ్చారు? మళ్లీ ఆ అమ్మాయి బడికి వెళ్లవలసి ఉంటుం" దన్నది ఆమె.

"చిత్తము, నాకు తెలుసును. ఒకమాటు ఒంటరిగా", అని గొణిగాడు జగన్నాథం. "ఆఁ ఆఁ, వల్లగాదు. హాస్టలు బాలికలతో ఒంటరిగా మాట్లాడుటకు మా రూల్సులు ఒప్పుకోవు. సంభాషణ నాసమక్షముననే జరుగవలెను." జగన్నాథం ఇక చేయునది లేక "లలితా!" అన్నాడు కంపితస్వరముతో. లలిత కన్నెత్తి అతనివంక చూచి మళ్లీ కన్నులు వాల్చుకున్నది.

"లలితా! నీ విట్లా పొరుగూరు వచ్చి చదువుకోడం మావాళ్లకిష్టంలేదు." అన్నాడు జగన్నాథం. లలిత సిగ్గుచేత జవాబుచెప్పలేదు. తల మఱీ నేలకు వంచుకున్నది.

"జవాబుచెప్పు లలితా! మొగుడితో మాట్లాడడానికి సిగ్గేమి" టన్నది, నవ్వుతూ, మేనేజరమ్మగారు. లలితసిగ్గు రెట్టింపైంది.

"ఎక్కువ మాట్లాడడానికి అవకాశం లేదు. మాఅమ్మ నీవు చదువుకోడానికి ఏమాత్రం ఒప్పుకోడం లేదు. నీ వెందుకు చదువుకుంటున్నావు?" అన్నాడు జగన్నాథం మళ్లీ. జవాబుచెప్పక తప్పలేదు. "మా అమ్మా, నాన్నా పంపారు. నాకేమితెలుసు?" అన్నది లలిత.

"అవును, నాకు తెలుసు. మీతల్లిదండ్రులుచేసిన పాడుపనే యిది. అయినా మించిపోయిన దేమీ లేదు. ఈచదువు మానేయి."

"మానాన్నగారికి వ్రాస్తాను. వారు మానేయమంటే అట్లాగే మానేస్తాను."

"మీతల్లిదండ్రులు నీచదువు మానిపించరు. వాళ్లు నీక్షేమం చూడటం లేదు. నీవైనా నీక్షేమం చూచుకో తలుచుకుంటే చదువుమానుకో."

"తల్లిదండ్రులకంటే క్షేమంచూచేవా రెవరు?"

"అది పొరబాటభిప్రాయం. నీమంచి కోరేవాళ్లయితే, మా నాన్నగారు మాకోడలిని పొరుగూరు చదువు నిమిత్తంపంపవద్దని వెయ్యివిధాల వ్రాస్తే వారిమాట పెడచెవిని బెట్టి యీవిధంగా నిన్ను పంపుతారా?"

"నా కా సంగతులన్నీ తెలియవు."

"తెలియవు కనుకనే చెప్తున్నా."

"ఏమిటి?"

"నీ వీచదువు మానెయ్యి."

"మాని?"

"నాతోటి మాయింటికి రా?"

"..............................."

"ఇప్పుడు నీ జీవితంలో చదువుకూ, సంసారానికీ పోటీ వచ్చింది. చదువువదలి సంసారం తీసుకుంటావో, సంసారం వదిలి చదువు తీసుకుంటావో యోచించుకో."

"రెండూ యెందుకు ఉండరాదూ?"

"అది పొసగదు. ఏదో భర్తలేనివాళ్లూ, భర్తను వదిలిపెట్టినవాళ్లూ, జీవనోపాధిలేనివాళ్లూ చదువుకుంటారు. నీ కెందుకీతిప్పలు?"

"అయితే మావాళ్లెందుకు పంపారు?"

"అదే మీవాళ్లు చేసిన బుద్ధితక్కువపని."

లలిత నేత్రాల్లో లాలిత్యం పోయి యెఱ్ఱపడ్డాయి. జగన్నాథంవంక తీక్ష్ణంగా చూచింది.

"అవును, మీవాళ్లనంటే నీకు కోపంగానే ఉండవచ్చు కాని, మీవాళ్లు చేసినపనిమాత్రం సరసమైంది కాదు."

"కొమార్తెను చదివించడం పనికిమాలిన పనా?"

"వాళ్ల అత్తవారికి ఇష్టంలేనప్పుడు చదివించడం పనికిమాలిన పనే. అయితే, అయిపోయినదానికి చేసేదేమిటి? నేచెప్పినమాట యేమన్నావు?"

"ఏమిటి?"

"నాతోటి వస్తావా?"

"మాతల్లిదండ్రులు పంపితే వస్తా."

"పంపకపోతే రావా?"

"............................"

"విన్నావా? మాఅమ్మ నాకు మళ్లీ పెండ్లిచేయడానికి సర్వం సిద్ధంచేసుకొని కూర్చున్నది. నేనెట్లాగైనా నీతో మాట్లాడి నిన్ను తీసుకొనిపోయి రక్షిద్దామని మాఅమ్మతో పోట్లాడి వచ్చాను. నాకేమి, నేను మళ్లీ పెండ్లిచేసుకుంటా. నీజీవితమే వ్యర్థమైపోతుంది. నేనిక నిన్ను తలపెట్టను. నీస్థానం మఱొకరాక్రమిస్తారు. పురుషుడిచిత్తం నీకు తెలియదు. ప్రత్యక్షసౌఖ్యాలను వదిలిపెట్టుకొని ఎవరికోసమో ప్రతీక్షిస్తూ కూర్చొనే ఓర్పు మొగవాడికి లేదు. అన్నివిధాలా స్వాతంత్ర్యంఉన్న మగవాడు తన స్వాతంత్ర్యం అన్నిమార్గాలా అనుభవించాలనే చూస్తాడుగాని, ఇంకో ఆలోచన చేయడు."

లలితకన్నులు నీళ్లతో నిండినాయి. ఒకటి రెండు చుక్కలు ఆపుకున్నా ఆగక నేలమీద పడ్డవి. జగన్నాథం చూచాడు. "వట్టివట్టియేడ్పులతో లాభంలేదు. ఇప్పుడు కావలసింది, పనీ" అన్నాడు.

పదునాలుగేండ్లు వెళ్లీవెళ్లని బాల. తల్లిదండ్రులను ధిక్కరించి మొగడితోటి వెళ్లాలె. రమ్మనేమొగవాడికి ఈవిషయము చాలసులభమైనదిగానే తోచవచ్చును. ఆలా తనవెంట రాకపోయినట్లయితే ఆపిల్ల చాలా అవిధేయురాలు, అయోగ్యురాలు అనేతలంపు గూడా కలుగవచ్చును. కాని నిదానంగా ఆలోచిస్తే ఇందులో పురుషుడి దౌర్జన్యమే అధికంగా గోచరిస్తుంది. తల్లిదండ్రులచాటున పెరుగుచు అభము, శుభము యెఱుగకుండాఉన్న పిల్లను అఘాటుగావచ్చి 'మాయింటికి నాతో రా' అంటే అత్తవారియింటికి వెళ్లితే తనస్థితి ఎట్లా ఉంటుందో? అత్తగారేమి చేస్తుందో? మొగుడేమి అంటాడో? ఈమాట విని తలిదండ్రు లేమనుకుంటారో? తన్ను మళ్లీ తలిదండ్రులను చూడనిస్తారో, లేదో? ఈవిధంగా చెప్పకుండా వెళ్లినదాన్ని అసలు తలిదండ్రులు తలపెట్టుతారో, లేదో? ప్రేమాస్పదులయిన తల్లిదండ్రులను వదులుకొని రాపాడే అత్తగారివద్ద చేరితే తనస్థితి యెట్లా ఉంటుందో? ఇవన్నీ బాలికహృదయంలో కలతపెట్టే విషయాలేగా! అయితే భార్య అనేది ఎప్పుడు, ఎక్కడ నిలబడి మగడు 'నాతో రా' అంటే రావడానికి సిద్ధంగా ఉండాలిసిందే అనీ, ఆవిధంగా తీసుకొనిపొయ్యే మహాధికారం తనకు గలదనీ మహాగర్వంతో ఉన్న జగన్నాథం యివన్నీ ఆలోచించలేదు "ఏమి వస్తావా, నాతోటి యివ్వాళ" అన్నాడు.

"మాతల్లిదండ్రులు పంపితే వస్తా" నన్నది, తిన్నగా, లలిత గడగడ వణుకుతూ. "ఛీ, నీ కర్మం నీది. వృథాగా యేడ్చిపోతావని యెన్నివిధాల చూచినా నీకు బుద్ధిలేకుండా ఉన్న" దని చివాలున లేచాడు, జగన్నాథం కుర్చీమీదనుంచీ.

"అవునండీ, చిన్నపిల్ల, తల్లిదండ్రులు పంపితే వచ్చి చదువుకుంటున్న పిల్ల. వాళ్లకు తెలియకుండా మీ రెక్కడో అర్థాంతరంగా వచ్చి నిలుచున్నదాన్ని నిలుచున్నట్టుగా నాతో రమ్మంటే ఎట్లా వస్తుంది? వెళ్లి మీమామగారితో మాట్లాడండి. మీ అభిప్రాయం తెలియజెప్పండి. వారు పంపితే లక్షణంగా తీసుకొనిపొండి. అదీ సబబు" అన్నది మేనేజరమ్మగారు.

"నాన్సెన్స. ఆదౌర్భాగ్యులతో నాకు అవసరం లేదు. ఈపిల్ల వస్తే తీసుకపోతా, అంతే."

**తన తల్లిదండ్రులను తీవ్రంగా** దూషిస్తూ తన్ను **బలాత్కారంగా యూపపశువును** లాక్కుబోయినట్లు **లాక్కుపోతా వంటూ ఉండే భర్తలో** ఉన్న అసురత్వం **స్మరించి గడగడలాడిపోయి** మేనేజరమ్మగారిని మరింత **ఆనుకొని బెదరిబెదరి** చూస్తూ నిలబడ్డది లలిత.

**"ఏమి, వెళ్లుతున్నా.** వస్తావా, రావా? ఏదో **మాట తేల్చిచెప్పు"** అన్నాడు జగన్నాథం, తీవ్ర **స్వరంతో.** లలిత మాట్లాడలేదు. పెండ్లయినదిమొదలు **తమకూ,** తమ అత్తవారికీ జరుగుచున్న సంఘర్షణవల్ల భర్తన్నా, భర్తగృహమన్నా బాలికలకు సహజంగా గలిగే అనురాగం, అభిలాషా లలితహృదయంలో వట్టి పోయింది. అత్తవారూ అంటే ఏదో ఒళ్లు జలదరించే అవ్యక్తపు భయ మేదో మనస్సును ఆవరించిపోయింది. నేడు జగన్నాథంగద్దరింపులు ఆ అవ్యక్తరూపానికి రూపం ప్రసాదించినవి. కనుక "యేమి, వస్తావా, రావా? తేల్చిచెప్పూ" అంటే యేమీ తేల్చలేకపోయింది, లలిత. ఒకటికి రెండుమాట్లడిగినా జబాబు చెప్పకపోవడంచేత తన భర్తృత్వాధికారమనే వాడికత్తి మొక్కబోయి నట్లయి కోపంతో మండిపోతూ జగన్నాథం, "ఊఁ, నీవుమాత్రం నీతల్లిబిడ్డవుకాదూ, మాఅమ్మ చెప్పినట్లు. నీకు తగినశాస్తి చేసితీరుతాలే" అంటూ లలితవంక తీవ్రంగా చూస్తూ వెళ్లిపోయినాడు.

లలిత మేనేజరమ్మగారిని కౌగిలించుకొని బావు రుమని యేడ్చింది. పాపం మేనేజరమ్మగారి మనస్సు కరిగిపోయి తానుగూడ "ఆడజన్మ మేమున్నదమ్మ! అధమపుజన్మ" అంటూ లలితను ఓదార్చింది.

## ౪

శంకరంపంతులుగారు పగలు పదిగంటల వేళ సావిట్లో పచారుచేస్తుండగా తపాలాజవాను వచ్చి రిజి స్టరుకవ రొకటి యిచ్చి రశీదుమీద చేవ్రాలు చేయిం చుకుపోయినాడు. ఆకవరు చించిచూడగా

"మీరు మీకొమార్తెకు మే మెన్నివిధముల వద్దని చెప్పినా మాయిష్టం లేకుండా విశాఖపట్నం పంపించి చదువుచెప్పిస్తున్నారు గనుక నేను యీనెల ౧౦ వ తేదీని ద్వితీయవివాహం చేసుకుంటున్నాను. కనుక తెలియ పఱచడమైనది.

జి. జగన్నాథరావు"

అని వ్రాసి ఉన్నది. ఆ ఉత్తరం చూచి "అయ్యో! అనుకున్నంతా అయిం దని ఒక్క కేకవేసి నేలమీదకూలబడ్డారు, శంకరం పంతులు గారు. "అయ్యో! అంటున్నారేమి" టని లోపలినుంచీ పరుగెత్తుకొచ్చి అన్నపూర్ణమ్మ "ఆ ఉత్తర మేమిటి? దుఃఖపడుతున్నా రెందుకు? మావాళ్లంతా క్షేమమేనా?" అని గ్రుక్క త్రిప్పకుండా అడిగింది. శంకరం పంతులు గారు కళ్ల నీళ్లుకారుస్తూ "మళ్లీ పెండ్లిచేసుకుంటున్నా నని అల్లుడు రిజిష్టరు ఉత్తరం వ్రాశాడు. చూడు, లలిత స్థితి యేమైందో" అని మళ్లీ దుఃఖపడ్డారు.

"అట్లాగా, వాళ్ల మాటలు నిజమా! ఈ ముష్టి బెదిరింపులు యెవరు యెరగ దనుకున్నాడో! ఆతల్లి వ్రాయించింది కాబోలు, ఈమాటంటే హడలిపోతామని!"

"బెదిరింపులేమిటి? నిజము అయి ఉంటుంది. నెలరోజులనుంచీ వింటూనే ఉన్నా, మళ్లీ పెళ్లి ప్రయ త్నంలో ఉన్నారని."

"అయితే కానీండి. దుఃఖపడతా రెందుకు?"

"నాలుగువేలు పోసి అల్లుణ్ణి తెస్తే **లలితగతి** యిట్లా అయిందిగదా అని విచారం."

"లలితకర్మాని కేమిటి? లోకంలో మొగుడు చచ్చినవా ళ్లెందఱు? మొగుడు వదిలిపెట్టినవా ళ్లెందఱు? వారిలో మనపిల్ల ఒక్కతె. పోనీండి, మూడోమగపిల్ల వా డనుకుందాము. ఒకవేళ కాపురానికి పంపితేమాత్రము ఆ అత్తగారు సుఖంగా ఉండనిచ్చేనా? ఆ మొగుడు చక్కగా యేలుకోబోయేనా? పీడా వదిలింది."

"మొదటినుంచీ నీపెళుసుమాటలే దానికాపురం పాడుచేసినాయి. నేను చెప్పలేదూ, వాళ్లకు యిష్టం లే నప్పుడు చదువుకుపంపితే తంటా వస్తుందని. విన్నావూ?"

"వినేదేమిటి? పిల్ల మనయింట్లో ఉండగా వారి అధికార మేమిటి? పిల్ల ప్రతితరగతీ తప్పకుండా పా స

సవుతుంటే పంతులమ్మలందఱూ 'మీ అమ్మాయి తెలివైంది. క్షణంలో స్కూలుఫైనలు ప్యాసుచేసి వస్తుం' దంటే సరేనని పంపాము. ఈమూడునెల్లూ గడిస్తే ఆతర్వాత ఒకరు పంపమన్నా పంపుతామా? ఇంతలో యేమి ముంచుకుపోయింది? ఆపిల్లవాడేమో కోయంబత్తూరులో చదువుతుండే. ఆమాత్రం వివేకం వాళ్ల కుండరాదూ?"

"వాళ్లకు చదువంటే గిట్టదాయె. ఏమి చేస్తాము? అందుకేగాదూ మన అమ్మాయిని బాగా చదివించాకనే పెండ్లి చేద్దామంటిని. అదీ వినకపోతివి."

"అవును. చదువుకోసం కులహాని చేసుకుంటామా? పెండ్లి చేస్తే బాగుంటుందనుకున్నా. బి. ఏ. పరీక్ష యిచ్చినవాడుగదా, చదువంటే గిట్టకపోతుందా అనుకున్నా. వీళ్ల కిట్లా పొయ్యేకాలం వస్తుందని నాకేం తెలుసు?"

"ఇంతకూ దాని కాపురం చేతులారా చెడగొట్టాము."

"మీలో యింత మెతక ఉండబట్టే వాళ్లట్లా యెగిరిపడుతున్నారు."

"అవును. నాలో మెతకా, నీలో కటుకూ కాపురం యింతకు దెచ్చింది."

"అదే మీకున్నది. నాలో కటుకుండి నేనెవరి గొంతులు కోటికాను? ఎంతమాటంటే అంతమాటా అనడమే! కడుపునగన్న బిడ్డమీద నాకేమన్నా పగా? చక్కగా అత్తవారింట్లో కాపురం చేస్తుంటే చూడలేక పోయినానా? పరాయమ్మ గన్న బిడ్డను నేను అగపడ్డాము, నానామాటలు పడడానికి. బిడ్డమీద అంత అపేక్ష కలవాళ్లయితే చదువు మాన్పించి తీసుకుపోయి అత్తవారింట్లో దిగపెట్టిరాండి. మూడురోజుల్లో ఏబావిలో పడ్డదనో, ఏగుడ్డకు నిప్పంటించుకున్నదనో, ఏగొంతుకు ఉరేసుకున్నదనో వర్తమానం వస్తుంది. మీచిక్కు తీరుతుంది. అంతకంటె ఆ అత్తగారివద్ద బతికి కాపురం చేయవా?"

"ఛీ! అప్రాచ్యురాల! నోరుమూయి. నీవు మంచిదానివా? ఆమె చెడ్డదా? ఇద్దఱూ ఇద్దఱే. దాని కుండా యినపతెద్దూ. ఇద్దఱివల్లే దాని కాపురం చెడ్డది." అంటూ శంకరంపంతులుగారు కోపంతో వాకిట్లోకి వెళ్లిపోయినారు. అన్నపూర్ణమ్మ అక్కడే కూర్చొని యేడవటం మొదలుపెట్టింది.

౫

జగన్నాథంలో మిగిలిఉన్న కొంచెం వివేచనాశక్తి లలితవద్దకు వెళ్లివచ్చినతరువాత నశించిపోయింది. ఇప్పుడు అతనిలో ఘనీభవించిందంతా, "నాకేమి? నేను మగవాడిని. నేనేమి చేస్తే చెల్లదు?" అనే అహంకారం. ఈగర్వంచేత గ్రుడ్డివాడైపోయిన జగన్నాథం తల్లి చేసిన యేర్పాటుల కన్నిటికీ వప్పుకున్నాడు. పెండ్లి నిశ్చయమైంది.

* * * *

పెండ్లిపీటలమీద చూచాడు, రెండోపెళ్లాన్ని జగన్నాథం. నల్లని మొద్దు, దిబ్బముఖం. పెద్దపెద్ద పెదవులు. అంగుళం వెడల్పు నుదురు. కనుబొమ్మలు, తలవెంట్రుకలు ఇంచుమించుగా కలిసిపోయినాయి. జగన్నాథం ఆవధువును చూచి ముఖ మింతచేసుకున్నాడు. విద్యా, వివేకం, సౌజన్యం, సౌందర్యం తాండవిస్తూఉన్న లలితసుందరముఖారవిందం ఒక్కమాటు జ్ఞాపకం వచ్చింది. మాణిక్యాన్ని పోగొట్టుకొని మసిపాతను కట్టుకున్నా ననిపించింది. తానీపెండ్లాడటం అత్తవారి కేదో పరాభవమనీ, భార్య కేదో శిక్షనీ అనుకున్నాడు గాని నిజంగా తానీ అనాకారిభార్యను పెండ్లాడటం తనకే పరాభవము, తనకే శిక్షయేమో అనిపించింది మనస్సుకు. ఇంతలో వచ్చి కుమ్మరిల్లినవి, అయిదుసంచులూ, అంతేనా, వెండిపళ్లెం, బంగారపుచెంబు, జరీపట్టుబట్టలు, రవ్వలఉంగరము వగైరాలు—భార్య నేమిచూస్తావు? మావంక చూడవోయి! మేమంతా నిన్ను చుట్టి కొలుస్తుంటే భార్యఅందవికారాలు నీకేమి లోటుగలిగిస్తుంది? లోటుంటే సర్వస్వతంత్రంగల నీకు తీర్చుకొనేదారులు లేవా? అని పలకరిస్తూ. 'భార్యవివేకవతియైతే నిన్ను అతి

క్రమిస్తుంది. రూపవతి ఐతే నిన్ను వెక్కిరిస్తుంది. చూడు, ఈభార్యవల్ల నీ కీరెండుఅపాయాలూ లేవు. 'ఎక్కడున్నావు గొంగళీ అంటే వేసినచోటుననే ఉన్నాను కంబళీ' అంటుంది. ఎంతలాభమోయి!' అంటూ వచ్చి నిలిచినాయి. ఈవిలువైన వస్తువుల సోదార్పుచేత భార్య ముద్దూ ముకరమూ అన్నవిచారం మఱచిపోయి మూడుముళ్లు వేశాడు, జగన్నాథం. శాస్త్రం ఒప్పుకున్నది. సంఘం సమ్మతించింది. పండితులు చేవని మెచ్చి ఆశీర్వదించి సంభావనలు పుచ్చుకొని దప్పళాలు కొట్టి వచ్చారు. అయితే నిరపరాధయైన లలితగతేమిటి?

---

## కొందరు ఉద్యోగులు (నా యూహాప్రపంచమున)



మల్లాది రామకృష్ణశాస్త్రిగారు

౧

'ఊహుఁ, నేను రానంటూంటే ఏమిటి ఊరి కేమ ? నీవు వెళ్లరాదూ, నన్ను బ్రతిమాలకపోతేను?'

'రావూ ?'

'ఊహుఁ.'

'ఎప్పుడూ కూర్చుంటే ఏం తోస్తుంది...రా పోదాం...'

'నేను — రాను...'

'నామాట వినవూ ?'

'నామాట నీవు వినరాదేం...మహా...నేర్చు కుంటూన్నావులే...'

'పోనీలే అమ్మ ! నేనూ మానేస్తాను...ఎంతో సరదాగా పిలుస్తూంటే...నాముచ్చట తీర్చడానికైనా రావచ్చునే...'

'నేను రానే...ఏమిటి...ఓ...సాద...నేను లేకపోతే కోవిలకూయదా...పూలు పూయవా... వెన్నెల కాయదా...నేనెందుకూ, నీవే పోయి అనుభవించరాదూ, ఆవైభవమంతాను...'

'వల్లకాదు...'

'పోనీ......మానేయి......ప్రతిపనికి నాతో వంతేనా ఏమిటి ?'

శాంతకు కోపం వచ్చి......ఇక అక్కడ నిలావకుండా వెళ్లిపోయింది. వనం—వనలత—ఆమె వెళ్లిపోవడం చూసికూడా మాటాడకుండా ఊరుకుంది.

'ఎందుకూ పనికిరాకుండా...ఎవరికీకూడా... ఈలా అయిపోతున్నానేం ?...'

కనుకొలుకుల్లో ఒకటిరెండు ముత్యాలు కనిపించి వాయి...వనానికి...పైట చెరగుతో తుడుచుకోవలెనని...యత్నించి...మరల మానుకున్నది...ఒకటి...రెండు...ఇక బాష్పధారా...ఆవేశాన్ని ఆపుకో లేకపోతున్నది...

'ఎందుకు...ఈ...లా...బ్రతకడం...ఏమున్నదని...?'

'.....................'

'అక్కయ్యా!.. వనం!...ఇదిగో నిన్నే...'

ప్రభావతి...నవ్వుతూ ... పరుగెత్తు కుంటూ వచ్చింది...

'మరే...రమేశమే...అన్నీ బడాయిమాటలేనే. నాతోనే ఆడలేకపోయినాడు...రెండుగేములు గెలిచాను...వట్టినాయనమ్మ...నాతోనే ఓడిపోయినాడు'

చిన్నిచెల్లెలిమాటలకి...ఆవిచారంలోనే...వనానికి నవ్వువచ్చింది...

'ఆలాగేం !...'అన్నది ప్రసన్నభావాన్ని అభినయిస్తూ.

'మళ్లా ఆడమన్నా...ఎప్పటికైనా సై...గెలవలేని కుక్క గయ్యాళికుక్క...పారిపోయి...అమ్మ దగ్గర దాక్కున్నాడు...రమ్మను...చేతనైతే...'

... ... ... ...

'అబ్బ ! నేను రావాలా ఏం...అక్కడ ఎవరూ లేరూ...'

'ఎవరున్నారమ్మ !...నాన్నగారు షికారు వెళ్లారు...రజాక్ కారు తీసుకువెళ్లాడు...ప్రకాశం... స్టేషనుకు వెళ్లాడు...మరి తాతయ్యగారిని రమ్మననా ? ఆయన లేవనేలేడాయెను...'

'ఎందుకూ అంతచదువు ?...వస్తానులే...'

ప్రభ ముందుదారితీసింది...వనలత నెమ్మదిగా ఆపిల్ల వెనుక అడుగులు వేస్తున్నది...

'అదిగో చూడు—ఆకొమ్మను...ఉహుఁ... అదికాదే...నీలాంబరిమీదుగా...ఆ... ఁ... అదే... నీవు కోస్తూండు...నేను గులాబీలు తీసుకువస్తాను... కోసి...ఫౌంటెనుదగ్గర పెట్టివచ్చాను కాని...అన్నీ కోయి...వాకే...కాంతకు చూపించవు క...'

ప్రభావతి పరుగెత్తుకునిపోయింది...వనం... నెమ్మదిగా ఆకొమ్మను వంచి...బాగా వికసించిన ఓపూవుకోసి...రేకలు త్రుంచివేస్తూ...తలవంచుకుని అక్కడనే నిలువబడి పోయింది...

'వనం !...'

ఉలికిపడి చూసింది...కాంతం...ఆమెనే చూస్తూ...చాలాదగ్గరగానిలుచుని ఉన్నాడు...ఎప్పుడు... ఏమూలనుంచి వచ్చాడో...

'ఎంతకాలం...వనం...'

ఆమె ఏమీ మాటాడలేదు...మళ్లా తలవంచుకున్నది...కాంతం ఆమెచేయి పట్టుకున్నాడు...ఆతని చేతిమీద కన్నీటిచుక్కలు రాలినాయి...

'ఎందుకూ...తలఎత్తి...ఈలా చూడు వనం!'

వనలత వెక్కి వెక్కి ఏడువ మొదలుపెట్టింది... కాంతం ఆమెను సమాశ్వసించాలనే యత్నంతో...

'ఊరుకోవూ...!' అన్నాడు చాల నెమ్మదిగా...

'నామాట వినవూ...ఎందుకూ...ఊరుకోవూ'

వనం వంచినతల ఎత్తలేదు...కాంతం ఎన్నో విధాల ఆమెను బ్రతిమాలాడు...ఆమె మారుపలుకనయినా లేదు...

'వనం !...'

ఆపలేని ఆవేశంతో, కాంతం ఆ అమ్మాయిని కౌగలించుకోవలెనని ప్రయత్నించినాడు...కాని ఆతని బాహువల్లరిలో చిక్కకుండా తప్పించుకొని...తేలకన్నులతో ఆతన్ని చూస్తూ...జాలిగా...వద్దని తల ఊగించింది...కాని కాంతం చూసీకూడా చూడని వాడిలాగా...ఆమెను...కౌగలించుకుని...పెదవి ముద్దిడుకున్నాడు...మళ్లా...మళ్లా...

ప్రభావతి పరుగెత్తుకుంటూ వచ్చింది!...ఆతన్ని తప్పించుకోలేక...ఆతని కౌగిలిలోనే ఉన్నది, వనలత ...తా నాలాగు ఉన్నాననే స్పృహలేదు...కాంతం తనివితీరా...అధరమధువును...

ప్రభావతి నవ్వుకుంటూ...చేతిలో గులాబీలు దోవలో విడిచివేస్తూ...అక్కడ నిలువకుండా ఒక్క పరుగుతీసింది...

౨

'నిన్నుజూచి...ధన్యుడైతినీ...నీరజనేత్ర...'

పాడుతున్నది...ఉహు...విచారమంతా ఆకొంచెంసేపయినా మరచిపోవచ్చును కదా అని...పాడుదామని ప్రయత్నిస్తున్నది...కాని సాగడంలేదు...వ్రేళ్లు ఆడటమే లేదు...చివరకు ... విసుక్కుంటూ పాట చాలించి...వీణెను సోఫాకు ఓరగా ఆన్చి, తాను అలా, ఓప్రక్కకు ఒరిగింది వనం...

చీకటిపడింది...మేడంతాకూడా దీపాలు వెలిగినాయి, కాని వనంకూర్చున్న గదిలోమాత్రం దీపం లేదు...ఫాన్‌మాత్రం ఆడుతూంది.

ఎదుట పోర్టికోతలుపు తెరిచిఉన్నది...గోదావరిమీదనుంచి చక్కని గాలి వస్తూన్నది...ఏటినడుమనుంచి...గాలివాటు ఉన్నప్పుడల్లా...అవ్యక్తమధురధ్వనిలో...పడవవాళ్ళ పాటల చరణాలు అక్కడక్కడవినబడుతున్నాయి...రొప్పుకుంటూ...వంతెనంతా ఊగిస్తూ...పాసింజరు పరుగెత్తింది...చల్లగాలికి గోదావరిఒడ్డుకు వచ్చి కూర్చున్న పిల్లవాళ్లల్లో ఎవరో గొంతెత్తి చక్కగా పాడుతున్నాడు.

"ఓబిలేశుని కొండలనడుమా
వంచెగడ్డి కోసేదానా
వంచెగుడ్డా, వల్లెగుడ్డేమే...హరి ఓబిలేశా."



3. షా సెఫీ కొలువు ౨

వినపడుతున్నదికాని, వనలత వినిపించుకోవడం లేదు...ఏదో ఆలోచించుకుంటూ...ఎక్కడో, ఏధోరణిలోనో,..ఉన్నది...కాని పాట ఆగలేదు.

"గిద్దెలగిరీ కొండల నడుమా
ఎద్దులు కాసే...ముద్దులమరదీ
నన్ను చూసీ నవ్వబోకోయీ...హారిఓబిలేశా"

వనం...అప్రయత్నంగా విన్నది...విని నవ్వుకున్నది...అహోబిల నారసింహుడుకూడా...ఆడవాళ్ళకోసం...అంత అవస్థపడుతాడుకదా అని.

"కట్టమీదనుం చెళ్ళేదానా
కాలుకురచా చిన్నదానా
కమ్మలిస్తా వెంటవస్తావా...హారి ఓబిలేశా."

వనం చివాలున లేచి నిలుచున్నది...పాడేవాడిమీద, ఆపాటలమీద చాలాకోపం వచ్చింది...తలుపు మూసేద్దా మనుకుని ముందుకు దూకుడుగా వెళ్ళింది... కాని పోర్టికోలో అడుగుపెట్టేటప్పటికి...చల్లనిగాలి వేస్తున్నది...ప్రాణంలేచివచ్చింది...వేయలేక...అక్కడనుంచి తిరిగిరాలేక...ఆలాగే నిలువబడిపోయింది, ఓ స్తంభాన్ని ఆనుకుని...ఉదయించాలని యత్నిస్తూన్న బాలచంద్రుణ్ణి జూస్తూ.

చూస్తూ...చూస్తూ...ఆచూపే క్రిందకు మరల్చింది...గోదావరిఒడ్డున ఇంకా ఎవరో చాలామంది అక్కడక్కడ కూర్చునేఉన్నారు...మనుష్యులు కనబడటంలేదు, కాని సిగరెట్ల వెలుగునుబట్టి చూచాయగా ఆలాగని గోచరిస్తున్నది.

క్రొత్తజులబాటం కాబోలును...ఎవరో... మార్కలుపిల్లవా డయిఉంటాడు...టార్చిలైట్ మాటిమాటికి వేస్తున్నాడు. ఆవెలుతురితో...భూమ్యాకాశాలు అలవి అయినంతవరకూ పరీక్షిస్తున్నాడు...ఓమారు వనం చాయలకుకూడా వచ్చింది వెలుతురు...అప్పుడు చప్పున ప్రక్కకు ఒదిగింది ఆఅమ్మాయి...మళ్ళా చీకటిఅయింది.

ప్రక్కగదిలో శాంత ఉన్నది...అలంకరించుకుంటూ...గదిలో దీపం ఉన్నది...సన్నని గొంతులో ఏదో పాటకూడా వినిపిస్తూన్నది.

ఒక్కమారే పాట ఆగిపోయింది...దీపం ఆరిపోయింది...ఉన్నట్టుండి మళ్ళా వెలిగింది...మళ్ళా ఆరిపోయి...మళ్ళా.

వనానికి అప్పటికి అర్థమయింది...ఒక్కమారున లోపలికి వెళ్ళి స్విచ్ వేసింది...గదంతా వెలుతురయింది.

'శాంతా...'

'అక్కయ్యా!...'

పైటపిన్ను అమర్చుకుంటూ శాంత తనగదిలోనుంచి బయటికి వచ్చింది...వనలత ఆఅమ్మాయిని ఉరిమిచూసి,

'ఏమిటీపని' అని గర్జించింది.

శాంత...మిస్ గోహార్ పోజుతో...అలాగే నవ్వి

'ఏమిపనా...పాడుపని...'అని తనగదిలోకితిరిగి వెళ్ళిపోతూన్నది.

వనం ముందుకు దూకి...శాంతజడ పట్టుకున్నది...శాంత కలవరపడి...తప్పించుకోవలెనని చూసి... వశముకాక నిలువబడిపోయింది.

'సిగ్గులేదూ?...'

శాంత ఊరుకున్నది.

'మాటాడవేం...'

శాంత ఎకసెక్కెంగా నవ్వి...

'అవును...అందరికీ...కాంతంబాటివాళ్ళు దొరకవద్దూ!' అన్నది.

వనం ఒళ్ళుమరచిపోయింది. ఆకోపంలో, చేయి ఎత్తింది.

'చిన్నమ్మాయ్!...'

వాళ్ళ నాన్నగారు క్రిందనుంచి కేకలేశారు... శాంత తప్పించుకున్నది.

3

'నీవుకూడా రావూ'

భోజనంచేసి మేడమీదికి వెళ్లబోతున్నది వనం. కాంతం పైనుంచి ఎదురువచ్చాడు...తప్పించుకుందామని చూసింది. కాని మాటాడకుండా వీలు లేకపోయింది.

'ఊహూ...' అని తలఊపింది.

'రావూ...నీవుకూడా వస్తావని చాలా...అనుకుంటూన్నాను...రావూ.'

వనం ఊరుకున్నది...కాంతం దగ్గరికి వచ్చి...ఆమెచెక్కిలి నిమురుతూ,

'రావూ...' అన్నాడు...

ఆ అమ్మాయి ఆతనికి ఎడగా జరిగి...చాలా దీనంగా,

'కాంతం!...నన్ను ఎందుకూ ఈలా హింసిస్తావూ' అన్నది...ఆతడు తెల్లబోయినాడు.

'ఆయన...నీస్నేహితులుకారూ... చనిపోయినారు. కాని, నామనసులోనుంచి పోలేదే...నీమిత్రుడి భార్యను...అంటుపరచాలని చూస్తావా...అప్పుడు... నేను ఈస్పృహలో లేను...నీస్నేహితుని...తలచుకుంటూ...నీవు...ఈపెదవిని...ఈ'

ఆ ఆవేశంలో బలంకొద్దీ పెదవిమీద కొట్టుకుంది నెత్తురుకమ్మింది.

'చూశావా...ఇదుగో...'

మళ్లా కొట్టుకున్నది...కాంతం అక్కడ నిలువకుండా క్రిందకు వెళ్లిపోయినాడు...వనం ఆలాగే చాలాసేపు తలవంచుకుని నిలుచున్నది.

'అమ్మాయి...వనం...అక్కడ నిలుచున్నావేం?'

అని వెనుకనుంచి ముసలమ్మ...మామ్మ...కేక వేసింది.

'ఏమిలేదు...పైకి వెళుతున్నాను...' అని వనం గబగబ మెట్లుఎక్కిపోయింది.

గదిలో బల్లమీద...ఆతని...ఫోటో ఉన్నది... వనం దాన్ని తీసుకుని...చాలా జాలిగా చూస్తూ,

'నన్ను...వదిలిపెట్టివెళ్లారు కామూ...నేను... కూడా...వస్తా...'

అని వెక్కి వెక్కి ఏడుపు మొదలుపెట్టింది.

నవ్వు!...గుమ్మంలో శాంత నవ్వుతూ నిలుచున్నది...వనం ఆమెను చూసి...కళ్లనీళ్లు అపుకుంటూ...అక్కడనుంచి వెళ్లిపోబోయింది...శాంత దగ్గరకువచ్చి,

'ఏమి తోచదాఏం...నీకు వనం!...ఎప్పుడూ ఓకేకోకాలా...లే...వేళయింది...నాటకానికి వెళదాము...'

వనం...కోపంగా

'నేను రాను...'

'ఎందుచేతనో'

'నాయిష్టం!'

'పోనీ...నేనుపనికిరాకపోతే...మీకాంతం... కూడా వస్తాడు'

వనం ఏమీ మారుపలుకకుండా...తన ఏవగింపంతా ఆమెకు అర్థమయేటట్టు శాంతవంక జూచింది.

శాంత...ఆబాణాన్ని లక్ష్యంచేయకుండా... నవ్వి...వనం చేతినుంచి...ఆచిత్రాన్ని...లాక్కొని... సావకాశంగా చూసి

'చక్కనివాడే...వనం...మీ ఆయన'

అని ఆచిత్రాన్ని ముద్దిడుకున్నది.

'ఇంకా కదలరేమమ్మా! పదికావచ్చింది... అరగంటనుంచీ కారు వాకిట్లో ఉన్నది...లేండి... ఇంకా ఎంతసేపు!'

తాతగారు...ఓపికచేసుకుని...మేడమీదికివచ్చి హెచ్చరించారు...శాంత-

'చూడండి తాతయ్యగారూ...మరి...వనం రాదుట!' అన్నది...

వనంకూడా అందుకుని

'నేను వెళ్ళనండీ...పోనిద్దురూ'

అని ఏదోపుస్తకం తీసుకున్నది, బల్లమీదనుంచి.

'అదేమిటమ్మా...వెళ్లిరా బాగుంటుంది...నీ కోసం టిక్కెట్టుకూడా తెప్పిస్తే...'

'పోనీ ఇంకఎవరినైనా పంపండి'

'సరే, మీయిష్టమమ్మ...నామాటలు వింటారా'

అని ముసలాయన విసుక్కున్నాడు...ఆయనను నొప్పించడ మెందుకని...వనం ఒప్పుకున్నది.

'నీవే కూర్చుండువుకానిలే కాంతం ప్రక్క... బళే...'

మెట్లుదిగి వస్తూన్నారు...శాంత వనంతో మెల్లిగా అన్నది...వనం క్రిందకు చెంగున దూకింది.

'ఇలా కూర్చో...పోనీ నీయిష్టం...ముందుకూర్చో' అన్నాడు కాంతం...వనలత ముందు ఎక్కపోయింది...శాంత నవ్వి,

'అవును...రజాక్ ప్రక్కను...బలేబాగుంటుందిలే...కూర్చో...' అన్నది...వనం మళ్లా తిరిగి వెనుకనే ఎక్కింది. ఆమెవెంట శాంత, తరువాత కాంతం ఎక్కారు.

మూడుగంట లయిఉంటుంది...నాటకం చాలా ఆలస్యంగా అయింది.

అంతకుముందు విన్న డ్యాన్స్‌సాంగు...వచ్చిరాని పూతిలో...ఈలతో, విసురుతూ డ్రైవరు, కారు వదిలాడు...వనానికి నిద్ర తూలుతున్నది...ముందుకు వాలి నిద్రపోయింది.

ఉలిక్కిపడి లేచింది...ఇంకా కారు సాగుతూనేఉన్నది...నిద్రపట్టడంతోనే...అంతలో కలవరపడి మేల్కొంచింది.

అందుకనే ఆ అవమానానికే కాబోలును.

రజాక్...ఆమెమీద చేయివేశాడు...ఆమె విదిలించుకుని ప్రక్కకు ఓసరిల్లింది.

ప్రక్కను...శాంత,...కాంతంకౌగిలిలో ఉంది.

౮

ఫోనుమోటారు స్టార్టుచేసింది శాంత.

'ఎందు కీతొందర'...సగంవరకూ విని, ఆరికార్డు తీసివేసి, ఇందుబాలపాటలు విన్నది కాంత సేపు...తరువాత,

"...జాలముచేసి కలసి...ఏవీరత నాల జామి
కేలజత పంపేనన్న...తోలవనలోలా...అల...
నీమాట లేమాయెనురా...సామీ...పల్కరా."

.....................

'ఎప్పుడూ...ఆ పాటు జావళీలేనా...మరేవీ లేవూ...' అన్నది వనం...ఒళ్లువిరుచుకుంటూ సోఫాలోనుంచి లేచి...

'చాలా బాగుంటాయి...ఇది...విను...'

అని శాంత మళ్లా ఒక క్రొత్తరికార్డు పెట్టింది... ఆలాటిదే...వనం చిడిముడిపాటుతో అక్కడనుంచి లేచింది...

'వనం!...ఇవాళే క్రొత్తఫిల్ము ఒకటి తెచ్చాను...తాతయ్యగారు కూడా చూస్తానన్నారు...నీవూ రావూ...శాంతా...నీవుకూడా వస్తావా...'

అని రమేశం ఎదురువచ్చాడు...

'వీటితొతలలాటెవిచూశాను...దాచుకో...నేను రాను నాయనా...తాతయ్యగారికి చూపించు కావాలంటే...ఆయనకు మహాఓపిక' అన్నది శాంత...రమేశము చిన్నబుచ్చుకున్నాడు...వనం అతనిబుజంమీద చెయివేసుకుని...శాంతవంక తిరిగిఅయినా చూడకుండా హాలులోకి వెళ్లిపోయింది...

చూసింది కొంచెంసేపు...ఇక చూడలేక పోయింది...ఎక్కడచూసినా శృంగారలీలలే...

ఈవలకు వచ్చింది...ఇంకా ఫోను వినబడుతూనే ఉంది...మధ్యమధ్య...ఆధోరణితో కలసీకలియకుండా శాంతసంగీతమూను.

ఏమీ తోచడం లేదు...ఏదన్నా చదువుకో వచ్చును కదా...అని ప్రక్కగదిలోకి వెళ్లబోయింది...కాని సమ్మందాక పోయి ఆగింది...లోపల వాళ్ల నాన్నగారు...కాంతానికి వేదాంతం చెపుతున్నారు...వనం వింటూ నిలుచున్నది...

చూశావూ...సంస్కారమంటే అదోయ్...కఠవల్లిలో...ఆయముడు...నచికేతుణ్ణిఅడుగుతాడు...'యే యే కామా దుర్లభా మర్త్యలోకే సర్వా న్కామాన్ఛందతః ప్రార్థయస్వ...'అని...'ఇమా రామాః సరథాః సతూర్యా నహీదృశా లంభనీయా మనుష్యైః...'ఈమాదిరిగానే ఎంత ఊరించినా...ఆపిల్లవాడు...వయసుకు పిల్లవాడే కాని...మహానుభావుడు, తోణికాడేమో చూశావు...'వరస్తుమే వరణీయ స్సఏవ...' అని ఆత్మవిజ్ఞానం కావాలన్నాడోయ్...వాడా...ఇప్పటి కాలపురకాలా...

ఆయన...వనంవాళ్ల నాన్నగారు...బల్ల నానుకుని నిలుచున్నారు...కాంతం ఎదురుగా...ఎప్పుడు తప్పించుకు బయట పడదామా అని కూర్చున్నాడు ముసులుతూ...

'ఇప్పటిరకాలా...శ్వసతికథమసౌరసాలశాఖాం చిరవిరహేన విలోక్య పుష్పితాగ్రాం...ఈ బాపతేనోయ్...అసలు నేను చెప్పవచ్చింది ఏమంటే...శంకరుడు వీళ్ల అందరిలోకి నాయకమణోయ్...శంకర మతం...నీకు సులువుగా అరగంటలో చెపుతాను...ఎంతవాడో నీకే తెలుస్తుంది...భాష్యంలో...ప్రచురానంద...

'ఇప్పుడే వస్తాను ఉండండి...' అని కాంతం తప్పించుకుని వచ్చేశాడు...

'ఏమండీ శంకరాచార్యులుగారూ...'అని పలుకరించింది శాంత, వనం వెనుకనుంచి...ఎప్పుడు వచ్చి అక్కడ నిలుచున్నదో వనం కూడా గమనించనేలేదు...

కాంతం నవ్వి,

'వెనుకటికి శుకుడితపం చెడగొట్టడానికి రంభ వచ్చిందట...మరిశంకరుడి...'

'ఆఁ ఈశంకరుణ్ణి...ఈ ఊర్వశి వచ్చింది...' అని కనుసైగతో వనాన్ని చూపించింది...ఆతడు ఆమె వంక సాభిప్రాయంగా చూసి...ఏకళనున్నాడో...అక్కడనుంచి వెళ్లిపోయినాడు...

'వనం...'

అని ఆమెబుజంమీద చేయివేసింది...శాంత...

వనం...'ఏం' అని తలఊచి అడిగింది...

'కాంతం...నిన్ను ప్రేమిస్తున్నాడు...ఆతన్ని..'

వనం ఆమెమాటకు అడ్డంవచ్చి...

'వద్దు...నాతో ఈమాటలు చెప్పద్దు...'అన్నది...

శాంత రుంజుకుంటూ...

'అబ్బ...ఎంతఇల్లాలివే...' అన్నది...

వనం ఆడుపులిలాగా చెలరేగి...

'నేనా...నన్ను అనడానికి నీకు అభిమానం లేదూ...నిన్ను...నీవుచేసే పనులను చూస్తే నీకే సిగ్గు రావడంలేదేం...నీ...మొగము చూడను...పో...ఇల్లాలినా...కాను...నామగడు...ఏలోకంలోనో ఉన్నాడు...నీవు...నీవు...స్వైరవిహారం చేస్తూన్న...నీవు...ఇల్లాలివి...'

శాంత ముందుకు వచ్చి వనంచేయి పట్టుకుని,

'ఏమన్నావూ...జాగ్రత...'అన్నది...

'చేయి వదులు'

'వదలను, ఏంచేస్తావు?'

'వదలవూ ?'

'ఊహు'...

ఠపీమని కొట్టింది వనం శాంతను...ఆదెబ్బకు నిలుకడతప్పి క్రిందకు—మెట్లమీదుగా దొర్లుకుంటూ పోయి...మేడమీదికి రావాలని మెట్లుమీదఅడుగువేస్తూన్న—తాతగారిమీద పడ్డది...ఆయన అయ్యో...అయ్యో...అనుకుంటూ క్రింద పడిపోయినాడు...

వనం గబగబ క్రిందకు వచ్చి—శాంతవంకైనా చూడకుండానే.. తాతగారిని లేవదీసి... ఆయనకు సాయమై లోపలకి తీసుకునిపోయింది.

✂

ఎత్తినతల వంచకుండా, పైన తిరుగుతూన్న విమానాలని చూస్తూ నిలుచున్నది వనం పైమేడమీద...

కొంచెంసేపు తిరిగి...చివరకు కనబడకుండా పోయినాయి...'స్వర్గంలోకి వెళ్లే విమానాలు...ఏలా ఉంటాయో...'

అని తనలో తా ననుకుని...ఏమేమో తలపోసి కుంటూ కన్నీరు పెట్టుకున్నది వనం...

'చూడు...చూడు అక్కయ్యా!

ప్రభావతి వనాన్ని హెచ్చరించింది...వనం ఆకాశంవైపు చూసింది...

అక్కడ లేదు...క్రింద...తోటలో...అవిగో నీలాంబరాలదగ్గర...

వనం చూసింది...చూసి తలతిప్పుకున్నది...మామూలే...శాంతా...మరి...ఓ...

'శాంతా...ఇదిగో...ఇక్కడ...'

పిట్టగోడమీదుగా వంగి ప్రభావతి పిలవడం మొదలుపెట్టింది చేయివిసురుతూ...వనం వద్దని వారించింది, కాని అల్లరిపిల్ల—ప్రభ-ఆమెను వినిపించుకోడం లేదు...

ఎంతో వయ్యారంతో...కులుకుతూ శాంత వచ్చింది అక్కడికి...

'ఏం...ద్రౌపదిని మించిపోతున్నావ్?' అన్నది వనం...శాంత నవ్వి...ఆ మాట మార్చేసి...తలలో పూలదండ సరిచేయమని దగ్గరకు వచ్చింది...

ఇద్దరూ క్రిందికి దిగి వచ్చారు...ప్రభ ఇంకా పైనే ఉన్నది, విమానాలు మళ్లీవస్తే చూడవచ్చుకదా అని...

.................

హాలులో తాతగారు పేపరు చదువుకుంటూ కూర్చున్నారు...

'ఎక్కడికమ్మా!...' అన్నా రాయన ఇద్దరిని చూసి...

'షికార్ వెళ్లివస్తామండీ...'అని శాంత జవాబు చెప్పి, వనం అడ్డుచెప్పకముందే ఆమెను లాక్కొని పోయి కారు ఎక్కించింది శాంత—

ఆనాడు చాలా చక్కగా అలంకరించుకున్నది, శాంత...లైట్ క్రేపు ఫుల్లు బాడీస్ తొడుగుకున్నది... లేత ఊదా సరిగంచు సిల్కుచీరె...పార్సీ పిల్లలాగా కట్టుకుని—చక్కగా నొక్కులు నొక్కులుగా-యంత్ర సాహాయ్యాన-తలకట్టు అమర్చుకుని...లోలాకులు కదిలే టట్టు తలత్రిప్పుతూ...కారులో కూర్చున్నది...వనం మామూలుగానే వచ్చేసింది...మామూలుకన్న ఎక్కువ ప్రసన్నంగా ఉంది కూడాను...

'రజాక్' త్వరగా పోనీయవోయ్' అన్నది శాంత రిస్టువాచిచూసి...

'ఇంకా ఎంతత్వరగా...అక్కడేమీ మించి పోవడం లేదు.'

'ఏమిటోయ్...ఒళ్లు దగ్గర పెట్టుకుని మాటాడు.' అని వనం అందుకున్నది...

'పోనీలే...పరవాలేదు...' అని శాంత సర్ది చెప్పబోయింది...

కారు గోదావరిబడ్డున ఆగింది...ఇద్దరూ దిగి నడుస్తున్నారు. ముందుకు పోయి కూర్చుందామని...

రజాక్ దగ్గరనుంచీకూడా...నీవంటే అంత అలుసేనా...' అని మందలించింది వనం...

'వాడి మొగం...ఏమీ తెలియదు...అమాయకుడు'

'మననౌకరు...ఆలా మాటాడుతాడా?'

'పోనీలే...'

ఒకచోట కూర్చున్నారు...సన్నపట్టుచీరెమీది నలిముడుతలులాగా గోదావరిమీద...లేత అలలు పొటకరిస్తున్నాయి...వనం నీటిమీదనుంచి వచ్చేగాలి అనుభవిస్తూ...గోదావరివైపు చూస్తూ పడుకునిఉన్నది ఇసుకలో...శాంత, ఎవరికోసరమో...అటు ఇటూ చూస్తూ...చాలా ఆతురతతో ఉన్నది...

'ఇప్పుడే వస్తాను ఉండు' అని శాంత లేచినిలుచున్నది...

'ఎక్కడికి'

'ఎక్కడికీ లేదు... ఇప్పుడే వస్తానుకాదూ...'

ముందుకు సాగిపోయి...తిన్నెలుచాటువడంచేత కనబడకుండాపోయింది శాంత...వనం ఆమెవైపైనా చూడలేదు...

క్రమంగా చీకటి ముసురువస్తూన్నది...ఎవరో వెనుకనుంచి...వనంకళ్లు మూశారు...ఆఅమ్మాయి కలవరపడి లేచికూర్చుని, బలవంతాన ఆచేతులు తీసివేసింది...

కాంతం...నవ్వుతూ నిలుచునిఉన్నాడు...

'కాంతం!...నీకు జాలిలేదూ...'అన్నదివనం... ఆతడు ఊరుకున్నాడు...

'దయయుంచి...నన్ను బ్రతుకనీయవూ...'

'దయయుంచి...నన్నూ బ్రతుక నీయవూ... వనం! నిన్ను విడిచి బ్రతుకలేకుండా ఉన్నాను...'

కాంతం మరీదగ్గరకు వస్తున్నాడు...వనం...

'వద్దు...ముందుకు రావద్దు'...అని తాను వెనుకకు నడిచింది...

'ఊహు... నీవు నాకు కావాలి...వనం...'

కాంతం ముందుకు వస్తున్నాడు...వనం చకచకా వెనుకకు అడుగులు వేస్తూన్నది...

'ఊరుకోవూ...కాంతం!...'

కాంతం వినిపించుకోలేదు...వనం...ఆగకుండా వెనుకకు అలాగే నడచిపోయి...

గోదావరి మామూలుగానే ప్రవహిస్తూంది... చూసినవాళ్లు...వనాన్ని మింగివేసిందని ఏలా అనుకుంటారు...ఆపిల్లను తనలో చేర్చుకోడానికి...రవంత ఎడమైంది...మరల కలుసుకుని కమ్ముకుపోయింది...

కాంతం అక్కడనే నిలబడిపోయినాడు...

చాలా చీకటిపడ్డది...రజాక్ హారన్ వేస్తూన్నాడు...కాంతం అది వినిపించుకోలేదు...శాంత నవ్వుమాత్రం చాచాయగా వినిపిస్తూంది...

---



పైకారా జలపాతము ఛాయాచిత్రకారుడు: సూర్యగారు.

# వర్తకమందం

నందివాడ చిదంబరంగారు, బి. ఎ., బి. యల్.,

౬౦

బుద్ధిమాంద్యం అంటే ఏమిటో యిదివరలోనే చాలామందికి తెలుసును గాని వర్తకమందం అంటే ఏమిటో ప్రమోదూతనామసంవత్సరానికి ముందు ఎవ్వరికీ తెలియదు. ప్రమోదూత సం.ము వచ్చింది లగాయితు, ఎక్కడ చూచినా "వర్తకం స్తంభించింది, ధరలు పడిపోయినాయి, ఒక్కడిదగ్గరా పైసా లేదు" అనేమాటే గాని, రెండోది వినబడటం లేదు. ఇళ్లలోనూ అదేమాట, వీధుల్లోను అదేమాట, కోర్టుల్లోనూ అదే గొడవ, కాఫీ హోటళ్లలోనూ అదే గల్లంతు, రైళ్లల్లోనూ యిదే గోడు, క్లబ్బుల్లోనూ యిదే కథ; దేశమంతా ఒక్కవిధాన్ని ఏకగందరగోళ మయిపోతుంది. పురుషులూ అదేమాట, యిల్లరికపు అల్లుళ్లూ అదే మాట; పెద్దమనుష్యులూ అదే మాట, నౌకర్లూ అదే మాట; సప్లైలు రాని ఉద్యోగులూ అదే మాట, యింజనీర్లూ అదేమాట; లంచాలు రుచిచూడని వారూ అదే మాట; సబ్ రిజిష్ట్రార్లూ అదే మాట; భత్య కర్చు భత్యానికే కర్చు పెట్టేవారూ అదే మాట, స్కూళ్ల యిన్స్పెక్టర్లూ అదేమాట; వర్తకులూ అదే మాట; దగా ఎరగనివాళ్లూ అదే మాట; వైద్యులూ అదేమాట, ప్రాణములు హరించనివారూ అదేమాట; ప్లీడర్లూ అదేమాట, కొంపలు కూల్చనివాళ్లూ అదే మాట. రామరామా, నాదగ్గిర ఒక్కపైసాఅన్నా లేదనే వాడే గాని, దగ్గర డబ్బున్నదనేవాడు కనబడటం లేదు. అందులో పేదలు డబ్బులేదని సణగడంలో ఏమీ ఆశ్చర్యం లేదు. ఇప్పుడు యింజనీర్లూ, సబురిజిష్ట్రార్లు గూడా రజితం కంట బడటం లేదని భార్యారత్నముతో గుసగుసలాడుతున్నారు. ఆఖరుకి, పోలీసువారూ, అబ్కారీవారూ గూడా యిప్పుడు డబ్బు యిబ్బందిలో నున్నట్టు తెలుస్తోంది. మొన్న సంకురాత్రి పండుగకు మా సబ్ రిజిష్ట్రారు స్నేహితుడు అల్లుడిని యింటికి తీసుకొని రాకపోవడానికిగూడా కారణం వర్తకమందమే అని నాతో తేల్చాడు. ఒక యింజనీరుగారి భార్య, క్రితం 15 సంవత్సరములలోనూ లక్షవత్తులనోము చేసుకోని సంవత్సరము యీసంవత్సరము ఒక్కటే అని, వారి వంటబ్రాహ్మణుడు గోల పెడ్తూ చెప్తున్నాడు. ప్రతి వృత్తికి చెందినవాడూ గూడా యీ వర్తకమందం తన వృత్తికి నష్టం దెచ్చిందంటున్నాడు. మేష్టర్లమట్టుకు మేష్టర్లు "మామూలుగా నమస్కారాలు పెట్టే కొద్దివిద్యార్థులూ గూడా యిప్పుడు నమస్కారాలు తగ్గించేసి వృత్తికి చాలా నష్టం దెచ్చి" నట్లు చెప్తున్నారు. డాక్టర్లమట్టుకి డాక్టర్లు వారిఫీజులో మందం బయట్పేరడంవల్ల వారి మందులకిగూడా మందం బయట్దేరి, కుదిరే కాశినిజబ్బులూ గూడా కుదరటం మానేశాయి, అంటున్నారు. ప్లీడర్లమట్టుకిప్లీడర్లు, కేసులరద్దీ తగ్గి, మంచి విశ్రాంతి ఏర్పడడంవల్ల ఉదయాన్నించి కోర్టుటైముదాకా రెండుకాళ్లూ నిదానంగా బల్లమీదకు త్రోసి కూర్చుని, మజాగా మీసాలు మెలిపెడ్తూ, కునికిపాట్లు పడుతూ ఎదురుగుండా కూర్చొన్న గుమాస్తాతో, భార్యామణిగారికిన్ని రోడ్డుమీద పోయే బాటసారులకిన్నీ, బాగా వినబడేటట్టు, తన ప్రజ్ఞలున్నూ, యితర ప్లీడర్ల లోటుపాట్లున్నూ ఏకరెడ్తూ కాలక్షేపం చేస్తున్నారే గాని చేతినిండా ఏమీ పని లేదు. కొండొకచో, ఉదయాన్నే కాఫీహోటలుదగ్గర తనున్నూ, రైలుస్టేషనువద్ద తన గుమాస్తాయున్నూ, దార్లో క్లైంట్లను అటకాయించు నిమిత్తమై క్యాంపుచేసి ఉంటూ వచ్చిననూ, ఏమీ లాభం కనబడటం లేదు. ఏంచేస్తారు పాపం? కొత్తకేసు ప్లయింటుచేయమని కోనసీమ క్లయింటని అడిగితే, కోర్టుఫీజుకి కొబ్బరికాయలు పుచ్చుకొంటే, ఆలాగే దావా వేస్తానన్నాడు. ఈమధ్య ఒక ప్లీడరు తన మంగలిక్లయింటును ఫీజు అడిగితే, వాడు డబ్బు లేదని చెప్పి, ఓసంవత్సరంపాటు, ఉదయాన్నే, నిత్యము ప్లీడరుగారికి క్షౌరంచేసి పోగలవాడనని ఒప్పుకెళ్లాడు. మరొక ప్లీడరు ఒక పూటకూళ్లయజమానిని ఫీజు అడిగితే, వాడుకూడా, డబ్బుమాత్రం లేదని చెప్పి, ప్లీడరుగార్కి రెండుపూటలా ఓ ఆరునెలలు సుష్టుగా గడ్డ పెరుగుతో భోజనం పెట్టుకుంటానని ఒప్పుకుని వెళ్లాడు.

అదేవిధంగా, ఒక భట్రాజుక్లయింటు, ఫీజు అడిగినసం దర్భంలో, డబ్బుమాత్రం లేదని చెప్పి, ఒకసంవత్సరం పాటు ప్లీడరుగార్ని, ప్రతిరోజూ ఉదయాన్నే తప్పక సీసపద్యాల్లో స్తుతించి, ఆశీర్వదించి, చక్కా పోగల వాడినని వప్పుకొన్నాడు. ప్లీడర్ల వ్యవహారం యిలాఉంది. ఇహ వర్తకులు: వీరు కొట్టు తెరచిఉంచి, సరుకులు అమ్మితే, సగం నష్టం, అసలు కొట్టు మూసేస్తే దానికి రెట్టింపు నష్టం. అందువలన కొట్టు తెరచేఉంచి సగం నష్టానికి వప్పుకుంటున్నారు. ఇన్కంటాక్సువారు పన్ను తగ్గించనంతమాత్రమున నిజంగా సాహుకార్లకు వర్తకంలో లాభం వస్తోంది అని అనుకోవడం కేవలం పొరబాటు ఇహ రైతులు: వీరి వ్యవహారం సరేసరి. ధాన్యంధరలూ, పొలాలధరలూ ఒక్కసారి పడిపోయేసరికి, ఆకాశమార్గాన్ని ఉన్నమాపులు భూమిమీదకు ప్రసరించాయి. కరెన్సీనోట్లని చిత్తుకాగితాలు పారేశినట్లు పారేయడం, చీటికిమాటికి రైలులో ప్రయాణాలూ (అందులో ఇంటరుక్లాసుకు తగ్గక,) పల్లెటూళ్లలోకి సహితం మద్రాసుషోకులు దింపడం అన్నీ కట్టడ్డాయి. లోకలుబోర్డులలో ఎంత గడేకారన్న రైతుమెంబరూ గూడా యిప్పుడు యింటిదగ్గర, ఘరానాగా భార్య చెప్పినట్టు వినుకుంటూ, మజ్జిగ మాత్రమే పోసుకుని, పాలు, నెయ్యి, పెరుగూ అమ్మమాపుతూ పొదుపుగా కాలక్షేపం చేయడం అలవడ్డారు. ఇహ డబ్బు ప్లీడర్లకే పిగలనందున, అబద్ధసాక్ష్యములు వృత్తిగా పెట్టుకున్నవాళ్లకి రోజులు అసలే బాగులేవు. భోగంమేళానికే కిరాయి దొరకనప్పుడు ఫిడేలువాడికి గిరాకి ఉంటుందా? పౌరోహిత్యం గూడా ఈ వర్తకమందంలో దెబ్బ తింది. శారదాఆక్టుతొందరలో వివాహాలు అన్నీ ఒకేమాటు అయిపోవడంవల్లనైతేనేమి, శుభశోభనాదులకు సహితము తగిన డబ్బు పిగలనందువనైతేనేమి, రెండేళ్లబట్టి ఎక్కడా డోలుమీద దెబ్బే వినబడటం లేదు. ద్వారబంధాలకి తోరణం కనబడటంలేదు. సంభావనకి సందర్భాలూ లేవు; సమారాధనలకు సమయాలూ లేవు. సంతర్పణకి సరుకున్నవాడేడీ? పూర్వం ఎవడికెన్నా కాస్త కీడు మూడితే, వాడివిరోధి దర్జాగా తన సంతోషం వెలిపుచ్చేటందుకు ఏ సత్యనారాయణవ్రతమో చేస్తూండేవాడు. ఇప్పుడు వ్రతాలూ లేవు, నియమాలూ లేవు. పప్పుబ్రాహ్మలకి చివరికి ధప్పళాలు కూడా కరువయిపోయాయి. ఆఖరికి, వీరికన్న లెజిస్లేటివ్ కౌన్సిలర్ల పనే బాగున్నట్టు కనబడుతూంది — స్వయంపాకాలకి డబ్బుదొరకడంవల్ల.

మంగలులవృత్తి గూడా ఈవర్తకమందంలో దెబ్బ తింది. శుభశోభనాదులు తగ్గి ఊరుక్కునేటప్పటికి తాసామరప్పాలూ, తంజావూరుసన్నాయిలూ, బొంబాయిబాండ్లు, బందరుగన్నెట్లు అన్నీ మూలబడ్డాయి. పోనీ పొది బెట్టుకుని బ్రతుకుదామా అంటే, చదువు వచ్చినవాళ్లు స్వంతక్షౌరం కొంత అడ్డం, తిథివారపట్టింపుల దొంగ అడ్డం కొంత. "కత్తి నాదైతే ఎంత తగ్గుతావు?" అనే బేరాలు కొంతఅడ్డం. ఆఖరుకి వీళ్ల పని ఎంత కొచ్చిందంటే, రోడ్డుపోయే ప్రతీవాడినీ కనబడగానే, ఎగాదిగా చూచి, ఒహ చిరునవ్వు, పెట్టుబడి కర్చు లేదుగదా యని ముందే విసిరేసి, "గెడ్డం మాసినట్టుందే బాబూ" అని అంటూ పిలిచినా పిలవకపోయినా గూడా రోడ్డుమీద అటకాయిస్తున్నారు — కొంతమంది ప్లీడర్లు చంకలో కాగితాలకట్ట పట్టికెళ్లే ప్రతివాడినీ గూడా, "ఏమటోయి కేసు? మీది ఏవూరు? ఏవి కాగితాలు చూదాం" అని అంటూ రోడ్డుమీద కూడా నకాలతలకొరకు అటకాయించినట్టు.

చాకలివాళ్ల వృత్తి అసలే బాగులేదు. సన్నాయిలే లేనప్పుడు సవారిమోత లెందుకు? ఇలాయిబుడ్లెందుకు? పోనీ, బండమీద నాలుగుబాదులు బాదుకుని జీవింతామా అంటే, గాంధీగారు నాజూకుతనాన్ని చంపేసి, ఒట్టి మోటు ఖద్దరుకే నాజూకుతనం, గౌరవం ప్రపంచంలో యిప్పించడంవల్ల, నాజూకుతనమూ చచ్చింది, బట్టకు అసలు మాపు అంటూనూ పోయింది. విదేశీబట్టలు కట్టేరోజుల్లో ఎన్నిబట్టలెన్నో చాలనివాళ్లు సహితమూ, యిప్పుడు ఖద్దరూ, పందలపాకలోకి దిగాక, మనిషికి రెండుజతలు ఎక్కువ అయిపోతూ చాకలి అవసరం పూర్తిగా పోయింది. ఆరెండుజతలు గూడా కొంద

రు చాకలులకు వేయక, భార్యాబలంమీద కొందరూ, వేధ వాడబడుచు బలంమీద మరికొందరు, ఉతకడం విషయంలో ఆధారపడుతున్నారు.

ప్రతివృత్తిగూడా ఈవర్తకమండంలో పడిపోవడంవల్ల, అన్నివృత్తులకన్నా ఎక్కువమంది ముష్టియే వృత్తిగా పెట్టుకుంటున్నారు. అయితే, ముష్టిలో యిప్పుడు బయల్దేరే నూతన ఫక్కీలు చూస్తే దేశం ఈవర్తకమండంవల్ల ఎన్నిబ్బందులలోకి దిగిందో స్పష్టమవుతుంది ప్లీడర్లు కమిషన్లకి ముష్టి, డాక్టర్లు నీళ్ళయింజక్షన్లు యిచ్చుటకై పరిశుభ్రమైన ఉదకమునకు ముష్టి, కవులు అచ్చువేయించే ఆసామీ కొరకు ముష్టి, గ్రామఫోను యజమానల్లా ప్లేట్లకి ముష్టి, యింగ్లీషు తెలిసినవాడల్లా న్యూసుపేపరుకి ముష్టి, గేదెఉన్నవాడల్లా కాఫీపొడరుకు ముష్టి, పెద్దముక్కుగలవాడల్లా నస్యానికి ముష్టి, పోస్టాఫీసుకెళ్లే ప్రతివాడు చిరునామా వ్రాసేందుకు ఫాంటెనుకలంకొరకు ముష్టి, విద్యార్థులు పరీక్షముందు ప్రశ్నలకు ముష్టి, పరీక్షతరువాత మార్కులకు ముష్టి, దాని తరువాత ఉద్యోగానికి ముష్టి, ఇహ వర్తకంలో, వస్తువు కొన్నదాకా వర్తకుడు సామాను కొనమని మనలను ముష్టి, కొన్నతరువాత బాకీకి తొందరపెట్టవద్దని మనం వాళ్లని ముష్టి, డబ్బుగలవాడల్లా గౌరవపదవులకు ముష్టి, పట్టిపదవులు గలవాడల్లా డబ్బుకు ముష్టి, ఈరెండూ రాగానే బిరుదలకి ముష్టి, దొరల షేకుహేండులకు ముష్టి, ఇందులో కొన్ని ఫురానాముష్టి లున్నాయి. కొందరు దాచేపోయే అత్తరువుసాహెబుని పిలిచి, అన్ని అత్తరువులు జేబురుమాళ్లకి, చొక్కాలకీ, కందువాలకీ రాయించుకొని, బేరం మాత్రం కుదురనివ్వకుండా చేసి అత్తరు సౌఖ్యం, కానికర్చు లేకుండా, పొందుతున్నారు.

శ్రావణమంగళవారములలో, పాపం, ఆడవాళ్ల శనగల సంపాదన యిప్పుడు చప్పగా పడిపోయిందిగదా! పూర్వం, ఒకొక్కక్క ఆడది, ఒక్కతే అయితే ఏమి, పేరంటాన పిలిచిన యింటికి, పిలవనింటికిగూడా పోతూ ధైర్యంగా ముందే ఒహ చిరునవ్వు విసిరిపారేసి, బోలెడు శనగలు యింట్లో జారేసేది. అందులో పిల్లలుగూడా ఉన్న యిల్లాలు అయితే చెప్పాలీ వేరే? నడకవచ్చిన ప్రతీ మాటలురానిచిన్న కుంకనీగూడా లేవదీసి, ఒకొక్కదానికి ఒక జేబురుమాలు అంటూ ఒక గుడ్డ యిచ్చి మనలోమాట, అది సరిగా విప్పి చూస్తే, ఒహ చిన్నతువ్వాలంతకంటె పెద్దది అయిఉంటుంది — సుమారు ఒహ బస్తాశనగలు యింటికి లాగిపారేస్తూ ఉండేది. కాని యిప్పుడు శ్రావణమంగళవారాలు నోముపట్టేవారు ఏవో దొంగవంకలు పెట్టి, అసలుపట్టడమే మానేస్తున్నారు. "మీ అమ్మాయి నోచలేదేమి అంటే" "మొగుడు పరీక్ష ఫేలయినాడు, ఏం నోపించం" అని ఒహరు, "మొగుడు మా అమ్మాయిని దేనికి గూడా వీధులోకి వెళ్లనియ్యడు" అని కొందరు, "నోచేలేకపోతుందా" అని కొందరు, "మా యింట్లో అద్దెకున్న వాళ్ల యింట్లో ఎవరికో జబ్బుగాఉంటే ఒకమూల ఎలా నోచడం" అని మరికొందరు, "కార్యం అయితేనే గాని మాఅమ్మాయి నోములూ గీములూ పట్టనని పట్టుబడుతోంది" అని ఇంకొకరు యిలా నోములను ఎగగొట్టుతున్నారు. అందులో గడుసుగడుగ్గాయలు మరికొందరు ఇంకొకఫక్కీ కనిపెట్టారు. మొదటి మంగళవారం మాత్రం నోము పట్టడం మాని, తాము ఆరోజున ఊళ్లో సంపాదించిన శనగలు జాగ్రత్తపెట్టి రెండోమంగళవారంరోజున తాము పంచిపెట్టి, రెండోమంగళవారం తాము సంపాదించునవి మూడోవారంలో తాము పంచిపెట్టి, మూడోవారం తాము సంపాదించినవాటితో నాలుగోవారం పంచిపెట్టి వ్యవహారం వీధులోకి రాకుండా, నోముకి లోపంలేకుండా చేసుకొస్తున్నారు. ఒకవేళ పట్టినవాళ్లు గూడా యిప్పుడు శనగలు శాస్త్రార్థం నాలుగేసి గింజలు రాలుస్తున్నారే గాని, యిదివరలోవలె విరివిగా యిస్తూ మళ్లీ శ్రావణబుధవారాలు ఉండే మగవాళ్లకి సాతాళింపుకుగూడా సరిపడ్డట్టు యివ్వడంలేదు.

ఇదేవిధంగా ఎక్కడ చూచినా వర్తకమండంవల్ల బయల్దేరిన అల్లరి గోచరమవుతోంది. ఎక్కడ చూచినా ధాన్యం ఉన్నాయి, కొబ్బరి కాయలు ఉన్నాయి అనేవాడు తప్ప, డబ్బు ఉన్నదనేవాడు కనబడటం లేదు. ధనికులుగూడా "అయ్యా, సరస్వతీప్రసన్నమే గాని, లక్ష్మీప్రసన్నము ఏమీలేదు" అని దగ్గుత్తికతోటి ప్రొ

నోట్లు చూపెట్టి కళ్లనీళ్లు పెట్టుకుంటున్నారు. ఇంత కాలంబట్టీ హిందూదేశంలోనున్న డబ్బు అంతా ఒక్క పర్యాయం కర్పూరం హరించినట్టు ఏలా హరించిందో ఎవడూ చెప్పలేకుండా ఉన్నాడు. పూర్వం తిలక్ స్వరాజ్యఫండున్నూ, ఖిలాఫత్ ఫండున్నూ హరించాయి అంటే, అప్పట్లో కారణము చెప్పలేకపోయినా, తరువాత తరువాత ఎన్నోకారణాలు ప్రజలకి తెలిసి ఊరుక్కున్నాయి. ఇప్పుడు వర్తకమందానికి కారణం కొందరు వెండిధర అంటున్నారు. కొందరు బంగారం మారకపుధర అంటున్నారు. కొందరు దీనికంతకూ కారణం అమెరికాఅంటున్నారు. ఇంకొందరు ఫ్రాన్సుదేశం అంటున్నారు. మరికొందరు బుద్ధిమంతులు మన బ్రిటిషుదొరలేనోయి అని గుసగుసలాడుతున్నారు. ఇంక కొందరు, గవర్నమెంటు ఉద్యోగస్తులు దీనికంతకీ కారణభూతుడు మన షాహుకారు గాంధిగారే అంటున్నారు, డిఫెన్సు పెట్టుకోకండా ఎట్టినేరం మోపినా వప్పుకుంటాడుగదా అమాయికపు సబర్మతిసన్యాసి అని. మొత్తంమీద వర్తకమందానికి సరియైన నాడీ పరీక్ష చేసిన అర్థశాస్త్రపండితుడు కనబడటంలేదు. నిజంతెలియక, అనేకమంది అనేకఅవకతవకలుగా కారణాలు చెప్తున్నారు. అయినదానికీ, కానిదానికి గూడా వర్తకమందమే కారణం అంటున్నారు, అయినదానికి కానిదానికి గూడా నెపం కొత్తకోడళ్లమీదికి తోసేస్తూన్నట్టు.

ఒక కమ్మవిద్యార్థికి లెక్కల్లో మార్కులు ఎందుకు తక్కువ వొచ్చాయి అని తండ్రి అడిగితే, ఫ్రుట్టి రు ౭౦-రోజుల్లో మార్కులు చవుకగా యిచ్చినట్టు ఫ్రుట్టి రు ౩౫/-రోజుల్లో యివ్వడానికి అసలు వీలేలేదనిన్ని, మనంమాత్రం ఏమొహం బెట్టుకుని మార్కులు ఎక్కువ అడుగుతామనిన్ని చెప్పాడట. ఈమధ్యే బి.యే. చదువుకుంటూఉన్న ఒక అమ్మాయి, మొహాన్ని కుంకుమబొట్టు అసలు ఎప్పుడూ ఉంచకపోవడానికి కారణం ఏమిటని ఒక పల్లెటూరి పెద్దఆడపడుచు అడగగా, "కుంకానికికూడా ఎక్కడ డబ్బు తగులెయ్యం; తినేదా కుడిచేదా?" అని జవాబు చెప్పిందట. పెద్దచదువులు చదివిన స్త్రీల జాకెట్లకి, రానురాను చేతులు అసలే ఉండీ ఉండనట్టు ఉండడానికి కారణం ఏమిటంటే, యిప్పుడు డబ్బులేనిరోజుల్లో గుడ్డ తక్కువపట్టేటందుకే అని, అమాయికపు భర్తలతోటెన్ని, నిరక్షరకుక్షి అయిన పెద్దకుంకంబొట్టు పెట్టే అత్తగార్లకున్నూ, సదరుస్త్రీలు దబాయించి జవాబు యిస్తున్నారట. పట్నంలో ఉండే దొరసానిపిల్లలు గూడా, తమ గౌనుల చివరంచు మోకాలిపైకి మూరెడు ఎత్తుగా ఉండుటకు గారణం వర్తకమందంలో గుడ్డలాభంనిమిత్తమే అని దబాయించి చెపుతున్నారట. "అబ్బాయికి ఔపోసనం అయి రెండేళ్లు దాటిందిగదా, యింకా మనుమడు బయల్దేరకపోవడం ఏమీ బాగులే" దంటే, "ఏముటోలెండి. యిప్పుడు ఎక్కడ చూచినా మందంగానే ఉన్నాయి వ్యవహారాలు. మళ్లీ ధాన్యంధరలు పెరిగితేనేగాని, సంతానంవిషయం ఆలోచించడానికి ఏం వీలు లేదు"అని ఒక సబ్ జడ్జీగారు జవాబుయిచ్చాడట. ఒకరోగికి క్రితంనాలుగురోజుల నుండి ౧౦౫ డిగ్రీలు జ్వరం కాస్తూ ఒక్కమాటే, ఒకనాడు సాయంత్రం హఠాత్తుగా ౯౮ డిగ్రీలకి తగ్గి ఒహామూల కాళ్లు చల్లపడుతూంటే, విల్లువిషయం చుట్టుపట్ల బంధువులు ఒహామూల తగాయిదాలు పడుతూ, శిఖపట్ల గోత్రాలపునచ్చరణదాకా దేకుతూఉంటే, డాక్టరువచ్చి, చిరునవ్వుతో, "అబ్బే, వేడి ఒక్కమాటే తగ్గడం యీరోజుల్లో ఏమీ ఆశ్చర్యంలేదు. ధాన్యంధరలూ పొలాల ధరలూ ఒక్కమాటు పడిపోలేదా? ఇప్పటి కాలపరిస్థితులు అట్టివి, మరేం భయంలేదు. 'ధరతగ్గుట హెచ్చుట కొరకే' అని శెలవిచ్చినట్టు, వేడి తగ్గితే మళ్లీ తరువాత క్రమంగా ఎక్కితీరుతుంది," అని అంటూ, ఫీజుమాత్రం వళ్లో వేసుకొని చక్కబోయాడట.

ఇలా డబ్బు యిప్పుడు ఎక్కడా కనబడనందున ఎంతటివాడూగూడా యిప్పుడు పొదుపుగా డబ్బుకర్చుపెట్టడం నేర్చాడు. అందులో పొదుపు ప్రతీవిషయంలోనూ ఉంటోంది, అరవసోదరులు ప్రతీభోజనపదార్థంలోనూ సాంబారు కలిపినట్టు.

ఇప్పుడు చుట్ట, బీడి, సిగరెట్టు కాల్చేవారు పెదవి కాలేదాకా కాలుస్తున్నారే సదరు సమిధలను

కాని, యిదివరలోవలె, దర్జాగా సగం కాల్చి, అంతకన్న ఎక్కువభాగం కాలిస్తే తమ ఆత్మగౌరవం తగ్గుతుందనే అభిప్రాయంతో, అవతల పారవేయడం లేదు, మళ్లీ అరవసోదరులకు వాటితో మద్రాసునశ్యం తయారుచేసేందుకు సావకాశం ఉండేనిమిత్తం. యిదివరలో యిడ్డెను అర్ధణాధర ఉన్నప్పుడు మామూలుగా రెండు పుచ్చుకొనే కాఫీహోటలువాడి, యిప్పుడు కానీధరల్లో రెండు తినుట మాని ఒకదానితోనే కొనడం ముగించి, రెండోయిడ్డెనుకు మింజుమలె పచ్చడి మారు వడ్డించుకొని, రెండోయిడ్డెనులోపం కూడదీసేస్తున్నాడు.

పట్నములలో ఎలెక్ట్రిక్ ఫాను ఉన్నవాళ్లు, అది కదిపితే కరెంటుకు డబ్బుకర్చు అగునని ఎంచి, ఓఅణా పెట్టి ఒకడజను తాటాకు విసనకర్రలు కొని, వాటితోనే చేతికొద్ది విసురుకుంటూ, తాటిచెట్టుయొక్క Utilityని మెచ్చుగుంటూ, దేహపరిశ్రమయొక్క లాభములను ఉగ్గడిస్తూ, గాలిసౌఖ్యం అనుభవిస్తున్నారు.— ముసలిభర్తలు తమ పడుచుభార్యామణుల మెప్పుకొరకై లోగడ మీసములకు నల్లరంగు వేయుటలో మిక్కిలి కర్చు అగుచున్నందున, యిప్పుడు ఈఆర్థికపరిస్థితులలో అసలు తమతాలూకు మీసరాజములనే నిర్మూలించి, మీసముల రంగుకొరకు అయ్యే ప్రత్యేకకర్చును తగ్గించివేస్తున్నారు —వెనకటికి, నీళ్లపైపులు అదివరలోనే ఉన్న ఒక మ్యునిసిపాలిటీలో, డ్రెయినేజి కట్టుటకు ఆలోచించి, సదరు డ్రెయినేజి కట్టుటకు డబ్బు ఎక్కువ కర్చు అగునని ఎంచి, అసలు ఉన్నపైపులే లాగిపారేయుటకు ఒక పురపాలకసంఘం నిశ్చయించినట్లు. విటులుమట్టుకు విటులు, యిప్పుడు వ్యవహారములు స్వంతంగానే ఫైసలుచేసుకుంటున్నారే గాని, "మధ్యనున్న లాల్ గాళ్లు" అని లోగడ కవులు వర్ణించియున్న మధ్యవర్తులకి పైసా పిగలనియ్యటంలేదు— ఉద్యోగస్తులకి లాభాలు యివ్వడంలో మధ్యవర్తులైన బంట్రోతులకి యివ్వడంమాని Direc dealings మొదలెట్టినట్టు.

బ్రాహ్మణులచే తయారుగాబడిన జంధ్యములు ఒకొక్కప్రతి మూడు అణాలు చొప్పున కొనడం ప్రస్తుత హిందూదేశ ఆర్థికపరిస్థితులలో కేవలం అనవసరమనిన్ని, అది Practical life లో మిక్కిలి ప్రతిబంధకముగ నున్నదనిన్ని, జంధ్యం ఉంచడంవంటి పురాతనమైన సంస్థను (Institution) ఒక్కమాటు నిర్మూలించటం న్యాయము గాకపోయినచో, చవుకలో దొరుకు మాంచెస్టరు ప్రైవేన్ దారమునుభక్తితో ఉంచుట కర్తవ్యమనిన్ని యిప్పుడు Loyalists న్నూ, విద్యార్థులున్నూ చెప్పుటకు కారణం కేవలం వర్తకమందమే. పొదుపుచేద్దామనే ఉద్దేశ్యంతో, పాపం వితంతువులు, క్షౌరంలో మరీ వెంటవెంటనే మెడికల్ కాలేజి విద్యార్థుల్లాగ చేయించుక, కాస్త సుస్తీచేస్తూంటే డబ్బు యిబ్బంది ఒంటబట్టని కొక్కిరాయజనం "క్రాపింగుమీద ముచ్చటపడుతున్నారా" అని అడుగుతున్నారు — వెనకటికి, ఒకశ్రోత్రీయ బ్రాహ్మణుడు, తిథివారనక్షత్రముల పట్టింపువల్ల క్షురకర్మకి మంచిరోజు త్వరలో దొరకక గెడ్డం పెంచితే, "యింట్లో ఎన్నో నెలండోయి, మీరు అసాధ్యులులా గున్నారే" అని నాగరకత అలవడిన ఒక అరమీసంగాడు వేళాకోళం చేసినట్టు. కొత్తకోడళ్లకు వంటిపూట మాత్రమే భోజనము చేయవలసినదని కొందరు అత్తగార్లు యిప్పుడు పట్టుపట్టడానికి మితభోజనముయొక్క లాభములు పరీక్షించుటకే అని సదరు అత్తగార్లు ఎంత అన్ననూ,యీఆర్థికపరిస్థితులలో బయలుదేరిన పొదుపువల్లనే అని ఎవరికి తెలియదు? మొన్నమట్టుకు మొన్న, ఒకపూటకూళ్ల యజమానిని "అదేమిటయ్యా, మజ్జిగలో జాస్తిగా తెల్లదనము చచ్చిపోయిందేమి" టంటే, "తెల్లగా ఉంటే, మజ్జిగలో పిండి కలిపే నంటారని భయంతో అలా ఉంచాను" అని జవాబు చెప్పినప్పటికీ, అది వర్తకమందంలోని పొదుపువల్లనే, అని ఎవరికి తెలియదు?

లోగడ ప్రతినాటకానికీ వెళ్లే యువకులు యిప్పుడు పొదుపు నేర్చుటవల్ల నాటకమునకు వెళ్లుట మాని, ఆరాత్రి వేసే నాటకగ్రంథాన్ని ఎలాగో దొరకపుచ్చుకొని అందరికీగూడా హోరెత్తేట్టు యింట్లోనే చదివి వినిపిస్తూ, నాటకం చూసినహాయిని పొందుతున్నారు—

వెనకటికి మాస్నేహితుడొకడు సినీమాకు వెళ్లుటకు తగిన దుడ్డు లేక, ఈమధ్య ఒకరాత్రి సినీమా ప్రకటన కాగితమొకదానిని లంకించుకొని, కథమాత్రం క్షుణ్ణంగా చదివి, ఆకథనే తరువాత భార్యారత్నంగారికి గూడా కొంచెం అభినయం మిళావుచేసి చెప్పినట్టు.

ప్లీడర్లుమట్టుకు ప్లీడర్లు, సాయంత్రం సమయాన్ని, షికారువంక బెట్టి కోర్టునుండి యింటికి వెళ్లడంలో వాహనం విసర్జించి కాలినడక లంకించుకోవడం, కేవలం ఈపొదుపుసందర్భమే కాని, షికారు దేహారోగ్యమునకు శ్రేయస్కరమని వారు యిప్పుడు నూతనంగా కనిపెట్టుటవల్ల గాదని క్లైంట్లు గుసగుసలాడుతూనే ఉన్నారు.

ఈపొదుపువల్లనే చాలామంది ఇప్పుడు ఫలహారాలవిషయంలో ఎన్నిలౌక్యములు ఉన్నవో అన్నీ మానేస్తున్నారు. కొందరు "చూడవచ్చారా ఏమిటి" అని చెప్పి, ఫలహారాలు తినకపోయినా 'తింటున్నాం" అని దబాయిస్తున్నారు—"చూడవచ్చారా ఏమిటి" అని చెప్పి, తద్దినపు బ్రాహ్మణులు, భోక్తగా వెళ్లకముందు కాఫీహోటల్లో కాఫీ తాగి, తాగలేదని గాయత్రీ సాక్షిగా చెప్పేటట్టు. కొందరు ఫలహారం తగ్గించినట్టు మాత్రం విధిలేక వప్పుకుంటూ, దానికి కారణంగా, కాస్త నీరసం మొహం బెట్టి "పత్యం అండి diet observe చేస్తున్నాను" అని దబాయించుకొస్తున్నారు. ఇంతకంటె గడుసువారు కొందరు అసలు యింట్లో ఫలహారాలు కట్టిపెట్టి, రివాజుగా ఫలహారాలు చేసుకునే వాళ్ళయింటికి, సరియైన టైముకి పని సృష్టించుకుని వెళ్తూ,—కాస్త రోజూ ఒకరియింటికే కాకుండా—ఘనానాగా కాలం వెళ్లబుచ్చుకుంటూ వస్తున్నారు. అంతకన్న మొండిజాతి, పెద్దకాఫీహోటలు గుమ్మము వద్ద ఉదయం మధ్యాహ్నం కాపలా కాసి, ఎరుగున్నవాడు ఎవడేన్నా కనబడకపోతాడా,కనబడిన తోడ్తోనే లేని సంతోషం నటిస్తూ, పెట్టుబడి లేదుకదా అని చెప్పి, ఒహ చిరునవ్వు ఒకటి ముందే విసిరేసి, విషయము లేకపోయినా మాటల్లోకి దింపి, కదలనియ్యకుండా వాడిని నిలేసి, వాడికే విసుపెట్టి "తింటూ మాటాడదాం లోపలికి రండి" అని వారే ఆహ్వానించి, లోపలికి తీసుకొని వెళ్లేటట్టు చేస్తున్నారు. ఇహ లోపలికి వెళ్లినతరువాత అభ్యాగతియొక్క నటనంతా నడిపి, వద్దువద్దంటూనే వ్యవహారం నడుపుతూ, డబ్బు యివ్వ వచ్చేటప్పుడు మాత్రం కాస్త అవసర పరధ్యాహ్నం నటిస్తూ, కాని కర్చు లేకుండా వీధులోకి వినాయకుడిలాగున బతుకుతూ, కాలం గెంటుకొస్తున్నాడు.

పోనీ, ముష్టివాళ్లగతి చూతాం. పూర్వం ముష్టివాళ్లకి కొంతమందికి గాకపోతేకొంతమందికైన్నా ముష్టి వేసేవారు. ఈవర్తకమందంలో యిప్పుడు పొదుపు బయల్దేరాక, ముష్టి వెయ్యాకపోవడమే కాకుండా, దానికోసం రోజుకి నూరు అబద్ధాలు, అవకతవకజవాబులు చెప్పుకుంటూ ముష్టివాళ్ళని విదిలించుకుంటున్నారు. "ఇవ్వాళ బియ్యం నిండుకున్నాయి, వెళ్లు" అని సంవత్సరం పొడుగూతా గూడా కొందరు అంటున్నారు. కొందరు సంతానరహితులుసహితమూ "ముష్టి వేసేందుకు యిక్కడ పిల్లలు ఎవరూ లేరు, వెళ్లు అబ్బాయి" అంటున్నారు—అబద్ధం చెప్పనట్టుకూడా ఉంటుందని, కొందరు, "యివ్వాళ బియ్యం వెయ్యకూడదు" అని ఏదో పెద్ద తద్దినమో, తదితరసందర్భమో ఉన్నట్టు ఘనానాగా చెప్పి తప్పుకొస్తున్నారు. మరికొందరు ముష్టివాడు రాగానే, "యిది దొడ్డిగుమ్మం. యిక్కడ వెయ్యరు. వీధిగుమ్మంవద్దకు పో" అని పంపేస్తూ, వాడు వీధిగుమ్మందగ్గరకు వెళ్లినపుడు, "అబ్బాయి, చూడు,యిది, ఆఫీసు; యిక్కడ బియ్యం ఉండవు, నడు" అని ఎక్కడా గింజ రాలకుండా సాగనంపేస్తున్నారు. కొందరు "యిప్పుడు చెయ్యి ఊర్కోలేదు" అని గదవాయించి పొమ్మంటున్నారు—మనిషి వకటికి రెండు చేతులు గలవాడు యింటికి నలుగురేసి ఉన్నప్పటికీ. ఇహ ముష్టివారిలో కాస్త వయస్సులో చిన్నవాళ్లు వస్తే, "ఏం, కూలి చేసుకోరాదూ?" అని పంపివేయడం; కాస్త వయోవృద్ధుడు వస్తే, "అబ్బాయి, నీకు పిల్లలు ఉండగా యిదేం పొయ్యేకాలం నడు" అనడం; కొందరు "ఆదివారం తప్ప యిక్కడ ముష్టి వెయ్యరు పో" అంటూవారమునకు ఆరురోజులు గెంటుకువస్తూ, ఆదివారం రాగానే "అబ్బాయి ఆదివారం ముష్టి వేసేది, చూశావు, మా

యింటి ప్రక్కన రామారావుగారింటివద్ద; అక్కడకు పో" అని కాలక్షేపం చేసుకుంటూ వస్తున్నారు. ముష్టి వాళ్లపని, పట్టి నిరుద్యోగపు బి. ఏ, ల వలె ఎక్కేగుమ్మం దిగేగుమ్మంతప్ప, ఎక్కడా ఆదరణ లేకుండా వుంది.

ముష్టి వెయ్యకపోవడంలో గూడా పొదుపు ఆగటం లేదు. బంధువు డెవడెన్నా భోజనానికి వస్తున్నాడని వాసన వేయగానే, యింట్లోవారు, డాక్టరు లోగడ ఏడాదిక్రితం యిచ్చిన Prescription కాగితం ఒకహటి పైకి లాగి, ఓయున్ని రంగునీళ్లు ఒకహసీసాలో పోసి, యింట్లో ఆడంగులకి జబ్బుగా ఉందనో, వంట చేసేందుకు చాలా యిబ్బందిగా ఉందనో, మాటలసందర్భాన్ని ఏదో తగిన సమయములో, వచ్చిన బంధువుడికి తెలియు చేసి భోజనానికి ఉండేందుకు వచ్చినవాడికే కష్టం తోచి మరోహయింటికి వెళ్లేటట్టు చేస్తున్నారు—వెనకటికి పరీక్షసమయములో, కాపీ చేసేందుకు వీలు లేకుండా శనిలాగున వాచరు దగ్గిర నిలబడి ఉండగా, ఒక విద్యార్థి, ఏకాగితంకొరకో, పిన్నులకొరకో, మంచినీళ్ల కొరకో, సదరు వాచరును ఆపనిమీద అవతలకు వెళ్లులాగున చేసినట్టు.

మోటారుయజమానులు ఈమధ్యవరకూ, తదితర సమయాల్లో ఎలాగున్నా, కారు ఎక్కినప్పుడెన్నా, దర్జా, హాయి, సౌఖ్యం అనుభవించేవారు. కాని యిప్పుడు కారు ఎక్కినది మొదలు దిగేవరకూ, ప్రతీయజమాని, పెట్రోలు ఎక్కువ కాలిపోతూందే, డబ్బు చూస్తూంటేనే పెట్రోలు దుకాణంవద్ద కరిగి ద్రవపదార్థమై రోడ్డు పాడుగూతా, నైజం మారి వాయువై, ఆఖరుకి కంటికి గూడా కనబడకండా పోతూందే,అని బెంగతో లోలోపల కుళ్లిపోతున్నాడు. కారు ఎక్కింది మొదలు దిగేవరకు చూపు పెట్రోలు గేజ్ కే శేగాని, రెండోదృష్టి లేదు. యిప్పుడు పెట్రోలుగేజ్ మీద యజమానికి బహు ఏకాగ్రత ఏర్పడడంవల్ల, కారు పరుగెత్తునపుడు, అవశాత్తూ ఏసామాను కారునుండి క్రిందకు పడిపోయినా, ఏ చంటిబిడ్డ జారిపోయినా కూడా, యజమానికి పెట్రోలు కర్చు బెంగవల్ల తెలియటం లేదు. ఇప్పుడు స్నేహితు డెవడెన్నా వచ్చి, కారుమీద షికారు బోదాం రమ్మంటే, "డ్రైవరు లేదు" అనియో, "ఇంజను సరిగా లేదు" అనియో వంకబెట్టి కారు కదలనియ్యాషం లేదు. పూర్వం మొగవాళ్లు షికారు వెళ్లాక, మళ్లీ ఆడవాళ్ల ట్రిప్పు ఒకటి ఉంటూండేది. ఇప్పుడు వేరే ట్రిప్పుకు వేరే పెట్రోలు కర్చగునని, రెండో ట్రిప్పు తగ్గించి, ఆడవాళ్లూ మొగవాళ్లు కలిసి ఒకేసారి పోతున్నారు, యిరుకైనా కాస్త ఒత్తిగిలి కూర్చుని. మరికొందరు అసలు డ్రైవరుతో పేచీ తెచ్చిపెట్టుకొని వాడిని తీసిపారేసి ఎంతకీ మళ్లీ డ్రైవరుని పెట్టక, డ్రైవరు లేడనే వంక మీద కారు నడపడం మానేస్తున్నారు. ఎవరన్నా కనబడి,"సుబ్బారావుగారి డ్రైవరు వస్తాడట, పెట్టుకోండి" అంటే, "అబ్బే, అంత బొత్తిగా వయస్సులో ఉన్న కుఱ్ఱవాడిని డ్రైవరుగా సంసారికుటుంబాలలో ఉంచడం న్యాయతం గాదు. అది గాక వయస్సు ముదిరినవాడైతే, అనుభవమూ ఉంటుంది, కాస్త తొందర లేనివాడు అవుతాడు" అని ఆసలహా తోసేస్తున్నారు.

"పోనీ, అయ్యంగారు డ్రైవరు యిప్పుడు కాళీగా ఉన్నాడు, అతనిని పెట్టుకోరాదా" అంటే, "అబ్బే, అయ్యంగార్ల యిళ్లల్లో మరిగినవాడు మళ్లీ మరోహ అయ్యంగారింట్లో చేరతాడు, గాని మనయింట్లో డ్రైవరుగా రమ్మంటే వస్తాడా"అని, ఆసలహా తోసేస్తున్నారు. "పోనీ సాహెబుడ్రైవరు కావాలా" అంటే, "అబ్బే, సాహెబు అసలు వద్దు. ఏమంటే, హిందూమహమ్మదీయ సమ్మేళనమునకు నేను ప్రయత్నాలు చేస్తూ సహాయనిరాకరణములో పని చేస్తున్నానని పైఉద్యోగస్థులు అనుమానించినా, ఉద్యోగం కీకి పోసులెడ్తా"రని చెప్తూ ఆసలహాకూడా తోసేస్తున్నారు. ఇలాగే ఏవో వంకలు పెట్టూ, కొన్నాళ్లు కారు కదపకుండా కాలక్షేపం చేసుకుని వస్తున్నారు.

ఈ వర్తకమండంలో బయల్దేరిన పొదుపువల్ల ఎక్కడ చూచినా,"రిట్రెంచిమెంటే"(తగ్గింపు). గర్భాధానానికి పీటలపై కూర్చుని యుండగా జరుగు మంత్ర సందర్భమైన తంతు రిట్రెంచిమెంటుక్రింద అనవసరం అని లాగేస్తున్నారు. మరికొందరు మంత్రాలే లేనప్పుడు పౌరోహితు డెందుకు, అని అతనినిగూడా లాగేస్తు

న్నారు. ప్లీడర్లుగూడా "లా" చూచి గర్భాధానమునకు పౌరోహితుడు "necessary party" గానని, అట్టివారికి సలహా యిస్తున్నారు. బాజాభయంత్రీలవిషయంలో గూడా పెద్ద రాద్ధాంతములు అయినతరువాత తేలినదేమిటంటే, వివాహమునకు సాక్ష్యం నిమిత్తం ప్రకటన, బాజాలు, అవుసరం గాని, గర్భాధానమునకు అవుసరం లేదు, దీనికి సాక్షులు అసలు అవుసరం లేదు—అంటూ బాజాభయంత్రీలు తగ్గించమంటున్నారు. అది గాక, గర్భాధానంగదిలో తినుబండారపు దినుసులను అందమైన పళ్లెములలో పెట్టి ఉంచడం, వధూవరుల "attention" వాటిపైకి "distract" చేయుట గావున అట్టి తినుబండారపు సరుకులను తగ్గించి కర్చు తక్కువ చేస్తున్నారు. అదీ గాక, భోగంపిల్లకి కొంగున కాసు కట్టుట అవుసరము గాని, స్వంతభార్యకు అట్లు కట్టవలసిన బాధ్యత లేదు గాన, గర్భాధానంగదిలో పెళ్లికుమార్తె కొంగుకు నవరసులు కట్టనక్కరలేదు అని చాలమంది అభిప్రాయపడుతున్నారు.

ఇప్పుడు, భోజనానంతరం సువాసనద్రవ్యములు, నిషాద్రవ్యములు ఎక్కువగాబడ్డ తాంబూలమును త్యజించి, శృంగారం బయలుదేరేందుకు పెట్టుబడి లేని ఇతర పద్ధతులమీద ఆధారపడుతున్నారు.

పూటకూళ్ల యజమానులు యిప్పుడు ధరలో కాస్త రాయితీచేసినట్టు నటించినను, వారి మామూలు లాభం పోకుండా ఉండుటకు, చాలా లౌక్యములు మొదలెట్టారు. అసలు భోజనపదార్థములసంఖ్యలో ఏమీ తగ్గించక, కూరలో ఉప్పు తగ్గించి, పచ్చడిలో కారం వెయ్యక, పులుసులో చింతపండు హానీ హానీగా వేసి, ఏపదార్థమునకు రుచి రానివ్వకుండా జాగ్రత్తపడి, ఏవస్తువా భోజనంవద్ద ఆట్టే కర్చు అవకుండా చేసేస్తూ లాభం పొందుతున్నారు.

'కోలినోసు టూత్ పేస్టు లేనిదే దంతధావనం ఎలా' అన్న మద్రాసు విద్యార్థులంతా యిప్పుడు కచ్చికలోకి కలియబడుతున్నారు. స్నానానికి హ్యూటికోరా సబ్బు లేనిదే జరుగదన్న కంకణబద్ధులు యావత్తూ యిప్పుడు కేవలం కుంకుడుకాయతో రాజీ చేసుకుంటున్నారు. కొమ్ములు మొలచినవారు సహితమూ కేశరంజనీ హెయిరు ఆయిలు మాని కొబ్బరినూనెయొక్క గుణగణములను శ్లాఘిస్తున్నారు. ముఖమునకు మృదుత్వం తెచ్చే వస్తువులలో యిప్పుడు శీకాయగంధమే "Hazeline Snow"ని తోసిరాజన్నది. పూర్వం చీటికి మాటికి, ఎక్కడ బడితే అప్పుడు అయిసుక్రీము, లయింజ్యూసు వగైరాలు త్రాగేవారంతా యిప్పుడు మంచినీళ్లతోనే సంతుష్టి చెందుతూ, యిదివరలో తమరు లైముజ్యూసులు త్రాగడం ఎరిగినవారు యిప్పుడు ఆక్షేపిస్తారేమో అని, తమరే ముందుగా అట్టివి త్రాగడంవల్ల ఎప్పటికెన్నా దేహానికి ముప్పం అని లెక్చర్లు బనాయిస్తున్నారు.

ఇలా వర్తకమందంలో ప్రతిదాంట్లోనూ గూడ మందం కనబడుతూ ఉన్నప్పటికీ, మందగించని విషయాలు గూడా లేకపోలేదు. వర్తకుల తూనికలలో, ఈ వర్తకమందంలో సహితం, దగా ఏమీ పడిపోలేదు అంటున్నారు. గెడ్డం మాయడంలో చురుకుతనం ఏమీ తగ్గనట్టు కాలేజి విద్యార్థులు సణుగుకుంటూనే ఉన్నారు.

నూతనంగా బయల్దేరిన భావకవులు "కోకిల"ను బాధపెట్టడమున్నూ, మన్మథుడిని ఉక్కిరి బిక్కిరిచేయడమున్నూ, ఏమీ తగ్గలేదు. వేసవికాలములోనే గాక యితరకాలములో గూడా జిల్లాబోర్డు ప్రెసిడెంట్లకు దాహము ఎక్కువగా ఉంటోన్నట్టున్నూ, అతిమధురము ఎంత బుగ్గ నెట్టినా దాహం కట్టనట్టున్నూ జిల్లాబోర్డు కంట్రాక్టర్లు రహస్యంగా చెప్పుకుంటున్నారు. గౌరవోద్యోగులు తమ గౌరవమునకు లోటు లేకుండా సంపాదించే సంపాదన ఏమీ పడిపోలేదు. పైపులు ఉన్న ఊళ్లల్లో సదరుపైపులవద్ద నిలబడి మిక్కిలి శ్రమపుచ్చుకుని రోజు అంతా నిలబడి ఉండే సరసుల సంఖ్య ఏమీ క్షీణించలేదు. ఈవర్తకమందంలో గూడా బిరుదులు, రెండు పంటలూ పండినవి గాని ఏమీ తగ్గలేదు. పోలీసు ఉద్యోగులకు ఈమధ్య ఎన్ని బిరుదులు వచ్చినా, బస్సుప్రమాదముల సంఖ్య ఏమీ తగ్గలేదు. గరరక్షణయొక్క

పదును తగ్గనట్టు దేశభక్తులు యింకా గుసగుసలాడుతూనే ఉన్నారు. లాఠీచార్జీలు తగ్గినట్టు బహుశః పోలీసువారే ఒప్పుకోరు. కాఫీహోటళ్లలో గ్రామఫోను హోరు తగ్గా లేదు. పబ్లిక్ మీటింగులలో అసలు వక్తలకన్న, చిట్ట చివర Vote of thanks చెప్పేఆయన హడావిడి పడి పోలేదు. చాకలులు బట్టలు పడిదల కివ్వడం యింకా తగ్గనట్టు నాటకాల్లో ఆడంగుల బ్లౌజుకు చేరువగా నున్న స్థలములో కూర్చునే యువకుల వేషం బట్టి తెలుస్తూనే ఉంది. వయస్సులో నున్న యువతి భార్యగాగల ముదుసలి భర్తలు యిళ్లకు సాయంత్రం వెళ్లేసరికి మామూలుగా జరిగే మర్యాదలు ఏమీ తగ్గనట్టు యిరుగు పొరుగిళ్లవాళ్లు చెప్తూనే ఉన్నారు. మ్యునిసిపాలిటీల ధర్మమున, డ్రెయినేజి లేని ఊళ్లలో దోమకుటుంబములయొక్క సంఖ్య ఏమీ క్షీణించటం లేదు. సంతాన నిరోధంమీద ఉపన్యాసాలు యిచ్చే ఆసామీలు మ్యునిసిపాలిటీలలోకి వచ్చి సదరు దోమలకు ఆలెక్చర్లు యిస్తే బాగుంటుందేమో అని కొందరు పామరులు ఊహిస్తున్నారు. వర్తక మండంలోగూడా ఇన్సురెన్సు ఏజంట్లబాధ ఏమీ తగ్గ లేదు. అందుకనే ఈ మధ్య ఒక ఆసామీ "దోమతెరలు వచ్చాక దోమ బాధ తగ్గింది గాని, ఈఇన్సురెన్సు ఏజంట్లబాధ తగ్గే ఎత్తు కనబడటం లేదు" అన్నాడు. ప్రజాసంఘములయొక్క కార్యదర్శిగా పనిచేయువారు, సదరు సంఘములయొక్క డబ్బును సాదరుపేట స్వంత కర్చుకై వాడుటలో చురుకుతనం ఏమాత్రం తగ్గలేదు. భూములమీద రాబడి తగ్గినా పన్నులు మాత్రం మన దురదృష్టవశమున తగ్గనట్టు అందరికి తెలియని సంగతి కాదు గదా. ఉద్యోగుల ధిక్కారమూ, నౌకర్ల యిబ్బందులూ, వితంతువుల చిక్కులూ, ధనికుల క్రౌర్యములూ, విద్యార్థుల అల్లర్లూ, నాయకుల అహంభావములూ, పొలిటీషియన్ల పల్టీలు కొట్టుటలూ తగ్గినవని చెప్పుటకు ఎవడికీ గుండెధైర్యం లేదు కదా. "లా" ఎలా గున్నా మద్రాసులో గుర్రపుపందెములూ, ఆ జిల్లాలలోనూ డబ్బెట్టి పేకాడుటలూ తగ్గినవని గవర్నమెంటువారే ఒప్పుకోరు గదా. గురువిందగింజగాళ్ల సంఖ్య ఏమీ క్షీణించలేదు కదా.

ఎక్కడ చూచినా ప్రతీకారమూ, ఊర్కే వచ్చిన సిగరెట్టు రుచి, స్వంతసరకులో లేదంటున్నాడు గదా, ముష్టిపొడుంలో ఉన్న రుచి స్వంతపొడుంలో లేనట్టు. ఎక్కడ చూచినా, "అరువు", "ముష్టి", "దివాలా" అనే మాటలే గాని మరొకటి వినబడటం లేదుగదా. ప్రపంచము నుద్ధరించుటకు కంకణము గట్టిన వ్యక్తులునూ, సంస్థలునూ ఎన్నాళ్లు యింకా ఉపేక్షించి ప్రస్తుతపు ఆర్థిక దుస్థితిని ప్రపంచమందు తాండవమాడనిచ్చి బీదల ఉసురు పోసుకుందురో తెలియకున్నది. ఎట్లయిన, సర్వేశ్వరుడు తలచుకొనిన గాని సర్వమునూ సక్రమముగా జరుగవు. సర్వేశ్వరుడే అనతికాలములో వర్తకమందమునకు అడ్డుగట్లువేసి ప్రపంచమున శాంతి నెలగొల్పుగాత!

---

# అపక్వగోస్తని

తుమ్మలపల్లి వెంకటరత్నము పంతులుగారు

వెనుకటి కొక్క ద్రాక్షలత
　వేముల వాడకులీనుఁడైన భీ
మనకవిగారి యిల్వెలుపటి
　యం దుదయంబయి తద్రసంపుఁ బెం
జనుకుల జోరునన్ దెనుఁగు
　సీమలఁ దియ్యఁదనాల మంచిరా
జనపుజిలుంగుఁ గబ్బపుఁ బ
　సందులు, మోటికలెత్తవర్ధిలెన్.

ఆపయి దాని యంటొకటి
యాంధ్రమునన్ గవిసార్వభౌముండై
ప్రాపితనైషధీయసుర
వాక్పరిభాషం దెనుంగుం దేనెతోం
బోషిడి నాతనింటికిని
ముందటి పందిరిపైకిం బ్రాంకి యా
యేపునంగాపువట్టి రహి
యించెను గుత్తులు దిగ్గం బాఱంగన్.

దక్షవాటీ పురాధివాస్తవ్య భీమ
నాయకజటావలీ విలగ్నశశిబింబ
సంభృతసుధా ప్రపూర నిష్యందమునను
వల్లరీద్వంద్వ మది ప్రవర్ధిల్లె మున్ను.

కనుంగొన నేఁడు మద్గృహాము
ఖంబునం గాలమునాటి దానివి
త్తనమెటువచ్చి పడ్డదొక
దా యెదియేం బెను గాలి పాటునన్
గొనకొని యింత దూరమునుం
గొట్టుక వచ్చెనో? లేక యాకసం
బునం బఱతెంచునే చిలుక
ముక్కునను డిలపైని రాలెనో?

విత్తుమొలకెత్తె; లేయివుర్వెట్టె; దీఁగె
కొనలు సాఁగెను బ్రాఁకులాడను దొడంగె
నంతనల 'చెల్లపిల్ల వెంకన్న' యొక్కఁ
డెరువుగట్టె నద్దానికి నెడపదడప.

సలిలాసేకం బాదిగం
గలిగిన సకలోపచారగతులున్ నే నా
లలితలతాబాలికకున్
సలుపుచునుండుదు నపత్యసంభావనమై.

చాలంగాలము నుండి లౌకికపుం బం
చారమ్ములం జిక్కుటన్
జాలింపంబడె నాపరామరిక లే
చాయన్ బ్రవర్ధిల్లెనో?
గాలింబుట్టుట, ధూళికిం బెరుంగుటే
కాకెంత కాలానకా
వాలంబందున నింత దోహదమిడే
పాపానం బో రెవ్వరున్.

నారుంబోసియు నీరుంబోయండె ధరన్
నారాయణుండన్న వా
చారీతిన్ బెనుపొంది నేఁటికిగుళు
చ్ఛంబొందు బ్రాపించె వి
స్తారం బయ్యెను కాయమానగతి హ
స్తప్రాప్యతన్మంజరీ
నీరంధ్రీకృత గోస్తనీమధుర పా
నీయ ప్రపాకారమై.

గిల్లినచో రసంబురులుం
గించిదపక్వతం దియ్యతియ్యగాం
బుల్లంగం బుల్లంగాం జవులు
పుట్టంగం జేసెడి పచ్చి ద్రాక్షపం
డ్లల్లవి వానిలోని రస
మానిన బాలకవిప్రపంచపున్
బెల్లిదమూని యున్నతృష
పెల్లు కదున్ శమియించి పోవదే?

కవనపున్ దప్పిగొనిన లోకమ్ము కొఱకుం
బచ్చి పూపలు పుణికిన పాపమునకుం
గరుణమెయి నాదు ముష్కర కరరుహాప
కారము క్షమింపు మిఁక వల్లికాకుమారి.




## కాకి — కోయిల

సంతేబిదనూరి రామారావుగారు

అనగా అనగా ఓ గ్రామం. ఆ గ్రామంలో ఓ చాదస్తపు బ్రాహ్మడుండేవాడు. అతడు అతికోపిష్ఠి. ఆయన భార్య చండిది; మొగుడితో తరచు కొట్లాడుతూండేది. ఓరోజు ఆలుమగలకు తగవు వచ్చింది. బ్రాహ్మడు ఇల్లువిడిచిపోయాడు, పెండ్లాంపోరు ఓర్చుకోలేక. వేసవికాలం; కాళ్లు కాలుతూన్నాయి. దారిలో ఒక కొలను. దానిగట్టున ఒక మామిడిచెట్టు వుంది. ఆ చెట్టునీడను ఉత్తరీయం పరచి పండుకొన్నాడు. పైకి చూశాడు. చెట్టుమీదనుండి కాకులు ఎగిరిపోబోతూండినవి. వాటిని క్రిందికి పిల్చి "చాల విసుగుచెందాను. ఓ క్షణం పాటపాడి నాకు సంతోషం కలిగేటట్టు చేయండి" అన్నాడు. "మా కెక్కడ తీరుబడి? తినడాని కెక్కడేనా యేమేనా చూసుకోవాలి. ఇక్కడ కూర్చుని పాటపాడి పస్తుపడి చావవలసిందే," నని ఎగిరిపోయినవి. బ్రాహ్మడికి కోపం వచ్చింది. "నాకోరిక తీర్చక పోయినారు. కాబట్టి మీకంఠాలనుండి వచ్చేస్వరం అశ్రావ్యమైపోవుగాక! మిమ్మల్ని ఎవరు చూసినా అసహ్యించుకొంటారు. తాకితే స్నానము చేస్తారు," అని శపించాడు. అప్పటినుంచి కాకులను ఎవరుచూసినా అసహ్యించుకొంటారు; తాకితే స్నానము చేస్తారు కూడాను.

మరికొంతసేపటికి ఆ చెట్టుమీదికి కోయిలలు వచ్చాయి. వాటిని క్రిందికి పిల్చి పూర్వంలాగే అడిగేడు, బ్రాహ్మడు. అప్పుడాపక్షులు క్రిందికివచ్చి "మేమేం చెయ్యగలం? చిన్నపిట్టలము. మీరు మనుష్యులు. మీకు మా కూతలు ఇంపుగా వుండకపోవచ్చును. అయినా ప్రయత్నించి చూస్తాం," అని చెప్పి తమ కంఠము లెత్తి పాడి బ్రాహ్మణ్ణి మెప్పించాయి. అప్పుడు బ్రాహ్మడు చాలసంతోషించి "మీ కేం వరం కావాలో కోరుకోండి," అన్నాడు. కోయిలలన్నీ ఆలోచించుకొని "వసంతకాలంలో జనులను సంతోషపెట్టుటకు ఇంకను ఇంపైన కంఠము ననుగ్రహించాలి," అని కోరుకొన్నాయి. ఆయనా ఇచ్చాడు. ప్రతికోయిలకు చాల ఇంపుగా కూయడానికి వచ్చింది. వసంతకాలంలో వాటి కంఠం మరీ మాధుర్యంగా ఉంటుంది.

ఇల్లా ఉండగా, ఇది అందరికీ తెలిసింది. ప్రతివాడూ కోయిలపిల్లలను గూట్లోనుంచి దొంగిలించి తెచ్చుకోడం, ఇంటిలో నుంచుకోడం, వాటి మధుర గానంతో సంతోషించడం మొదలుబెట్టారు. పిల్లలనే కాక గ్రుడ్లనుకూడ తీసుకొపోయేవారు. కోయిలలు తమకు తటస్థించిన కష్టమును బ్రాహ్మడివద్దకు పోయి చెప్పుకొన్నవి. వాటి పిల్లలకూ, గ్రుడ్లకూ కలిగే హాని తప్పించాలని వేడుకొన్నాయి. అప్పుడు బ్రాహ్మడు మిక్కిలి జాలిపడి "మీరు ఇకముందు మీగ్రుడ్లను కాకుల గూళ్లలో పెడుతూండండి. కాకిగ్రుడ్లకూ మీగ్రుడ్లకూ భేద మేమీ కనబడదు. కాకులు మీ గ్రుడ్లను పొదిగి పిల్లలను చేయును. పిల్లలు పెరిగి ఎగిరిపోవును. కాకుల గూళ్లలో ఉండేంతవరకూ మీపిల్లల కేమీ భయ ముండదు," అన్నాడు. అప్పుడు కోయిలలు సంతోషించి గూళ్లకు వెళ్లేయి. అప్పటినుంచి కోయిలలు తమ గ్రుడ్లను కాకులగూళ్లలో నుంచడం మొదలుబెట్టాయి.

కథ కంచికీ, మనం యింటికీ.

---

# గుభేలు దస్త్రం

కపిల కాశీపతిరావుగారు

వెనకటికి ఓ బ్రాహ్మణుడుండేవాడు. చెప్పన్న శాస్త్రులు, అరవయినాలుగు విద్యలు, అభ్యసించినా ఆయనకి ఆనాడే నిరుద్యోగసమస్య సంభవించింది. విద్యావంతుడైనా రాజదర్శనం లభించలేదు.

ఏమీ తోచక వీధి అరుగుమీద ఇన్ని తాటియాకులు పోసుకుని ఓ గంటంతో తనకు తోచిందల్లా వ్రాయడం మొదలు పెట్టినాడు. తనకండ్లకు కనబడినా, చెవులకు వినబడినా, మరి ఏవిధముగానైనా తనకు వ్యక్తమైన విశేషాలన్నీ పరపర వ్రాశిపారేయడమే. వీధిలో కుక్క మొరిగితే రికార్డు. పొలంలో నక్క కూస్తే రికార్డు. ఎండకాస్తే రికార్డు. వానకురిస్తే రికార్డు. ఈవిధంగా ఉదయాస్తమానములూ, రాత్రి నిద్దరవచ్చేవరకూ వ్రాస్తూ ఉండడమే. స్నానసంధ్యానుష్ఠానాలకు, భోజనాది క్రియలకూ ఏమివెళ్లేవాడో బ్రాహ్మణుడు, తదితర కాలములలో వ్రాత, ఒకటే వ్రాత. చిత్రగుప్తుడికైనా సర్వకాల సర్వావస్థలలోనూ ఉంటుందో ఉండదో పని, ఈ బ్రాహ్మడికి మాత్రం జీతంబత్తెంలేని ఉద్యోగం స్వయంనిర్మితం. పలుకులేదు, ఉలుకులేదు. బ్రహ్మవ్రాత. తాటియాకులు కట్టలు కట్టలుగా పెరిగిపోతూన్నవి. దస్త్రాలమీద దస్త్రాలు అటకమీద పెరుగుతూన్నవి.

ఇలావుండగా ఓరోజు రాత్రి రాజుగారింట్లో దొంగలుపడి జవాహీరీ అంతా మళ్లించుకుపోయారు. రక్షకభటులు వెంబడిస్తే చిక్కలేదు. దొంగల్ని పట్టుకోనందుకు అందరి ఉద్యోగస్థులకు అవమానం వచ్చింది. మహా రాజుగారు ఉగ్రమూర్తులైపోయినారు. ఇంతలో ఒక ఆయనకు ఊహతోచింది: అహోరాత్రాలు జరిగే సంగతులు వరుసతప్పకుండా ఉదాహరించే దస్త్రాల బ్రాహ్మడి దగ్గిర ఆచోకీ ఏమైనా దొరుకవచ్చునని. బ్రాహ్మడి దర్శనానికి వెళితే మర్యాదగా దస్త్రాలువిప్పి వెదకడం ప్రారంభించాడు. వెతగ్గా వెతగ్గా ఈవాక్యం బహిర్గతమైంది. "రాత్రి రెండు ఝాములకు మాయింటికి పడమరలో వున్న నూతిలో 'గుభేల్' మన్నది.

ఇకనేం గావాలి? బహుశా దొంగలు సొమ్మంతా అక్కడ పారేసివుంటారు అని ఊహించారు. మనుష్యుల్ని దింపి వెదికిస్తే ఒక్కపూస పోకుండా పోయిన సొమ్ము నూతిలో దొరికింది. ఒక్కపరుగున వెళ్లి రాజుగారికీసంగతి తెలియజేశారు. ఎల్లా దొరికిందంటే దస్త్రం, బ్రాహ్మడికథ అంతా చెప్పినారు.

రాజుగారు సంతోషించి, ఇటువంటివారు కూడా ఉండడం సంస్థానానికి అవసరమేనని నిర్ణయించి బ్రాహ్మణ్ణి తనకచ్చేరీ ఇంటి వద్దనుంచి కోటగుమ్మానికి ఎదురుగా ఉన్న ఠాణా కచేరీకి మార్చమన్నారు. అవసరమైతే ఇద్దరు గుమాస్తాలు, ఒకబిళ్లబంట్రౌతు ఇత్యాది రాజచిహ్నములు ఇచ్చారు. దీనికిగాను కొంతమాన్యం వేరుజేసి ఈదస్త్రం వ్రాసేపని వంశపారంపర్యా వచ్చేటట్టు ఏర్పాటుచేసి ఆఉద్యోగస్థుడికి మాన్యం చెందేటట్టుగా నిర్ణయించారు. ఆరోజు మొదలు 'గుభేలు దస్త్రం' శాస్త్రి అని బ్రాహ్మణ్ణి పిలిచేవారు.

---

# బ్రాహ్మడికూతురు–మాదిగాడి పెళ్లాము!

## (ఎన్నెమ్మ)

78

వసుమర్తి వెంకటప్పయ్యగారు, బి. ఏ.

ఒకఊళ్లో ఒక బ్రాహ్మడుండేవాడట. ఆయన మంచివేదాధ్యయనపరుడూ, శిష్టాచారపరాయణుడూను. ఆయనకొక కూతురుండేది. ఆమెకు ప్రతిదినమూ తలంటినీళ్లు పోస్తూండేవారట. కొంత కాలానికి ఆతలంటిన చోట సున్నిపిండి నలుగుపడి ఒకవింతచెట్టు మొలచినదట. ఆవింతచెట్టును బ్రాహ్మణుడు చూచి 'ఈచెట్టు పేరును కనుక్కొన్నవానికి నా కూతుర్నిచ్చి పెండ్లి చేస్తా'నని చెప్పాడట. ఈసంగతి అంతా వాళ్ల పశువుల కాపరి మాశాడు. వాడు కులానికి పెద్దకులం (అనగా మాదిగవాడు). బ్రాహ్మణ చిన్నదానిని పెండ్లాడవలెనని మరాశపుట్టింది. ఒకఉపాయం పన్నాడు. ఊరువిడచి దేశాంతరము పోయి కొన్ని ఏళ్లు గడచినతరువాత బ్రాహ్మడివేషము వేసుకొని తిరిగి తనగ్రామం చేరాడు. ఈలోపుగా ఊరిలోవారంతా వాడిమాటే మరచిపోయారు. చింకిగోచీపెట్టి, భుజముమీద దుడ్డు కఱ్ఱవేసికొని, బుట్టతలపాగ పెట్టునే పయిలాడు, (పశువులవాడన్నమాట) ఇప్పుడు మెడలో లావుపాటి జందెము, చెవులకు కుండనములు, చేతిలో జారీచెంబు, భుజముమీద దర్భాసనము, నీరుకావిపట్టిన దోవతి ఉత్తరీయము మొదలైనవాటితో వచ్చీరాని మంత్రాలన్నీ జపిస్తూ గ్రామంలో ఆబ్రాహ్మడి యింటికి తయారైనాడు. రావడంతోనే ఆయింటి యిల్లాలు వేళ అగుటచేత, ఆపరదేశి దేవతార్చనకు లేవమన్నది. ఆకపట బ్రాహ్మడు పెరటిలోనికి కాళ్లు కడుగుకొ[illegible], ఓహో! మీపెరటిలో సున్నిపిండి నలుగుచెట్టు [illegible] అన్నాడు. ఆమాట బ్రాహ్మణుడు విని, పరదేశి [illegible] మహిమ గలవాడని సంతోషించి, తనకూతుర్ని ఆతని కిచ్చి పెండ్లి చేస్తానన్నాడు. కులానికి మాదిగాడైనా బ్రాహ్మణ సంపర్కముచేత వాళ్లపడిపట్ల కన్నిటికీ అలవాటుపడి, అప్పటినుండి బ్రాహ్మణ చిన్నవాడిలాగే మెలగేవాడు. పెళ్లి [illegible]ది. కూతుర్నీ, అల్లుడినీ అక్కడే కాపరం పెట్టారు. [illegible]ద్ది కాలములో పిల్లలు కూడా కలిగారు. పగలంతా బ్రాహ్మడిలాగ వ్యవహరిస్తూన్నా, స్వతః "చెప్పరాని" కులానికి చెందడము చేత రాత్రి అయేసరికి వారిగూడెమునకు పోయి గొడ్డునుకోసి, మాంసమునుతిని, కల్లుత్రాగి, తోళ్లను ఆరబెట్టి తెల్లవారేసరికి యిల్లుచేరుకునేవాడు. పిల్లలుకూడా మాదిగవాడికి పుట్టడంచేత ఆపోలికవంటి, [illegible]టప్పుడు బొమ్మలు, లక్కపిడతలు వదలిపెట్టి ధుమ్ములు, ముడుసులు తెచ్చి ఆడుకునే వారట. ఇదంతా [illegible] పొరుగువారు కనిపెట్టి, 'బ్రాహ్మడికూతురు మాదిగాడి పెళ్లాము' అంటూండేవారు. బ్రాహ్మడి కూతురు ద్వారా రహస్యమును గ్రహించింది. ఆమెకు ఎంతో తలవంపుగా తోచింది. తండ్రివద్దకుపోయి ఒకనాడు "కుక్క ముట్టుకున్న కుండకు దోషము ఎట్లాపోగల" దని అడిగింది. "చర్భకఱ్ఱపెట్టి తగులవేస్తేనేకాని పో"దన్నాడు తండ్రి. ఆప్రాయశ్చిత్తానికి సిద్ధపడిందాకూతురు. అమలునాడు పిల్లలకు తలంటి నీళ్లుపోసి భర్త, తాను, పిల్లలు తృప్తిగా భోజనముచేసి అందరు [illegible] పరుండిన తరువాత ఆయింటికి చిచ్చుపెట్టి ఆచిచ్చులో యింటిల్లిపాదితోపాటు తానుకూడ భస్మమై పోయింది. పరలోకములో భగవంతుడి దగ్గఱకు [illegible]కొని వెళ్లారు ఆయిల్లాలిని; కింకరులు "నాగతి [illegible]వాలి" అని ప్రశ్నించిందా భగవంతుడిని. "నీవు [illegible]ము చేశావు, యింటి పాదిని చిచ్చుపెట్టి [illegible] కాబట్టి 'ఎన్నెమ్మ' వై భూమిమీద జన్మిస్తావు. నిపల్లల్ని కొత్తెమ్మ, కోటెమ్మ అని పిలుస్తారు. నీమగడిని పోతరాజు అంటారు. వాళ్లకి నై[illegible]ాలు పెడుతూంటారు. నీవుమాత్రము మహా

పాపిష్ఠురాల వవడంచేత నీపేరు చెపితేనే అందఱూ అసహ్యించుకొని తిడుతూ ఉంటారు. నీకు ఆహారము, ఆయువు లేని పురిటిపాపలు. లోకములో పురుడు వచ్చిన ఏడురోజులవరకూ ఆయింటి చుట్టూ సంజవేళ 'జుమ్మ'ని ధ్వనిచేస్తూ తిరుగుతూ ఉంటావు. నీకు దీపము కిట్టదు. అందుచేత రావడంతోనే దీపముమీదపడి, ఆరిపేసి, నీమేతకై తిరగడం మొదలిడుతావు. కాని నీవు అభిమానంగలదానవు అవడంచేత నీవువచ్చేవేళని "బ్రాహ్మడి కూతురు మాదిగాడి పెళ్లాము" అని అనినమాత్రాన్ని విషాదముతో పారిపోతూంటావు. ఇంకా నీకు పరాభవము చేయడానికి పురుడుగదిగుమ్మములకు యిరుప్రక్కల పాతచెప్పు, కలబందముట్ట, భూతులసిచెట్టు కట్టుతారు. వెల్లుల్లి తొరకలు, తవుడు ఊకలోవేసి కుమ్మ పెడతారు. నీకు కళ్లు కనబడకుండచేయుటకు పొద్దుండగానే పురిటింటిలో దీపముంచి దానిని కాపాడుతూంటారు. ఈజాగ్రత్తలేనిచోట నీఆట సాగుతుంది. కాని అలాటిచోటు దొరకడమే కష్టము. కాబట్టి నిరంతరము క్షుద్బాధచే తిరుగుతూంటావు. ఇదే నీవు చేసిన పాపానికి ఫలితము" అని నిర్ణయించినట్లు భగవంతుడు చెప్పాడు. అప్పటినుంచీ ఆబ్రాహ్మడి కూతురు "ఎన్నెమ్మ" అయి భూమిమీద వెలిసింది.

అందుచేతే యిప్పటికీ మన యిళ్లల్లో పురుడు వచ్చినప్పుడు ఏడుదినాలవరకూ ఎన్నెమ్మ రాకుండా చేయడానికి ప్రతిసాయంకాలము ముసలమ్మలు పురిటిగదిదగ్గఱ కూర్చుండి ఎన్నెమ్మపాటపాడి కథచెప్పి 'బ్రాహ్మడికూతురు మాదిగాడి పెళ్లాము' అని అస్తమానూ అంటూంటారు. బాలింతరాలిచేతకూడా అనిపిస్తారు. ఎప్పుడేనా వీటికి లక్ష్యముచేయక ఎన్నెమ్మ ధ్వనిచేస్తూ వచ్చినా పురిటి పాపను మరుగుపఱచి, అందఱు బ్రాహ్మడికూతురు మాదిగాడి పెళ్లాము 'అంటూ పాతచీపురు కట్టతో తుడిచి పారేస్తారు. "ఎన్నెమ్మ" అంటే పేడపురుగులాగ నల్లగా ఉండే రెక్కలపురుగట. దానికిముందు భాగంలో అంపపు ముండ్లలాంటి కోఱలుంటాయిట, లేశిశువుల ఆయువు తీయడానికి. అయితే ఈఅంగరక్షలన్నీ జరిగినమీదట ఎన్నెమ్మ కొట్టడం అనేదేకష్టము. ఎన్నెమ్మ కొట్టడంచేత శిశువు మరణించిందని చాలా అరుదుగా వింటూంటాము. పురిటి సమయంలో పైవిధా మంతా అందరిళ్లలోనూ మనదేశములో జరుగుతూంటుంది. చేయరానిమహాపాప కార్యములు చేస్తే బ్రాహ్మడికూతురువలె ఎన్నెమ్మనెడి ఏకీటకజన్మమో ఎత్తి, అందరిచేతా కలకాలము గర్హింపబడుతూ, క్షుత్తుచే బాధపడుతూ, పుడుతూచస్తూ ఉంటారు. వాళ్లకి జ్ఞానము లేదు, మోక్షములేదు.



పుదుచ్చేరి హార్బరు

ఛాయాచిత్రకారుడు: కె. గోపాల్ గారు.




# కుట్టుపని II

కో. నరసింహాచారిగారు

గత సంచికయందు, కుట్టుపనిలో సాధారణపు కుట్లు రెండింటినిగురించి వ్రాయుట యైనది. ఈ సంచికయందు వేరువిధములగు కుట్లనుగురించి వ్రాయబడును. పూర్వము చెప్పబడిన కుట్లవలన సన్నని రేఖలుగా మాత్రము కుట్టుటకు వీలగును. కాని, రేఖలు వెడల్పుగా నుండినయెడల కుట్టువిశదముగానుండును. అట్లు వెడల్పుగా నుండుటకు తగిన యొక వేరువిధపు కుట్టు చిత్రము A యందు చూపబడియున్నది. ఇందు కుట్లు కొంచెము ఏటవాలుగాను, ఒకదానివెంబడి యొకటిగాను ఏర్పడును. అందువలన రేఖ వెడల్పుగా నుండును. 1 అనుచోట సూదిని దారముతో పైకిలాగి 2 వద్ద గ్రుచ్చి మరల 3 వద్ద పైకి లాగవలెను. ఇట్లు వరుసగా కుట్టుచుబోయిన యెడల 4 నందు వలె వెడల్పగురేఖ ఏర్పడును. దుస్తులయొక్క అంచులయందు, ఇట్టి కుట్లను వివిధవర్ణపు దారముతో కుట్టినయెడల అందముగా నుండును. (చిత్రము C చూడుడు.)

### గొలుసువంటి కుట్టు

### (Chain stitch)

### చిత్రము B

ఇది మరియొకవిధమగు కుట్టు. దారమును 1 వద్ద పైకి లాగి మరల సూదిని మాత్రము 1 వద్దనే గ్రుచ్చి, 2 వద్ద పైకి లాగవలెను. అట్లు చేయునప్పుడు 3 అను దారపు వలయము (loop) సూదికి అడుగున నుంచి సూదిని దారముతో పైకి లాగవలెను. మరల సూదిని 2వద్ద గ్రుచ్చి 8 వద్ద పైకి లాగి 9 అను దారపువలయముమీదుగా సూదిని పూర్తిగా పైకిలాగవలెను. అపుడు, మరియొక కొక్కెము ఏర్పడును. ఇట్లే వరుసగా కుట్టుచు బోయిన యెడల 10 విధముగా గొలుసువంటి కుట్టు ఏర్పడును. ఈ కుట్టు చిత్రపు కుట్టుపనియందు విశేషముగా వాడుకయందున్నది. దీనిని అంచులయందును, ఇతర చిత్రరూపముల యందును ఉపయోగింపనగును. (చిత్రము D)

### ముడుల కుట్టు

(Knot stitch)

చిత్రము E

ఈ కుట్టునందు ముళ్లు ఏర్పడుటవలన దీని కీ పేరు తగియున్నది. 1 వద్ద సూదిని పైకి లాగి 1కి కొంచెము ఎడముప్రక్క 2 వద్ద గ్రుచ్చి 1 కి నేరుగా క్రింద 3 వద్ద పైకి లాగవలెను. ఈ విధపు కుట్టునందు గూడ సూదిని a అను దారపు వలయము మీదుగా పైకి లాగవలెను. అట్లు లాగిన యెడల ఏర్పడు ముడి b యందు గలదు. మరల సూదిని 4 వద్ద గ్రుచ్చి 5 వద్ద లాగి b అను దారపు వలయముమీదుగా పైకి లాగవలెను. ఇట్లే c యందున్నట్లు మరి యొక ముడిని వేయవలెను. ఈవిధముగ వరుసగ కుట్టుచుబోయినయెడల F వద్ద నుండు రీతిని ముడులకుట్టు ఏర్పడును. G, H అను చిత్రములయందు B లో జూపబడిన గొలుసు కుట్టు అంచులు కుట్టుటకు వేయబడియున్నది.

మన మేలాటి చిత్రరూపమును కుట్టవలెనని యెంచెదమో ఆ చిత్రమును ముందుగా పెనసలుతో దుస్తుపైని తేలికగా గుర్తించుకొని, ఆ గుర్తుపై కుట్టుచుబోయిన సులభముగా నుండును. చిత్రపు కుట్టుపనికి ఓపిక మెండుగా నుండిన అందమగు చిత్రములు కుట్టుటకు సాధ్యమగును.



---



'స లా మ్'

ఛాయాచిత్రకారుడు: వి. యస్. గోపాలదేశికాచారిగారు.

# కుహనాయతి

దర్భా వేంకటకృష్ణమూర్తిగారు

అద్భుతం బన్న! కాలమాహాత్మ్య మెన్న - ఘనుని నల్పుని నల్పుని ఘను నొనర్చు
క్షేమ మొనగూర్చుఁ గూర్చును క్షామ మట్ల - యెప్పు డే రీతి నేమౌనొ యెవరి కెఱుక?
ఉండిన ట్లుండి యెక్కడ నుద్భవించి - క్షామదేవత వేసవికాలమందుఁ
బైరు పచ్చయు మడిమట్రపాఁడి పంట - నీటఁగలిపెను వీట నెచ్చోటఁ గన్నఁ
గూడు గుడ్డయు లేక గగ్గోలువడుచు - దీనులై బీదసాదలు వేనవేలు
కడు ధనాఢ్యుఁ డౌ నొక యతికడకు నరిగి - విన్నవించిరి తమతమ కన్నపాట్లు.

అంతట నాతఁ డందఱను నాదరమారఁగఁ జేరఁదీసి య
భ్యంతరమందిరంబున నయంబున వారలఁ జేర్చి యంతఁ గా
లాంతకుఁడో యనన్ బయట నగ్గి రగిల్చి విచారదూరుఁడై
యంతట దేశమందయిన యార్తి హరించెనటంచు నెంచుచున్
స్వాంతమునందుఁ దాఁ గరము సంతసమందుచునుండెఁ గ్రూరతన్.

యతి యను మాటయె కానీ - మతి లే దొక్కింత యేని మాన్యతయును లే
దతిదారుణ మకటా! యే - గతి గాంచునొ కాని తుదకుఁ గాఁ గనవలయున్.

మచ్చరమున నందఱకటు - చిచ్చిడి యాయతివరుండు చెచ్చెర మిద్దెం
జొచ్చి యమాయకువోలెం - జొచ్చె న్నిద్రింప; నిద్రఁ జొరఁ డటుపైనన్.

తెల్లవాఱునంత కల్లనమేల్కాంచి - యతివరుండు క్రింది కతిముదమున
నరిగి కలయఁజూచి యందొక్కయెడఁ దన - చిత్రమఱుటగనె విచిత్రముగను.

కని గుండె జల్లనంగా - "ననుమానం బేల? యెలుక లకటా! దీనిం
దినివైచె నేమి సేయుదు" - ననుచున్ వెఱఁగంది దిక్కు లరసెడు వేళన్.

సేవకుం డొక్కండు చెచ్చెర నేతెంచి వినయ మొప్పఁగ నిట్లు విన్నవించె
"చిత్తగింపుము దేవ! చిత్రంబొకండు గానంగనయ్యెను భవనంబునందు
నుదయంబుననె లేచి ముదమున మన గాదె తలుపులు దీయఁగఁ దరలె నందు
లెక్కింపఁగారాని మిక్కిలి బలిసిన మూషికరాజముల్ మోరలెత్తి
కొట్టునం గల ధాన్యంబుఁ గొల్లకొట్టి - యంతతోఁ బోక నాపైకి నరుగుదెంచి
యంత మొందింపఁ గడఁగ నే నంతలోన - బయటఁబడఁగంటి నెట్టులో బ్రతుకఁగంటి."

అని యిటు లాతఁడు దెలుపఁగ - విని వగలన్ మిగులఁ బొగిలి వేఁదుఱుఁబోలెన్
మనమున నేమియుఁ జేయుట - కునుదోఁపక యతియుఁ గొట్టుకొనుచుండె నటన్.

పరఁగఁగోరుచుట్టు పైనరొకటిపెట్టు - నాఁగ వేఱొకండు వేగవచ్చి
“వచ్చె నెలుకదండు పరుగిడు మోదేవ!” - యంచు హెచ్చరించె నంత నతఁడు.

అకటా! యేమని దూఱువాఁడ విధి, నా కంతంతకుం దాప మా
సకలైశ్వర్యముఁ గోలుపోతి నిటు పెల్చన్ దానికే గుండె దా
వికలంబై చెడె మీఁదుమిక్కిలిగ నీవేళం బటిష్ఠంపు మూ
షికముల్ ప్రాణభయంబు నాకుఁ గలిగించెన్ బట్టుగా దైవమా!

అని పలవించి తుట్టతుద కవ్వల వేఱొక యెత్తుమిద్దెకుం
గనుకనిఁ బాఱి యందుఁ గలకంతలఁ దల్పుల నెల్ల మూసి మె
ల్లన సుఖనిద్ర జెందెదు తలంపున శయ్యను మేను వాల్చి తాఁ
గను లరమోడ్చినంతనె తగ న్వినవాయెను శబ్ద మొండెడన్.

దిగ్గన లేచి యంత నలుదిక్కులునుం గలయంగఁ జూచుచో
డగ్గఱ “మ్యావుమ్యా” వని బిడాల మొకండు భయంకరంబుగా
నగ్గలమైన కంపమున నార్చువిధంబుఁ గనుంగొనంగ మై
గగ్గురుపాటుఁ జెంది వడఁకందొడఁగెన్ యతివర్యుఁ డంతలోన్.

అటఁ బఱతెంచు మూషికము లన్నియునుం బసిపట్టి దండుగాఁ
బటురయమొప్పఁ గాలువలు పల్లములు న్నదులు న్నదంబులున్
జిటుకున దాఁటి యాయతి వసించెడు సౌధముఁ జేరి యంతటన్
బటపటయంచు మించి నలువంకలునుం గొరుకంగఁ జొచ్చినన్.

కటకటఁ బడి యతివర్యుం - డిటునటు వడిఁ బోవఁ జూడ నెందును దామై
తటుకున లోఁ దూఱఁగ నవి - నిటలతటము మోదుకొంచు నిర్భరవృత్తిన్

కూలంగాఁబడె, నంత మూషికములుం గ్రూరంబుగా నాతనిం
గాలంబుంబలె గ్రుచ్చిగ్రుచ్చి పటుదీర్ఘక్రోధముం జూపుచున్
వాలంబుల్ వడిగా విదల్చుచుఁ గడున్ వాల్లభ్య మొప్పారఁగాఁ
గాలుం జేతులు బిట్టుపట్టి మెగఁ బ్రాకం జొచ్చి మేనెల్ల దూ
టాడెన్; సర్పము నల్లచీమలటు, కట్టా తప్పునే యేరికిన్
గూడంబెట్టిన కర్మముం గుడువ కెందుం గాలముం గూడుచోన్.

---

# నక్షత్రమండలము.

(వైశాఖమాసము)

గోబ్బూరు వేంకటానందరాఘవరావుగారు, బి. ఏ.

ఉత్తరము




దక్షిణము

ఈనెల పున్నమనాడు చంద్రుడు విశాఖనక్షత్రము మనిపేరు. ఈనెలలో రాత్రి తొలిజామున నగపడు నక్ష
చెంత నగపడును. కనుక ఈమాసమునకు వైశాఖమాస త్రములను గమనింతము.

పడమట అప్సరోమండలము ఇంద్రమద, చ్యవన భృగుమండలాదులును, రోహిణి లోనగువృష భరాశిలోని నక్షత్రములును అస్తమించినవి. సారథిమండలమును, అందలి బ్రహ్మహృదయ, ప్రజాపతి, బడబాగ్ని లోనగు నక్షత్రము లిక త్వరలో నస్తమింపనై యున్నవి. శ్వానమండలములో మృగవ్యాధుడును అస్తమింపబోవు చున్నాడు. అగస్త్యు డస్తమించినాడు. నైరృతిమూలను మృగవ్యాధుని సమీపముననే సముద్ర మథన వృత్తాంతమును స్ఫురణకు తెచ్చుచు వాసుకియు, మందరగిరియు కానవచ్చుచున్నారు. వాటికి ఉత్తరమున పూర్వశ్వానము మెఱయుచున్నది. ఈపూర్వశ్వానము నాయకమణియై మెఱయుచుండ ముత్యాలహారమువలె పునర్వసు విస్తృత స్వరూపముతో ప్రకాశించుచున్నది.

పునర్వసునకు తూర్పుగ పొట్లపువ్వువలె పుష్యమి గోచరించుచున్నది. ధవళధవళమై, వెండికంచమువలె నుండు మధ్యమతార కటునిటు రాసభములని వర్ణింపబడిన రెండుచుక్కలు మిణుకు మిణుకుమనుచున్నవి. ఆదిగువను సర్పమువంటి యాకారముగల ఆశ్లేష యున్నది. ఈపాము తూర్పున చిత్ర దాటి స్వాతిదిగువవరకు నహుషరూపమున వ్యాపించియున్నది. వాయుదైవత్యమై, భీమునిస్ఫురింపజేయు స్వాతి దిగువకు కూడ నీమహోరగమూర్తి వ్యాప్తమై భారతమందలి యజగరోపాఖ్యానమును జ్ఞప్తికితెచ్చుచున్నది ఈ అహిమండలమునకు మీదుగా గ్రావమును, 'సోమోరాజా' యని వేదమునందు వర్ణింపబడిన చమసమును గలవు. వీటికిపైన సింహరాశిలోని మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని నక్షత్రము లున్నవి.

మఘ (అందోళికాంపంచ) పల్లకివలె ఐదునక్షత్రములని మనవారు చెప్పుచున్నారు. పాశ్చాత్యులు (Sickle)కొడవలివంటి నక్షత్రములని వర్ణించుచున్నారు. ఇక్కడి నక్షత్రములు పాము మెలికలవలె- పరుండబెట్టిన ఇంగ్లీషు S అక్షరమువలెనున్నవి. ఇంగ్లీషువారు కొడవలి యని చెప్పెడిదానికి వారు Regulus అని చెప్పెడు తేజోవంతమైన నక్షత్రము పిడిస్థానముననుండును. దాని కుత్తరముననున్న నాలుగును కొడవలిలోని వగును. ఈకొడవలిమధ్య నక్షత్రమునకు 'శృంగ' అనుపేరున్నట్లు కేత్కరుపండితులు తమజ్యోతిర్గణితమునందలి నక్షత్ర పటమున తెలిపినారు. పాశ్చాత్యులు Regulus అని చెప్పెడు తేజోధికమైన చుక్కకు ఉత్తరమున రెండును- శృంగనక్షత్రము సహా—దక్షిణమున రెండును కలిపి అయిదు చుక్కలను మఘయనుచున్నట్లు కనబడుచున్నది.

వీటికి తూర్పుగా పూర్వఫల్గుని ఉత్తరఫల్గునినక్షత్రము లున్నవి. ఎఱ్ఱనికాంతితో కాలిన ఉక్కుగుండువలె కుజుడును, బహుధవళ కాంతితో గురుడును వక్రగతులై సింహరాశిలో పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని నక్షత్రములనడుమ కానవచ్చుచున్నారు. ఫల్గునీనక్షత్రములకు తూర్పున (పాణినాంపంచ) ఐదువ్రేళ్లతోకూడిన అరచేతివలె హస్త కానవచ్చుచున్నది. ఉఫ. $\frac{3}{4}+$



హస్త+చిత్రార్థ— కన్యారాశి యగుచున్నది. ఇంద్రాగ్ని దైవత్యమయిన విశాఖ అడుగునను, కన్య మీదనుండుటచేతను, ఆకాశమందలి నక్షత్రముల కూడికచే కన్యారాశి యేర్పడుటచేతను ఈకన్య అయోనిజ, అగ్నికుండ సముద్భవ అని చెప్పతగియున్నది. మరియు వేదమునందర్జునీయని వ్యవహరింపబడిన ఉత్తరఫల్గునీ నక్షత్ర ముదయింపగానే ప్రతిస్పర్ధియగు (Diameterically opposite) మీనమస్తమించుటయు, అందువలన నర్జునుడు మాత్రము ఆకాశమున గిరగిర తిరుగు మీనమును (మత్స్యయంత్రమును) పడవేయగల్గుటయు, మత్స్యయంత్రము పడిపోయిన పిదప కన్యఉదయించుటయు ప్రత్యక్ష గోచరములు. కన్యచుట్టునున్న తేజోవంతములయిన ముఖ్యనక్షత్రము లయిదు—౧. మఘ, ౨. ఉత్త

రఫల్గుని, 3. స్వాతి, దిగువను అశ్వతరమండలములో సూర్యపుత్రులైన అశ్వినులు. మఘకు పితరు లధిదేవతలు. వారల రాజు యముడు. యమాంశజనితుడు ధర్మరాజు. ఉత్తరఫల్గుని అర్జునుడు. స్వాతి భీముడు. వీరు కుంతీ పుత్రులు. ఈనక్షత్రములను పాశ్చాత్యులు క్రమముగా Regulus, Denebola, Arcturusఅని చెప్పుచున్నారు. అశ్వతర (Centarus) మండలములో మిక్కిలి తేజోవంతములైన ఆల్ఫా బీటా గుర్తుగలచుక్కలు అశ్వినులు. ఇవిఅశ్వినుల 3-వ స్థానము. రెండవదానికె మనము చూచి యున్నాము. అశ్వినీనక్షత్రముల కధిదేవతలు అశ్వినులు. పునర్వసు మిథునము మొదట అశ్వినులు..వీరే రాసభవాహనులు. మూడవది అశ్వతరమండలములోని స్థానము. ఇది స్పష్టమగుటకే పటములో ఇచట అశ్వినులు (3) అని గుర్తువ్రాసినాము.

ఈయశ్వినుల అంశమున నకుల సహదేవు లుద్భవించిరి. ఈయయిదు తారాసముదయముల నడుమ 'పంచపర్వతముల నడుమ నదియుంబోలె' కన్యారాశి మెఱయుచున్నది.

ఈద్రౌపదికన్యకథకు వేదమూలములు రెండు తెలుపుదుమని యీవఱకు చెప్పుచుంటిమి. కావున నిట సంగ్రహముగా తెలిపెదము. "భారత మిషమున పలికితి వేదార్థ భావమెల్ల" అని భాగవతమునందు వ్యాసుడు వ్యాకులచిత్తుడై చింతించుపట్టున స్పష్టముగా నాతడే వ్రాసియున్నాడు. ఋగ్వేద మహాభారతముల నోపికతో పఠించువారల కిందలి సత్యము ఎంతోరమ్యముగ గోచరించుచుండును. జూదరుల దురవస్థ దశమమండలము 34-వ సూక్తమునందలి యీదిగువ ఋక్కులలో నిట్లు వర్ణింపబడినది—

x. 34. ౨. "అక్షస్యాహమేక పరస్య హేతో రనువ్రతామపజాయామరోధం."

పాచిక యెంత చెప్పిన నంతే. అందునిమిత్తము నా కనువ్రతయైన ప్రియురాలిని అన్యాక్రాంతము గావించితిని.

౪. "అన్యేజాయాం పరిమృశం త్యస్యయస్యా గృధద్వేదనే వాజ్యక్షః."

ఎవరి ఐశ్వర్యమును జూదపుపాచిక హరించినదో వానిభార్యను ఇతరులు అనుభవింపజూతురు. దుర్యోధన కర్ణులు ద్రౌపది నెట్లు పరిభవింపనెంచిరో గమనింపుడు.

x. 34. ౯. "నీచావర్తంత ఉపరిస్ఫురంత్యహ స్తాసోహస్తవంతం సహంతే, దివ్యాఅంగారా ఇరిణే న్యుప్తాః శీతాః సంతో హృదయం నిర్దహంతి."

పాచికలు క్రిందకు దొర్లుచు పిమ్మటమీదికి ఉరికి చేతులులేకున్నను చేతులుంగల మనుజుని బలవంతముచేసి తమయిష్ట ప్రకారము ఆడించుచున్నవి. అవి చల్లనివే యైనను బల్ల మీదబడి, దివ్య మహత్త్వముగల (నిప్పు) బొగ్గులై జూదమాడువారి హృదయములను దహించి వేయుచున్నవి.

x. 34. ౧౦. "జాయాతప్యతే కితవస్య హీనా మాతా పుత్రస్య చరతః క్వస్వితీ."

జూదరిభార్య దిక్కుమాలి తపించుచున్నది; జూదరితల్లి కుమారుడు నిలువనీడలేక అల్లాడుట చూచి దుఃఖించుచున్నది.

ఇక జూదరిభార్య దురవస్థ—

x. 33. ౧. "దుఃశాసు రాగాదితి ఘోష ఆసీత్."

౨. సంమా తపం త్యభితః సపత్నీరివ పర్శవః, నిబంధతేఅమతిర్నగ్నతాజసుర్వేర్న వేవీయ తేమతిః.

3. మూషోన...వ్యదంతి మాధ్యః స్తోతారం తేశత క్రతో, సకృత్సునోమఘవన్నింద్ర మృళయాధాపి తేవ నో భవ.

౪. కురుశ్రవణ....

ఘోష వినబడుచున్నది. అదుగో దుఃశసు వచ్చుచున్నాడు.

నా పేగులు పెల్లగిల్లి పోవుచున్నవి. సపత్నుల వలె బాధించుచున్నవి. దరిద్రము, నగ్నత (నిస్సి

హీనత) అలసట-వీటిచే మిక్కిలి బాధపడుచున్నాను. నామనస్సు పక్షివలె కొట్టుకొనుచున్నది.

ఎలుకలు సాలీల నూలును కొరికి తినివేసినట్లు మనో వ్యథలు నన్ను తినివేయుచున్నవి. ఓశతక్రతూ, మమ్మొక సారి కనికరింపుము. ఔదార్యమూర్తీ, ఇంద్రా, మాకు తండ్రివై రక్షింపుము. కురుశ్రవణ.

జూదమాడునపుడు ధర్మరాజుయొక్క, అవస్థ— పిమ్మట దుఃశసురాక—దరిద్రము. నగ్నత—దుకవస్థ యనియాక్రోశము. ఇచట ఇంద్రశతక్రతుశబ్దములకు మారుగా "కృష్ణా ద్వారకావాసా" అనినచో భారతములోని ద్రౌపదికథకు సరిపోవునా, సరిపోవదా? ఈరెండు ఋక్కుల అంశములు విపరించి పెంచి వ్రాసినచో సభాపర్వముఖ్యకథ తేలినదా, లేదా?

పాపావహుడగు దుశ్శాసనుడీడ్చి తెచ్చుటచే విడిన ద్రౌపదికేశభారము, వానిం జంపివచ్చి భీముడు




ముడినైచెనని వేణీసంహార వృత్తాంతము గలదు. చూడుడు—వేణీ మండలము దిగువ భీముని (స్వాతిని).

ఇక తక్కినచుక్కలను గూర్చి చూతము—

దక్షిణమున నౌకామండలమునందలి పృష్ఠభాగము, చాపలు, స్తంభము, వెన్ను కనబడుచున్నవి. కాని మృగవ్యాధుని దిగువ నగస్త్యుడు మాత్రము కానరాకున్నాడు. నహుష నౌకామండలములకు నడుమ చీమల

పుట్టలో చిక్కువడి ఇంద్రప్రసాదముచే వెలువడగలిగిన అగ్రుపుత్రునిగూర్చి గతసంచికలో చదివితిమి. అదియే వమ్రీమండలము. నౌకామండలమున కీవల దక్షిణపు కొనను మక్షికమండలమున్నది. దీనినే పాశ్చాత్యులు Musca అందురు. ఇందు రెండుచుక్కలు మాత్రము గానవచ్చుచున్నవి. ఆపైన గాలిపడగవలె త్రిశంకు మండలమున్నది. ఇందు పై మూడుచుక్కలే త్రిశంకుడని మనవారు చెప్పుదురు. అడుగున నొకటిచూడకలిపి నాలుగు చుక్కలను చేర్చి పాశ్చాత్యులు దక్షిణపుశిలువ అని అర్థమిచ్చు Southern Cross అని చెప్పుచున్నారు.

ఇక నాగ్నేయభాగమున నున్న తారల చూతము. త్రిశంకుమండలమున కీవల అశ్వతర వృకమండలములు చాలముఖ్యములు. అశ్వతరమండలమును పాశ్చాత్యులు Centaur అనియు, వృకమండలమును Lepus అనియు వ్యవహరింతురు. దుష్టబుద్ధియగు వృకము వార్తికమను పక్షిని పట్టి తినరాగా, ఆదిక్కుమాలినపక్షి అశ్వినీదేవతనుగూర్చి మొఱపెట్టి రక్షింప వేడుకోగా ఆమహాత్ములావృకమును బల్లెముతో పొడిచి వార్తికమును రక్షించిరని ఋగ్వేదమునందు అశ్వినీదేవతాకములైన సూక్తములలో పెక్కుచోట్ల కలదు. వార్తికపు పక్షి కనబడుతావు చమసమునకు తూర్పున, నహిమండ



లముపైని. ఈవార్తికములోనున్న చుక్కలు హస్త నక్ష

త్రములలోనివని కొందరు సిద్ధాంతులు చెప్పిరి కాని అది సరికాజాలదని నావిన్నపము. దీనిని 'కాకి' (Crow) అని ఇటీవలివారు చెప్పుచున్నారు. ఇందుకొక గాథ గలదు—

### గ్రీకు గాథ

అపోలో అను గ్రీకులదేవత యొకపక్షినిపిల్చి 'కొరోనిస్'(Coronis) అనునామె ప్రవర్తన కనిపెట్టుచుండుమని నియమించెను. కాని యాపక్షి వర్తనము సరిగాలేక చాడీకోరుసంగతిగా పరిణమించెను. అందుపై నతడు కోపించి, అంతవరకు ధవళధవళమై రజతకాంతితో తేజరిల్లు నాపక్షిని కుమ్మరావమున కాలినట్లు నల్లకాకివగుమని శపించెను.

Wanton babbler ! see thy fate
Messenger of mine no longer
Go to hades with thy prate
And to match thy disposition,
Henceforth be thy plumage black.

"నీగుణమునకు తగినట్లే నీశరీరముగూడ నల్లగానై పోవుగాక" అని శపించెనట.

తత్పూర్వమిది ధవళమై చక్కనిపక్షియై యుండవలెను. అశ్వినీదేవతల దయకు పాత్రమై తన్ను మ్రింగ వచ్చిన తోడేలినోట పడకుండ రక్షింపబడెను, చూ. ఋగ్వేదము-యాభిర్వార్తికాంగ్రాసితామముంచతంతాభి ...అస్నోవృకస్యవార్తికామభీకేయునంనరానాసత్యాముముక్తం.

తోడేలుయొక్క కోరలనుండి మీరు వార్తికమను పక్షిని విముక్తిచేసి మీరు రక్షించితిరి.

అచోహువిదశ్వినావార్తికా వామాస్నోయత్సీమముంచతం వృకస్య.

అముంచతం వార్తికామంహయోనిః......

వృకరూపముగల చుక్కలు దక్షిణాకాశమున నున్నట్లు గ్రిమాల్డిదొరగారు ప్రాచీనాకాశమున గానవచ్చిన తారారూపములనుగూర్చిన గ్రంథము ౬౭-౬౮ పుటలలో నుదాహరించిరి.

వృకప్రశంస ఋగ్వేదమునందు మరికొన్నిచోట్ల కలదు. దీనికావల విశాఖదిగువను అనూరాధ, జ్యేష్ఠనక్షత్రము లుదయించినవి. ఇవి వృశ్చికరాశిలోనివి. అనూ



రాధ మూడు చుక్కలలో తూర్పుననున్నది. గౌతము డని క్షేత్రాగపండితుడు జ్యోతిర్గణిత నక్షత్ర పటములో చూపెను.

అటుపైనున్న కన్యారాశిని గూర్చి వివరము లీవలకె తెలిపితిమి. ఒక్క అంశముమాత్రము మఱచినందున నిచట వ్రాసెదము. ద్రౌపది కైదుగురుభర్తలుండుటయా యని ద్రుపదుడు శంకించినప్పుడు వ



పూర్వవృత్తాంతము ద్రుపదుని కేకాంతముగా వ్యాసు డెఱిగించెను. అందు ద్రౌపది పూర్వజన్మమున నాలాయని యైనయింద్రసేన యని తెల్పబడినది. చిత్ర కొన్నింటిలో ఇంద్రదైవత్య మని కలదు. ఈరాశిలో గామా గుర్తుగల చుక్క వల నక్షత్ర మని కేత్కారుపండితులు చెప్పి యున్నారు.

ఈరాశి మొదట మరుత్తుల కందరకు నేకభార్య యైన రోదసియనియు పెక్కుచోట్ల ఋగ్వేదమునందు గలదు. మహాభారతకథ ఆకాశమున నక్షత్రరూపమున చిత్రితమనుట కీయంశములుకూడ ప్రయోజనకారులగునని ఋపు డిందు వ్రాయుచున్నారు. కన్య, వేణీమండలము




నంటియే స్వాతియున్నది. స్వాతి భూతేశమండలము లోనిది.

స్వాతిసమీపమున నొకప్పుడు ఒక కోతిరూపము గల చుక్క లున్నట్లు కనబడుచున్నది. కన్యారాశిని వర్ణించునపుడు జ్యోతిశ్శాస్త్రవేత్తలు 'ససస్యదహనాప్లవగాచకన్యా' అని వర్ణించిరి. కన్యచేతిలో సస్యము అనగా వరికంకులున్నట్లు ఇంచుమించుగా నన్ని దేశము లలో దొరికిన ఖగోళచిత్రములలో కలదు. అగ్నిదైవత్య మైన విశాఖ అడుగున నుండుటచేత దహన సహితమై నది కన్యయనికూడ చెప్పవచ్చును. కాని ప్లవగమనగా పడవయని కీ. శే. Major B. D. Basu గారు చెప్పి నది సరియని తోచుచున్నది. ప్లవగమనగా కోతియని యర్థమున్నది. కన్యసమీపమున కోతియున్నట్లు గ్రిమాల్డి దొరవారు వ్రాసిన జ్యోతిశ్చిత్రవివరములలో

| పుట. | ఈజిప్టుచిత్రములసంఖ్య. | |
|---|---|---|
| ౧౫ | | ౨౯ |
| ౨౧ | | ౮౨, ౯౨ |
| ౧౭౮ | | ౧౮౬౮ |
| ౩౧ | చీనా చిత్రములు | ౧౮౬, ౧౮౭ |
| ౩౦ | టిబెటీయ ,, | ౧౫౨-౧౫౩ |

గలసంఖ్యల చిత్రములలో తెలిపిరి. వాల్మీకిరామాయణ మునందు కిష్కింధా కాండాంతమున హనుమంతుని లంకాప్రయాణము వర్ణించుచు "స్వాతేఃపంథాఇవాంబరే" అని వ్రాసినది సాభిప్రాయమని నావిన్నపము.

విశేషించి భారతమునందు విరాటపర్వములో ఉత్తరగోగ్రహణసందర్భమున నర్జును డరుగునపుడు తన రథమునకు "మాయామయంబును, వానరాకారంబును నగు మహోగ్రకేతనంబును, దదాశ్రితంబులైన వికృతాఖిల నానాభూతంబుల బుత్తెంచిన నిజధ్వజంబు రథంబునం గట్టించి" అని యున్నది. ఉత్తరఫల్గునికి పైన భూత సంబంధముగల వానరరూప ముండినపుడే అర్జునుడు కపిధ్వజు డగును. ఈ సందర్భములన్నియు బట్టిజూడగా కన్యారాశిసమీపమున స్వాతికడ నొక కోతిరూపము గన్పట్టుచుండెనని చెప్పదగియున్నది.

మన పటములో నిక ఉత్తరమున కానవచ్చు చుక్కలను జూతము. సింహరాశికెగువను పులహక్రతు రేఖ సూచింప ధ్రువుడు ఉత్తరమున మెఱయుచున్నాడు. క్రతుఋషికి తూర్పున అత్రియు, పులహునికి తూర్పున పులస్త్యుడును తేజరిల్లుచున్నారు. ఈ చతుర్భుజమునకు తూర్పుగానున్న త్రిభుజములో తూర్పుకోనను మరీచియు, మధ్య అరుంధతీసహితుడై వసిష్ఠుడును, ఆదంపతులకు పశ్చిమముగా అంగిరసుడును ఉన్నారు. ఆ దిగువను సారమేయమండలము గలదు. క్రతుపులహులకు పశ్చిమముగా వక్రతుండము, లంబోదరము, మూషకవాహనముతో విఘ్నేశ్వరుడున్నాడు. మిథునరాశికిని సారథి మండలమునకును, విఘ్నేశ్వరమండలమునకును మధ్య పాశ్చాత్యులచేCamelopardolis(చిత్రక్రమేలకము)అని చెప్పబడు పొడలలొటిపిట (Giraffer) వలె నొడుగు.

గను, పైనిసుబురుగను కనబడుచు చిన్నచుక్కలతో కల్ప వృక్షమున్నది. ధ్రువునకు పైన ఊర్వశి చుక్కలు మూడుమాత్ర మగపడుచున్నవి. లఘుఋక్షములో చివర నున్న ధ్రువునికిదిసువ, తోకలో కశ్యపమహేంద్రులును, పుచ్ఛమూలమున నగ్నియు గలరు. అగ్నికి దక్షిణముగా ధాతయు, ధాతకుతూర్పున విధాతయు గలరు. ధాత విధాతలు ధ్రువరక్షకులు. అగ్నికి తూర్పునను విధాతకు ఉత్తరమునను మిత్రుడున్నాడు. ఈ చుక్కల కుదయాస్తమానములు లేవు. ఈరెండు ఋక్షములకు మధ్య ౧౭ నక్షత్రములతో ఘోరసర్పాకారుడై ధరాసూనుడు నరకుడున్నాడు.

ఇక మనము మనపటములో ఈశాన్యదిశను గాన వచ్చు చుక్కలనుగూర్చి తెలుసుకోవలసి యున్నది. ఇందున్న చుక్కలు పాశ్చాత్యుల సిద్ధాంతప్రకారము

౧. Corona Borealis: Northern Crown ఉత్తరమకుటము.

౨. Hercules హెర్క్యులీస్, శౌరి, త్రివిక్రముడు.

౩. Serpens, సర్పెన్స్, శేషుడు.

౪. Ophiuchus అఫ్యూకస్, సర్పధారి. Serpent Bearer సర్పధారి. అను నాలుగు మండలముల చుక్కలు. పైన వీణామండల (Lyra) మున్నది.

ఇందు త్రివిక్రమమండలమును గూర్చి కొంచెము యోజింతము. విష్ణుమూర్తి మూడడుగులతో విశ్వమంతయు కొలిచినాడు. ఋగ్వేదమునందలి యీ క్రింది ఋక్కులను గమనింపుడు—

"ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్, సమూఢమస్య పాంసురే."

ఈలోకమునందంతటను విష్ణువు అడుగులిడెను. అతడు మూడడుగులు వైచెను. అతని పాదధూళిలో నిదియంతయు కూడిపోయెను.

"త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః అతో ధర్మాణి ధారయన్."

ఎవని నెవ్వరును మోసగించజాలరో, ఎవడు విశ్వరక్షకుడో అతడు మూడడుగులు వైచెను. అప్పటినుండి






అతడు ధర్మమును ధరించుచున్నాడు. అనగా అతని యాజ్ఞప్రకారము విశ్వము పరిపాలింపబడుచున్నది.

"విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే ఇంద్రస్యయుజ్యః సఖా"

విష్ణుడు చేసినకార్యములను మీరు చూడుడి. వాటివలన ఇంద్రసఖుడైన విష్ణుని పవిత్రకార్య విధానములు మాకెఱింగించుచున్నారు.

వృత్రుని సంహరించుటలో ఇంద్రునికి విష్ణుడు తోడ్పడుచుండెను.

..."అథాబ్రవీద్వృత్ర మింద్రో హనిష్య న్త్సఖే విష్ణో వితరం విక్రమస్వ"

వృత్రుని చంపనైయున్న ఇంద్రుడు విష్ణునితో నిట్లనుచున్నాడు: "సఖుడా, విష్ణుడా, ధైర్యముతో పెద్ద అడుగులు వేయుచు ముందునకు పొమ్ము."

ఇంద్రశ్చ విష్ణో యదపస్పృధేథాం
త్రిధాసహస్రం వితదైరయేథాం.

ఇంద్రవిష్ణువులారా, మీరు వృత్రునితో యుద్ధము చేసినపుడే మూడుభాగములుగల యీ విశ్వమును కల్పించిరి.

ప్రాచీన పాశ్చాత్య సిద్ధాంతులు ఈ తారాసముదయము వర్ణించిన విధానము గమనింతము.—

Aratus

"Near to the Dragons head, in toil-spent posture,

Revolves a phantom whose name none can tell,

Nor what he labours at; they call him simply,

The Man upon his knees; his knees seem bent,

In Despe rate struggle, while from his shoulders. His hands are high, uplifted and out-spread,

As far as he can strech, his right foot's sole,

Is planted on the crest of that coiled dragon."

"డ్రేగన్" అను మహాసర్పముయొక్క శిరము కడ, ఒక తారాసముదయము గోచరించును. ఈ నైఋతి మూలగా విశేషాయాస బాధితమైనట్లు ఆ స్వరూపము వలన స్పష్టముకాగలదు. ఆమూర్తి ఆకాశమున నాశ్చర్యముగా పరిభ్రమించుచుండును. ఆమహనీయమూర్తి పేరేమో చెప్పగలవారు లేరు. అతడెందునిమిత్త మంత శ్రమపడుచున్నాడో అదియును చెప్పజాలరు. అతడు మోకాళ్లపై నున్నాడని మాత్రము తెలిపెదరు. ఆ మోకాళ్లు [illegible] యాసముతో కుక్కుకొని వంగి యున్నట్లు కనబడును. అతని భుజములపై నాతని బాహువు లెంతో పైకి ఎత్తి చాపబడినట్లు కనబడును. ఎంతవరకు సాధ్యమో అంతవఱకు, అనగా వీలునంత యెత్తునకు అతనిచేతులు పైకెత్తబడిన ట్లగపడును. అతని కుడికాలిమడమ తన్ను చుట్టవైచిన మహాసర్పము యొక్క శిరము నదిమి త్రొక్కియుంచినట్లున్నది.

రా. రా. కర్తస్వామిగారి సముఖమునకు—

సేవకానుసేవకుడు రామాజి తిరుమల హర్కారా-౨ వ్రాసుకొన్న విన్నపము॥ తరువాత॥ దేవరవారు కట్టుబాటుచేసిన మర్యాదప్రకారము శాలివాహనశకములు ౧౪౮౬ నకు సరియగు రక్తాక్షినామ సంవత్సర వైశాఖబహుళ ౮ వఱకు కర్ణాటక దక్షిణదేశాధిపతి యగు రామరాజు3 సన్నిధియందు ఉంటూఉంటిని.

అల్లీ ఆదులశాహుని మహలుదారుడు౪ తనయజమానుని ప్రయోజననిమిత్తమై ఉత్తరములను తీసుకొని వచ్చి రాజద్వారమున నిల్చి, తాను వచ్చియున్న విషయమును రాజుగారికి చెప్పి పంపెను. ఈవర్తమానమును రాజుగారు చిత్తమునకు తెచ్చి, తమదళవాయిని పిలిచి ఆజ్ఞాపించినది: "అల్లీ అదులశాహుగారి [మహలదారుని*] పిలిచి జాసోతిచావడి,౫ హజారచావడి, వీనిబయట ఆనందమహలునందు బస యేర్పాటుచేసి ఆమహలుదారుని యోగ్యానుసారముగ ఖర్చు ఇచ్చి పరామరిసించవలెను" అని ఆజ్ఞాపించగా అదేప్రకారము దళవాయి యొక్క నగరిహరకారుడు [మహలుదారుని*] తోడి తెచ్చి ఆనందమహలునం దుంచి [వాని*] యోగ్యతానుసారము వెచ్చపు ఖర్చునకు ఇచ్చి పరామరిసె చేయించి మరల రాజుగారికి యీవర్తమానమును ఎఱుకపఱచెను.

ఆమహలుదారుడు ఆదివసము ఆనందమహలులో విశ్రమించికొని మరుదివసము ప్రాతఃకాలమునకు లేచి, కాళ్లు మొగము తొలుచుకొని నమాజుచేసి తనలో తాను ఆలోచనచేసినది: "రాజుగారు నన్ను తమ సముఖమునకు రప్పించి ఆక్షణముననే మా యజమానుని ఉత్తరములను తీసుకొనక ఉదాసీనము చేసినవారగుచున్నారు. నేను ఇప్పు డేమాటయును ఆడగూడదు. హెచ్చుమాట లాడిన మానము నిలువదు. నే నన్నో దుర్బలసేవకుడను. సర్వప్రకారములను మానమును నిలుపుకొని పోవుటయే ఉత్తమము. మహత్తయిన గజమును ఎక్కవలెనన్న వెనుకముందు చూచి పరిశోధనచేసి యెక్కవలసినదిగా ఉన్నది. రాజుగారిదగ్గర హెచ్చుగ సంభాషణ సేయవలయునన్న దూరదృష్టి కలిగి చేయవలయును" అని తానే తెలుసుకొని సమాధానము తెచ్చుకొని రాజుగారికి చెప్పిపంపినది:

"దేవరగారన్నో నన్ను వచ్చినక్షణముననే సముఖమునకు పిలిపించి ఉత్తరములు౬ తీసుకొని విచారించినవారు కాకపోతిరి. నేను తీసుకొనివచ్చిన ఉత్తరములు బహు నాజూకైనవి. ఇక మీద నైనను పిలిపించిన హజూరుకు వచ్చి ఉత్తరములను ముట్టజేసి సాకల్యముగ యావద్వర్తమానమును విన్నవించుకొనుచున్నాను"

అని చెప్పిపంపగా రాజాధిరాజుగారు బహుహర్షితులై తమ సముఖమునకు వచ్చుటకు అప్పనపాలించుటచేత, మహలదారుడు ఉత్తరములతోకూడ రాజుగారి సన్నిధికి వచ్చి వినయపూర్వకముగ వందనము చేసి, ఉత్తరము ముట్టజేసి మఱియు కొన్ని విషయములను విన్నపముజేసెను. అనంతరము (వాడు) రాజుగారిని స్తవముజేసినది:

౧. ఇది పురాతన కన్నడగ్రంథమునకు ఆంధ్రీకరణము.

౨. వార్తావహుడు.

3. ఈగ్రంథమునందు రామరాజును పేర్కొనినది మూడు పర్యాయములే. తక్కిన చోట్ల రాజభూవరుడని, రాజుగారు అని, రాజరాజని వ్రాయబడియున్నది.

౪. ఉద్యోగస్థుడు.

౫. జాసోతి చావడి యనగా వేగులవారి కచ్చేరి యని తెలియవలయును.

౬. 'కాగితపత్రములు' అని మూలము.

"దేవరగారన్ననో మహారాజాధిరాజులు. అప్రతి పరాక్రమ వంతులను నరపతులు. దేవరవారివంటి సమర్థులు పృథ్వియం దెవ్వరును కానవచ్చుటలేదు. నవ కోటినారాయణ అనిపించుకొని యున్నారు. దేవర వారివంటి రాజతేజోనిధులను నే నెట్లు స్తోత్రము చేయగలను"

అని యనేకవిధముల స్తోత్రముసేయగా మహారాజాధిరాజుగారు పరమహర్షితులై మహలుదారు డిచ్చినట్టి ఉత్తరములను చదువుటకు స్థానాపతిచేతి కిచ్చి చదివించి పరమహర్షితులై, అటుతరువాత, ఆనంద మహలునందు చదరుసేయించుటకు యేర్పాటుచేసి అచ్చటికి పోయి సమస్తసామాజికులను డెబ్బదిరెండు నియోగములవారితోకూడా పిలుచుకొని సింహాసనము మీద కూర్చున్నవాడాయెను.

అదే సమయమునందు తెలుగు దొమ్మరవారు వచ్చిరి. వెంటనే ఆడుటకు వారికి ఉత్తరవు యిచ్చిరి. కొన్ని గంటలు దొమ్మరివాండ్లాడిన తరువాత రాజుగారు వారికి ఆకులు వక్కలు యిప్పించి ఉడుగర లొసగిన పిమ్మట దొమ్మరివారు నమస్కరించి మహారాజాధిరాజులకు విన్నపముచేసి భక్షణచేయుటకు పదిసూకరములను దయచేయించవలెనని వేడుకొనగా నరపతిగారు దయచేసి మహలుకారఖానలోనుండి ఉత్తమగ్రామసూకరములను తెప్పించి తమ సమక్షమున దొమ్మరులకు యిప్పించి అప్పన యిచ్చినవారైరి. అల్లీఅదుల శాహుని మహల్ దారుడు [అచ్చట*] కూర్చునియుండెను. ఈసూకరములు మహలుదారుని దృష్టికి తగులగనే [వాడు*] కండ్లు మోముతోకూడ మూసుకొని పల్కినది: "నే నన్ననో, పుట్టుకచేతనే ముసల్ మానుడను. చెడుమృగములు కంటికి అగపడగూడదు. అగపడినను చూడగూడదు. తత్రాపి చెడుమృగములను చూచినట్లయిన ముసల్మానులలో నుండినవాడు హిందువులలో కలిసినట్లే" అని పల్కెను. అందుమీదట నరపతివారు చెప్పినది: "మీజాతిలో కోడిని తినుచున్నారు. కోడిని భక్షించినతరువాత మలభక్షణము చేసినట్లే అనుచున్నది." అని చెప్పగా దానికి మహలుదారు డాడినది: "మీరు చెడ్డజంతువులను తినుచున్నారు. మీజాతి హీనజాతి" అని యాడగా, ఆ రాజాధిరాజు మహాకోపముతో నగరములోపల నున్నట్టి గ్రామసూకరములను తెప్పించి జమచేసి, యొకగొప్ప ఇంటిలోనికి వానిని తోలించి అవి [తినుటకు తగిన జొన్నలను బోయించి*] బీగము వేయించి మొహరు చేయించి మరుదివసము బీగము తీసి చూడగా గ్రామసూకరములు జొన్నలనంతయు భక్షించుటచేత ఆయింటిలో నెల్ల మలవిసర్జనము చేసియుండెను. అట్టి గృహములోనికి నరపతిగారు నూరుకోళ్లను విడిపించగా సూకరములు విసర్జించిన మలములోని జొన్నగింజలను తినుటకు ఆరంభించినవి. పిమ్మట మహారాజాధిరాజుగారు మహలుదారుని పిలువనంపించి, చూపించి, "నీవు మమ్ము చెడుజంతువులను భక్షణ చేయుచున్నామని యాడితివికదా! అవిగో, సూకరములు విడిచిన మలములోని గింజలను తినుచున్నవి

---

౧. డెబ్బదిరెండు నియోగములని పట్టి యొక్కటి యిచ్చట బొందుపరపబడినది. డెబ్బదిరెండు నియోగము లివి కావు.

అష్టప్రధానులు, హాజీబులు, సీమామూలపారపత్యగాండ్రు, ఇతిహాసకులు, కందాచారమువారు, రాయసమువారు, శాస్త్రులు, దళవాయీలు, ముజుందారులు, వేదపాఠకులు, అఘోర, పురాణ, యితిహాస్య, ఆకర్షణ, వృధారత్వ, వేదశాస్త్ర, లక్షణ, శిక్షకల్ప, అలంకార, భేతాళమంత్ర, శిల్పిశాస్త్ర, అగ్నిస్తంభ, వైశ్యా, ఛందస్సు, కవిత్వ, సంగ్రామ, జలస్తంభ, దృష్టిస్తంభ, వేద, జ్యోతిష, శూరత్వ, నృత్యా, యోగశాస్త్ర, వాగ్బంధన, శాస్త్ర, వేషా, ధీరత్వ, తాళ, మదనశాస్త్ర, ఉచ్చాటన, అదృశ్య, గణిత, ముష్టియుద్ధ, అశ్వపరీక్ష, రసవాద, అనృత్య, సంజ్ఞా, లిఖిత, మోహన, నరపరీక్ష, బిల్వవాద, నృత్య, పరకాయ, గాంధర్వ, ఇంద్రజాల, భూపరీక్ష, కాలవాద, సంచన, ప్రవేశ, లీనతా, వీణ, వేణు, రత్నపరీక్ష, మృగపరీక్ష, ధాతువాద, దృశ్య, ఆత్మప్రవేశ, వేణు, గజపరీక్ష, వాగ్వాద—౭౨ మొత్తము.

కోళ్లన్నియు. [వానిని*] భక్షించిన తరువాత మీ చెట్టి దొడ్డజాతి ?"

అని పల్కగా యామహాలుదారుడు అసమాధానమును పొంది కోపము గలుగగా పోనుద్యమించుచుండ [వానిని*] మరల నానావిధముల సమాధానపరచి, రాజుగారు పిలువనంపించి, వానికి తగినట్లు బహువిధముల సత్కరించి, అధిక బహుమానములతోడ తాంబూలమును యిప్పించి పంపించినవా డాయెను.

అటుతరువాత మహాలుదారుడు తమ యజమానుసుండుస్థలమునకు పోయి, అదులశాహపాదుశాహ దగ్గరకు వెళ్లి, బహుకోపిష్టుడై తనతలమీది పాగను తీసి మెడకు వేసుకొని మనవి చేసుకొన్నది:

"పాదుశాహ సలామత్, ఇన్నాళ్ళకు ఈకాలమునకు పాదుశాహి మునిగినది. ముసల్మానుల క్రమమేమియు నిలుచుటలేదు. నాస్తికుడు మిక్కిలి అడావొడిగా నున్నాడు. ముసల్మానుల మానమును గణన సేయుటలేదు. హాజరకు పాదుశాహ సాహేబుగారు ఆనరపతిని నాశముచేసి కర్ణాటక దేశమునం దెల్లెడలను ఠాణ్యాము వేసి అమలు బందోబస్తుచేసినయెడల మానము దక్కును. లేకపోయిన లేశమాత్రమును దక్కదు. ఈమాటనుబట్టి తప్పక కర్ణాటకమునకు విజయము సేయుడు"

అని మనవిచేయగా పాదుశాహగారు మహాలదారుతో చెప్పినది:

"నే నన్నానో నరపతికి కుమారుడ ననిపించుకొని యున్నాను. వారి అహితమును చేయగూడదు. రాజుగా రన్నానో మాకు పెద్దలు. వారిని యెదిరించి నిలువకూడదు."

అని చెప్పగా ఆమహాలుదారునికి కోపము వచ్చి, పాదుశాహతో చెప్పక, [అతని అనుమతిని*] అడుగక, ముగ్గురు పాదుశాహుల దగ్గరకు వచ్చెను. ముగ్గురు పాదుశాహులును ఎవ్వరనగా:

జహాలనాపుర సింహాసనాధిపతి అఖబరు జులాయి పాదుశాహ. ౧ [దౌలతాబాదు సింహాసనాధిపతి

---

౧. మూలగ్రంథములో 'మూరుమంది పాదుశాహరు దారుయందరె' అను వాక్యమునకు తరువాత 'జహాలనాపుర తఖతు అఖబరు జులాయి పాదపాః యదుల్లా శాపాదపాహ సవాయి జగజంపసుగుణ కన్నడజాణ పాదశాహరు అను ఇద్దరే పేర్కొనబడిరి. అఖబరు జులాయిపాదుపాః జహాల్నాపురపు ప్రభువని ఇచ్చట స్పష్టముగ వ్రాయబడి యున్నది. ఈసుల్తానుపేరు రెండుమూడు విధములుగ వ్రాయబడియున్నది. ఒకచోట (L. R. Vol. 24. p. 149) 'అఖచరజలవుదిని పాదుశహా' అనియు, మరియొకచోట (Ibid. p. 162) 'అకబరు జలాదీను మొగలిపాదుశాహతఖ్తు జహాలనాపుర' అనియు, ఇంకొకచోట (Ibid. p. 172) 'అఖబరజలాయుదెను పాదశాహ' అనియు, వేరొకచోట (Ibid. p. 66) 'అఖచరజలదీను పాదుశాహ' 'మొగలుపాదుశాహ' అనియు వ్రాయబడియున్నది. ఈ భేదములు అల్పములు. ఇతనిపేరు 'అఖబరు జలాయిదీను పాదుశాహ' యనియు, అతడు మొగలుపాదుశాహ యనియు, అతని రాజ్యస్థానము జహాల్నాపురమనియు మనము నిశ్చయించవచ్చును. రెండవపాదుశాహపేరు యదుల్లా శాహపాదశాహ అని యుండుట పొరపాటు. యదులశాహపాదుశాహతో చెప్పక అతనిని అడుగక వచ్చిన మహాలుదారుడు, మరల నతనియొద్దకు పోవుట యసంగతము. ఇంతే కాదు. ముగ్గురు పాదుశాహులును ఆమహాలుదారుని ఈక్రింది విధమున అడిగిరి: 'నీనాదరు అల్లి యదులపాహనమహాల్ దారను. నీను నింమధణిగళిగె అర్జి మాడికొంబువదు బిట్టు నమ్మబళిగె బందదు పరమఆశ్చర్యతోరుత్తా యిధితు. నరపతిమాడిద అభిప్రాయ నింమ ధణిగళిగె హేళికొళ్ల దేలె నంమబళిగె, బందుహోగా యిత్తు. ఇదుయేను విచారవు?' అందుకు మహాల్ దారుడు ఇట్లు జవాబు చెప్పెను: "నానాదరె నంమధణిగళిగె హేళికొళ్లదదెలె బందవనల్లా." ఈప్రశ్నోత్తరముల వల్ల జహాల్నాపురములో కూడిన ముగ్గురు పాదుశాహులలో అదులశాహ పాదుశాహ యొక్కడు కాడని తెలియుచున్నది. ఈముగ్గురును ఈగ్రంథమున నె మఱియొక తావున

నిజాంశాహి [కుతుబ్‌పాదుశాహా తెలంగాణ్యపు పాదుశాహా ఇబ్రాహీం కుతుబుశాహాపాదుశాహా వీరు*] జహాల్నాపురమున పేష్వాపనిమిత్తము కలిసియుండిరి. రత్న ఖచితమైనట్టి వసంతమహలులోపల సభచేయుచు డెబ్బదిరెండు నియోగములు పదునెనిమిది కారఖానాలు,౧ పన్నెండు మహల్లు౨ విద్వజ్జనులు మొదలైనవారితో కూడి కూర్చుని యుండిరి.

ఈప్రకారము యాబదియారు చప్పన్న దేశముల 3 వారితోకూడ సదరుచేయుచు కూర్చునియుండు సమయమున ఒకప్రక్క వేశ్యలు నర్తన మాడుచుండిరి. [మరియొకప్రక్క*] గాయకులు గీతము పాడుచుండిరి. వైణికులు వీణలను వాయించుచుండిరి. యమనియమాది విద్యావంతులతో కూడి ముగ్గురు పాదుశాహులును కూర్చునియుండగా ఆసమయమునందు యదులశాహ పాదుశాహుని మహలుదారుడు పోయి ముగ్గురు పాదుశాహులకును నయవినయ పూర్వకముగ నెరగి సలాముచేసి తనకు అనుభవమైన పూర్వవృత్తాంతమును యావత్తున్ను సాంగోపాంగముగ రెండు చేతులను ముకుళించి చెప్పకొనెను. ఈముగ్గురు పాదుశాహులును మహలుదారుని మనవిని చిత్తమునకు దెచ్చి విచారించినది: "నీవన్నావో అల్లిఅదలుశాహుని మహలుదారుడవు. నీవు నీయజమానునితో మనవి చేసుకొనుటను మాని మాచెంతకు వచ్చినది పరమ ఆశ్చర్యముగ తోచుచున్నది. నరపతి సూచించిన అభిప్రాయమును మీయజమానులకు చెప్పుకొనక మాదగ్గరకు వచ్చినట్లుగా యున్నది. ఏమిసంగతి ఇది?" అని అడుగగా ఆమహలుదారుడు చెప్పుకొన్నది:

"నేను నాయజమానునితో చెప్పుకొనక వచ్చినవాడనుకాను," అని తాను యజమానునితో చెప్పుకొన్నది, [అతడు *] తనమనవిని చిత్తమునకు దెచ్చుకొనక, 'నేను రాజభూవరుని కుమారుడ ననిపించుకొనుచున్నాను. అతనిమీద చేయి యెత్తుటలేదు' అని పరిహరించగా "తరువాత, మీదగ్గరకు వచ్చినవాడనైతిని" అని చెప్పుకొన్నవాడాయెను.

ముగ్గురు పాదుశాహులును మహలుదారుని మాటను చిత్తమునకు తెచ్చుకొని తమలో తాము ఆలోచించుకొని, 'మంచిది. రాజభూవరునకు మాన మేమున్నదో' అని కోపించుకొని అతనిమీద కయ్యముచేసి, యంతవఱకు కర్ణాటకదేశము గలదో అంతవఱకు తాణ్యము వేయ

---

పేర్కొనబడియున్నారు. వారెవ్వరనగా నిజాంశాహ పాదుశాహ, ఇబరాహి[ం]కు[తుబు] శాహ, ఇమామన మల్‌కీపాదుశాహ(చూడు: L. R. 24, p. 154, 155). ప్రస్తుతము ఆఖబరనుబట్టే సరి యనుకొందము. అట్లయిన తక్కిన యిరువురును నిజాంశాహ, కుతుపుశాహులుగ నుండవలయును.

౧. తోషఖాన, దఫ్తర్‌ఖాన, షికారఖాన, కలబత్‌ఖాన, సెతాబ్‌ఖాన, సరాఫఖాన, బబర్జీఖాన, తాలీంఖాన, శరాబఖాన, షెమర్‌ఖాన, నగారఖాన, ఫీల్‌ఖాన, ఫరాష్‌ఖాన, జబీర్‌ఖాన, దివాన్‌ఖాన, ఆదమ్‌ఖాన, నజర్‌ఖాన, ముజరాఖాన.

౨. కోశమహాలు, గాడీమహాలు, దీవటీమహాలు, జకాయత్‌మహాలు, తట్టుమహాలు, దరోగిమహాలు, సెంచీమహాలు, పాలఖీమహాలు, ఇమారతీమహాలు, దబీరమహాలు, ఫాయిజ్‌మహాలు, జాసూదమహాలు.

3. ౫౬ దేశములు.

అంగ, కాళింగ, తెలుంగ, కొంగ, కేరళ, పంచాల, సింగాళ, కుంతళ, నేపాళ, సౌరాష్ట్ర, కిరాత, చేది, అంబా, వంగ, లాళ, బాగళ, చోళ, గౌళ, హూణ, హుమ్మూర, కాశ్మీర, సౌర, మాళవ, కురు, జినా, మ్లేచ్ఛా, మళయాళ, హయువా, సైంధవ, కొంకణ, కుమ్మ్రావతి, కలహోవతి, ముంగల, మగధ, మారుత, తురుష్క, శాండ్యల, మహాజినా, గాంధర్వ, శిరిగుత్తు, హిందవా, త్రిగర్తా, ఆర్యావర్తా, భోజ, మహాభోజ, అభటి, మహారాష్ట్ర, పార్వరా, ఖర్పరా, మధ్యరాష్ట్ర, ద్రావిడా, కర్ణాటకా.

ఈపట్టికలో ౫౨ దేశములే పేర్కొనబడినవి. అందులో కొన్నిటిపేర్లు కల్పింపబడినవి.

వలయును. శత్రువును శిక్షించి పాహజాయించి ౧ నష్టము కలిగించవలెనని సిద్ధము చేసుకొని ముగ్గురు పాదుశాహులును తమతమ అష్టప్రధానులను సేనానాయకులను దళవాయిలను కందాచారులను సర్వమైన డెబ్బదిరెండు వినియోగములవారిని పిలుపించి సైన్యము సిద్ధముచేసి శిబిరమున వెలుపల వేయించవలెనని ఉత్తరవు సేయగా ఆప్రకారము ముగ్గురు పాదుశాహుల సైన్యము డెబ్బదిరెండు వినియోగములవారితో సహా ప్రయాణమునకు సిద్ధమైన వివరము:

జహ[ల*]నాపురిసింహాసనాధిపతి అఖబర జలాలదీన్ మొగలపాదశాహయొక్క సైన్యములు: [అశ్వములు, తీరందాజులు, కరోలు బాలేకారులు, కొత్తల దేశీలు.]

౧౨,౦౦౦ ౨ కొత్తల ఉత్తమ అశ్వములు. ౨౧౦౦ ౩ కరోలు ప్యాదాలు ౫౦,౦౦౦ ౪ తీరందాజులు ౫,౦౦౦ ౫ బాలేకారులు, ఐదుమణువుల గుండుపట్టు ఫిరంగులు ౪,౦౦౦-రెండుమణుగులగుండుపట్టు ఫిరంగులు ౫,౦౦౦, మణుగుగుండుపట్టుఫిరంగులు ౬,౦౦౦, బాణకారులు ౨౫,౧౨౦, ఏనుగులు ౧౦,౦౦౦, ఒంటెలు ౨౦,౦౦౦, పాలకులు ౫౦౦౦౦, ౬ సుతరనాళికలు ౭,౪౮౦, గోలందాజవారు ౨౭౦, కొమ్ములు ౮౬౦, బండ్లు ౬౦,౦౦౦, ౭ కాల్బలము ౨౫,౦౦౦,౦౦౦, రేఖలాలు ౮౦౦౦, ౮ హాతరనాళికలు ౯,౬౫౦, జజాలు ౧౨,౯౬౦, తప్పెటలు ౯౪,౭౨౦.

వీరివలెనే దౌలతాబాదు పీఠాధిపతి నిజాంశాహ భైరిపాదశాహ సైన్యయుక్తుడాయెను. ౯ అక్లేం కుతుపుశాహపాదశాహయొక్క సైన్యమును ముస్తీదుఆయెను. గజ తురగ రథో[ష్ట్ర] కాల్బలముతో కూడిన ఆబల స్తోమమును ఆయిత్తపరచి [సామగ్రులను*] పంచియిచ్చి నరపతిమీద దండయాత్ర వెడలుటకు ముగ్గురు పాదశాహులును బైట తమతు శిబిరములదగ్గర ఝుండా పైకెత్తి సిద్ధపడినవారైరి.

రాజభూవరుని హేజీబు తిమ్మాజిభీమాజి జహల్నాపురములో మకాముచేసియుండెను. ముగ్గురుపాద

౧. 'గనీమాగె తంబీ పాహజాయిశి హరాము హొసగబేకెందు' అని మూలము. పాహజాయిసి అను మాటయొక్క అర్థము తేలలేదు.

౨. కొత్తల అశ్వములు: యుద్ధమున ఒక గుఱ్ఱము చచ్చినను ఇబ్బందిపడక వేరే గుఱ్ఱముపై నెక్కుటకు రౌతులు కూడ తీసుకొనిపోవు విడిగుఱ్ఱము. వీనికి "కో అస్ప" గుఱ్ఱములనియు పేరు గలదు.

౩. శిబిరము, తత్సంబంధమైన సామగ్రులను కాపాడుటకు నియమింపబడిన కాల్బలము.

౪. విలుకాండ్రు.

౫. బల్లెములవాండ్రు.

౬. ఒంటెల మూపుపై నుంచి కాల్చెడు చిన్న ఫిరంగులు.

౭. 'జనపాదగళు' అని మూలము.

౮. ఏనుగులమూపుమీదనిల్పి కాల్చెడు ఫిరంగులు.

౯. అఖబర జలదీనుపాదశాహుని సైన్యవివరమును వర్ణించిన తిమ్మాజి తక్కిన ఇద్దరి సైన్య వివరమును చెప్పకపోవుటకు కారణము కనుపడదు. ఇచ్చట గ్రంథపాత మున్నట్లు తోచుచున్నది.

౧౦. మూలములో ఈసందర్భమున కుతుపుశాహ పేరు లేదు. దానికి బదులు "అల్లియాదలశాహపాదశాహ సవాయిజగజంపసుగుణ కన్నడ జాణపాదశాహ" అని యున్నది, కాని యిది తప్పు: ఏలన, (చూడు: L. R. Vol. ౨౪, p. ౧౨౭) యుద్ధసన్నద్ధులై ముగ్గురు పాదుశాహులను రామరాజుమీదికి పోవుటకు అల్లి అదలుశాహును తనరాజ్యముగుండ త్రోవ యిమ్మని అడిగినట్లు వ్రాయబడియున్నది. కావున ముగ్గురుపాదుశాహులలో అదిలశాహ యొక్కడుగ నుండుట యసంభవము. మూడవవాడు కుతుపుశాహ యని ఇతరస్థానములయందు చెప్పబడియున్నది.

శాహాలసైన్యములు యుద్ధమునకు వెడలిన సమాచారమును తమయజమానుడకు రాజభూపరునకు చారునితో చెప్పిపంపించగా చారుడువచ్చి నరపతిగారికి భయభక్తితో ముకుళితకరకమలుడై హేజీబు పంపించిన విన్నపమును యిచ్చి తాను కొన్ని అభిప్రాయములును సాంగోపాంగముగ మనవిజేసుకొనెను.

నరపతిగారు విజయదశమినాడు మనోహరవృనాంతరమునందు సదరుచేసికొని సమస్తమైన వజీరులు అష్టప్రధానులు దళవాయీలు కందాచారమువారు మొదలుగా డెబ్బదిరెండు వినియోగములవారితో కూడ ఉండినట్టివారి వివరము:—

( ? సి ) పిడ్డిగి జంకణనాయకుడు, మడగమానూరు విరూపణ్ణనాయకుడు, ఇక్కేరి కృష్ణప్పనాయకుడు, సోదె రఘునాథనాయకుడు, చిత్రకల్లు సీనప్పనాయకుడు, ఛందవరపు భీమనాయకుడు, కోలాగు కేశినాయకుడు, సకరెపట్ణపు జక్కణ్ణనాయకుడు, ఆదవాని వెంకటపతినాయకుడు, సీర్యపు పద్మనాయకుడు, తళవార తింమణనాయకుడు, పెనుగొండె యల్లప్పనాయకుడు, బళ్లాపురపు యల్లినాయకుడు, శ్రీరంగపట్టణపు రామరాజు, బీదనూరు సోమశేఖరనాయకుడు, గుడికోట అచ్యుతనాయకుడు, బంకాపురపు యల్లప్పనాయకుడు, నంద్యాల సదాశివనాయకుడు, దేవనహళ్లి హనుమప్పనాయకుడు, తాటిపత్రి బిసలప్పనాయకుడు, గుత్తి తింమప్పనాయకుడు, కడప వెంకటపతి నాయకుడు.— ఈ మొదలైనవారిని పిలిచి నరపతి పాదశాహు మాటలాడినది:—

“ముసల్మాను పాదశాహులు నలుగురును౧కూడి యేకస్థులై తమతమ సైన్యములను కూర్చుకొని వచ్చి కర్ణాటకమును జయించు నిమిత్తమై మనమీద వచ్చుచున్నారు. మీరు మీమీ బలస్తోమముతో కూడ సమాధానముగ యింకను ఎక్కువ మనుష్యసమూహము గల బలమును చేర్చి౨ పరత్తునకైనను సాహసముచేసి శత్రువులను మొగముపై జోడిచి చలాయించి, బంటుతనమును నిలిపి శత్రువులకు శిక్ష కలుగునట్లు హజాయించి౩ తిరుగుముఖము చేసి, యశస్సును తీసుకొని రండు.”

అని అనేక విధముల వజీరుల కందరికిని మన్నెలకును ఉత్సాహము కలుగజేసి, అట్లే వారికి జమాదరఖాన నుంచి ఉచితమైన వస్త్రములును, జలతారు బుటేదారు జలదాహారి కిముజారఫీన౪ కుసితాలును దగలీలును ౫, నానావర్ణముల దినుసుల అతలసు ఫెజరెట్‌శాలువలును, జామాకానౌ౬ లాకిగులాబిసఫేదా౭ మొదలగు నానావర్ణముల శాలువలను, బందరు చీటీలును, శకలాతీ౯ బనాతులును, జమద్రా౧౦ బనాతులును, సులతాని బనాతులును౧౧, కలాసియాదదె......సఫేదదురంగి౧౨ బనాతు

౧. రామరాజు ‘అల్లీ అదిలషాహు తక్కినముగ్గురుపాదుశాహులతో నేకీభవించెనని తలచుటచేత ‘పాదుశాహులు నలుగురును’ అని చెప్పెను.

౨. సరియైన యాంధ్రీకరణము కాదు. “హెచ్చికె నరసంచణికె బలవన్ను” అని మూలము. ఈ మాటలకు అర్థము చక్కగ తెలియ లేదు. ఉజ్జాయింపు ఆంధ్రీకరణమని మనవి.

౩. ‘హజాయించు’ (హాహజాయించని కొన్ని చోట్ల) ఇది రూపాంతరము నందిన పారశీమాట. మొదటి స్వరూపము నూహించుటకు సాధ్యము కాకయున్నది. మొదటిస్వరూపము తెలియనిది అర్థము తెలియుట లేదు.

౪. ‘జలదాహారికిముజాఫీ’ — రూపము చెడిన పారశీమాటలు: అర్థము విచారణీయము.

౫. దూదిపెట్టి కుట్టినట్టి పైబట్ట—జమిలిదుప్పటి

౬. ఒకవిధమైన శాలువ.

౭. అర్థము తెలియుటలేదు.

౮. ఘూసర, గోజా, ధవళవర్ణములు.

౯. అరేబి కూలోని శకలాతనుచోట చేసినవి.

౧౦. అనుపచ్చ.

౧౧. ఒకదినుసు బనాతు.

౧౨. రెండు రంగుల.

లును, జమేదారులును,౧ జలతారు యిజారులును, జల తారుమందీలును,౨ తురుమా బందూలును౩ చక్క డోదినుసులు, పువ్వుల పచ్చడము, తలపాగయు, ముత్య పుతురాయి కలికితురాయి కంఠమాలలును రత్నఖచిత తటక మోహనమాలలును, నవరత్నముల పదకములును, వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య ములును పచ్చలు ముత్యములు పవడములు మున్నగు నవర త్నములు తాపిన కర్ణకుండలములు మొదలైన అలంకార విశేషములను, డాలు, ఖడ్గము, చక్రము, ధనుర్బాణ ములు, నాగము, భిండివాలము, తోమరము, గద, అంకు శము మొదలగు ముప్పదిరెండు [వగల *] ఆయుధము లను ధరించువారికి......ఆయుధములను యిచ్చి ధైర్య శౌర్య చాతుర్య మాధుర్య గాంభీర్య యుక్తము లగు [వాక్యములను*] బోధించి, సంవత్సరక్లిప్త మాసక్లిప్త ముల వారికి వారివారి యోగ్యతానుసారముగ వారివారి గృహకృత్యపరామరిక జేసియిచ్చి పంపించిన తరువాత, నరపతి తాను దుర్గాధ్యక్ష, ధనాధ్యక్ష, ధర్మాధ్యక్ష, సైన్యాధ్యక్ష, హేజిబ, పురోహిత, దైవజ్ఞు లనెడు ప్రకృతులు ఏడు ౪ఇట్టి సప్తాంగ లక్షణముల వారితో కూడి కూర్చుని వీరాధివీరుడై ఆలోచనచేసి శత్రువుల మీద వెడలవలెనని సిద్ధాంతము చేసెను.

తరువాత మూడవదివసమున చారులు నగరిసింహా సనముకడకు సమాచారమును తీసుకొని వచ్చినది: ముగ్గురు పాదశాహులును కూడి అల్లిఅదులశాహాపాదు శాహాకు చెప్పి పంపించిన వివరము: "మేము ముగ్గురము కూడి మా సైన్యములను కూర్చుకొని నరపతి దేశమగు కర్ణాటకమును జయించు నిమిత్తము తెరలిపోవుచు న్నాము—మీరు మీ సైన్యముతో కూడ యుద్ధమునకు వెడలవలయును. మేము మీకు స్వాధీనమైన రాష్ట్రము మీది మార్గమును బట్టి వచ్చుచున్నాము. మాకు మార్గ ము యియ్యవలయును. మేము మీరు కలసి పంతముపట్టి కర్ణాటక దేశమును జయించవలెను." అని చెప్పి పంపిం చగా, వచ్చిన హేజీబులకు అల్లిఅదలశాహా జవాబు యిచ్చినది:

"రాజభూవరునిమీద నేను ఎదిరించి చేయెత్త రాదు. కొమారుడ ననిపించుకొనుచున్నాను. సర్వవిధ ములను స్వామిద్రోహము సేయగూడదు" అని చెప్పి, వచ్చిన హేజీబులకు వారి యోగ్యతానుసారముగ వస్త్రా లంకార కటక కంఠాభరణములును, పదకము, తురాయి మొదలయిన [ఆభరణములయొక్కయు*] అశ్వగజాది [వాహనముల యొక్కయు*] బహుమానములతో కూడ అప్పన యొసగి పంపినవా డాయెను.

తరువాత రాజభూవరుని హరకార నాగోజి నారాయణుడు ముగ్గురు పాదుశాహులవద్దగ యుండెను. ముగ్గురు పాదుశాహులును అల్లిఅదలశాహాయొద్దకు తమ హేజీబును పంపిన సమాచారమును, అందుకు అదల శాహ ఒప్పుకొనక 'నరపతిపాదశాహామీద నేను ఎదిరించి చేయెత్తుటలేదు' [అని జవాబు*] చెప్పి పంపిన సమాచా రమును తన యజమానుడగు రాజభూవరునికడకు చెప్పి పంపెను. అట్లే అల్లీఅదలశాహునియొద్ద నుండిన నరపతివారి హేజీబు యిదే ప్రకారము చెప్పి పంపుట వల్ల రాజభూవరుడు బహుహర్షితు డాయెను. అటు తరువాత సేనాపతి బిసలప్ప నాయకునిచేత నరపతిపాద శాహా అల్లి అదులశాహునకు ఉత్తమ వస్త్రములు ముత్యా పుతురాయి కడకకంఠమాలలు ఐదు కొత్తల గుఱ్ఱముల జతలు యిచ్చి౫ బహుమానమును పంపగా అల్లి అదుల

౧. అర్థము విచారణీయము.

౨. తలపాగలు.

౩. నాభివద్ద బొత్తాసు వేసుకొను, పైన కప్పు కొను వస్త్రము.

౪. దుర్గాధ్యక్ష ధనాధ్యక్ష
ధర్మాధ్యక్ష శ్చమూపతిః,
దూతః పురోధో దైవజ్ఞః
సప్తప్రకృతయ స్స్మృతాః.

౫. 'ఆతనుమాడి' యని మూలము. దీనికి అర్థ ము లేదు.

శాహ వశాలుపడి పదరుచేసి హూర్చుని నరపతి పంపించి నట్టి బహుమానమును తీసుకొని దానికి బదులుగా గజ తురగవస్త్రాలంకార మణిమకుటములు నవరత్నఖచిత మైనట్టి నూతనమైన ఉత్తమ దుప్పటములు యిచ్చి తమ వకీలును[1] యిచ్చి పంపించెను.

ముగ్గురుపాదుశాహుల హేజీబులును అల్లి అదులశాహ [రాజభూవరుడు*]ను ఏకస్థులై రాజ్యము ఒకటి చేయుచున్నారని తమధణుల[2]కు సమాచారము పంపించగా దీనికి [ప్రతి*]వివేకధీమంతుడును పలుకుబడి గలవాడును సుబేదారుని[3] [ఒకనిని*] అల్లి అదలశాహు నియొద్దికి పంపించగా, ఆసుబేదారుడు వచ్చి అల్లి అదల శాహునికి బుద్ధిచెప్పినది: "నీవన్నను ముసల్మానపాద శాహవు. నీవు హూర్చుని నాస్తికుడగు హిందువుతో రాజ్యము కలుపుట (ఒకటి సేయుట) యుక్తము కాదు. దీనివల్ల నీకు పెద్దరికము రాబోవునది లేదు. మాటవాసియైనను కీర్తిరాదు. ఇంతవఱకు యేమైనను అయిపోయినది. ఇక మీదనైనను చక్కగా బుద్ధి తెచ్చుకొని ముగ్గురు పాదుశాహులతో కూడ ముఖ్యముగ కలసి, మీరు నలువురును కూడి యేకముఖులై రాజ్యమును వకటిచేసి హిందూనాస్తికుని దాక్షిణ్యమును (?) చూడక పొడిచి చలాయించి కర్ణాటకదేశము తాంణ్యముచేసి కీర్తి వచ్చునట్టిపని చేయుము. దీనివల్ల భూషణ రాగలదు. మామాటను వినక పోయిన పక్షమున, నీవు మణిగిపోయి దేశనాశనము కాగలదు. అటుమీద స్థళభ్రష్టుడ వైపోయిన తరువాత గౌరవము ఉండదు. ముందు ఆలోచనగల బుద్ధిశాలివి నీవు" అని యనేకవగల బుద్ధిచెప్పి, 'దానివల్ల నీవు దొడ్డ వాడ వగుదువు. నాల్గురాజ్యములకు పేరు వచ్చును. నీయొక్క బజావుర ఉండగలదు.'

[ఇట్లు*] అనేకవిధముల నయభయముల బుద్ధి చెప్పగా, అల్లి అదలశాహ [తలచినది*]: "ఇతనిమాట వినవలసినమాట. విరుద్ధమేకారణముచేత నాడ వలయును" [అని చింతించి*] ముగ్గురు పాదుశాహులకు సమయోచితముగ అనుసంధానమును పెట్టి వచ్చినవారితో సమాధానమును ఉత్తరము చెప్పి, రెండుగడల అనుసంధానము విడకుండ వచ్చినసుబేదారునికి చెప్పినది: "నేను కూడినక్షణమునను రాజభూవరుడు దొడ్డపాదుశా ఆయెను. (?)—అవశ్యము మారదృష్టి తెలిసి చక్కగ యీమాటను బట్టి జయించునట్టి కార్యము చేయునది." అని సుబేదారునికి చెప్పి అనుసంధానము పెట్టి అతనికి పెద్దరికమునకు తగిన బహుమానమును చేసి వస్త్రాలంకారముల నొసగి పంపినవాడాయెను. ఈ సుబేదారుడు ముగ్గురు పాదుశాహుల యొద్దికి వెళ్లి యావద్వర్తమానమును సాంగోపాంగముగ అల్లి అదులశాహుకు తెలియజెప్పి మందలించిన వర్తమానమును యావత్తు చెప్పినవా డాయెను.

ముగ్గురు పాదుశాహులును అల్లి అదులశాహుని దగ్గరకు సుబేదారుని పంపి అనుసంధానమును పెట్టి నడపుచున్నారని సమాచారము విద్యానగరమునకు వచ్చెను. ఈసమాచారమును సేనాపతి బిసలప్పనాయకుడు విని [రాజభూవరునితో*] మనవిచేసుకొనెను. తాబేదారులందరును రాజభూవరునికి అదే విధముగ విన్నపము జేసుకొన్నది:—

"మీ రన్నను దొడ్డపాదశాహులు. 'నవకోటి నారాయణ' యనిపించుకొని యున్నారు. అప్రతిపరాక్రములు మీరు. ఈసమయమునందు యీమాట విడువ రాదు. శత్రువులన్నను కూరులై ముందంజ వేసి వచ్చుటకు ఆరంభించుచున్నారు. ఊరకుండినట్లయిన దేశమునకు ఉపద్రవము కలిగించి ధూమధామలు హెచ్చు జేసి, రాష్ట్రమునంతయు నాశనముజేసి రైతులను పట్టుకొనిపోదురు. తరుణమునందు శత్రువులైనట్టివారిని భగ్నము సేయవలయును. ఈసమయమునందు ద్రవ్యము వెచ్చము సేయుటకు ముందు వెనుక చూడక వజీరులు ఉమ్రావులకును, గొప్ప గొప్ప యిండ్లవారికిని వారివారి విద్యమానము నెరిగి భూషణముల నిచ్చి సమస్తాన్యామును జమచే[యవలెను. *]" [అని*] ఉండిన సమగ్రసేమా

౧. 'వకీలు'—అనగా ప్రతినిధి అని యర్థము.

౨. యజమానులు.

౩. మండలాధికారి.

౪. ఈమాటకు సరియైన అర్థము తెలియదు.

మూలపు అష్టప్రధానులు, సేనాపతులు, దళవాయీలు మున్నగు ప్రముఖులు విన్నపముసేయగా నరపతి బహు హర్షితుడై అదేప్రకారము ఖజానాలోని రొఖము తెప్పించి పంచి యిచ్చి యావత్సామాజికులకు సిపాయీలకు తాంబూలము నిప్పించి, యుద్ధసామగ్రులను శిబిరమును బైట వేయించి, [శత్రువులను నిలుపగలరను*] విశ్వాసమునకు పాత్రులైన ఎలగోలుఫౌజుసంగాతలను కొన్నిటిని ముందుగ నంపి తన రాణివాసములోనికి పోయినవాడాయెను.

పెద్దభార్య సత్యభామ. ఆమెమహలులోనికి వచ్చి రత్నఖచితమైన మంచముమీద కూర్చుని౧ *** అష్టైశ్వర్యయుక్తుడై, అష్టభోగములను అనుభవించి నంతట, తక్కినభార్య, దేవచింతామణి, తిరువెంగళమ్మ, సుభద్ర, మిత్రవింద, జాంబవతి, రాధ, మోహిని, చామవర్ణి మొదలైన అరువదినల్గురు భార్యలయిండ్లకు వచ్చి, పెద్దభార్యకు యిచ్చినట్లే విశేషములను యిచ్చి, అనుపానము చేసి సర్వమైనవారికి బహుమానములను యిచ్చి, పుత్రమిత్రకళత్రములను సత్కరించి తమతల్లిగారు నివసించు చంద్రశాల మేడమీదికి పోయి పాదముల వ్రాలి బహువినయపూర్వకముగా నమస్కారమును జేసెను. తల్లిగారు పరమహర్షితులై ఆశీర్వాదమును చేసి నిండుగ౨ నవరత్నములను సువర్ణపుష్పములను నివాళించి దిగదుడిచి బ్రాహ్మణులకు ధర్మముచేసి పుత్రుని చేయి పట్టుకొని తనమహలులోనికి తీసుకొని వెళ్లి అనేక ప్రకారముల బహుమానమును చేసినవారైరి.

అటుపిమ్మట నరపతి తమతల్లిగారికి విన్నపము చేసినది: "ముగ్గురు పాదశాహులను కూడి నామీద తిరగబడి రాజకార్యమునకు ఆరంభించి కర్ణాటకదేశము నంతటిని స్వాధీనము చేసుకొనవలయునని నడచి వచ్చుచున్నారు. ఈదేశమన్నో ధర్మదేశము. [ఈ*] ధర్మసంస్థానము దేవబ్రాహ్మణులపాలికి వచ్చినది. దేవస్థానములను, పుణ్యక్షేత్రములను, విద్యావంతులను గలిగిన సింహాసనముమీద వారియిలాజు3 యేల నడువవలసియున్నది. దీనికి నీఅనుగ్రహమువల్లను కులదేవతల ప్రసాదమువల్లను బలమునకు ద్రవ్యనిక్షేపములకు, ఉండువారందరికి యెట్టిలోపమున్ను లేదు. సకలసైన్యయుక్తముగ నడచిపోయి శత్రువులను పొడిచి నాశనము చేయుచున్నాను. నాకు నేమి బుద్ధిచెప్పుచున్నావు?" అని తల్లిగారిని అనుజ్ఞ అడుగగా ఆమె బహుక్లేశితురాలై యుత్తరమిచ్చినది:

"నీవన్నో దొడ్డ నరపతి పాదుశాహువు. ఇప్పటికి తరతరములుగ యేకుపాదుశాహులు పట్టములు అయిపోయి ఇంకను వారు తమ తమ స్థళములలో మర్యాదయందున్నారు. కాలప్రతికూలము వారిదో నీదో తెలియదు. కాలగతివల్ల [శత్రువులు *] అధికఉపద్రవములను యిచ్చి నడచివచ్చుచున్నారు. మంచిది. ఋణానుబంధము. నీవన్నో బాలకుడవు. వారితో విరోధ మేల చేయవలయును? కాలానుకూలముగ దృష్టిని ద్రిప్పి తత్కాలానుగుణ్యముగ నడచి సంధి చేసికొనుట ఉత్తమముగ గన్పించుచున్నది."

అని హితము జెప్పగా రాజభూవరుడు మిక్కిలియును అసంతుష్టి జెంది "నేను దొడ్డ నరపతి పాదుశాహు ననిపించుకొని, 'అప్రతిపరాక్రమ' అనుబిరుదుచే పొగడించుకొనుచుండ, వారి గొప్పతనము౪ యేమున్నది. వారన్నను నాచేతికి లొంగియుండినవారు. నేనిచ్చిన దేశమును అనుభవించుచుండినవారు. అట్టివారిసంగడ అనుసంధానము నడపవలయునన్న, నామానమునకు లోటు

౧. ఇచ్చట కొంతభాగము తర్జుమా చేయక వదలివేసినాను: అందు రాజభూవరుడు తనపెద్దభార్యకొసగిన బహుమానములు వర్ణింపబడియున్నవి. చరిత్రాంశము లేశమైనను లేదు: పుష్పములు, ఫలములు, వస్త్రాభరణముల జాపితాలే అందు వర్ణింపబడినవి.

౨. "ఝుడితిరుఘడావు" అని మూలము.

3. 'యిలాజు'—వైద్యముచేయుట. ఈ సందర్భమున ఈయర్థము సరిపోదు.

౪. 'గుమాను'—సందేహము. ఈయర్థము ఇచ్చట సరిపోదు.

గాదా. జయించువఱకు యుద్ధము సేయవలయునన్న, శక్తికి లోపము లేదు. శత్రువులను పొడిచి చలాయించుచున్నాను."

అని తల్లికి విన్నపము జేసికొనగా, తల్లిగారు పరమహర్షితులై పుత్రునిచేయి పట్టుకొని, సమాధాన పఱచి, 'జయమగు గాక!' యని యనేకవిధముల దీవించి అప్పనకొని పిలిచి సింహాసనము మీద కూర్చుండబెట్టి కనకాభిషేకము జేసి, పుష్పవృష్టివలె కురియించి, "శత్రుపరాభవమగుగాక!" అని దీవించి, దేవతలకు ప్రార్థన జేసి, "జయించి రమ్మ" అని అప్పన యిచ్చి పంపించిన తరువాత రాజభూవరుడు సంగాతమహలులోనికి వచ్చి కొంచెము విశ్రమించుకొనవలయునని మంచముమీద పండుకొనియుండగా రాత్రి గాఢనిద్రాసమయమునందు కర్ణకుండలములలోని ముత్యములను ఎవ్వరో బలవంతముగ తీసుకొనుచుండినట్లు దుస్స్వప్నమును కనెను. ఇట్టి దుస్స్వప్నమును కనినపిమ్మట ఒడలు విరుచుకొని లేచి హరి నామస్మరణ చేసి, మనస్సున కలత జెంది మిక్కిలియును చింతించి, మరుసటి యుదయముననె వేదశాస్త్ర సంపన్నులగు బ్రాహ్మణులను పిలిపించి స్వప్నముకనినది చెప్పగా అందుకు ఆబ్రాహ్మణులు "స్వప్నము నాశనమైనది. దేవతలు దయచేసినారు. నీవు సమాధానముగ నుండు" మని యనేకప్రకారముల జెప్పి ఆశీర్వాదమును చేసినవారైరి. రాజుగారికి సమాధానము గాక, "ఇట్టి దుస్స్వప్నమును నేను ఎప్పుడును కనియుండలేదు. ఎప్పుడును దేవుడు నామీద కోపము జేసినవాడు కాడు. ఐశ్వర్యమునకు హాని వచ్చినది. భాగ్యలక్ష్మియు, కులదేవతయు నామీద గినిసిరి. దేవునిదయ దప్పిన పిమ్మట నాయత్నమేమున్నది? మంచిది ఋణానుబంధము. ధైర్యము విడువరాదు. ఎందాక ధైర్యలక్ష్మి యున్నదో అందాక ప్రయత్నము చేసెదను. అదృష్టమెట్లో అట్లగునట్లు తప్పదు. నా చింతవల్ల ఏమగును?"

అని చింతించుచు కూర్చునియుండగా సమస్త విద్వజ్జనులును సమాధానము చెప్పి, కాలగతిని చూచి ఆశీర్వాదము చేసి, "నీశత్రులకు అపజయ మగుగాక! నీవు జయమును పొంది 'ఛత్రపతి' అని యనిపించుకొని మార్కండేయుని యాయుస్సు గలవాడవై అనంతకాలము స్థిరపట్టముగ నుండవలె" నని రాజభూవరునికి సమాధానమును చెప్పినవారైరి. వచ్చిన బ్రాహ్మణులకు దాన ధర్మములు చేసి సువర్ణరత్నఖచితమైన అలంకారములును ఉదారమనోగతానుసారముగ బ్రాహ్మణులకు ధర్మములు యిచ్చి అనుజ్ఞ యిచ్చి పంపించి తరువాత తాను మంగళ స్నానము చేసి మరల బ్రాహ్మణులను పిలిపించి యేబదివేలరూపాయలను దానముచేసి తాను దండువెడలి పోవుటకు జోస్యులచే మంచి ముహూర్తమును చూపించి, అమృతసిద్ధియోగమునందు సమస్తమైన డెబ్బదిరెండు వినియోగములవారితో శిబిరము బైట వేయించి తాను పదునొకండుఘంటలకు సారంగమువలె పారుతెంచు 'రాజహంస' యనెడు గుఱ్ఱముమీద తన గృహమునుంచియు, విద్యానగరమునుంచియు ఉత్తర దిక్కునకు బయలువెడలి వచ్చి నవగజ జయభేరితో విడిసెను. కుడియెడమపక్షముల తమతమ సైన్యములతో అష్ట ప్రధానులు, దళవాయీలు, సేనాపతులు మొదలైన డెబ్బదిరెండు వినియోగములవారు సమస్తసైన్యమును కూర్చుకొని విడిసినవారైరి. అట్లే పదునెనిమిది కారుఖానలవారు, పంద్రెండు మహళ్లవారు వచ్చి విడిసిరి. ఇంకను "విద్యానగరములో రౌతులు నిలిచియుండక బయలువెడలి రండు; రాక నిలిచినయెడ నగరికి అపరాధము అచ్చుకొనవలయును." అని దండోరా వేసి తాకీదు పంపినకారణముచేత ప్రాణిమాత్రు లందఱు, 'రాజునకంటె మనజీవము హెచ్చా?' యని నిలిచియుండక బయటికి వచ్చిరి.

అటుపిమ్మట రాజు, అష్టప్రధానులు, పారుపత్యగాండ్రు, కుమాళ్లు, దళవాయి సదాశివనాయకుడు, జమేదారఖాన గోపాలయ్య, వీరిని పిలిచి, డెబ్బదిరెండు వినియోగములవారికి, వజీరులకు, ఉమ్రావులకు, పదాతులకు, దొడ్డదొడ్డ జమాతిదారులకు బహుమానము యిండని చెప్పి, అట్లే సమస్తసంస్థానికులకు, పాళెగాండ్రకు, మహళ్లవారికి, పాళెపట్టుపరగణాలు మొదలైనవారికి బహుమానములు యివ్వవలెనని దినుసువారి హుకుములను పంపిన వివరము :

| | | |
|---|---|---|
| ౯,౪౫,౮౨౧ | అచ్యుతరాయి ముద్ర | |
| ౧,౪౮,౬౯౭ | జడహొంన్ను | ,, |
| ౯౭,౮౬౫ | కొత్త | ,, |
| ౧౯,౭౬౬ | ఆనెగొంది | ,, |
| ౨౪,౮౨౦ | ఇక్కేరి | ,, |
| ౮౦,౬౭౦ | రాజ | ,, |
| ౯,౧౦,౪౮౦ | మెలు | ,, |
| ౧౯,౬౮౬ | గుత్తి | ,, |
| ౬౮,౮౪౭ | మదిర | ,, |
| ౬౭,౮౬౪ | హొసూరు | ,, |
| ౧౪,౮౬౯ | హనుమంత | ,, |
| ౯,౬౮౮ | అఘోర | ,, |
| ౭౮,౬౭౩ | వేలూరు | ,, |
| ౯౬,౩౩౩ | నాగరపణములు | |
| ౯౭,౮౬౭ | వడేవ | ,, |
| ౬౩,౪౩౨ | హొసకెరె | ,, |
| ౫౦,౬౪౦ | ఆదవాని | ,, |
| ౬౪,౪౮౦ | హొన్నటికేరి | ,, |
| ౬౦,౭౬౦ | రఘునాథ | ,, |
| ౯౦,౮౫౦ | కావేరి | ,, |
| ౧,౦౭,౬౪౦ | కృష్ణపాడి | ,, |
| ౭౦,౫౩౦ | పరశురామ | ,, |
| ౧,౦౭,౬౪౦ | శివరామ | ,, |
| ౬౦,౪౨౦ | రాముని | ,, |
| ౭,౦౦,౫౭౦ | శితారామ | ,, |
| ౧,౦౭,౬౪౦ | సాగర | ,, |
| ౨,౦౬,౪౦౦ | చంనంగిరాజు | ,, |
| ౮,౦౪,౭౬౬ | నోడె | ,, |
| ౬,౨౬,౮౮౦ | తింమానాయక | ,, |
| ౫,౨౬,౭౦౯ | శ్రీరంగ | ,, |
| ౬,౦౮,౩౨౦ | రామటంక్క ముద్ర | |
| ౬,౦౭,౪౭౦ | బ్రహ్మ | ,, |
| ౪,౨౨,౪౮,౮౮౦ | | |

ఈప్రకారము దినుసువారి హొన్నులను, సమస్తమైనవారిని పిలిచి బహుమానములు పంచియిచ్చి, సిపాయీల కందరికిని "కవచములు, ఆయుధములు, దుపాటులును ధరించి, తయారుగ నుండుడు" అని తాకీదుచేసినవారైరి. అటుతరువాత గణుతి యిచ్చుటకు, దివాణపు హర్కారాల నందజేని పిలిపించి, "రేపటిఉదయము గణుతికి రావలయును" అని సిపాయీలకు చెప్పిపంపినందున [వారు*] గణుతికి వచ్చినవివరము :

| | |
|---|---|
| ౬౫,౪౭,౮౨౧ | గుఱ్ఱములు |
| ౧౭,౮౪,౪౨౯ | ఒంటెలు |
| ౧౭,౮౬౭ | ఏనుగులు |
| ౯,౭౮,౩౬,౪౧౩ | మందుతూనికె [ప్రకారం*] మణువులు |
| ౯,౭౮,౬౫,౪౮,౨౧,౦౦,౦౦,౦౦౦ | గుండ్లు (ఇన్ని) |

ఈప్రకారముగ గణుతికి తీసుకొనివచ్చిన వివరము. ఇది గాక మంది గణుతియైన వివరము :

| | |
|---|---|
| ౧౨,౮౯,౪౮౦ | కాల్బలము |
| ౮౮,౪౬౦ | నేర్పరులు[౧] |
| ౮౪,[illegible]౬౮ | సీబెదడ్లెయవరు[౨] |
| ౪౫,౯౭౮ | కత్తులవారు |
| ౫౮,౯౬౫ | జంజాలవారు[౩] |
| ౪౮,౭౮౬ | గుండ్లు విసరువారు (అనగా ఫిరంగులను పేల్చువారు) |
| ౪౫,౬౮౭ | బూరగలు, తప్పెటలు |
| ౧౫,౦౦,౯౬౩ | మొత్తము జమ |

౧. హన్నరవానరు: సైన్యము పోవుటకు మంచి మార్గములను చూపువారు: "శాపర్స్" అను ప్రస్తుత సేనాసంగాతలకు సరిపోదురేమో.

౨. అర్థము తెలియదు.

౩. జంజా: చిన్న తిరుగుడుఫిరంగి—అనగా ఒక మేకునకు దగిలింపబడి సర్వదిశలను త్రిప్పుటకు అనుకూలమైన ఫిరంగి.

ఆధాణెవారు[1]:—

| | |
|---|---|
| ౪౭,౬౨౦ | యీగెకారరు(ఈతగాండ్రు?) |
| ౧౫,౯౪౦ | నీట మునుగువారు |
| ౪౭,౪౭౨ | అడ్డకత్తులవారు |
| ౯౭,౬౪౫ | బాణములవారు |
| ౯౮,౯౬౪ | హుయలుసవారు[2] |
| ౪౮,౯౭౬ | రాజపుత్రులు, బాంధవులు |
| ౬,౪౫౬ | తలటోపీలవారు[3] |
| ౪,౫౬౨ | సేనానాయకులు |
| ౭,౪౪,౯౪ | మొత్తము జమ |

వీరు గాక వగైరా[4]మంది వివరము:—

| | |
|---|---|
| ౭,౪౫౪ | పరంగులు |
| ౭,౪౫౪ | హరకారాలు |
| ౪,౫౯౫ | మహలుదారులు |
| ౬,౪౮౬ | పారావాండ్రు |
| ౬,౪౮౬ | వేగులవారు |
| ౪,౮౬౪ | శాస్త్రీకులు |
| ౫౮ | వంటెలవారు (?) |
| ౪,౬౮౬ | లాయములపై నధికారులు |
| ౪,౮౭౬ | ఒంటెలకు చాకరి చేయువారు |
| ౪,౬౮౭ | పురాణీకులు |
| ౪,౮౯౬ | గాయకులు |
| ౫,౭౯౮ | వేశ్యలు |
| ౪౭౮ | పీణెలవారు |

ఆధాణెవారు:—

| | |
|---|---|
| ౪,౭౭౬ | రాతిపనివారు |
| ౭,౯౬౬ | ఆయుధములనుశుద్ధము సేయువారు |
| ౭,౭౬౩ | శికలివారు |
| ౭,౭౬౩ | కంసాలివారు |
| ౪,౭౬౦ | వడ్రంగులు |
| ౨,౭౪౭ | పెద్దఫిరంగులు |
| ౭౬౪ | చిన్నఫిరంగులు |
| ౭౬౨ | రామజంగులు |
| ౯,౮౭౬ | హస్తినాళికలు |
| ౭,౪౫౪ | ఉష్ట్రినాళికలు |
| ౬,౫౪౭ | శేఖలాలు |
| ౪,౭౨౧ | గాడిదలవారు |
| ౪,౯౭౬ | డాలుమోతగాండ్రు |
| ౪,౫౬౭ | వార్తావహులు |
| ౭,౬౪౭ | బండారంవారు |
| ౭,౭౭౬ | ఊడ్చేవారు |
| ౪,౫౯౭ | హుక్కామోతగాండ్రు |
| ౬,౭౮౯ | కళ్లరు[6] |
| ౫,౪౭౬ | బోయలు |

అశ్లై వివరము:—

| | |
|---|---|
| ౬,౭౮౩ | రామబాణములు |
| ౯,౮౭,౬౫౬ | జంజాలు |
| ౯,౮౭,౬౪౭౨ | హుంతెసురుళి |
| ౯౮,౭౬,౫౪,౭౨౦ | ముతాబులు |
| ౬౫,౯౪,౮౨౧ | తారామండలములు |

౧. ఆధాణె: అనగా డాలు.

౨. హుయలుసవారు: అనుమాటకు అర్థము తెలియదు. 'హుయలు' అనగా యుద్ధము. 'సవారూ' అనుమాటలే "సవారరు" అనునేమో. అట్లయిన స్వారి చేయువారని యర్థము. వీనికి పొంతన మెట్లు కూర్చవలెనో తెలియకయున్నది.

3. వీరిజాతియు, యుద్ధరంగమున నియమింపబడిన వృత్తియును తెలియవు.

౪. 'వగైరా'అను ఫార్శీమాటకు 'మొదలైన' అని అర్థము: ఇచ్చట సంబంధించిన అని అర్థము చేసుకొనవలయును.

౫. అర్థము తెలియదు.

౬. ఈమాటకు దొంగ అని అర్థము. దొంగలను సైన్యమందేల చేర్చుకొనిరో? కళ్లసిపాయీలకు వీరికేమైన సంబంధ మున్నదో తెలియదు.

| | |
|---|---|
| ౨౬,౨౬౪ | భూచక్రములు |
| ౮,౨౭౧ | యుద్ధప్రబంధ్లు |
| ౨,౬౭౪ | ఈటెమోతగాండ్రు |
| ౮,౪౯౨ | ఫిరవానులు |
| ౮,౫౨౯ | భట్లులు |
| ౨,౨౨౬ | కంచరవాండ్రు |
| ౨౬,౨౭౧ | ఆయగాండ్రుమొదలైనవారు |

ఈప్రకారము గణుతికి తీసుకొనిన తరువాత, తనయొద్దనున్న యేనుగులను తోలి తెప్పించి కైదువులను కవచములను తొడుగుడని ఉత్తరవు దయచేయగా ఏనుగులను తోలితెచ్చిన వివరము :

వీరఅర్జున, గోకులరాయ, ఉత్తమప్రకాశ, గుమ్మతరాయ, జగజ్జ్యోతి, మాధవరాయ, కుమారరాయ, తారకబ్రహ్మ, అమృతరాయ, వేదమూర్తి, గోవిందరాయ, విరూపాక్ష, భుజబలరాయ, భర్జల, అమృతరావు, దేవేంద్ర, క్షీరాపతి, సాలంకి, మన్మథ, చతుష్ట, సాలగ్రాము, జ్యోతిప్రకాశ, ప్రహ్లాద, లంకుత, నవకోటినారాయణ, దుర్జన, క్షేత్రపాల, లక్ష్మీనారాయణ, మధురారాయ, రామపతి, తేజోనిధి, చన్నిగరాయ, వీరశూల, వజ్రమణి, మునీశ్వర, జరత్కార, విక్రమరాయ, ద్రోణాచార్య, రోదనంత, కల్పవృక్ష, సూర్యప్రకాశ, గోవిందరాజ, మహారాజ, అన్నకోటి, కుంభకోణ, శేషార్జున, త్రిశూల, ఐరావత, భేతాళ, అనంతరామ, శ్రీరంగధర, కామహార, యమునా, అశ్వత్థా [మ*] మనోహర, పుండరీక, సార్వభౌమ, మత్తకేసరి, కణమల్ల, ఎగలెచన్నిగ, మన్మథరాయ, బలభద్ర, ముక్తాఫల, జతారామ, రిక్షపాలిక, శీతామూర్తి, శార్దూల, జోకుమార, హనుమంత, బలిభయ, దామోదర, దుర్జన, సురుతెంప, ప్రళయకాల, దివాకర, రక్షపాంచ, కురుపంచ, రిక్షపతి, గంభీర, కనకజోతి, సుదామ, విక్రమరాయ, నిజగుణ, కేశవ, శ్రవణ, ద్వారకరాయ, గోవిందమూర్తి, నీలకంఠ, బైలుపులి, శార్దూల, రంగనాయక, సలిధర, కృష్ణమూర్తి, దొంగలజోడు, రామాయణ, రతి, శ్రీగణేశ, అచ్యుతరాయ, వైరాగ్య, క్షమాపతి, నరసింహ, మహేశ్వర, దశరథ, కస్తూరిభోగ, తేజోనిధి, చవనపతి, ఉక్కుచెండు, బలవంత, వైకుంఠ, రామబాణ, భట్టి, విక్రమరాయ, కల్పవృక్ష, కార్తికరాయ, జగన్నాథ, ద్వారక, లక్షణ, కృష్ణరాయ, నాగనాథ, కాళిరాజ, ప్రకార, కృపాచార్య, గోవర్ధన, లక్ష్మీపతి, శివరాయ, చింతామణి, భైరవ, చోరతా, పేరులేని ఏనుగులు ౧౫౨, ప్రహ్లాద, పంచకేశ, ముత్యపుచెండు, కుంతీరాజు, భీష్మాచార్య, సూర్యకాంతి, ఏకదంత, గళిరామ, గోపాలమూర్తి, గౌరీపతి, శేషశయన, భాగీరథి.—300 మొత్తము.

ఇదిగాక ఇతర వివరము :—

| | |
|---|---|
| ౮,౪౨౬ | విద్వాంసులు |
| ౫,౨౪౨ | కవులు |
| ౮౬౫ | వీణెలవారు |
| ౫౨౯ | ఖడ్డితాళమువారు |
| ౮౨౯ | తాళమువాయించువారు |
| ౩,౨౩౬ | కమ్మరవారు |
| ౩,౨౨౫ | స్వర్ణకారులు |

[సశేషము]

# అశ్రుమాల

కవిరాజహంస, బాలాంత్రపు వేంకటరావుగారు

జీవమణిమూల్యసిద్ధాంతులార!
నిఖిలప్రసవమూల్య నిర్ణేతలార!
అశ్రుబిందువుమూల్య మది యెంతగలదొ
గణియించి గణియించి కనిపట్టఁగలరె?—

కలికికుత్తుకనిండఁ గై సేయనిచ్చి
వెలఁదియెడందపై విశ్రాంతియిచ్చి
యారాధనమునకై యవసరం బిచ్చి
యనుఁగుఁజూపులలోన నాశ్రయం బిచ్చి
మఱచిపోదునె యట్టి మౌక్తికమాల!
మఱచిపోదునె యట్టి మాణిక్యమాల!
మఱచిపోదునె యట్టి మల్లికామాల!
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల?—

మూల్యంబునకు నేని, ముచ్చటకేని,
యేయక్కఱకు నేని, యెరవుగనేని,
యితరుల కెన్నఁడు నీరానిదాని,
ననిమిషులకు నైన నందనిదాని
శోకామృతాబ్ధిలోఁ జూచినదాని,
విరహామృతాబ్ధిలో విలిచినదానిఁ,
ప్రణయామృతాబ్ధిలోఁ బడసినదాని
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల!—

మనసుతోఁ దన కెంత మర్త్యత్వమున్నఁ
దలఁపుతోఁ దన కెంత దైవత్వమున్న
నవ్యక్తభావామృతాబ్ధినే పుట్టి
సువ్యక్తమై యది చూపులఁ దోఁచి
కంటితారల నిట్టె కరఁగించుచుండఁ
గన్నులఁ జిత్రముల్ గల్పించుచుండఁ
గనురెప్పఁగోవమై కాన్పించుచుండ
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల!—

మలినమైయున్న నామానసంబునకుఁ
బరిశుద్ధిఁ జేకూర్చి, భద్రంబుఁ గూర్చి,
సంశుద్ధబిందు ప్రసన్నరూపమునఁ
గమనీయమాలికగాఁ గానవచ్చి
కోరికచుక్కల కోతలువిచ్చి
కోమలకాంతుల గుణము లందించి
నాకంటితోడ మంతనమాడుదాని
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల!—

అది హృదయాకాశహైమతారకము,
అది భావసంధానితాశ్వాససురభి,
అది యంతరంగచిత్రాంశుబింబంబు,
అది మానససుధార్ణవాంతరహంస,
అది పాంచభౌతికంబైన చిత్రంబు,
అది ప్రేమరాజ్యరహస్యసూత్రంబు,
అది విశ్వమయలీల, యది నిత్యలీల,
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల!—

గ్రహచారవాదులు కంఠోక్తిగాఁగ
నుదుటి యక్షరమాల నూఱేఁడు లండ్రు;
సహచారవాదులు చతురోక్తిగాఁగ
నయనాశ్రుమాల జన్మశతంబు లండ్రు;
నిత్యప్రణయతత్త్వనియతిఁ బోనాడి
యెవ్వ రేగతి గణియింప నాకేమి?
యూహ కందినదాఁక యుగములదాఁక
మఱచిపోదునె యట్టి మహితాశ్రుమాల!—

# కడపటిపల్లవులు – కాలనిర్ణయసమస్య

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు



దక్షిణహిందూదేశచారిత్రమున పల్లవరాజపరిపాలనము బహుధా ప్రసిద్ధమయినది. భక్తిప్రధానమయిన శైవమతము వర్ధిల్లిన దీ పల్లవులకాలమున. జైన, బౌద్ధమతములకు జీవశక్తి తగ్గి యవి దేశమున కుంటువడుటచేత వానిస్థానమును వైదికబ్రాహ్మణమత మాక్రమించుకొని పెంపొందినది ఈపల్లవుల యాదర, పోషణములవలన. అశ్వమేధము మొదలయిన యజ్ఞయాగాదులను గావించి హిందూమతమునకు దోహద మొసంగినవారు పల్లవులు. పండితప్రకాండులకు ఆశ్రయ పోషణముల నొసంగి సంస్కృతవిద్యకు ప్రోత్సాహ మిచ్చినవారు పల్లవులు. దక్షిణ హిందూదేశమున దేవాలయ, శిలాహర్మ్యవాస్తువున కాలంబనమై నిలిచి దానిని వర్ధిల్లజేసినవారు పల్లవులు. సంస్కృతసాహిత్యమే కాక సంగీత చిత్రలేఖన కళలుకూడ పల్లవులకాలమున విజయశంఖము నొత్తినవి. కాంచీపుర కైలాసనాథాలయమున పల్లవులకాలపు ఆలేఖ్యములు నిటీవలనే కనిపట్టి డుబ్రాయిల్ దొరగారు పల్లవచిత్రకళాప్రశస్తిని వినిపించిరి. కుడిమియామలై శాసనము గానసాహిత్యమున పల్లవులకుఁ గల వైదుష్యమునకు రూపు నొసంగినది. పల్లవకళాసౌందర్యమును శిలారూపమున కరగబోసిన మనోహరాకృతులు మహాబలిపురమునందలిధర్మరాజాదినామాంకితములయిన శిలావిద్ధరథములు. వేంగిదేశమును బరిపాలించిన విష్ణుకుండివంశజులవలననుండియే శిలలను మలిచి, యాలయములను, హర్మ్యములను నిర్మించు కళను పల్లవులు నేర్చికొనిరని డుబ్రాయిల్ దొరగారి మతము. ఇది సుప్రమాణప్రతిష్ఠితము. ఇట్లగుట దాక్షిణాత్యుల కీకళను పల్లవరాజతరంగిణీద్వారమున అందించిన విఖ్యాతి యాంధ్రులదే కదా! దాక్షిణాత్యసంస్కృతి, శిల్పములకు పునాదులు వైచిన తమపూర్వులాంధ్రులు వదలిపెట్టిన కొస నందికొని ఆర్యనాగరకతకు పందిళ్లు వైచినవారు పల్లవులు.

ఇంతటి సుప్రసిద్ధమయిన పల్లవవంశమందలి వేఱువేఱు ప్రభువుల పరిపాలనకాలము ఇంకను చరిత్రకారులకు చిక్కు విడని సమస్యగనే యుండిపోయినది. పల్లవరాజ రాజకీయచారిత్రమును గుఱించిన గ్రంథములు, వ్యాసములు పెక్కులు వచ్చినను, ఎందఱు రచయితలు గలరో కాలనిర్ణయము విషయమున నన్ని సిద్ధాంతములు కల వన్న నతిశయోక్తి కాదు.[1]

1. అసమగ్రముగ నున్న సామగ్రివలన మన మింకను చరిత్రరచనమున తప్పటడుగులు వేయుచు, తప్పులు దిద్దుకొనుచు యాత్ర సాగించుచున్నాము. తప్పులు చేసినందుకు చింతపడ నక్కఱలేదు; తప్పులు దిద్దినందుల

పల్లవకాల నిర్ణయము విషయమున చేసిన పరిశోధనకు ఫలముగ దేలిన విషయములను తెలియపఱుచుట ఈవ్యాసము నుద్దేశము. అంతిమపల్లవ కాలనిర్ణయసమస్యాపరిష్కారమున కిదియొక ప్రయత్నము.

పల్లవులు మొదట ఆంధ్రరాజు లనబడు సాతవాహనులకు సామంతులుగను, సైన్యాధిపతులుగను ఉండి పేరు ప్రాముఖ్యములను బడసినవారు. ఆంధ్రసామ్రాజ్యము క్రీస్తుశకము మూడవశతాబ్దిని మఱిగిపోయిన తరువాత ఈపల్లవసామంతులు స్వతంత్రులయి తమకు చేపడిన దేశమును బరిపాలించిరి. ఈవిధమున ఆంధ్రదేశమునందలి కృష్ణానదీ దక్షిణతీరము మొదలు కాంచీపురమునకింకను దక్షిణమున గల కొంతదేశమువఱకు పల్లవు లధిపతులయి యందలిప్రజలభాగ్యనౌకకు కర్ణధారు లయిరి. వీరు తమపరిపాలనకాలము నిరుగుపొరుగులరాజవంశములతోడి సంగ్రామములతో నెంతబందచేసినను, కళాసంస్కృతులవిషయమున వారు తీసికొనిన శ్రద్ధకు, నభిమానమునకు శతాబ్దులను గడచని యిప్పటికి దమసౌందర్యమును నిలుపుకొన్ని తమకు రూప మిచ్చిన కళాపోషకుల ప్రశస్తిని గానముచేయు దేవాలయాదికృతులే తార్కాణములు.

దక్షిణహిందూదేశమును పాలించిన యీపల్లవప్రభువులను - వారియనుస్యూతచారిత్రమును, పరస్పర బాంధవ్యమును ఇంకను దెలియరానికారణమున వారిశాసనముల నూతగా గొని – చరిత్రకారులు నాలుగువిభాగములుచేసి పేర్కొనుచుందురు: ఎట్లన—

౧. ప్రాకృతశాసనముల పల్లవులు. వీరు పల్లవవంశమున మొదట దెలియవచ్చిన రాజులు. వీరు తమశాసనములందు ప్రాకృతభాష నుపయోగించుటవలన చరిత్రకారులు వీరి నాపేర పేర్కొనుచుందురు. గుప్తవంశమునందలి సముద్రగుప్తుని దండయాత్రతో నీపల్లవులపరిపాలన మంతరించినదని చరిత్రకారుల మతము.

౨. సంస్కృతశాసనముల పల్లవులు. పూర్వోక్తప్రభువులకు దరువాత రాజ్య మేలినవారు. వీరు తమశాసనములయం దుపయోగించినభాష సంస్కృతము. కావుననే వీరికీపేరు. ఈవిభాగమునకు కడపటి హద్దు క్రీస్తుశక మాఱవశతాబ్ది.

౩. మహాపల్లవులు. వీరు ఏడవ శతాబ్ద్యాదినుండి పరిపాలనము నెఱపినవారు. వీరు గొప్ప దేవాలయములను నిర్మించిరి. కళలను పోషించిరి. సంస్కృతవిద్యావల్లరి వీరికాలమున మాఱాకు తొడిగినది. వీరికాలమున దేశమునందు మతవిషయకముగను, విద్యావిషయకముగను గొప్ప యభివృద్ధి చూపట్టినది. దేవాలయవాస్తువు వీరి కాలమున

---

కుబ్బి తబ్బిబ్బు కా నక్కఱలేదు. చరిత్రరచయితలు పూజాతత్పరులు. అతిసౌమ్యమును, వినమ్రము నగు భావముతో, నిష్కపటమయిన హృదయముతో ధర్మనిర్వహణమునకు గడంగవలసిన కాల మిది.

పెక్కురీతులతో గొప్ప పరిణామమును గాంచుటచేత తచ్చారిత్రమున పల్లవ సంప్రదాయమను నొకవిశిష్టనామాంకితమైన యధ్యాయము నేర్పఱుచుకొనెను.

౪. కడపటి పల్లవులు. వీరు మహాపల్లవుల యనంతరమున దేశసౌభాగ్యమును సరిదిద్దినవారు. మొట్టమొదటినుండి పల్లవులకు రాజధానిగ నుండిన కాంచీపురము ఈ కడపటిపల్లవుల యనంతరము చోళులకు వశమయినది. పల్లవరాజ్యసౌధము భగ్నమయినది. రాజకీయరంగమున పల్లవుల ప్రభ యడగిపోయినది; చోళులు రాజకీయముగ ప్రాముఖ్యము గడించిరి. అంతటినుండి దక్షిణాదిని చోళులదే ప్రధానపతాక.

పై నాలుగువిభాగములందు జెప్పబడిన పల్లవులకు పరస్పరము గల సంబంధ మెట్టిదనువిషయము ఇంకను వివాదమూలకముగనే యున్నది. ఎడతెంపులు లేని సూత్రవృత్తిని, ఈ చతుర్విభాగవిదితులయిన పల్లవవంశజులకు గల బంధుసరణి, అన్వయక్రమము సునిశ్చితము కాలేదు. మొదటి రెండు విభాగములకు గల సంబంధమును, మధ్య రెండు విభాగములకు గలసంబంధమును బయటికి దీయుటకు చరిత్రకారు లింకను శాసనములు త్రవ్వుచునే యున్నారు. మొదటి రెండు విభాగములయందలి పల్లవులచారిత్రము భారతీపాఠకులకు పరితపూర్వము.

మహాపల్లవులలో మొదట తెలియవచ్చినవాడు సింహవిష్ణువు. సంస్కృతశాసనములవలన దెలియవచ్చిన కడపటి ప్రభువునకు నితనికి గల సంబంధ మింకను సునిరూఢము కాని సిద్ధాంతములయందే చిక్కుకొనియున్నది. కాంచీపురపల్లవరాజ్యము చేపడకపూర్వ మీతడు ఆంధ్రదేశమున కృష్ణానదీతీరమున నుండెనని కొందఱు చరిత్రకారు లందురు. సింహవిష్ణువు కుమారుడు మహేంద్రవర్మ. దక్షిణాదిని వాస్తుశిల్పకళలను పందిరికి ప్రాకించిన దీతడు. ఆంధ్రదేశమున కృష్ణానదీతీరమున నుండినకాలమున ఉండవల్లి శిలాగుహాలయములను దొలిపించిన విష్ణుకుండివంశజులవలననుండి యభిజ్ఞానమును బడసి, కాంచీపురమహారాజ్యమున కధిపతిగ వెళ్లిన పిదప శిలాగుహాలయనిర్మాణకళ నచ్చట నాటి ప్రోదిచేసెనని డుబ్రొయిల్ దొరయు, ఇంకను మఱికొందఱు కళావిదులయు నభిప్రాయము. ఈవంశమునందలి మహేంద్రవర్మనామాంకితులలో నీతడు మొదటివాడగుట నీతనిని మొదటి మహేంద్రవర్మ యందురు. ఇతని కుమారుడు (మొదటి) నరసింహవర్మ. ఇతని కొడుకు (రెండవ)మహేంద్రవర్మ. (మొదటి) పరమేశ్వరవర్మ అతని తనయుడు; (రెండవ) నరసింహవర్మ పౌత్రుడు; (రెండవ) నరసింహవర్మకు (రెండవ) పరమేశ్వరవర్మ జనించెను. ఇతనికి కొడుకులు కలరో లేరో కాని యీతని కాలముననే మహాపల్లవుల రాజ్యమునకు విచ్ఛిత్తి సంభవించినది.

వీ రందఱు గలసి మొత్తముమీద వంద సంవత్సరములకు పైగ పరిపాలించిరి. ఈప్రభువులలో నొక్కొక్కరి పరిపాలనకాలము సునిశ్చితముగ నిర్ణయము కాకపోయినను సమకాలీనరాజవంశచారిత్రము ననుసరించి వీరు క్రీస్తుశక మేడవశతాబ్ది ఆదిని కాంచీపురపల్లవ రాజ్యము నాక్రమించుకొని రనియు, ఎనిమిదవ శతాబ్ది ప్రథమభాగమువఱకు పాలించి రనియు స్థూలముగ చరిత్రకారులు నిర్ణయించిరి. వీరి యనంతరము పల్లవరాజ్యరమ సింహవిష్ణువు సోదరుడయిన భీమవర్మసంతతివారిని వరించినది. మహాపల్లవవంశమునందలి (రెండవ) పరమేశ్వరవర్మయనంతరమున కాంచీపురపల్లవ మకుటమును దాల్చినవాడు హిరణ్యవర్మ కుమారుడు (రెండవ)నందివర్మ. ఇతడు పల్లవమల్ల బిరుదాంచితుడు. ఇతనిని నందివర్మపల్లవమల్లు డనియు బేర్కొనుట కలదు. ఇతనినుండి కాంచీపురరాజ్యమును పరిపాలించినవారే 'కడపటిపల్లవ' నామాంకితు లగుచున్నారు.

కడపటి పల్లవుల వంశావతారక్రమ మిది. నందివర్మ పల్లవమల్లునికి దంతివర్మ జనించెను. ఇతనికుమారుడు (మూడవ)నందివర్మ. ఇతనియనంతర మితనితనయుడు నృపతుంగుడు రాజ్యమునకు వచ్చెను. తరువాత దెలియవచ్చు పల్లవరాజులు అపరాజితవర్మ, కంపవర్మలు. ఈకడపటి యిరువురకు పరస్పరము గల సంబంధమును, వీరుభయులకును నృపతుంగాదులకును గలసంబంధమును చరిత్రకారులకింకను వాదకారణములుగనే యున్నవి. అపరాజితుడు నృపతుంగునికుమారు డని కొందఱు, కా డని కొందఱు, నృపతుంగునికే అపరాజితు డని నామాంతర మని కొందఱు, కంపవర్మ మూడవనందివర్మకుమారు డని, అపరాజితుని సోదరు డని కొందఱు — చరిత్రపరిశోధకమండలి యిట్లు భిన్నాభిప్రాయమధ్యస్థమై యున్నది. కడపటి పల్లవులశాసనములు చాల దొరకినవి. అందు వారి రాజ్యపాలనవత్సరములే కాని శకవర్షములు కానరావు. కావుననే యీ పల్లవప్రభువుల కాలనిర్ణయ మొకసమస్య యైనది. పల్లవవంశచారిత్రమును రచియించినవా రందఱు అపరాజితుని కడపటిపల్లవులలో గడపటివానిగ జెప్పుదురు; అతనితోనే కడపటి పల్లవరాజ్య మస్తమించిన దందురు.

కడపటిపల్లవులకు సమకాలీనవంశము లయిదు కలవు: అవి యేవన—

౧. పశ్చిమగాంగవంశజులు: వీరు మైసూరుమండలమునందలి 'గాంగవాడి' నేలినవారు; కోలాలపురపరమేశ్వరుల మని చెప్పుకొన్నవారు. వేంగిచాళుక్యులవలెనే అవిచ్ఛిన్నముగ ఆఱేడుశతాబ్దులు రాజ్యముచేసినవారు. కళింగము నేలిన గాంగులకు తూర్పుగాంగు లనియు, వీరికి పశ్చిమగాంగు లనియు చరిత్రకారులు పెట్టినపేరు. పశ్చిమగాంగులలో కడపటి పల్లవులకు సమకాలీను లయిన భూపతుల వంశావతారక్రమ మిది:

- నవకాము డను (మొదటి) శివమారుడు
  - ×
    - శ్రీ పురుష ముత్తరసు
      - (రెండవ) శివమారుడు (సైగొట్టనామాంచితుడు)
        - మారసింహుడు
        - (మొదటి) పృథివీపతి
          - (రెండవ) మారసింహుడు
            - (రెండవ) పృథివీపతి హస్తిమల్లుడు
      - దుగ్గమార ఎఱెయప్ప
      - రణవిక్రమ విజయాదిత్యుడు
        - సత్యవాక్య కొంగణివర్మ ధర్మమహాధిరాజ పరమేశ్వర (మొదటి) రాజమల్లుడు
          - నీతిమార్గ కొంగణివర్మ ధర్మమహాధిరాజ పరమేశ్వర (మొదటి) ఎఱెగంగ దేవుడు
            - సత్యవాక్య కొంగణివర్మ ధర్మమహాధిరాజ పరమేశ్వర (రెండవ) రాజమల్లుడు
            - గుణదుత్తరంగ (మొదటి) బూతుగుడు

౨. రాష్ట్రకూటులు : రాష్ట్రకూట రాజ్యమును స్థాపించిన ఇంద్రరాజతనయుడగు దంతిదుర్గభూపతి మొదట బాదామిచాళుక్యులకు సామంతుడుగను, సైన్యాధిపతిగను ఉండి ఆ రాజ్యము క్షీణదశకు వచ్చుచుండిన కాలమున చాళుక్య సామంతశృంఖలములను ఛేదించుకొని స్వతంత్ర రాష్ట్రకూటరాజ్యమును నెలకొల్పెను. మాల్యఖేట మీరాష్ట్రకూటులకు రాజధాని. కడపటిపల్లవులకు సమకాలికులయిన రాష్ట్రకూటభూపాలురవంశవృక్ష మిది.

- ఇంద్రుడు
  - దంతిదుర్గుడు
- (మొదటి) కృష్ణుడు (అకాలవర్ష శుభతుంగ బిరుదాంచితుడు)
  - జగత్తుంగ, ప్రభూతవర్ష (రెండవ) గోవిందుడు
  - నిరుపమ ధారావర్ష నామాంచితుడు ధ్రువుడు
    - రణావలోక కంబయ (లేక) స్తంభుడు
    - జగత్తుంగ, ప్రభూతవర్ష (మూడవ) గోవిందుడు
      - అకాలవర్ష (రెండవ) కృష్ణుడు

౩. నొళంబపల్లవులు: వీరు నొళంబవాడి, యనగా మైసూరు సంస్థానమునందలి వాయవ్య దేశమును బరిపాలించినవారు. పశ్చిమగాంగ వంశజులకును, వీరికిని సంబంధబాంధవ్యములు కలవు. వీరు మొదట పశ్చిమగాంగులకు సామంతులుగ నుండి పిదప స్వతంత్రులయి శత్రువులయినవారు. ఈక్రిందివారు కడపటి పల్లవులకు సమకాలికులు.




౪. బాణవంశజులు: కడపటి పల్లవుల కాలమున వీరు వారికి సామంతులయి, చిత్తూరుజిల్లా గుడిమల్లం, కాళహస్తి ప్రాంతములను బాలించుచుండిరి. గుడిమల్లం తామ్రశాసనము ననుసరించి వీరి వంశవృక్షమిట్లు తెలియవచ్చుచున్నది.




౫. పాండ్యులు: మొదటిపాండ్యుల వంశావతారక్రమ మింకను చక్కగ నిరూపణము కాలేదు. ఇటీవలనే ప్రొఫెసరు కే. యే. నీలకంఠశాస్త్రిగారు 'పాండ్యరాజ్య' మనుపేర నొకగ్రంథము వ్రాసిరి. వారే 'ఎర్లీ పాండ్యన్ క్రానాలజీ' అనుపేర మొదటి పాండ్యరాజుల కాలనిర్ణయమును గుఱించి 'జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ'కి ఒకవ్యాసము వ్రాసియున్నారు. వారిచ్చిన వంశావతారక్రమము ననుసరించి[1], కడపటిపల్లవులకు సమకాలీనులుగ గన్పట్టు పాండ్యరాజు లీప్రక్క, వంశానుక్రమమున జూపబడుచున్నారు.

---

1. రాజకేసరివర్మ బిరుదాంచితుడయిన మొదటి ఆదిత్యవర్మ కుమారుడు పరకేసరి మొదటి పరాంతకుడు పాండ్యరాజ్యమును జయింపక పూర్వము రాజ్యమేలిన పాండ్యరాజుల వంశానుక్రమమును నిర్ణయించుటకు గల ముఖ్యములయిన ఆకరములు వేళ్వికుడి, శిన్నమనూరు తామ్రశాసనములు. ఈరెండు జతలశాసనములయందును రాజనామ, బిరుదాది విషయములయందు పరస్పరము కొన్ని భేదము లుండుటచేత వీని నాధారపఱచుకొని పాండ్యరాజ వంశావతారక్రమమును నిర్ణయింప బ్రయత్నించినవారిలో ఈనిర్ణయము విషయమున పెక్కుభేదాభిప్రాయములు కలిగి, మొదటి పాండ్యరాజుల వంశావతారక్రమము పెక్కురీతుల జూపబడుచున్నది. ఇంతవఱకు వచ్చిన పాండ్యరాజవంశవృక్షములలో ప్రొఫెసరు, కే. యే. నీలకంఠశాస్త్రిగా రిచ్చినది సరియైనదిగ నాకు దోచుటచేత నే నిచట దానినే యనుసరించితిని.

కోశడయ్యన్ (రణధీరుడు)
(క్రీ. శ. ౭౧౦ - ౭౪౦)[1]
|
మారవర్మ
(మొదటి) రాజసింహుడు
(క్రీ. శ. ౭౪౦-౭౬౫)
|
జటిలపరాంతక నెడుంజడయ్యన్
(మొదటి) వరగుణుడు
(క్రీ. శ. ౭౬౫ - ౮౧౫)
|
శ్రీమార శ్రీవల్లభుడు
(క్రీ. శ. ౮౧౪-౮౬౨)
|
(రెండవ) వరగుణవర్మ (క్రీ. శ. ౮౬౨ - ౮౮౦)
పరాంతక వీరనారాయణుడు (క్రీ. శ. ౮౮౦ - ౯౦౦)

౬. బాదామి చాళుక్యులు : వీరిలో ప్రసిద్ధుడు రెండవపులకేశి. ఇతని సోదరుడు కుబ్జవిష్ణువర్ధనుడు వేంగిచాళుక్యరాజ్యసంస్థాపకుడు. పులకేశిసంతతియందలి కడపటి మూవురును కడపటిపల్లవులలో మొదటివాడగు నందివర్మకు సమకాలికులు. వారియనుక్రమ మిది :

విజయాదిత్యుడు (క్రీ. శ. ౬౯౬ - ౭౩౩)
|
(రెండవ) విక్రమాదిత్యుడు (క్రీ. శ. ౭౩౩ - ౭౪౬)
|
(రెండవ) కీర్తివర్మ (క్రీ. శ. ౭౪౬ - ?)

నందివర్మ పల్లవమల్లుని కాలముననే బాదామిచాళుక్యరాజ్యసౌధము కూలిపోయినది.

కాంచీపురమును పాలించిన కడపటిపల్లవుల యధికారము క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్ది కడపటిభాగమున సమసిపోయినది. పల్లవరాజ్యము చోళులహస్తగత మయినది. కాంచీపురమునవ్యాఘ్రపతాక బాదుకొలిపిన మొదటి చోళభూధవుడు రాజకేసరివర్మ బిరుదాంచితుడగు మొదటి ఆదిత్యవర్మ. అంతటితో దక్షిణహిందూదేశచారిత్రమున పల్లవులు మహారాజులుగ నంతరించి సామంతులుగ జీవము నిలుపుకొనిరి.

---

## ౨

ఈపైసంగతులను : జ్ఞాపక ముంచుకొని కడపటిపల్లవుల కాలనిర్ణయమునకు గడంగుదము. నందివర్మపల్లవమల్లునితో నారంభమగు ఈకడపటి పల్లవుల వంశావతారక్రమ మెంత స్పష్టముగను, సరిగను దెలియవచ్చినను వారిశాసనములందు పరిపాలనకాలవర్షములే కాని శకవర్షములు లేకపోవుటచేత వారిలో నొక్కొక రెప్పటినుండి యెప్పటివఱకు పరిపాలించి రనువిషయము ఇంకను పెక్కుసందియములతోగూడిన యొక సమస్యగనే యుండిపోయినది. విరివిగా దొరకిన యీ కడపటిపల్లవుల శాసనములవలన రెండవనందివర్మ పల్లవమల్లుడు ౬౫ సంవత్సరములును[2], అతని కుమారుడు దంతివర్మ ౫౧ సంవత్సరము

1. ఈకాలనిర్ణయము శ్రీనీలకంఠశాస్త్రిగారు పెక్కు విషయములను పర్యాలోచించి చేసినది ; 'అంచనా'గ వేసిన సంవత్సరము లివి ; పరమాధారప్రతిష్ఠితములు కావు.

2. Ep. Coll., No. 666 of 1922.

లును,[1] ఇతనితనయుడు మూడవ నందివర్మ ౨౩ వత్సరములును,[2] ఇతనికొడుకు నృపతుంగుడు ౨౬ వర్షములును[3] పాలించినట్లు తెలియుచున్నది. పదునెనిమిది సంవత్సరములు పరిపాలనము నెఱపినట్లు[4] తెలియవచ్చు అపరాజిత వర్మకును, పూర్వోక్తపల్లవభూపతులకును గల సంబంధమువిషయమున పరిశోధకపండితులలో భిన్నాభిప్రాయములు కలవు. కీర్తిశేషులయిన వి. వెంకయ్యగారి యుద్దేశము ననుసరించి అపరాజితుడు నృపతుంగునికుమారుడు.[5] 'పల్లవులు - గాంగపల్లవులు' అను శీర్షికతో క్రైస్తవకళాశాలపత్రికకు[6] వ్రాసినవ్యాసమున కీర్తిశేషులయిన శ్రీ టి. ఎ. గోపినాథరావు గారు అపరాజితు డన్నది నృపతుంగునికి మాఱుపేరని యొకసిద్ధాంతమును బైలుదేఱదీసిరి. డుబ్రాయిల్ దొరగారు తమ 'పల్లవు' లను గ్రంథమున అపరాజితునికి, నృపతుంగునికి నెట్టిసంబంధ మున్నది కాని, అత డెప్పుడు సింహాసన మెక్కినది కాని తెలిపియుండలేదు. క్రీ. శ. ౮౮౦ ప్రాంతమున నృపతుంగుని మరణానంతరమున—అపరాజితుడు కాక—రాజకేసరి వర్మ బిరుదాంచితుడయిన మొదటి ఆదిత్యవర్మ చోళుడు సింహాసన మెక్కి రాజ్య మేలెనని మాత్రము వారు వ్రాసియున్నారు.[7] కాని వారు 'పల్లవు' లను గ్రంథమునకు దరువాత వెలువడిన తమ 'దక్కనుదేశప్రాచీనచారిత్రము'న నిచ్చిన కాంచీపురపల్లవుల వంశవృక్షమున కారణములు తెలుపకయే అపరాజితుడు నృపతుంగుని కుమారుడుగ జూపియున్నారు.[8] ఇటీవల కాంచీపురపల్లవుల చారిత్రమును విరచించిన ఆర్. గోపాలన్‌గారుకూడ ఈవిషయమునుగుఱించి కొంత చర్చించిరి. ఉదయేందిరము శాసనము[9] ననుసరించి, పశ్చిమగాంగవంశజుడయిన మొదటిపృథ్వీపతి శ్రీపురంబియము యుద్ధమున పాండ్యాధిపతియగు రెండవవరగుణుని తనబాహుబలమున నోడించి, తనమిత్రు డపరాజితునినామము నన్వర్థము కావించి, స్వర్గమునకు బోయెను. నృపతుంగవిక్రమవర్మ అంబూరుశాసనముల ననుసరించి[10] చూచినచో, గాంగపృథ్వీపతి యతనిసామంతు డయినట్లు తెలియును. ఈపృథ్వీపతియు, ఉదయేందిరముశాసనమున పేర్కొనబడిన పృథ్వీపతియు నొక్కరే యగుదురన్న యూహచొప్పున నృపతుంగునికి బిదప అపరాజితుడురాజ్యమునకు వచ్చియుండుననియు, ప్రాయికముగ నతనికి బిదప సింహాసన మెక్కినవాడతని కుమారుడేమై యుండుననియు గోపాలన్‌గారు వ్రాసిరి.[11] 'ఎపిగ్రాఫియా ఇండికా' యందు[12] 'లాల్గుడియందలి మూడు

1. Ep. Coll., No 262 of 1904.
2. Ep. Ind., Vol. XI , p. 224..
3. Ep. Coll., No. 8 of 1896.
4. Ep. Coll., No 435 of 1905.
5. Ep. Rep., for 1906, P 64.
6. Christian College Magazine, 1907.
7. The Pallavas by J. Dubreuil, P. 64.
8. Ancient history of the Deccan, by J. Dubreuil, P. 70.
9. Sou. Ind. Ins., Vol II.. P. 384, V. 18.
10. Ep. Ind., Vol. IV, P. 182.
11. The Pallavas of Kanchi by R. Gopalan, P. 142.
12. Ep. Ind., Vol. XX, P. 46.

తమిళశాసనము' లను ప్రకటించు సందర్భమున కే. వి. సుబ్రహ్మణ్య అయ్యరుగారు కూడ కాంచీపురపల్లవులలో అపరాజితుడే కడపటివాడని తేల్చియున్నారు. ఇందులకు గల కారణము లివి: చోళవంశజుడయిన మొదటి ఆదిత్యవర్మ అపరాజితుని వధియించి యాతని పల్లవరాజ్యము నాక్రమించుకొనెనని తిరువాలంగాడుతామ్రశాసనము[1] ననుసరించి తెలియుచున్నది. ఈపల్లవరాజ్యాక్రమణము ఆదిత్యవర్మ ౨౧-వ పరిపాలనవర్షమునాటికి జరగినట్లు కంజీవరము నొద్దగల తిరుమాలపురము శాసనము ననుసరించి[2] యూహింపవచ్చును. తక్కోలముశాసనము[3] నాధారముగా గొని సుబ్రహ్మణ్య అయ్యరుగారు చేసిన సిద్ధాంతము ననుసరించి, ఆదిత్యవర్మ క్రీ. శ. ౮౭౦ లో రాజ్యమునకు వచ్చుటచేత క్రీ. శ. ౮౯౧ ప్రాంతమున కాంచీపురపల్లవరాజ్య మాదిత్యవర్మ వశమయి యుండును. ఈకారణముల వలన సుబ్రహ్మణ్య అయ్యరుగారు కూడ, శాసనములవలన నృపతుంగ, అపరాజితులకు గల సంబంధము తెలియరాకపోయినను, అపరాజితుడు నృపతుంగునికి తరువాతివాడని, ప్రాయికముగ ఆతనికొడుకగునని తీర్మానించిరి.

స్థిరపఱుచుటకు గల ఆకరములు తక్కువగుటచేత గావచ్చును ఈకడపటి పల్లవుల కాలనిర్ణయము నొక ప్రత్యేకవిషయముగ గైకొని యింతవఱ కెవ్వరును చర్చించినట్లు కనబడదు. దక్షిణహిందూదేశ చారిత్రమునకు సంబంధించిన శాసనము లనేకములను ప్రకటించిన డాక్టరు ఫ్లీటుదొరగారు పశ్చిమగాంగశాసనమొకటి ప్రకటించుసందర్భమున పశ్చిమగాంగ శాసనముల 'సృష్టి', యాథార్థ్యములను, మొదటి పశ్చిమగాంగుల కాలనిర్ణయమును గూర్చి చర్చింపవలసిన యావశ్యకము కలిగినది. వారాసందర్భమున నందివర్మ పల్లవమల్లుని ఏబదవ పరిపాలనవర్షము క్రీ.శ. ౭౩౩ - ౭౮౭ లకు నడుమ బడియుండవలెనని యభిప్రాయపడినను, ఆతని రాజ్యారంభకాలము క్రీ. శ. ౭౧౫ ననో, అంతకు దరువాతనో ఆరంభమయియుండవలెను గాని అంతకు పూర్వము కానేరదని వ్రాసియున్నారు.[4]

'పల్లవు' లను చారిత్రగ్రంథమున ఈవిషయమునుగుఱించి తరువాత చర్చించిన వారు డుబ్రొయిలు దొరగారు. వారు నందివర్మ సింహాసనారోహణకాలము స్థూలముగ క్రీ. శ. ౭౧౭,౭౩౭ లకు నడుమ నయియుండునని, తుదకు మఱికొన్ని యితరకారణముల యాధారమున అతడు రాజ్యమునకు వచ్చినది క్రీ. శ. ౭౧౯-౭౨౦ కి పూర్వము, ప్రాయికముగ క్రీ. శ. ౭౧౭ న నని తేల్చియున్నారు.[5] వారీవిధమున తీర్మానించుటకు గల కారణము లివి: 'మహా పల్లవవంశమునందలి మొదటి

---

1. Sou. Ind. Ins., Vol. I.
2. Ep. Coll., No. 286 of 1906.
3. Ep. Ind., Vol. XIX, P, 81.
4. Ep. Ind., Vol.
5. Pallavas, by J. Dubreuil, P. 66.

పరమేశ్వరవర్మ క్రీ. శ. ౬౭౪ ప్రాంతమున బాదామిచాళుక్యుల నోడించెను.[1] మొదటి పరమేశ్వరవర్మకు, నందివర్మ పల్లవమల్లునికి నడుమ (౧) మొదటి పరమేశ్వరవర్మ పరిపాలనము ముగియుట; (౨) రెండవ నరసింహవర్మ, (3) రెండవ పరమేశ్వరవర్మలు రాజ్యమేలుట – ఇన్ని జరగియుండవలెను. రెండవ పరమేశ్వరవర్మ కొద్దికాలమే పరిపాలించె నన్నను ఇన్ని సంగతులు జరగుట కధమము నలువదిసంవత్సరములయినను పట్టును[2]. ఇది డుబ్రాయిల్ దొరగారు నందివర్మరాజ్యాభిషేకకాలము క్రీ. శ. ౭౧౭ గ నిర్ణయించుటకు గల కారణము. పట్టాంతరము ననుసరించి చూచినను వారి కిది సిసలయినదిగ గన్పట్టినది; ఎట్లన: ఆదిత్యవర్మ చోళుడు పల్లవరాజ్యమును జయించెను. ఆదిత్యవర్మకుమారుడును, పరకేసరివర్మ బిరుదాంచితుడును అగు మొదటి పరాంతకుడు క్రీ. శ. ౯౦౭ లో రాజ్యమునకు వచ్చెను. కావున ఆదిత్యవర్మ కడపటిపరిపాలనవర్షము ౯౦౭ గ నుండవలెను. శాసనముల ననుసరించి చూచినయెడల, ఆదిత్యవర్మ ఇరువదియేడువత్సరములు రాజ్య మేలినట్లు స్పష్టమగుచున్నది. నృపతుంగుని యనంతరముననే ఆదిత్యుడు పల్లవరాజ్యమును వశపఱుచుకొనెనని డుబ్రాయిలుదొరగారిమతము.[3] ఇట్లయినచో, క్రీ. శ. ౮౮౦ (౯౦౭ – ౨౭) నృపతుంగుని కడపటి పరిపాలనవర్షమని, ఆదిత్యుని మొదటివత్సరమని వారియూహ. డుబ్రాయిల్ దొరగారు పల్లవచారిత్రమును రచియించునాటికి నందివర్మపల్లవమల్లుని ౬౫-వ పరిపాలనవర్షమును పేర్కొను శాసనము మాత్రమే దొరకినది. ఇటు లాలోచించినను నందివర్మ రాజ్యాభిషేకకాలము క్రీ. శ. ౭౧౭ (౮౮౦-౧౬౩ [౬౫ + ౫౧ + ౨౨ + ౨౫]) అగుచున్నది. ఈకారణములవలన గాని, లేనిచో వారు ౭౧౭ ను నందివర్మ[4] ప్రథమరాజ్యసంవత్సరముగ నీయదలచిరి. డుబ్రాయిల్ దొరగారు పల్లవచారిత్రమును రచియించిన నాటనుండి పల్లవచరిత్రకారులు ౭౧౭ నే రెండవనందివర్మ రాజ్యారంభవత్సరముగ నంగీకరించుచున్నారు.

డుబ్రాయిలుదొరగారి యనంతరమున పల్లవచారిత్రమును రచియించిన ఆర్. గోపాలన్‌గారి యభిప్రాయముప్రకారము క్రీ. శ. ౭౧౦ లో రెండవ నందివర్మ రాజ్యమునకు వచ్చెను.[5] డుబ్రాయిల్‌దొరగారిచ్చిన ౭౧౭ ను త్రోసివేయుటకు గాని, ౭౧౦ ని గ్రహించుటకు గాని గోపాలన్‌గారు రెట్టికారణములను దెలిపియుండలేదు; కావున ౭౧౦ ని గుఱించి మన మంత వితర్కింప నవసరము లేదు.

'లాల్గుడియందలి మూడు తమిళశాసనము'లను 'ఎపిగ్రాఫియా ఇండికా' యందు ప్రక

1. Ep. Ind., Vol. IX, P. 202;
   Ep. Ind., Vol X, P. 101.
2. Pallavas, by J.Dubreuil, P. 64.
3. Ibid, P, 66.
4. Ibid, P. 65.
5. The Pallavas of Kanchi, by- R. Gopalan,

టించుసందర్భమున,[1] ఇటీవల నీవిషయమును గుఱించి యించుక విపులముగ చర్చించినవారు కే. వి. సుబ్రహ్మణ్య అయ్యరుగారు. ఈ శాసనములను బ్రకటించుటకు పూర్వము వారు రాజకేసరివర్మ (ఆదిత్యవర్మచోళుడు) తక్కోలముశాసనమును బ్రకటించి, తత్సాధనమున ఆదిత్యవర్మ క్రీ. శ. ౮౭౦-౮౭౧ లో రాజ్యమునకు వచ్చెనని నిర్ణయించిరి.[2] ఆదిత్యవర్మయీపట్టాభిషేకవత్సరమును ప్రాతిపదికగ గైకొని వారు కడపటిపల్లవులకాలమును నిర్ణయించిరి. ఎట్లన, కంజీవరమునొద్ద తిరుమాలపురమునందలి యొకశాసనమున[3] తొండైమాన్ ఆఱ్ఱూర్ తుంజిణఉడయరు ఇరువదియొకటవ పరిపాలనవర్షమునాటి దానము పేర్కొనబడినది. ఈపేరు మొదటి ఆదిత్యవర్మ నామాంతరమని చరిత్రకారు లంగీకరించినారు. ఈకారణమున నీశాసనము క్రీ.శ. ౮౯౦-౮౯౧ నాటి దగును. మొదటి ఆదిత్యవర్మ పల్లవ అపరాజితుని వధియించి వాని రాజ్యము నాక్రమించుకొనె నని తిరువాలంగాడు శాసనమువలన దెలియుచుండుటచేత[4] ౮౯౦-౮౯౧ నాటికి పల్లవరాజ్యము చోళులకు చేపడె ననుట ధ్రువము. ఆదిత్యవర్మ క్రొత్తగా జయించిన దేశమున స్థిరపడుటకు రెండేండ్లయినను పట్టియుండు నన్నయెడల అత డపరాజితుని క్రీ. శ. ౮౮౮ ప్రాంతమున వధియించి యుండవలెను. అపరాజితుని కడపటి సంవత్సరము ౮౮౮ అయినచో — అతని శాసనముల ననుసరించి యతడు పదునెనిమిదేండ్లు పాలించినట్లు తెలియుచున్నది కావున — అతని రాజ్యము౮౭౦లో ప్రారంభమగును. సుబ్రహ్మణ్య అయ్యరుగారి యభిప్రాయము ప్రకారము అపరాజితుడు నృపతుంగుని యనంతరమున రాజ్య మేలియుండు ననుటకు గలకారణము లీవఱకే తెలియును. కావున అపరాజితునికి పూర్వుడు నృపతుంగుడు క్రీ. శ. ౮౪౪ మొదలు ౮౭౦ వఱకు రాజ్యము చేసియుండును. ఈలెక్కను నృపతుంగుని తండ్రియయిన మూడవ నందివర్మ క్రీ. శ. ౮౩౩ మొదలు ౮౪౪ వఱకు పాలించియుండవలెను. కాని సుబ్రహ్మణ్య అయ్యరుగారి యభిప్రాయమున నట్లు కాదు. ఏలయన, రాష్ట్రకూటవంశజుడగు మూడవ గోవిందభూపతియు, పల్లవరాజగు నందివర్మయు — ఇరువురును పట్టాభిషిక్తులైన రాజులు — గంగవంశజుడును, శ్రీపురుష ముత్తరుసు కుమారుడును అయిన రెండవ శివమారసైగొట్టని గంగరాజ్యమునకు పట్టము కట్టినట్లు పశ్చిమగాంగశాసనములవలన దెలియుచున్నది.[5] మూడవ గోవిందుని కడపటి రాజ్యవత్సరము క్రీ. శ. ౮౧౪ అగుటచేత ఈరాజ్యాభిషేక మంతకు పూర్వ మనగా క్రీ. శ. ౮౧౩ ప్రాంతమున జరగియుండవలెను.

1. Ep. Ind., Vol. XX, P. 46.
2. Ep. Ind., Vol. XIX, P. 81.
3. Ep. Coll., No. 286 of 1906.
4. Sou. Ind. Ins., Vol, I.
5. Mys. Arch. Rep. for 1924, P, 72; Ep. Carn., Vol. IX, Nl. 60.

౮౧౨ వ సనే నందివర్మ రాజ్యాభిషేకము జరగియుండు నన్నది సరియయినచో ఆతని రాజ్యారంభకాలమును ౮౨౨ నుండి పదేండ్లు పూర్వమునకు జరపవలసియుండును. అప్పుడు **మూడవ** నందివర్మ క్రీ. శ. ౮౧౨ మొదలు **౮**౪౪ వఱకు పాలించినట్లు నిశ్చయింపవలెను. ఈ రీతిని సుబ్రహ్మణ్యఅయ్యరుగారిమతము ప్రకారము కడపటి పల్లవుల కాలనిర్ణయ మిది:

రెండవ నందివర్మ

| | | |
|---|---|---|
| పల్లవమల్లుడు | క్రీ. శ. | ౬౯౬ - ౭౬౧ |
| దంతివర్మ | ,, | ౭౬౧ - ౮౧౨ |
| మూడవ నందివర్మ | ,, | ౮౧౨ - ౮౪౪ |
| నృపతుంగవర్మ | క్రీ. శ. | ౮౪౪ - ౮౭౦ |
| అపరాజితవర్మ | ,, | ౮౭౦ - ౮౮౮ |

ఇట్లు సుబ్రహ్మణ్య అయ్యరుగారు రెండవ నందివర్మ రాజ్యారంభకాలమును క్రీ. శ ౬౯౬ గ నిర్ణయించినారు.[1] నందివర్మ రాజ్యాభిషేకకాలమున కిప్పుడు చరిత్రరంగమునం దున్నవి **మూడు**వత్సరములు (౧) ౬౯౬; (౨) ౭౧౦; (3) ౭౧౭. ఇవి సరియయినవో కావో చర్చించి, యింతకంటె గట్టి పునాదిమీఁద నీకాలమును నిర్ణయింపగల మేమో చూడవలసి యున్నది.



విజయనగరం మహారాజావారి సంస్కృతకళాశాల
ఛాయాచిత్రకారుడు : జి. వి. చారిగారు.

1. Ep, Ind., Vol. XX, P. 46.

# ఆయుర్వేదము—భారతీయ దృష్టి

డాక్టరు కనగాల లక్ష్మీనరసింహారావుగారు



ప్రాచ్యదేశాల దృష్టి పారమార్థికమనీ, పాశ్చాత్యదేశాలదృష్టి వ్యావహారికమనీ, ఆయా దేశాల నాగరకతావిజ్ఞానములను భిక్షపెట్టిన భారత గ్రీసు దేశముల స్వరూప స్వభావములను బట్టి నిర్ణయించి ఉన్నాను. ఇక అవి జాతకశాస్త్రరీత్యా ఎట్లా ఉన్నవీ చూపిస్తాను.

మనుష్యుల కెట్లాగో అట్లాగే దేశాలకు కూడా జాతకా లున్నవి. ప్రాచీన ప్రాచ్య విజ్ఞానానికి మూల భూతమయినది హిందూదేశము జాతక శాస్త్రరీత్యా ఎటువంటిదో ఆలోచిస్తాము. ఈదేశలగ్నము మకరము. ఒక్కసారి భచక్రము, దాని అధిపతులను స్మరిస్తే యీ దేశ స్వభావములు తెలిసిపోతవి.

లగ్నధనాధిపతి శని మందుడు. పైగా కుంటి వాడు. ఎప్పుడు తల వంచుకొని కూర్చుంటాడు. కేవలము అధోలోకము, కాకపోతే ఊర్ధ్వలోకము చూస్తాడు. ముఖాముఖీగా చూడలేడు. సదా ధ్యాననిమగ్నుడై సమస్త భౌతిక వాంఛలను విడనాడినాడు. సంసారము లేదు. త్రిలోకసుందరి అయిన భార్య తన్ను వ్యామోహ పెడుతుంది అని అనుకొన్న మాత్రానే సంసారము త్యజించినాడు. అతి తీవ్రమయిన దృష్టులు కలవాడు. ఈవర్ణన అంతా అనవసరము. ఒక్కమాటతో చెప్పి వేయవచ్చును. మామూలు లోకానికి పనికిరానివాడు. పై పెచ్చు దాస్యము చేసే స్వభావము కలవాడు. ఈ కారణమువల్ల ఈ దేశజనులు మందులు. ఏనూత్నవిషయాలూ వీళ్లబుర్రలలో జొరబడవు. ఇతరదేశీయులు అనేక మార్గములలో ముందుకు సాగిపోతూఉంటే వీళ్లు మాత్రము తొందరపడి వాళ్లతో ముందుకు పరుగెత్తరు. అయితే ఏయత్యల్పవిషయమయినా చాలా లోతుకు దిగి ఆలోచిస్తారు. ఇటు అధోలోకములోకి, అంటే కేవలము రంధ్రములు వెతకడములోనో, కాకపోతే అటు ఊర్ధ్వలోకములోకి, అంటే పారము ఎరగని లోతుకు పోయో ఆలోచిస్తారు. ఇతర దేశములు ఏవిధముగా ఉన్నవీ వీరు గ్రహించరు. వీరికి సంసార తాపత్రయము కన్న ఆధ్యాత్మిక విషయములమీద ప్రేమ యెక్కువ. భౌతిక విషయములు అంటే పట్టవు.

ఈవిధముగా చెప్పినందువల్ల ఈదేశజనులు బుద్ధిమాంద్యము కలవారనీ, పనికిమాలిన వారనీ అనుకో గూడదు. తృతీయ వ్యయాధిపతి గురువు అయిన కారణమునుండి ధైర్యసాహసములకు ఎప్పుడూ లోటు వుండదు. వ్యయ మెప్పుడూ చాలా సద్వ్యయముగా ఉంటుంది. సుఖలాభాధిపతి కుజుడు అయిన కారణమునుంచి ఎంత సుఖమున్నా కష్టపడే స్వభావము. లాభము—ఆర్థికలాభము—శూన్యము. శుక్రుడు బుద్ధిస్థానాధిపతి, రాజ్యాధిపతి అయినందున వీళ్లబుద్ధి చాలా కుశాగ్రమయినది రాజ్యము అంటే కీర్తిలో వీళ్లను మించినవాళ్లు ప్రపంచములో మరొకచోట ఉండడానికి వీలు లేదు. నవమాధిపతి బుధుడు. వీడికి స్వయంవ్యక్తిత్వము లేదు. ఉత్సాహము, భాగ్యమూ ఎప్పుడున్నా ఒక్కమాదిరిగా ఉండవు. మారకస్థానాధిపతి చంద్రుడు. అందువల్ల ఎప్పుడూ చావుబ్రతుకులు లేకుండా వృద్ధిక్షయములతో ఉంటుంది తప్ప ఒక్కమాదిరిస్థితిలో ఉండదు. అష్టమాధిపతినిబట్టి పరలోకసౌఖ్యము చెప్పవలెను. అంధకారము భేదించే విష్ణువు, సృష్టించే బ్రహ్మ, లయముచేసే రుద్రుడు—ఈ మూడు సూర్యుడేఅయినందున పారలౌకికవిషయములలో వీరితో ఎవరూ పోటీకి ఆగలేరు. మొత్తముమీద తేలుతున్న విషయము ఏమంటే: వీళ్లు మామూలు సౌఖ్యములతో తృప్తిపడరు. ఏదో ధ్యాననిమగ్నులయిపోయి మామూలు భౌతికప్రపంచము ఎట్లా పోయినా గమనించకుండా యోగదృష్టితో ప్రతి అత్యల్ప విషయమూ సమీక్షచేస్తూ ఎప్పుడూ బ్రహ్మానందము అనుభవించే

స్వభావము కలవారు. ఈచెప్పినస్వభావాదుల విపాకము గ్రహచారాదుల ననుసరించి ఏర్పడుతుంది.

ఇక పాశ్చాత్యవిజ్ఞానమునకు పుట్టినిల్లయిన గ్రీసు దేశజాతకవిషయము. లగ్నము తుల. లగ్నాధిపతి శుక్రుడు. శుక్రుడు రసికుడు, భోగప్రియుడు, అత్యుత్సాహి, తెల్లటివాడు, అతివేగమయిన బుద్ధిబలము కలవాడు, ఎప్పుడూ సుఖము అనుభవించేవాడు. అయితే శుక్రుడే అష్టమాధిపతి అయిన కారణమునుంచి గ్రీసుదేశస్థులకు పరలోకవిషయములతో నిమిత్తము లేదు. చక్కని దేహము కలవాండ్లు. యథేచ్ఛగా భోగము అనుభవిస్తూ సుఖించడము తప్ప మరొకటి వారికి అవసరము లేదు. తృతీయషష్ఠాధిపతి గురువు. ధైర్యసాహసములు, ఉత్సాహము ఎప్పుడూ కోల్పోనివాండ్లు. సుఖపంచమాధిపతి శని అయినందున, అతిలోతుకు దిగి ఆలోచించే బుద్ధిబలము ఉండదు. సుఖముకూడా వారికి కొంచెము తక్కువే. భాగ్యవ్యయాధిపతి బుధుడు. బుధుడికి స్వయంవ్యక్తిత్వము లేదు. భాగ్యము కానీ, వ్యయము కానీ సమయాసమయాలనుబట్టి ఉంటుంది, ఎప్పుడూ ఒక్కవిధముగా ఉండదు. ఆ దేశస్వభావమంతా ఆకేశ లగ్నసుఖాధిపతుల ననుసరించి సమన్వయము చేయవచ్చును. లగ్నాధిపతి సంతోషప్రియుడు. సుఖాధిపతి దుఃఖభాజనుడు. ఈ ఉభయాధిపతుల వైరుధ్యమే ఆ దేశజనుల స్వభావము. అంటే, సుఖముకోసరము వాళ్లు ఏపని చేయడానికయినా వెనక్కు లాగరు. వాళ్లకు పారలౌకికవిషయములతో నిమిత్తము లేదు. ఆయా ఫలసిద్ధి గ్రహచారముల ననుసరించి ఉంటుందని యిదివరకే చెప్పినాను.

మొత్తముమీద తేలిన విషయమేమంటే— హిందూదేశవాస్తవ్యుడు లౌకికకాంక్షలతో నిమిత్తము లేకుండా సర్వసంగపరిత్యాగి అయి సమాధిలో కూర్చుని సర్వకాలసర్వావస్థలలో యోగదృష్టితో ప్రతివిషయమూ సమీక్షు చేస్తూ ఉంటాడు. గ్రీసుదేశస్థుడు లౌకికసుఖాభిలాషి అయి అరవై ఘడియలూ తదన్వేషణార్థము తిరుగుతూ ఉంటాడు.

కనుక జాతకశాస్త్రాన్ని బట్టి కూడా భారతీయదృష్టి, తద్ద్వారా ప్రాచ్యదేశములదృష్టి పారమార్థికము అనీ, గ్రీసుదృష్టి, తద్ద్వారా పాశ్చాత్యదేశముల దృష్టి వ్యావహారికమనీ తేలినది. ఇక యీదృష్టుల కుండే భేదము సారస్వతాదులలో మాత్రమే కాకుండా వైద్యశాస్త్రాలలో కూడా ఏవిధముగా కనబడుతుందో చూపిస్తాను. అయితే పారమార్థికదృష్టి అనేది, వ్యావహారికదృష్టి అనేది అనుభవములో ఏవిధముగా వ్యక్తమవుతదో ముందుగా వివరించడము అవసరము. స్వపరభేదజ్ఞానమునకు ఫలము మనుష్యజన్మ. మనుష్యజన్మలకు లక్షణము స్వపరభేదజ్ఞానము. రెంటికీ అవినాభావసంబంధము ఉన్నది. అంటే ఒకదాన్ని విడిచిపెట్టి మరొకటి ఉండదన్నమాట. ఈస్వపరభేదజ్ఞాన రాహిత్యమే బ్రహ్మైక్యానుసంధానము. అదే ముక్తి. అదే ఆనందము. ఒకప్పుడు అనుభవించి కోల్పోయిన యీ ఆనందాన్నే ప్రతిమానవుడూ కోరుతాడు. కాని అలా కోరుతున్న సంగతి అతనికే తెలియదు. ఆనందాన్ని కాంక్షించడము ఆత్మస్వభావము. సుఖాన్ని కోరడము మనస్స్వభావము. ఐహికవాంఛాపరిపూర్తి మనుష్యుడికి సుఖము కలిగిస్తుంది. స్థూలదృష్టికి ఆనందమూ సుఖమూ ఒకటిలాగానే కనిపిస్తవి. కాని ఆనందాభాసము సుఖము. అది శాశ్వతము, ఇది అశాశ్వతము. అది నిరాశ్రయము, ఇది సాశ్రయము. అది నిరవధికము, ఇది సావధికము. అది విషయాతీతము, ఇది విషయగతము. అది పారమార్థికము, ఇది వ్యావహారికము. కాని ఒక చిత్రము మాత్రము ఉన్నది. ఒకడి ఆత్మోపలబ్ధికి ఉపకరించే ప్రకృతి దృష్టిభేదాన్నిబట్టి మరొకరి ఆత్మోపలబ్ధికి ఏవిధంగా అంతరాయము కల్పిస్తుందో అదేవిధముగా సుఖము అనేది కూడా పారమార్థికచింత కలవాడికి అతిశీఘ్రముగా తృప్తి కలిగించి విరాగిని చేసివేసి అతడు శాశ్వతానందము కోరేటట్టు చేస్తుంది. ఆసుఖమే వ్యావహారికచింత గలవాడికి అసంతృప్తి కలిగించి విషయలోలతను కలిగిస్తుంది. ఇందుకు కారణము దృష్టిభేదమే కాని వ్యక్తిభేదము కాదు. పారమార్థికచింత గలవాడు కోరేది బ్రహ్మైక్యానుసంధానము. అదే ముక్తి, అదే ఆనందము.

అంటే స్వపర భేదజ్ఞానశూన్యత—తనకూ చరాచర ప్రకృతికీ భేదము లేదనే జ్ఞానము. ఇది ప్రాప్తించడముతోటే అతడు ధర్మాధర్మవిచక్షణజ్ఞానము కలిగి వర్తిస్తాడు. జగత్కల్యాణము అతనికి ఆనందకర మవుతుంది. అంటే స్వార్థత్యాగము అతనికి ఆనందముగానూ, స్వార్థపరత్వము దుఃఖముగానూ పరిణమిస్తవి. కాని వ్యావహారికచింత గలవాడికి ఇవే కేవలము విరుద్ధముగా వర్తిస్తవి. అంటే స్వార్థత్యాగము అతనికి దుఃఖముగానూ, స్వార్థపరత్వముతో కూడుకొన్న ఐహికవాంఛా పరిపూర్తి సుఖముగానూ కనుపిస్తవి. అచిరకాలములోనే ఈ సుఖము తృప్తికి బదులు అసంతృప్తి కలిగించి అతన్ని విషయలోలుణ్ణిగా చేసివేస్తుంది. ఒకడు కోరేది శాశ్వతమయిన ఆనందము. మరొకడు కోరేది ఐహికవాంఛా పరిపూర్తి వల్ల కలిగే తాత్కాలికసుఖము. ఒకడు ప్రకృతిలో లీనమయి పరమాత్మను దర్శించి ఆనందము పొందితే యింకొకడు ప్రకృతిని బలవంతముగా వశపరుచుకొని ఐహికభోగములను అనుభవిస్తాడు. కాని క్రమక్రమముగా వీటిమీద అతనికి అసహ్యము పుడుతుంది. వాటి నిష్ప్రయోజకత్వము అనుభవసిద్ధము అవుతుంది. అవి శాశ్వతానందాన్ని కలిగించలేదనే సంగతి స్పష్టపడుతుంది. అంతటనుంచి అతడు దాన్నే కాంక్షిస్తాడు. ఒకడికి నైసర్గికముగా లభించే దృష్టి మరొకడికి అనుభవమువల్ల అబ్బుతుంది. కొంచెము ముందూ వెనకా అన్నమాటే కాని ప్రతిమానవుడు చివరకు మోక్షము పొందుతాడు. అయితే జన్మతః దేశకాలపరిస్థితులనుబట్టి సహజముగా లభించిన దృష్టి మాత్రము ఆవ్యక్తికి సంబంధించిన ప్రతి విషయములోనూ వ్యక్తము కాక తప్పదు.

పారమార్థికదృష్టి కలవానికి "య ద్దృశ్యం త న్నశ్యం", "సర్వం ఖల్విదం బ్రహ్మం", "ఏకమేవాద్వితీయం బ్రహ్మ", "ఆనందో వై బ్రహ్మ", "ఆత్మవ త్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి", "అహింసా పరమో ధర్మః", "సత్యమేవ జయతే నానృతమ్, నానృతాత్ పాతకం పరం", "సర్వే జనా స్సుఖినో భవంతు"—మొదలయిన మహా వాక్యాలలో ఇమిడి ఉన్న తత్త్వము అతనిజీవితములో వ్యక్తమవుతుంది. అతనికి కావలసినది అంతస్తత్త్వము కాని బాహ్యరూపము కాదు. మూలకారణము కాని బాహ్యపరిణామములు కావు. భావసౌందర్యము కాని రూపసౌందర్యము కాదు. జగత్కల్యాణము కాని స్వసుఖము కాదు. సమన్వయభావము కాని విభేదభావము కాదు. బహుత్వమందు ఏకత్వము కాని ఏకత్వమందు బహుత్వము కాదు. న్యాయాన్యాయవిచక్షణముకాని లాభనష్టపరిగణనము కాదు. ఆత్మశాంతి కాని శరీరసౌఖ్యము కాదు. అతి ప్రయత్నలభ్యశాశ్వతఫలము కాని అల్ప యత్న లభ్య తాత్కాలిక ఫలము కాదు. అతని దృష్టిలో మృత్యువు ఒక పరిణామము, పరలోకప్రవేశద్వారము. కాని వ్యావహారికదృష్టి కలవానికి ఇవన్నీ వ్యతిరేకముగా వర్తిస్తవి. ఈభావాలు సారస్వతంలో ఏవిధముగా ప్రతిబింబిత మయినవో చూతాము. భారతభాగవత రామాయణాలూ, పురాణాలూ, కావ్యాలూ, నాటకాలూ మొదలయినవి పోయినవి పోగా, శిథిలమయినవి కాగా, కొన్ని మిగిలినవి. వాటిలో కొన్ని అచ్చుపడ్డవి. మరికొన్ని అచ్చుపడవలసి ఉన్నవి. వీటిలో ఏగ్రంథము పరిశీలించినా ప్రతిదీ లోకకల్యాణముకొరకు వ్రాసినట్టే కనుపిస్తుంది. ప్రతిగ్రంథము సూచకముగానో, వాచకముగానో రెండువిధాలా కూడా స్తోత్రాలతోటి, ఆశీస్సులతోటి ప్రారంభించి మంగళవాచకాలతోటి, శాంతివచనాలతోటి ముగించినట్టు కనుపిస్తుంది. భారతసారస్వతములో ఏది చూసినా సుఖాంతమే కాని విషాదాంతము సాధారణముగా కనుపించదు. అంతగా కథా సందర్భాన్నిబట్టి విషాదాంత మయ్యేటట్టుగా కనుపించినా, చివరకు శాపవిమోచనమువల్లనో, పరమేశ్వర సాక్షాత్కారమువల్లనో సుఖాంతము అవుతవి. మానవుడు ఎన్నికష్టాలనుభవించినా చివరకు ప్రేమమయుడు, న్యాయమూర్తి, శరణాగతరక్షకుడు అయిన పరమేశ్వరుడు మోక్షము ప్రసాదించడమువల్ల శాశ్వతమయిన ఆనందము అనుభవించగలడనేభావము ఇందువల్ల వ్యక్త మవుతున్నది. కాని పాశ్చాత్యదృష్టికి ఈ భావాలు గోచరించవు. అందువల్ల మరణముతో మనుష్య జీవితము సమాప్తి చెందుతుందని వారు నమ్ముతారు.

అంతే కాకుండా భగవంతుడు భయంకరస్వరూపుడని, మానవులను సర్వదా శిక్షిస్తాడని, హింసిస్తాడని భావిస్తారు. కాబట్టి వారి సారస్వతములో విషాదాంతాలు హెచ్చుగా ఉన్నవి. ముఖ్యపాత్రలను సాధారణముగా సామాన్యమానవులలోనుంచి తీసుకొంటారు. ఆపాత్రలకు అనేక విషమపరిస్థితులు కల్పిస్తారు. అట్టిసందర్భాలలో మానవప్రకృతి ఏవిధముగా ప్రకాశిస్తున్నదో స్వాభావికముగా చిత్రించి లోకజ్ఞానాన్ని బోధిస్తారు. కాని భారతీయులవలె లోకాతీతములయిన ఆదర్శమూర్తులను పాత్రలనుగా సృష్టించి ఉత్తమాదర్శములు ఎదట పెట్టడానికి ప్రయత్నించరు. కాని భారతీయులు ఆదర్శములు, లోకాతీతములు అయిన పాత్రలను భావప్రపంచంలో సృష్టించి భౌతిక ప్రపంచములోకి తీసుకొనివచ్చి కండ్లయెదుట పెట్టి మానవుడు తన ప్రవర్తనమును ఎట్లా దిద్దుకోవలెనో చూపిస్తారు. ఆదర్శప్రాయులయిన సీతారాములు, సావిత్రీసత్యవంతులు, చంద్రమతీ హరిశ్చంద్రులు మొదలయినవారు కూడా సుఖదుఃఖము లనుభవించే సన్నిహిత బంధువులకుమల్లె కనుపిస్తారు. కాని ఊహాతీతములయి ఉండరు. అర్జునుడికి కలిగిన ఇతికర్తవ్యతామూఢతవంటిదే షేక్సుపీయరు సృష్టించిన హేమ్లెటుపాత్రకు కలిగింది. ఉభయులకు ఒక విధమయిన తాత్కాలిక మానసిక మరణము సంభవించింది. కాని శ్రీకృష్ణభగవానుడు అర్జునుడికి కలిగిన సమస్త సందేహములను తీర్చి మనస్సుకు ఉత్సాహము కలిగించి కర్తవ్యాన్ని నిశ్చయించి కార్యరంగములోకి ప్రవేశింపజేసి నిష్కామ కర్మతో ధర్మ సంస్థాపనము, దానితోపాటు లోకకల్యాణము సమకూర్చినాడు. తద్ద్వారా సాధారణముగా ప్రతిమానవుడి జీవితములోనూ కలిగే మహాసమస్యను పరిష్కరించినాడు. శ్రీకృష్ణుడు లాంటిపాత్రను షేక్సుపీయరులాంటి మహాకవికూడా సృష్టించలేకపోయినాడు. అందువల్లనే హేమ్లెటు లాంటి ఉత్తమ పాత్రకు ఆత్మహత్య శరణ్యము కావలసి వచ్చినది.

భారత సారస్వతములో కనబడే వర్ణనలను బట్టి ప్రకృతి మానవులకు తీరని సంబంధ మున్నదని వ్యక్తమవుతున్నది. పశుపక్ష్యాదులు, సూర్యచంద్ర నక్షత్రాలు, అవీ యివీ అనక సమస్త చరాచర ప్రపంచము మానవుడు అనుభవించే సుఖదుఃఖాలను పంచుకొన్నారా అనిపిస్తున్నది. అదేవిధముగా మానవుడు వాటిని తన ఆప్తబంధువులు, ఆప్తమిత్రులు అయినట్టుగా భావించినట్టు కనుపిస్తుంది. శైశవములో శకుంతలను శకుంత(?) పక్షులు రక్షించడము, కణ్వాశ్రమములో ప్రేమతో పెంచిన హరిణ్యాదిసాధు మృగములను, వృక్షలతాదులను విడిచిపెట్టి పొయ్యేటప్పుడు శకుంతలకు కలిగిన హృదయవేదన, దిలీపమహారాజు వసిష్ఠధేను సంరక్షణార్థము వనములో పాదచారిఅయి పోతూఉన్న సమయములో వనవృక్షాలు అతనికి చేసిన రాజోపచారములు, దేవదారు వృక్షమును పార్వతీపరమేశ్వరులు తమ పుత్రుడయిన కుమారస్వామితో సమానముగా పెంచడము, అవతార పురుషులయిన మహాత్ముల జననమరణ సమయాలలో సంభవించే విచిత్ర ప్రకృతి పరిణామాలు అన్నీ ప్రకృతి మానవులకు ఉన్న అన్యోన్య సంబంధాన్ని ప్రకటిస్తున్నవి. ఇటువంటివి పాశ్చాత్య సారస్వతములో చాలా తక్కువ.

ఇక అలంకారాల సంగతి: భారత సారస్వతములో విశేషముగా కనుపించేవి ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, రూపకము, తత్తుల్యములు. స్వభావోక్తి తక్కువ. కాని పాశ్చాత్య సారస్వతములో స్వభావోక్తి హెచ్చు. ఉపమతప్ప మిగిలినవి మృగ్యములు. అట్లా ఉండడములో ఆశ్చర్యము లేదు. ఒకరికి ప్రత్యక్షములో నుంచి అప్రత్యక్షము గోచరిస్తే మరొకరికి ప్రత్యక్షము ప్రత్యక్షముగానే గోచరిస్తుంది. ఎదుట కనుపించే వస్తువు ఒక్కటే అయినప్పటికిన్నీ అది చూసినప్పుడు భావనా ప్రపంచములో ఒకరు సంచరిస్తే భౌతిక ప్రపంచములో మరొకరు సంచరిస్తారు. ఒకరు భావానికి రూపము కల్పిస్తే యింకొకరు ఉన్నరూపము ఉన్నట్టుగానే కండ్లకు కట్టేలాగున వర్ణిస్తారు. అందువల్లనే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మొదలయిన దేవతల స్వరూపాలు పాశ్చాత్య దృష్టికి అస్వాభావికములు, వికృతములు అయి ఉన్నట్టుగానే కనుపిస్తవి. అవే

భారతీయదృష్టికి భగవంతుడి నిత్యకల్యాణగుణములను స్ఫురింపజేసే పవిత్రరూపములుగా తోస్తవి. ఒక దేవతకు ఉన్న నామము లన్నీ సమకూర్చి వాటిఅర్థము యోజిస్తే ఆదేవత స్వరూప స్వభావాలు మనోనేత్రానికి గోచరిస్తవి.

భావానికి రూపకల్పన సారస్వతములోనే కాకుండా శిల్పములోనూ, చిత్తరువులలోనూ, కనుపిస్తుంది. పాశ్చాత్యుల వీనస్, అప్పాలో (Venus & Appolio) విగ్రహాలను మించిన సహజ సుందరరూపాలు ప్రపంచములో ఎక్కడా లేవని ప్రతీతి. అందు కాశ్చర్యపడవలసిన పని లేదు. ఒకరు కల్పించేది భావసౌందర్యము. మరొకరు కల్పించేది రూపసౌందర్యము. సారస్వతానికి శిల్పచిత్రకళలకు సహజమయిన సన్నిహిత సంబంధము ఉండడమువల్ల ఒకదానిలో కనుపించే లక్షణాలే మరొకదానిలోనూ కనుపిస్తవి. నాట్యసంగీతాలు మొదలయిన యితర లలితకళల విషయములలో కూడా అంతే.

ఇక శాస్త్రాల సంగతి. భగవద్ధ్యాన తత్పరులయిన మహర్షులు సమాధ్యవస్థలో ఉన్నప్పుడు వారికి గోచరించిన మహాసత్యాలనుంచే వివిధశాస్త్రాలూ పుట్టినవి. అందుచేతనే అవి ఇంతవరకు ఏవిధమయిన మార్పు చెందకుండా నిలిచిఉన్నవి. భారతీయ శాస్త్రాలన్నీ ఒక్క అఖండ సత్యమునుంచి వెలువడిన ఖండసత్యాలు కావడమువల్ల ఏశాస్త్రాన్ని పఠించినా అఖండ సత్యమయిన బ్రహ్మపదార్థము వైపుకే తోవ చూపిస్తుంది. ఒక శాస్త్రములో కలిగిన జ్ఞానము తృప్తిని కలిగించక ఇతర శాస్త్రజ్ఞానపిపాస కలిగిస్తుంది. తచ్ఛాస్త్రజ్ఞానము వివిధశాస్త్రములకు కల పరస్పర సంబంధాన్ని విశదము చేస్తుంది. అంతే కాకుండా మానవుణ్ణి అహంకారశూన్యుణ్ణి, బ్రహ్మజిజ్ఞాసాసంపన్నుణ్ణి చేస్తుంది. భారతీయశాస్త్రాలు జితేంద్రియులయిన ఋషిసత్తముల బ్రహ్మజిజ్ఞాసవల్ల పుట్టి తిరిగీ బ్రహ్మజిజ్ఞాసకు ఎట్లా ఉపకరిస్తవో అట్లానే పాశ్చాత్యశాస్త్రాలు అహంకారపూరితులకు నైసర్గికమయిన అహమహమికవల్లకలిగి రాజ్యకాంక్ష, శత్రుజిగీష మొదలయిన స్వార్థ లక్షణములు కలవారి హృదయాలలోనుంచి బయలుదేరడమువల్ల అవి భోగాభిలాషియొక్క వ్యవహారదృష్టికి తగినవిగా ఉంటవి. అంతే కాకుండా తిరిగి అహంకారాన్ని, అహమహమికను వృద్ధిచేస్తవి. అవి యోగదృష్టి సాధితములు, నిత్యసత్య సంయుతములు, చిరంజీవములు అయి ఉంటే యివి శాస్త్రప్రయోగ తర్కమీమాంసా సాధితములు, ఆభాససత్య సమ్మత సిద్ధాంత సంయుతములు, అచిరంజీవములు అవుతున్నవి. అందువల్లనే అవి ఆధ్యాత్మిక జ్ఞాన సంపాదకములు, ఇవి ఐహికసౌఖ్య దాయకములు.

ఇక మత రాజకీయ సాంఘిక విషయాలను గురించి సూచిస్తాను. భారతదేశములో జరిగిన యుద్ధాలు సాధారణముగా ధర్మసంస్థాపనకొరకే గానీ, రాజ్య సంపాదనకొరకు గాదు. ప్రజకోసరము ప్రభువు కానీ, ప్రభువు కోసరము ప్రజ కాదు. రాజుకు రాజ్యపరిపాలనా విధానములో హితోపదేశము చేయగల మంత్రిసత్తములే కాకుండా ధర్మాధర్మములు నిర్ణయించి అతన్ని ధర్మపథగామిగా చేయగల పురోహితులుకూడా ఉండేవాళ్లు. ఆతడు యిహపరములను సమన్వయము చేసి ఈశ్వరసేవ, మానవసేవ ఏకకాలమందే చేస్తుండేవాడు. వివాహము ఇహపరసౌఖ్యముల నిచ్చు శాశ్వతబంధము కాని ఐచ్ఛిక విమోచనార్హమయిన ఐహికబంధము కాదు. సంతానప్రాప్తికోసరం కాని కామసంతృప్తి కోసరము కాదు. భార్య సహధర్మచారిణి కాని కామకళా తంత్రానికి యంత్రము కాదు. కీర్తిశేషులయిన మహాత్ముల జన్మదినోత్సవాలు జరుపుతారు కాని మరణదినోత్సవాలు జరపరు. భీష్మనిర్యాణ దినోత్సవము జరపడానికి కారణము వేరు. గోవృషభాదిసాధుజంతు సంరక్షణము, అశ్వత్థామలకాదివృక్షపూజారక్షణములు, అతిథిసత్కారము, గురుకులవాసము, తీర్థయాత్రాసేవనము, దేవాలయప్రతిష్ఠ, ధర్మసత్ర సంస్థాపనము, అవిభక్త కుటుంబ సంప్రదాయము, దత్తస్వీకార పద్ధతి, నామకరణ విధానము, శుభాశుభ సమయములలో చేసే భూరిసంభావనాసంతర్పణలు, అవి ఇవి

ఏమిటి, ఏది పరిశీలించినా భారతీయుల పారమార్థిక దృష్టి వ్యక్తమవుతుంది. వ్యావహారిక దృష్టిగల పాశ్చాత్యుల జీవితములో ఇవన్నీ వ్యతిరేకముగా కనుపిస్తవి.

ఇంతవరకు పారమార్థిక వ్యావహారికదృష్టులు సారస్వతాదులలో ఎట్లా చిహ్నితము లయినవో ప్రస్తుత సందర్భానికి అవసరమయినంతవరకు సూచించినాము. ఇక ఈదృష్టులు వైద్య సంప్రదాయాలలో ఏవిధముగా ప్రతిబింబితములు అయిఉన్నవో దిఙ్మాత్రముగా చూపిస్తాము.

ప్రాచ్యదేశాలవారి సంప్రదాయాలలో పురాతనము, సుప్రసిద్ధము, చిరంజీవము, స్థిరమూల సూత్రబద్ధము, సంతతాభివృద్ధి సాధ్యము అయినది ఆయుర్వేదము. మిగిలినవి దానికి పుత్రికలు, సంగ్రహములు, అనుకరణములు, ఆభాసములు. పాశ్చాత్యవైద్యవిధానములలో ముఖ్యమయినది అలోపతి (Allopathy). దీన్నే మనవాండ్లు ఇంగ్లీషు వైద్యమని వ్యవహరిస్తున్నారు. సాధారణముగా గవర్నమెంటుకు సంబంధించిన ఆసుపత్రీలలో చేసేది ఇంగ్లీషువైద్యమే. ఇదొక వైద్య విధానమే కాని సంప్రదాయము కాదు. దీనిసిద్ధాంతాలు ఒకదానితో మరొకటి సంబంధించి ఉన్నప్పటికి అన్నిటిని ముడివేయతగిన మూలసూత్రము కనుపించదు. ఆయుర్వేదములోనుంచే అలోపతి పుట్టిందనే సంగతి చరిత్రప్రసిద్ధమయిన నిర్వివాదాంశము. ముఖ్యముగా శస్త్రచికిత్స, ప్రసూతి తంత్రము ఆయుర్వేదమునుంచి సంగ్రహించినవే. సుశ్రుతుని శస్త్రములకు ప్రస్తుతము అలోపతి వాడుతున్న వాటికి నామభేదమే కాని రూపభేదమంతగా లేదు. కాకపోతే కొంచెము మార్పు కలిగి ఉండవచ్చును. ప్రసూతి తంత్రములో మనపూర్వులు చెప్పిన దానికంటే మించి వారు నూతనముగా కనిపెట్టిందేమీ లేదని తేలింద. వైద్యసంబంధమయిన యితర విషయాలలో, అనగా రోగనిర్ణయము, యోగకల్పనము, చికిత్స, ఔషధ నిర్మాణము మొదలయిన వాటిని గురించి ఆయుర్వేదము చెప్పిన విషయాలను అలోపతి సరిగా గ్రహించలేకపోయినది. బాహ్యరూపాన్ని చూసిందే కాని అంతస్తత్వాన్ని చూడలేదు. ఆయుర్వేదములోనుంచి అలోపతి పుట్టిం దన్నమాటే కాని పైన చెప్పిన కారణాలనుబట్టి స్వభావములోనూ, లక్షణాలలోనూ ప్రాచ్యపాశ్చాత్య దిక్కులకు దృక్కులకు ఎంత భేద మున్నదో వీటికి అంత భేద మున్నది. తత్త్వ సంప్రదాయాలు గ్రహించక స్థూలదృష్టికి గోచరించినవి మాత్రము స్వీకరించి కార్యరంగములోకి ప్రవేశించేసరికి వాటివల్ల తగినంత ప్రయోజనము లేకపోయినది. అందువల్లనే ఏవో కొన్ని, అనగా మామూలుగా కలిగే సామాన్యవ్యాధులకు చికిత్స చేయడమే కాని కఠినమయిన వాటికి, దీర్ఘమయినవాటికి అలోపతిలో తగిన చికిత్స లేదు. ప్రభుత్వసహాయము ఉండడమువల్లనూ, యితర దేశకాలపరిస్థితులను బట్టిన్ని అది అతిత్వరితముగా విశేషవ్యాప్తి పొందడము, దానిమాతృక అయి సర్వవిధములా సమర్థమయిన ఆయుర్వేదము నానాటికి అడుగంటే స్థితికి రావడము తటస్థించింది. అటువంటి సమయములో పాశ్చాత్యదేశాలలో కొందరు మహాపురుషులు బయలుదేరి అలోపతిని ఖండించడము మొదలుపెట్టినారు. అది సంప్రదాయ రహితమయినదనీ, దానివల్ల కలిగే తాత్కాలిక రోగశాంతినుంచి లాభముకంటే నష్టమే ఎక్కువనీ, దానివల్ల ప్రపంచమునకు అపకారము కలుగుతున్నదనీన్నీ కనబరస్తూ దాన్ని తీవ్రముగా ఖండించినారు. లూయి కూని (Luis Khune), ఏడాల్ఫు జస్టు (Adolf Just), డాక్టరు బాబిట్ (Dr. Babbit), డాక్టరు షూస్లరు (Dr. Schuessler), డాక్టరు హానిమన్ (Dr. Hahnemann), మొదలయినవారిగ్రంథాలను పరిశీలిస్తే ఈసంగతులు తెలుస్తవి. వాట్లలోనూ ముఖ్యముగా హోమోపతీ (Homoeo-pathy) వైద్యపితామహుడుఅయిన డాక్టరు హానిమన్ రచించిన ఆర్గనన్ (Organon) అనే ఉద్గ్రంథము తప్పక పఠించ తగినది. అందులో అతడు అలోపతి వైద్యమును నిర్దాక్షిణ్యముగా ఖండించినాడు. దానిలోలోపాలు చక్కగా చూపించినాడు. పైన ఉదాహరించిన వారిలో ఒక్కొక్కరు ఒక్కొక్క వైద్య సంప్రదాయమునకు మూలపురుషులు, అలోపతిమీద వారికి

కలిగిన అసంతృప్తి, అసహ్యము వా రీనూతనవైద్య సంప్రదాయములు కనిపెట్టడానికి కారణములు అయినవి. ఇవి సంప్రదాయసిద్ధములు అయినప్పటికి ఖండసత్యములు అనక తప్పదు. ఇవి ఆయుర్వేదములోని కొన్ని సిద్ధాంతాలు పొందిన నూతనరూపాలు. అది ఏలాగో సందర్భము వచ్చినప్పుడు చెపుతాను.

ఇపుడు ప్రాచ్య పాశ్చాత్యదేశాలలో కనుపించే వివిధవైద్యవిధాన సంప్రదాయాలతో ప్రస్తుతము మనకు పనిలేదు. మనకు విమర్శనార్హమయినవి రెండే: ఆయుర్వేదము, అలోపతి. ఈరెంటితత్త్వ సిద్ధాంతాలను గురించి చర్చించడానికి ఇది సందర్భము కాదు. వీటి దృష్టి భేదాన్ని చూపించడమే ప్రస్తుత కర్తవ్యము. అనుదినమూ మనము చూస్తున్న విషయాలను జ్ఞప్తికి తెచ్చుకొంటే ఈవిషయము బోధపడుతుంది. అసాధ్యమని అలోపతి విడిచిపెట్టిన అనేక వ్యాధులకు కఠినమయిన వాటికి దీర్ఘమయిన వాటికి కూడా ఆయుర్వేదము శరణ్యము కావలసి వస్తున్నది. దీనికి కారణము ఏమయిఉంటుందని ఆలోచిద్దాము.

వైద్యవిధానములో ముఖ్యమయినది రోగనిర్ణయము అది సరిగా ఉంటేనే తప్ప చికిత్స సాధ్యము కాదు ఈరోగనిర్ణయములోనే అలోపతికి ఆయుర్వేదమునకు హస్తిమశకాంతరము వ్యత్యాసము ఉంది. ఆయుర్వేదము రోగలక్షణాలను బట్టి కారణము నిర్ణయిస్తుంది. కారణాన్ని నిర్మూలించడమువల్ల లక్షణాలు అదృశ్యము కావడమే కాకుండా రోగముకూడా నిర్మూలము అవుతుంది. అలోపతి అలా కాదు. బాహ్యలక్షణాలే రోగమని దాని భ్రాంతి. అందుచేత లక్షణాలు అదృశ్యము కావడముతోనే రోగము పోయిందని ఊహిస్తుంది. రోగకారణానికి లక్షణాలు బాహ్యపరిణామములు అనే సంగతి అది గుర్తించడము లేదు. అందుకనే దానిచికిత్స లక్షణాలు అదృశ్యము కావడానికే కాని రోగకారణము నిర్మూలము కావడానికి కాదు. ఆకారణమువల్ల రోగాలు అప్పటి కప్పుడు నివారణ అయినట్లు కనుపించినా అంతర్గతమయి ఉండి తిరిగి మారురూపాలతో ప్రత్యక్షమవుతవి. కనుపించినప్పుడల్లా చికిత్సవల్ల శాంతించినా నిర్మూలము కాకపోవడమువల్ల రాను రాను కఠినములు, దీర్ఘములు అయి, ఒకస్థితి వచ్చేసరికి అసాధ్యములుకూడా అవుతవి. అట్లా అసాధ్యములని అలోపతి నిర్ణయించి వ్యాధు లనేకము ఆయుర్వేద చికిత్స పొంది నివారణ అయినవి ప్రత్యక్షముగా చూస్తూనే ఉన్నాము. కనుక ఆయుర్వేదము లోతుకు దిగి సూక్ష్మదృష్టితో పరిశీలిస్తుందనీ, అలోపతి లోతుకు దిగకుండా పైపైన స్థూలదృష్టితో చూస్తుందనీ స్పష్టమవుతున్నది. ప్రస్తుతము ఈవిషయ మింతే.

భారతదేశానికి సంబంధించిన ఏవిషయమయినప్పటికి, అందులోనూ ముఖ్యముగా ఆయుర్వేదాన్ని, దానికి సంబంధించిన విషయాలను సమబుద్ధితో తెలుసుకోవలె నన్నా, ఇతర సంప్రదాయాలతో దాన్ని పోల్చి చర్చించవలె నన్నా, భారతీయ దృష్టి యిదమిత్థమని నిర్ణయించడమే కాకుండా ప్రాచ్యపాశ్చాత్యదృష్టులకు ఉండే భేదముకూడా చూపించడము అవసరమని భావించి ఆప్రకారము చేసినాము.

ప్రత్యేక విషయాలను ముందు వ్రాస్తాను.

[సూచన:—ఈవ్యాసములోని జాతకభాగము నామిత్రులు శ్రీనివాసశిరోమణి వ్రాసిన జైమినిసూత్రోపోద్ఘాతములోనుంచి సంగ్రహించినది.

—క. ల. న.]

# యమునకు కొన్ని సూచనలు



శ్రీసాంఖ్యాయనశర్మగా రన్న పండితుల కంతులేని గౌరవము. స్వగ్రామమునందైనను లౌకికవ్యవహారములలో వీరితో సంబంధము గలవారి కీపేరు చెప్పిన వా రెవరో మాకు తెలియ దందురు. ఆచంట వేంకటరావు పంతులుగా రన్న పండితులు మాకు తెలియ దందురు. ఆంధ్రసారస్వతలోకమున నిది యొక విశేషము. సాంఖ్యాయనశర్మగారే యొక విశేషముగ గనబడెదరు—చూడ జూడ.

పరిచయము లేనివారు గూడ వీరిముఖమును చూచినవెంటనే వీ రొక మహావ్యక్తి యని యనుకొనక తప్పదు. ఆముఖమున పాండిత్యప్రజ్ఞ, కార్యదీక్ష, లోకజ్ఞానము, సునిశితబుద్ధియును తాండవ మాడుచుండును. పరిచయము కలిగినకొలది వీరియెడల నంతులేని భక్తి, గౌరవము కలుగును. ఎట్టివారినైనను మోహింపజేయగలుగుట వీరిసొమ్ము.

వీరు సంస్కృతాంధ్రములందు సాటిలేని పండితులు. పండితులన్న కావ్యములను చదువుకొని కబుర్లు చెప్పుట యని యర్థము కాదు. వ్యాకరణము, తర్కము, దేశచరిత్ర, వేదములు, వేదాంతము, మంత్రశాస్త్రము, అలంకారశాస్త్రము, సంగీతవిమర్శ, శిల్పచిత్రముల చరిత్ర, నాట్యకళ—వేయేల, వీరు పరిచయము కలుగజేసుకొని, తమబుద్ధితో విమర్శించి, క్రొత్తవిషయములను గనిపెట్టని సనాతనభారతీయవిజ్ఞానభాగము లేదు. ఉత్తరరామచరిత్రమును నిర్దుష్టమగు వచనకావ్యముగను, విక్రమోర్వశీయమును చక్కని నాటకముగను ఆంధ్రీకరించి యాంధ్రీకరణమన్న నెటు లుండవలెనో చూపిరి. మనోరమ, పార్థివ పరాజయము, అవదాత కలభకము అను స్వకల్పిత రూపకములను, సుధానిధి యను పద్యకావ్యమును రచించిరి. గ్రామ్యభాషవలె కనబడు నీచపాత్రల మాటలను వాటివైఖరి చెడకుండునటుల వ్యాకరణబద్ధముగ వ్రాసి యిప్పుడాంధ్రదేశమున జరుగుచున్న భాషావివాదమున కొక నూతనవిషయమును చేర్చి భాషావివాదమున జొరక నాటకములను వ్రాయువారి కొక క్రొత్తమార్గమును జూపిరి. సంస్కృతమున గల రూపకముల, తత్సంబంధశాస్త్రముల నన్నింటిని జదివి, నాట్యప్రబంధ నిరూపణముగ నాట్యకళనుగూర్చి "రూపకసర్వస్వ"మను సమగ్రగ్రంథమును రచించిరి. ఈమహాగ్రంథ మింక నచ్చుకాకుండుట యాంధ్రసారస్వతలోకము నావరించియున్న దారిద్ర్య—ఉపేక్షలకు నిదర్శనము. ఆంగ్ల కావ్యములను చదివి, యాభాషయందు గల రసాయన వస్తువిజ్ఞాన భూతత్త్వ వృక్షతత్త్వ ఖగోళ, భూగోళ శాస్త్రములందు మంచి పరిచయము గలుగజేసుకొనిరి. భూమియొక్కయు, క్రిమి

కీటకములయొక్కయు, మనుష్యులయొక్కయు ప్రారంభావిర్భావములను గూర్చి చదివి విమర్శించి నూతనవిషయముల నావిజ్ఞానమునకు చేకూర్చిరి. భూమితత్వ మను గ్రంథమును రచించి భూగర్భశాస్త్రజ్ఞుల మన్నలను బడసి యాంధ్రభాష కొకయలంకారమును జేకూర్చిరి. దేశచరిత్రమును చదివి సనాతనహైందవ నాగరికత యుత్కృష్టము కాదనియు, మొన్నటిదనియు వ్రాసిన పాశ్చాత్యపండితులను సహేతుకముగ ఖండించిరి. మనుష్యేతరజీవముల జీవరహస్యములను 'రహస్యదర్పణ' మను వచనగ్రంథమున మృదుమధురశైలిని వ్రాసిరి. ప్రకృతిశాస్త్రజ్ఞులు, భూతత్త్వజ్ఞులు మొదలగు పండితు లీగ్రంథము నెంతయు గొనియాడి యున్నారు.

౧౯౨౨-వ సంవత్సరము, జూను నెల ౧౦, ౧౧, ౧౨ తేదులందు నిడుదవోలులో జరిగిన పదునాఱవ నియోగిమహాసభకు అధ్యక్షత వహించి యొసంగిన యుపన్యాసము జాతీయతాభివృద్ధికి దోహదమై యున్నది. ౧౯౨౩ సం. ము జనవరి ౨౦, ౨౧ తేదులందు గుంటూరు మండలములోని నండూరు గ్రామమున జరిగిన ఆరవయాంధ్ర సారస్వత మహాసభ కధ్యక్షత వహించిరి. ౧౯౨౭-వ సంవత్సరము తణుకులో జరిగిన పదమూడవ ఆంధ్రసాహిత్యపరిషద్వార్షిక సభ కధ్యక్షులుగ నుండిరి. ౧౯౨౯-వ సంవత్సరము జూను ౧౯, ౨౦, ౨౧ తేదులందు తెనాలిలో జరిగిన ప్రథమాంధ్ర నాటకకళాపరిషత్సభ కధ్యక్షత వహించిరి. ఈ మూడు ఉపన్యాసములను జదివిన యాంధ్రులు వీరిపరిశోధనశక్తిని, బుద్ధిపాటవమును విమర్శకపరిజ్ఞానమును, సర్వతోముఖమైన పాండిత్యమును గీర్తించిరి. విజయనగరమందలి విజయాంధ్రగ్రంథాలయ వార్షికోత్సవమున కధ్యక్షత వహించి మనోజ్ఞకళల (Fine arts) కు గల పరస్పర సంబంధమును గూర్చి యొసంగిన యుపన్యాస మమూల్యమైనది. ౧౯౨౭ సం. ఆగస్టు ౩౧-వ తేదీని రాజమహేంద్రవరములోని మెట్కాఫ్ వసతిగృహ వార్షికోత్సవమున కధ్యక్షత వహించి పండితరాజు లనిపించుకొనిరి.

వేదము వేంకటరాయ శాస్త్రిలవారికిని, కల్లూరి వేంకటరామశాస్త్రిలవారికిని "శ్రీమన్మహోపాధ్యాయ" బిరుదము నొసంగిన యాంధ్రసారస్వతమహాసభవారు శ్రీసాంఖ్యాయన శర్మగారి ధీశక్తిని, సర్వతోముఖమైన పాండితీగరిమను గమనించి పెదచెరుకూరునందు జరిగిన అష్టమసభయందు వీరికి "శ్రీమన్మహోపాధ్యాయ" బిరుదమును సమర్పించి సన్మానించిరి.

నాలుగవ ఆంధ్రసారస్వత మహాసభ కధ్యక్షత వహించిన కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు సభాకార్యము ముగిసిన తరువాత ప్రసంగించుచు, "మన తెలుగు దేశమునకు బ్రహ్మశ్రీయుతులు వేదము వేంకటరాయ శాస్త్రిల వారును, ఆచంట వేంకటరాయ

సాంఖ్యాయనశర్మగారును విజ్ఞానసర్వస్వముల వంటివారని యుగ్గడించిరి. పండితులు "శభా" సనిరి.

"ఆంధ్రభీష్మ" లని వీరిని విశ్వనాథ సత్యనారాయణగారు పేర్కొనిరి.

ఈ యభిప్రాయములను విశేషము పేర్కొన నేల?

వీరు ౧౮౮౦-వ సంవత్సరము మొదలు ౧౮౮౩ సం. వరకు "సుజన ప్రమోదిని" యను మాసపత్రికను మేరంగినుండి ప్రకటించిరి. ౧౯౦౩ లో విశాఖపట్టణమునుండి "కల్పలత" యను మాసపత్రికను బ్రకటింప నారంభించిరి. గ్రాహకుల మాంద్యమువలన ౧౯౦౮ లో ప్రకటనమును మానివేసి, మిత్రులు కోరగా ౧౯౨౧-వ సం. మున మరల నారంభించి యాసంవత్సరముననే విరమించిరి. సుప్రసిద్ధాంధ్రపండితులు వీరి వ్యాసములను గాంచి వీరు సరస్వతి యపరావతారమని నుతించిరి.

పాండిత్యమునందే కాదు వీరిప్రజ్ఞ, వ్యవసాయమున నూతన మార్గములను ద్రొక్కి చూచిరి. ఖనిజములను బరిశీలించి, వాటిని పరిశీలనకొరకు ఇంగ్లాండు మొదలగు దేశములకు బంపుచుండిరి. గ్రహణములు మొదలైనవి జరిగినప్పుడు పాశ్చాత్యజ్యోతిషపండితులు తీయుచుండిన ఛాయాచిత్రములను పరిశీలనార్థము తెప్పించుచుండిరి. నూతన విషయమైమేదియైన నసందేహముకలిగినయెడల పాశ్చాత్య పండితులతో నుత్తర ప్రత్యుత్తరములను జరుపుచుందురు. విజ్ఞానమునం దింతటి యభిలాష కలదు కనుకనే యిం దింతటి యసమాన పాండిత్యము నార్జింపగలిగిరి.

దీనికి తోడు వీరి మేధాశక్తి యతినిశితము. ఇంతటి జ్ఞానమును స్వయంకృషివలననే కలిగెను. సంస్కృతాంధ్రాంగ్ల భాషలు తమంతట తామే నేర్చుకొనిరి. మిడిల్‌స్కూలు పరీక్షకు బోయి రాజధానియంతకును బ్రథములుగ నుత్తీర్ణులైరి. ఇంటివద్దనే చదివి ప్లీడరీ ప్యాసైరి.

రక్తాక్షి, ఆశ్వయుజ బ ౧౧ బుధవారము నాడు వీరిజననము. ఇంతటి వృద్ధులైనను వీరి మేధస్సుయొక్క ప్రతిభ తగ్గలేదు.

ఒకసంస్థానమునకు దివాంజీగా నుండిరి. ఇప్పుడు పేరుగన్న ప్లీడరు.

వీరి కవిత్వము సరళము, మధురము, భావగర్భితము. అందరు చదివి యానందింపగల సులభశైలి వీరిది. రహస్యదర్పణమువంటి గ్రంథమునను వీరికవనముయొక్క సొగసు సుగోచరము కాగలదని చెప్పిన జాలును.

కొందరు పండితులవలె తాము చిన్నప్పుడు నేర్చుకొనినదే నిజమనియు, నిప్పటివారు చెప్పునది సరి కాదనియు ననరు. "భావకవు" లని పిలువబడుచున్నవారు కూడ వీరి ప్రోత్సాహమును బడయుచుందురు. యువకులు వీరియెడల మిగుల గౌరవముతో మెలగుచుందురు.



శ్రీమన్మహోపాధ్యాయ సాంఖ్యాయన శర్మగారు

విజ్ఞానవిషయములందుగాని, లౌకికవ్యవహారములందు గాని వీరితో సంప్రదించుట కెంతయు నానందముగ నుండును. ఎట్టివారికిని నిరుత్సాహము కలుగదు. మున్ముందు దేశసేవను చేయుట కత్యుత్సాహము కలుగును. వీరియొద్దకు పోయినయెడల నన్ని శాస్త్రములందు గలిగిన సంశయములు తీరునని ధైర్యము కలుగును.

హాస్యమునందు వీరు సుప్రసిద్ధులు. ఎవ్వరికిని నొప్పి కలుగదు; అందరిని మెప్పించును.

శ్రీసాంఖ్యాయనశర్మగారొక సంస్థ. అపరూపపువ్యక్తి.

అన్నివిధముల దేశమున సంచలనము కలుగుచున్న యీకాలమున శ్రీ సాంఖ్యాయన శర్మగారి సర్వతోముఖవిజ్ఞాన మమూల్యముగ నుండగలదు. వీరి యసమానపాండిత్యమును దేశ మెటుల వినియోగింప గలుగుచున్నది? మౌనమే యీప్రశ్నకు ప్రత్యుత్తరము.

పై నభోమణి తన తలపైన తీక్ష్ణ - కాంతు లొలయింప బడమటి గాడ్పులెగసి
బుసలుకొట్టగ విషవహ్ని ముసరికొనగ - గ్రీష్మకాలాహి తన పడగెత్తి నిలిచె.

చిచ్చుగురియించు నెండలో శిరము వంచి - భూతపస్వినీమణి తపోముద్ర దాల్చి
తనదుతాలిమి తను గాచికొనగ నిలిచె - అగ్గిగుండంబు నడుమ సీతమ్మ యనగ.

లేరు నటకులు చూచెడు వారు లేరు - ఖరకరుడె దీప మగుచు నెక్కటి వెలుంగ
తా వెలార్చెడు ప్రకృతిచిత్రములు మెరయ - వ్రేలుచున్నది తెరవోలె విశ్వమెల్ల.

అఖిల విశ్వంబు బాలించునట్టి ప్రభువు - సూర్యు డాగ్రహోదగ్రుడై చూచుచుండ
నరులు వెగడొంది దాగుకొన్నార, లిండ్ల -తలుపులు బిగించుకొని దివాంధములుబోలె.

ఒండొరులతోడ కలియరాకుండ నిండ్లు - వెడలనీయక నడివీధి నడువనీక
జనుల నరికట్టె సైనికశాసన ప్ర - యోగమునబోలె నుగ్రుడై యుష్ణకరుడు.

వీచుచున్న పడమటిగాలి విసరు లొరసి - కదలునాకు చూరుల గలగలలు తక్క-
తక్కు-శబ్ద మాలింపరాదయ్యె నప్పు - డూరు కనుపించె నొక్క-యెడారిపోలె.

అమృతమును బోలె విననయ్యె నపుడు నాకు - నవ్యమధురరాగాలాపనం బొకండు
హోమకుండాగ్ని కీలల నుద్భవించి - యజ్ఞపురుషు డందించు పాయసము లీల.

నరసిన గడ్డమున్ మిగుల నల్లని మోటుశరీర మంతటన్
జిరిగిన బట్ట, మోవిపయి జేర్చిన యానపకాయబుఱ్ఱ; యీ
తెరగు బికారి యయ్యు జగతిం గరగించిన వాని పాటలో
కరగుచు సూర్యుడే కరడుకట్టెను చల్లని మంచుగడ్డగా.

విలయకేళీరసావేశ వివశు డగుచు - అగ్నినడుమను తాండవమాడిపోవు
ఆ మహోగ్రరసికుడైన యభవు డనగ - పాడె నాతండు గ్రీష్మాతపంబునడుమ.

నల్లనగు కోయిలం బోల్ప నయ్యె నతడు - నల్లని శరీర మమర గానంబు నెరప
అతని గానంబు మధ్యందినాతపమున - వికసనము జెందె మంకెన విరియుబోలె.

సరసతఁ బండువెన్నెలఁ బ్రశాంత వినీలిమ ముద్రగొన్న తా
మరకొలనన్ కుమారపవమానుని లాలన బుల్కలట్ల వే
దరగల జిట్లు వెన్నెలల తళ్కుల దేలెడు తమ్మిరేకుపై
దిరుగుచు పాటపాడు నెలదేటిరుతిన్ దలపించు రాగముల్.

చెలు వలరారు నీలగిరిశృంగమునన్ విరిసెజ్జ బండు వె
న్నెల నునునిగ్గు సోక శయనించి వినీలతమాలశాఖలన్
మలయసమీరకోమలకుమారతరంగము లీను జోల పా
టల గనుమూసి చొక్కుచు గడానికలల్ గనజేయ బాడుచున్.

తా నొక సార్వభౌముడయి తన్మయుడై రసరాజ్య మేలుచున్
మానుగ సార్వభౌమునిగ నన్నొనరింపగ జాలు గాన వి
ద్యానిధి యయ్యు; భిక్షుకు డతండట యేమని చెప్పవచ్చు మా
యా నటనావిలాసము లయారె! జగంబున నెంతచిత్రముల్.

నామెద ముద్రితంబులయి నాటికి నేటికి నొక్కతీరుగా
హాయి నొసంగుచున్న వవురా మధురస్మృతి లక్షితంబులై
యా యరమోడ్పు కన్నుల యొయారము, లా రసశబ్ద సృష్టి లీ
లాయతలాస్యవర్తిత కరాంగుళు లా మృదుమోహనధ్వనుల్.

నడకలు క్రొత్తలై హృదయనాడులలో లయ హత్తి జీవముల్
బడలగజేయుచున్ బిగియబట్టిన పాశము లొక్కసారిగా
సడలగ; మూలమూలలకు సాగిన గానసుధాప్తి దేలుచున్
పడగలు విప్పి యాడినవి పాములువోలె మదీయప్రాణముల్.

---

హిందూ దేశానికి క్రొత్తరాజ్యవిధానము రాబోతోంది. వచ్చేసిందికూడాను. మనకి అక్కర లేదంటూంటే మనకి ప్రసాదించినవాట్లలో నొకటి, రాష్ట్రాలలో రెండవశాసనసభలు.

ప్రజాస్వామిక (Democracy) పరిపాలనంలో రాజ్యము శాసనసభలలో మనప్రతినిధులవలన తయారు చేయబడిన చట్టముల ననుసరించి పరిపాలింపబడుతుంది. శాసనసభలే ప్రజాస్వామికపరిపాలనానికి ప్రాణము. అట్టిశాసనసభలు ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొకటుంటే చాలా, లేక రెండు [భాగాలుగా] వుండాలా అనేది పెద్దసమస్య.

ప్రజాస్వామికపరిపాలనానికి నిజమైన స్థానము ఐరోపాఖండము. ఆఖండంలోవున్న దేశాల్లో మూడు వంతుల మూప్పాతిక రెండవశాసనసభలను కలిగివున్నాయి. అమెరికాఖండంలోకూడా చాలారాష్ట్రాలలో వున్నాయి. అందుచేత ప్రజాస్వామికపరిపాలనము తిన్నగా కొనసాగాలంటే రెండవశాసనసభ లుండితీరాలని చాలా మంది యభిప్రాయము.

ఈ వాదాన్ని చారిత్రకవిషయాలు బలపరుస్తున్నాయి. ఇంగ్లాండు క్రామ్‌వెల్ కాలములో నొకశాసనసభతోనే వ్యవహారం సాగించాలని చూసింది. కాని ౧౬౬౦ లో రాజ్యప్రదానముతో బాటు రెండవశాసనసభా (House of Lords) ప్రదానముకూడా జరిగింది.

అలాగే ఫ్రాన్సుకూడా కొంతకాల మొకశాసనసభతో తృప్తిపడాలనుకుంది. కాని ౫ ఏండ్ల తర్వాత ౧౮౭౫ లో మరల రెండవశాసనసభ నేర్పరుపవలసి వచ్చినది.

రెండు పెద్దదేశాలు రెండవశాసనసభలు లేకుండా పరీక్షచేసి, కష్టమనుకొని, వాటిని తిరిగి యేర్పరుచుకొన్నాయి కాబట్టి, రెండవశాసనసభ లుండితీరాలి అనే వాదము చాలమిక్కుటమయింది.

రెండవ శాసనసభల ఉపయోగాలు చాలా వున్నాయి

౧. శాసనసభలు చట్టమునుచేసినయెడల వాటి కందరును బద్ధులయి తీరాలి. కాని శాసనసభలు ప్రజాభిప్రాయమునకు వ్యతిరిక్తమైన చట్టములను చేయవచ్చును. శాసనసభచేసిన పనిని, తిరిగి పరీక్షించువారెవరును లేక, అధికారమంతయు ఒక్క శాసనసభ చేతులలోనే యుంచిన, ప్రజ లందరు వారి కిష్టము లేని చట్టములవలన బాధలపాలగుట కవకాశ ముంది. కాని రెండవ శాసనసభ గనక ఉండి చట్టమునకు దాని యంగీకారముకూడ కావలసిన, నా రెండవ శాసనసభ యాచట్టమున కంగీకారమునీయక త్రోసి వేయవచ్చును. దీనిమూలమున ప్రజాభిప్రాయము పైకి వచ్చుటకు వ్యవధియేర్పడును.

శాసనసభలు కొన్ని చట్టములను మిగుల త్వరితకాలములో నవ్యవధిగ చేసివేయును. ముందువెనుకల నాలోచించుకొని మంచిచెడ్డ నరయుటకు వ్యవధియుండదు. కాని రెండవశాసనసభయున్నచో నట్టి వ్యవధికలుగ జేయుట కవకాశముండును.

అదిగాక యొకశాసనసభలోనున్న పార్టీలలో నొకటి మిగుల చిన్నదైన వారు మంచిచెప్పినను వినెడివారెవరు నుండరు. ఉ : ఒకశాసనసభలో మెంబర్లు ౧౦౦ ; ఒకపార్టీ ౭౦, రెండవపార్టీ ౩౦ : రెండవ పార్టీ నెగ్గుట కేవిధమైన యవకాశమును లేదు. మొదటి పార్టీనాయకు లెట్లు ప్రవర్తించినను చెల్లును. దాని మూలమున దేశమునకు చెరుగు సంభవింపవచ్చును. కాని రెండవశాసనసభ యట్టిసమయముల నీపార్టీవారు చేసిన దేశారిష్టచట్టములను నిరాకరింపవచ్చును.

అందుచేత ప్రజాభిప్రాయము పైకి తెలియుటకు వ్యవధి నిచ్చుటకును, దేశమును చెడ్డచట్టముల పరిపాలన నుండి తప్పించుటకును రెండవశాసనసభ యవసరము.

౨. శాసనసభలలోని ప్రతినిధులు ఎన్నుకొనబడుదురు. కాని యందరును తగినవారలే యెన్నుకొనబడరు. సాధారణముగ నెవనికి ధనమున్నదో, లేక యెవడు పెద్దసభలలో మాటలాడి ప్రజలమనసును త్రిప్ప గలుగునో వాడే యెన్నుకొనబడును. బాగుగ తెలివిగలవాడు ఎన్నుకొనబడకపోవచ్చును. కాని వారే దేశమునకు ముఖ్యము. తెలియని పదిమందికంటె, తెలిసిన యొకడు చాలును. అట్టివారి సహాయము లేకపోయిన, సరియైన చట్టములు చేయబడవు. వారు శాసనసభలకెన్నుకొనబడుట యరిది. కాని వారిసహాయము నెటులనైనను పొందవలెను. అట్టివారిని రెండవశాసనసభలకెన్నుకొనవచ్చును. వారి కపుడు తమ తెలివితేటలను దేశసౌభాగ్యముకొఱ కుపయోగించుటకు వీలుకలుగును. అందుచేత వారికొఱకు రెండవశాసనసభ లుండవలెను.

3. చట్టము లొకవిధమైన సాంకేతిక (technical) భాషలో నుండవలయును. కాని ఎన్నుకొనబడిన ప్రతినిధులకు సాంకేతికజ్ఞానము లేకపోవచ్చును. సాధారణముగా నుండదు. కాని రెండవశాసనసభలలో (ప్రత్యేకజ్ఞానము కలవారు) specialists ఉండిన, వారి పనిని త్వరితముగను, చక్కగను నెరవేర్చగలరు. చట్టములు సాంకేతికభాషలో నుండునటులు చూడగలుగుదురు.

౪. ప్రతిదేశమునను తక్కువ సంఖ్యవారికి (minorities) ప్రత్యేకరక్షణల నీయవలసియుండును. వారి హక్కులను సంరక్షించుటకు వారికి ప్రత్యేక ప్రాతినిధ్య మవసరము. అట్టివారిని ప్రజాప్రతినిధులతో నొకశాసనసభయందే కలిపివేయుటకంటె వారికొఱకై రెండవశాసనసభ నేర్పరుచుట యుత్తమము.

ఈకారణముల మూలమున రెండవశాసనసభలను తప్పక యుంచవలెను. అట్లుండినయెడ మరికొన్ని లాభములు గలవు.

౫. శాసనసభలలో కాలవ్యవధి యన్నిచట్టములను బాగుగ పరిశోధించుటకు చాలదు. అందుచేత వారు కొన్నికొన్నిచట్టములను బాగుగ పరిశోధింపరు. అటువంటి సమయముల రెండవశాసనసభ వాటిని తిన్నగ పరీక్షించి, తప్పు లున్న మాపించగలదు.

అటులనే శాసనసభలలో చర్చించుటకు కాలవ్యవధి లేకపోయిన, సరియగుచర్చ రెండవశాసనసభలో జరగవచ్చును.

ఎచ్చటను అధికారమునంతను ఒకరిచేతులలో నుంచకూడదు. అధికారము చాలకొద్దియే కావచ్చును. కాని అధికారమున కడ్డు లేదని తెలిసిన,దుర్వినియోగేచ్ఛ ప్రతిమానవునకును జనించును. ఇది మనుష్యస్వభావము. దీనినుండి తప్పించుకొనుటకు సులభమార్గ మొకయడ్డు (check) నుంచుటయే. పూర్వకాలమున రోమనులును, గ్రీకుదేశస్థులు నీసంగతిని గుర్తించుటచేతనే, వారధికారము నెల్లపుడు నిద్దరికి పంచుచుండిరి. స్పార్టాలో రాజు లిద్దరు; సమానమైనహక్కు. అటులనే రోమున 'కాన్సలు' (మేజస్ట్రేటు) లిద్దరు. అందుచేత నధికారము నంత నొకశాసనసభ కీయకూడదు. శాసనసభ చేసినపనులను తిరిగి పరీక్షించి, కావలసిన యడ్డుతగులుటకు శక్తికలిగిన రెండవశాసనసభ యత్యావశ్యకము.

పైన చెప్పిన వాదన లన్నియు చాలమటుకు సహేతుకములే. కాని వీటిని నెరవేర్చుకొనుటకు రెండవశాసనసభలే యవసరమా? లేక మరియొకవిధముగ వీనిని నెరవేర్చుకొనవచ్చునా? రెండవశాసనసభ బాగోగు లేమి? అనునది ప్రస్తుత చర్చనీయాంశము.

౧. నిజముగ నాలోచించిన, చారిత్రకవాద మంత గొప్పది కాదు. ఇప్పటి ప్రజాస్వామికపరిపాలనము ౧౯-వ శతాబ్దినుండి మొదలిడినది. అప్పటికి ప్రజాపరిపాలనమును కలిగియున్నది ఐరోపాఖండమున నింగ్లాండుదేశ మొకటే. ఇంగ్లాండులో రెండు శాసనసభ లుండుటవలన ప్రతిదేశము ఇంగ్లాండు ననుకరించినది. రెండవశాసనసభ లుండాలని సహేతుకముగ నిరూపించినతర్వాత ప్రతిదేశము వానిని నెలకొల్ప

లేదు. ఉన్న శాసనసభలని సమర్థించడానికీవాదనలను లేవదీశారు.

ఇంగ్లాండులో రెండవశాసనసభ ఉండడానికి కారణము విశదమే. ఇంగ్లాండులోని ప్రజాపరిపాలన యొక్క రోజులలో తెచ్చిపెట్టుకొన్నది కాదు. రాజు దగ్గిరనుండి, ప్రభువుల దగ్గిరనుండి ప్రజలు హక్కులను కొంచెముకొంచెముగా సంపాదించారు. కాబట్టి వారు ప్రతివిషయములోను రాజీనామా పడేవారు. రాజునకు కొంత హక్కు, ప్రభువులకు మరికొంత, ప్రజలకు కొంత పంచుకొన్నారు. ఇంగ్లాండున రెండవశాసనసభ మొదట నుండియు నుండుటకిదియే కారణము. కాన, ఇంగ్లాండులో రెండవశాసనసభ యుండుట మూలమున ప్రతిదేశము రెండవశాసనసభను కలిగిఉండాలి యనుట వ్యర్థవాదము. వారి దేశకాలపరిస్థితులనుబట్టి వారి కప్పుడు కావలిసివచ్చింది. ఇప్పుడు కూడా కావలసివస్తుంది అనుకోడంకూడా తప్పు. మొదటి నుంచి ఉండి, మిగిలిన ద్వితీయశాసనసభలకు మాతృకయైన ప్రభువులసభల (House of Lords) హక్కులను పరీక్షిస్తే యీసంగతి తేల్తుంది.

౨. శాసనసభలు ప్రజాభిప్రాయము వెల్లడవడానికి అవకాశము లేనంత యవ్యవధిగ చట్టముల చేయు ననుకొనుటకు కూడ నవకాశములేదు. మన యొక్క శాసనసభ లెట్లు చట్టముల చేయునో చూసిన, యీసంగతి తెలియగలదు. మచ్చునకు హక్కులే లేని మన శాసనసభలైనను సరియే. శారదాబిల్లు చట్టమగుటకు ముందు చాలకాలము ప్రజలు చర్చించలేదా ? శాసనసభలో ప్రవేశపెట్టిన తర్వాత నెన్ని నెలలకు చట్టమైనది! అలాగే 'దేవాలయ ప్రవేశ' బిల్లు కూడాను. అందుచేత యేచట్టములు మరీ యవ్యవధిగ చేయబడవు.

ఇదీ గాక, ప్రతిశాసనసభలోను, ఎదిరిపార్టీ యొకటుండితీరును. ఆపార్టీ యాచట్టము నెదిరించి మీటింగులమూలముననుపేపర్లమూలముననుప్రజాభిప్రాయములను వెల్లడిచేయును.

ఇప్పుడు శాసనసభలలో చట్టములు చేయబడవలెనంటే నది యొకపార్టీయే ప్రవేశపెట్టవలెను. లేక పోయిన చట్టమగుటకు వీలే యుండదు. కాని ఒకపార్టీ యొక క్రొత్తచట్టమును చాలకాల మాలోచించియే ప్రవేశపెట్టును గాని ఒకనాడమాంతముగా ప్రవేశపెట్టదు.

శాసనసభలలో చట్టములు చేయవలసినమార్గ మొకటి ఉంటుంది. సాధారణముగా ప్రతిచట్టము మూడుమార్లు ఆమోదింపబడాలి. రెండవమాటు ఆమోదింపబడినతర్వాత సెలెక్టుకమిటీకి పంపబడుతుంది. ప్రజాభిప్రాయాన్ని తెలిసికోడానికి కొన్నిరోజులు వ్యవధి ఉంటుంది.

ఈపరిస్థితుల్లో కాలవ్యవధికోసము రెండవశాసనసభ అవసరంలేదు. అంతగా వ్యవధి కావలిస్తే ఇప్పుడున్న మార్గమును (Procedure) కొంత మార్చవచ్చు. మొదటి యామోదనకి, రెండవయామోదనకు మధ్య కొంతగడువు ఏర్పరుపవచ్చును. ప్రజాభిప్రాయము కమిటీలమూలమున తెలిసికొనవచ్చును. సలహాసంఘముల నేర్పరచి చట్టములు సరిగా చేయబడునట్లు చూడవచ్చును.

౩. ప్రజలు కావలసినవారినే యెన్నుకొందురు. కాని యందరిని చేతకానివారిని యెన్నుకొనరు. ఒకవేళ మరీముఖ్యమైన వా రోడిపోయిన, వారిని సలహాసంఘముల ద్వారా (advisory board) పొందవచ్చును. వీరికొరకు కాక రెండవశాసనసభ యనవసరము.

౪. ప్రజాస్వామ్యపరిపాలనములో ముఖ్యముగ గుర్తించవలసినది సమత్వము. భాగ్యవంతులకు బీదవానికి భేదము లేదు. ప్రభువునకును కూలివానికిని తారతమ్యము లేదు. అందరి హక్కు (వోటు) ఒకటే.

ప్రత్యేకరక్షణలు ఎవరికీ ఉండకూడదు. అందరి హక్కులు సమానముగానే రక్షింపబడాలి. కాని, జమీందారులహక్కులు వేరే సంరక్షింపబడ నక్కర లేదు. ధనమున్నవాని హక్కులను సంరక్షిస్తే, మలమల మాడిపోయేవాని హక్కులను సంరక్షించే దాతెవడు? ధనమున్నవానికే మళ్లీ దానమా ? అందుచేత ప్రత్యేక హక్కుల రక్షణార్థమై యవతరించిన రెండవశాసనసభకు ప్రజాపరిపాలనలో తావు లేదు. అలాటిశాసనసభ

ప్రజాప్రతినిధులతో నెన్నడు నేకీభవించక పరిపాలనాన్ని కష్టాలపాలు చేస్తుంది. రాజ్యములోని చాలామందికి వ్యతిరిక్తముగా, కొద్దిమందిని సంరక్షించే రాజ్యవిధానము ప్రజాస్వామికము కాదు, ప్రభువులపరిపాలనే (aristocracy).

౫. సరియైన సాంకేతికభాషని ఉపయోగించడానికి రెండవశాసనసభ అనవసరము. ఆపని రెండవశాసనసభమూలాన్నికూడా తిన్నగా జరగదు. [ఈ సంగతి తరవాత చర్చకు తీసికొనవచ్చును.] చట్టములను సరిగావ్రాయుటకుఒక 'Legal Experts Committee' ని ఏర్పరుపవచ్చును. వా రీపనిని రెండవశాసనసభకన్న బాగుగ చేయుదురు.

౬. శాసనసభలు సంవత్సరమునకు కొలదిరోజులు మాత్రమే కలుసుకుంటాయి. మనశాసనసభలు సంవత్సరానికి ౫-౬ నెలలలో పనిచేస్తాయి. వ్యవధి లేకపోతే సంవత్సరములో నెక్కువరోజులు కలుసుగోడ ముత్తమము కాని రెండవశాసనసభలను నెలకొల్పుట మంచిదికాదు.

౭. తమ అధికారాన్ని దుర్వినియోగము చేద్దామని నిశ్చయించుకొన్న శాసనసభని ఏరెండవసభా అడ్డు తగలలేదు. ఇలాంటి సమయాలు రాకుండా చూడడమే ప్రతిక్రియ. వోటర్లకు వారి కర్తవ్యమును తిన్నగా బోధించి దుర్వినియోగము చెయ్యనటువంటివారే యెన్నుకొనబడేటట్టు చూడాలి. లేక ప్రతిహక్కును సమానముగా నిద్దరికి పంచితే పోట్లాట (conflict) తప్పదు. రోము ప్రజాపరిపాలనాన్నించి మన రాజులపాలనంలోకి (Kingship) మారడం ప్రతిహక్కును యిద్దరికి పంచియిచ్చుటవలన కలిగిన యుద్ధములే.

"ఒక్క రెండవశాసనసభ యిన్ని పనులు చేస్తుంది; లేకపోతే ఒక్కొక్కపని కొక్కొక్క కమిటీ నేర్పరుచాలి. పైగా ప్రత్యేకరక్షణాలు, బాధ్యతలు, మంచి (?) వారి నెన్నుకోవడముకూడా కూడివస్తాయి. ఒక్క దెబ్బతో రెండుపిట్టల్ని కొట్టినట్టవుతుంది. అందుచేత రెండవశాసనసభలే వుండా"లని కొందరివాదము.

కాని రెండవశాసనసభల మూలాన్ని దేశానికి కొన్ని చెడుగులు కలుగుతాయి.

ఒక ప్రతినిధి ఒకానొక విషయములో ప్రత్యేకజ్ఞానము కలవా డైతే, కడమవిషయాల్లోకూడా గొప్పవాడని చెప్పడానికి వీల్లేదు. సైన్సులో ప్రత్యేకజ్ఞానము (specialist) కలవానికి రాజకీయంలో ప్రవేశము ఉండకపోవచ్చు. 'మారకము' (Exchange) ను గురించి తెలియకపోవచ్చును. కాని రెండవశాసనసభలో ప్రతివానికి నన్ని విషయములపైనను చర్చచేయుటకును, వోటుచేయుటకు అధికార ముండును. అందుచే ఒక్కొకదానికొరకు నియమింపబడిన ప్రత్యేకజ్ఞాను లందరూ తమకు తెలియనివిషయాల్లో జోక్యము కలగజేసుకొని పాడుచేయవచ్చును. అత్యవసరమైన చట్టములను రెండవశాసనసభ నిరాకరింపవచ్చును. మనము రెండవశాసనసభ పనిని (ప్రతిదేశంలోనూ) చూస్తే, మొదటిశాసనసభ 'అవు' నన్నది 'కా' దనడమే.

మొదటిశాసనసభ కయినదానికంటే యెక్కువ కర్చవుతుంది రెండవశాసనసభకి. ప్రభువులసభలు కావండీ మరి? ఇంతధనము వ్యయపరుస్తే, చేసేపని తక్కువ, 'యెద్దె' మంటే 'తెద్దె' మనే శాసనసభ తయారవుతుంది. ఎంతమంది ప్రత్యేకజ్ఞాను లుండాలి? చర్చకు వచ్చిన ప్రతిచట్టానికి సంబంధించిన ప్రత్యేకజ్ఞాని ఉండాలా? జట్కాబళ్లమీద పన్నెయ్యడానికి, చట్టము తయ్యారుచెయ్యడానికి జట్కాబళ్లప్రత్యేకజ్ఞా నొకడు రెండవశాసనసభలో, నన్ని విషయాలమీదా (అర్థమైనా కాకపోయినా) వోటుచేయడానికి హక్కుకలిగి ఉండవలసినదేనా? కాని అన్నిటికంటే ముఖ్యాలోచనీయాంశ మొకటుంది. ఇప్పటివరకు, రెండవశాసనసభ లేవిధముగా నడపబడవలెనో, సరియైనవిధానము లేనే లేదు. రెండవశాసనసభకు ప్రతినిధుల నేర్పరుచు టెట్లు? శాసనసభ కధికారము లేవి? అనేవి సమస్యలు.

ప్రస్తుతము రెండవశాసనసభ ప్రతినిధుల నేర్పరుచుకొను విధానములు నాలుగు.

౧. పూర్తిగా వంశపారంపర్యముగా వచ్చునది :

ఇంగ్లాండులోని ప్రభువులసభ. ఈసభిలోని ప్రతినిధు లందరును వారిహక్కును వంశపారంపర్యముగ ననుభవింతురు. తండ్రిచనిపోగానే, పెద్దకొడుకు ప్రభువవడ మాచారం. ప్రతిప్రభువునకు సభలో స్థాన ముంది.

౨. నామినేషను :

నామినేషనులు గవర్నమెంటువారిచే రెండవ సభకు చేయబడును. నామినేషనులు కొన్నిసంవత్సరములకో లేక జీవితము (for life) అంతకో చేయబడును. కెనడాలోని రెండవశాసనసభ క్విబెక్, నోవాస్కోషియా, ఆస్ట్రేలియాలోని కొన్నిరాష్ట్రములు, జపానులోని ప్రభువులసభ యీజాతిలోనికి చేరినవి.

3. ప్రజలచే యెన్నిక :

ప్రతినిధుల యెన్నికలలో కొంచెము భేద ముండవచ్చును. ఉదా : మొదటిశాసనసభకు ప్రతినిధికి ౨౫ సంవత్సరములు ఉండవలెను. రెండవశాసనసభ ప్రతినిధికి కనీసము 3౦ సంవత్సరములు ఉండవలెను. అమెరికాలోని రెండవసభ, బ్రెజిల్, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, స్వీడన్, చిలి, పోలెండు మొదలయిన వీతెగలోనివి.

౪. సంస్థలద్వారా యెన్నికలు (Indirect Election):

ప్రజలొక సంస్థకు ప్రతినిధుల నెన్నుకొనినవారు తిరిగి మరియొకదానికి ప్రతినిధుల నెన్నుకొనుట. ఉదా: ప్రజలచే రాష్ట్రశాసనసభలకు ప్రతినిధులుగ నెన్నుకొనబడినవారు, రెండవశాసనసభకు ప్రతినిధుల నెన్నుకొనుట. ఇట్టిపద్ధతి గలవి ఫ్రాన్సు, డెన్మార్కు, నార్వే, నెదర్లాండ్సు, ఆస్ట్రియా, పోర్చుగల్ మొదలయినవి.

౫. హిందూదేశమున నేర్పరుపబడబోవు సభలకు ప్రతినిధులు ప్రజలచే నెన్నుకొనబడుదురు. కాని ప్రతినిధులు 3౦ఏండ్లు కలవారుగ నుండవలెను.

సాధారణముగ ప్రతిదేశమునను రెండుమూడు పద్ధతుల ననుసరించుచున్నారు. ఏపద్ధతియు సరియైనదిగ కన్పించుటలేదు.

౧. పూర్తిగా వంశపారంపర్యమైన, ఏయుద్దేశములకొరకు రెండవశాసనసభ లేర్పరుపబడెనో, అవి నెరవేరవు. పుట్టుకచేతనే ప్రతినిధియైనవానికి ప్రత్యేకజ్ఞానము కాదు సరికదా, లోకజ్ఞానము మాత్ర మున్నదనియనుకొనుట యెట్లు? ఇట్టిసభ ఒక్క యింగ్లాండులోనే కలదు. ఇట్టిసభలు, 'అంశలును సమానముగ జనింతురు' అను ప్రజాస్వామికపరిపాలనకు వ్యతిరిక్తము. కాన దానికి యేవిధమైన హక్కులును లేవు. ధనవిషయమైన (ఆదాయవ్యయవ్యవహారములు) చట్టములు ప్రభువులసభచే నామోదింపబడకపోయినను చట్టము లగును. ప్రభువులకు అట్టిచట్టముల గురించి చర్చచేయుటకు మాత్రమే అధికారము గలదు.

మిగిలినవిషయములలోకూడ నొకచట్టము మూడుసారులు శాసనసభచే నామోదింపబడిన ప్రభువులయంగీకారము లేకయే అది చట్టమగును. అందువలన ప్రభువులసభ కేవిధమైనహక్కులును లేనే లేవన్నమాట. దానికున్నహక్కు 'అడ్డు' పెట్టుటంమాత్రమే. అన్ని రెండవశాసనసభలకు మాతృకయయిన ప్రభువులసభకే హక్కులు లేనప్పుడు కడమదేశములలో నుండితీరవలె నను వాదము సమంజసము కాదు.

కాని యీఅడ్డుతగులుట ఒక్కొక్కపుడు దేశమునకు కష్టములను తెచ్చిపెట్టును. దేశమంతయు కావలెనన్నదానికి రెండవశాసనసభ అడ్డుపెట్టవచ్చును. మొన్న డివెలరాగారి రాజభక్తిప్రమాణ చట్టమును శాసనసభ యంగీకరించినప్పుడు రెండవసభ త్రోసివేసెను. దాని మూలమున తిరిగి యెన్నిక లవసరమాయెను. కాని డివెలరాగారు మరల గెల్చినను రెండవశాసనసభ మరల త్రోసివేసినది. అందుచేత ఇప్పుడు రెండవశాసనసభను తీసివేయించెదనని యాయన బెదరించుచున్నాడు.

౨. నామినేషనులుకూడ సరియైనమార్గము కాదు. అప్పటికి అధికారమునందున్న మంత్రులచే నామినేషనులు చేయబడును. అట్టినామినేషనులు, తమపార్టీకి సహాయముచేసినవారికే జరుగుచుండును. అందుచే రెండవశాసనసభలలో పార్టీమనుష్యులుతప్ప మరెవ్వరుండరు.

కెనడాలో నీసంగతి స్పష్టముగా తేలినది. అట్టివారిపై ప్రజలకు నమ్మక ముండదు. ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధు లామోదించిన చట్టములను పార్టీనాయకులచే తమకొరకు నామినేషను చేయబడిన ప్రతినిధులు తోసివేసిన ప్రజ లూరకుండరు. అది ప్రజాస్వామికపరిపాలనా నికి వ్యతిరిక్తము.

ఈకారణంవలన కెనడాలో రెండవసభ సాధారణంగా అడ్డుచెప్పదు ; క్రిందిసభ యేదంటే దానికి తలూపుతుంది. ఆసభమూలాన్ని కెనడాకి ధనవ్యయం తప్ప లాభమే లేదు.

3. రెండుసభలనీ ఎన్నుకుంటేకూడా కష్టాలున్నాయి. ఇద్దరూ ప్రజాప్రతినిధులే అయినప్పుడు అభిప్రాయభేదములు వచ్చినప్పుడు ఎవరు నెగ్గడం?

రెండవసమస్య రెండవశాసనసభ హక్కులేమిటి? సాధారణంగా ప్రతిదేశంలోను మొదటిశాసనసభకు రెండవదానికంటె హక్కు లెక్కువ. ధనవిషయములైన చట్టములు రెండవశాసనసభలో ప్రవేశపెట్టరాదు. దానికి చర్చించుటకుమాత్రమే హక్కుంటుంది. ఇంగ్లండులో, రెండవశాసనసభ తోసివేసిన చట్టమును తిరిగి మొదటిసభ యామోదించిన ఆరునెలలలో రెండవసభ యంగీకారము లేకయే చట్టమగును. కాని కొన్నికొన్ని దేశములలో రెండుసభలకును సమానహక్కులు ధనేతర విషయాలయిన చట్టాల్లో వున్నాయి. అప్పుడు రాజ్యము స్తంభించిపోవడానికి అవకాశ ముంది (dead-lock) క్రిందిసభ ఆమోదించినదానిని పైసభ తోసివేసిన ఎవరిమాట నెగ్గవలెనో తెలియదు. అందుచేత స్తంభనలను తొలగించుటకు విధాన మొకటి యుండవలెను. దానికి సాధారణముగా రెండుసభలును కలిసి వోటుచేయును (Joint sitting and deliberation).

ఉ: మనకి మొదటి శాసనసభలో ప్రతినిధులు ౩౬౦ ; రెండవదానిలో ౨౬౦. రాజ్యస్తంభన కలిగినప్పుడు ౬౨౦ ప్రతినిధులు కలిసి వోటుచేయుదురు. ఎక్కువ వోట్లు వచ్చిన పక్షము గెలిచినట్లు. ఇట్లు కలిసి వోటుచేయించెడిహక్కు గవర్నరుజనరలు చేతిలోను, రాష్ట్రీయగవర్నరుల చేతిలోను ఉంచబడినది.

కాబట్టి రెండవశాసనసభలమూలాన్ని కష్టాలు చాలా వున్నాయి. అవి మంచిచట్టాలకుకూడ అడ్డుపెట్టవచ్చు. దానిమూలమున వచ్చు లాభములకంటె చెడుగులే ఎక్కువ. అనవసరధనవ్యయ మగుటకంటె మరిలాభము లేదు. రెండవసభ చేయు ననుకొన్న సహాయములు కమిటీలు మొదలయినవి చేయును. కాని వాటి కీచెడుగులు లేవు. ఇంత ధనవ్యయ ముండదు.

అనేకకష్టములతోకూడి ప్రజాస్వామికపరిపాలనమునకు వ్యతిరిక్తమైన రెండవశాసనసభలు — వానిమూలమున నగు లాభాలన్నీ యితరత్రా ఇంతకంటె ఎక్కువగా కలుగుతూన్నపుడు కావాలనుకోడం చాలా పొరపాటు. రెండవశాసనసభ అధికారదుర్వినియోగాన్ని తొలగించడానికి మారు అధికారదుర్వినియోగేచ్ఛ కలిగిన గవర్నరులచేతిలో కీలుబొమ్మై దేశాని కనిష్టాన్ని కూరుస్తుంది కాని యేవిధమైన లాభముండదు.

అందులో హిందూదేశానికి రెండవశాసనసభలు అసలు తగవు. కేంద్రంలో ౧/3 మంది సంస్థానాధీశుల నామినేషను. వారే గవర్నరుజనరలుచేతిలో కీలుబొమ్మలు. ప్రజాభిప్రాయానికి అడ్డుతగులుతారు. గవర్నరులకే చాలా చిక్కులున్నాయి. ఇలాటిపరిస్థితులలో రెండవశాసనసభకూడా వుంటే ప్రజాప్రతినిధులమాట లేమీ కొనసాగవు. వారి నెన్నుకోడం వ్యర్థమవుతుంది. హిందుదేశానికి హక్కు లేమీ యివ్వకుండా వుండడానికి వేసినయెత్తులలో రెండవశాసనసభ ఒకటి; రెండవశాసనసభలని కావాలనడం "డబ్బిచ్చి తద్దినం కొనుక్కోడం" అనడానికి యెంతమాత్రమూ శంకించనక్కరలేదు.

---






# భారతీయ చిత్రకళయొక్క ప్రాచీనత

తలిశెట్టి రామారావుగారు, బి. ఏ., బి. యల్.

అజంత, బాఘ్, సీగిరియాలయందు గానబడిన బౌద్ధయుగమునాటి చిత్తరువులకు పూర్వము చిత్రింపబడినవి హిందూదేశమున మొన్నటివరకు గానరాకపోవుట చేతను, ఇటీవల కానబడినవి యుత్కృష్టకళాసంప్రదాయబద్ధములు కాకపోవుటచేతను, భారతీయచిత్రరచన యొక్క ప్రాచీనతనుగూర్చి యనేకులు సంశయించుట కలిగెను.

శ్రుతులు, స్మృతులు, రామాయణాది మహాకావ్యములను గూర్చజాలిన మహాకవులును, రాళ్లనయిన గరగింపజాలిన మహాగాయకులును పుట్టిన భారతభూమియందు సుప్రసిద్ధ చిత్రకారులేనా యుద్భవించియుండ లేదు ?

తొలియుగములందు మానవులు భాషను కల్పించుకొనక పూర్వము సైగలతోను, చిత్రములమూలముననను ఒకరి యభిప్రాయమును మరియొకరికి తెలియజేసుకొనుచుండి రని యూహింపవచ్చును. ఈయూహను బలపరచుటకు సూచనామాత్రముగ వ్రాయబడిన చిత్తరువులు స్పెయిను, భారతభూమి, మరికొన్ని దేశములందు గానవచ్చెను. చలిబాధనుండి తప్పించుకొనుటకును, అలంకారార్థమును దేహములకు రంగులను పూసుకొనుటయు నాచారమైయుండినటుల కానవచ్చును. నాగరకత యింకను శైశవమునం దున్నపుడే చిత్రరచన ప్రారంభమై యుండవలెను. కాన భారతీయ నాగరికతయొక్క ప్రాచీనతను కనుగొనిన యెడల హైందవ చిత్రరచనయొక్క ప్రాచీనత నిర్ణయమగును.

మన పండితు లీ ప్రాచీనతనుగూర్చి యెన్నడును సంశయింపలేదు. వీరి వ్రాతలు దేశభాషయం దుండుటచేతను ఇప్పటి వాఙ్మయమంతయు నాంగ్లభాషయందు పెరుగుచుండుటచేతను వీరు చెప్పినది ప్రపంచమున వినబడకయున్నది. కొంత పరిశ్రమ చేసి యీవిషయమై పాశ్చాత్యపండితులును, వారి ననుకరించువారును ఆంగ్లమున

వ్రాసిన ప్రతికూలాభిప్రాయములకు తగిన ప్రత్యుత్తరముల నిచ్చుటకు వీరి కాభాష రాక పోవుటచే నవకాశములు లేకయున్నవి. కొందరు విద్యావంతులు మనవారి యభిప్రాయముల ననుసరించి యాంగ్లమున వ్రాసిరి. కాని సమగ్రముగ వ్రాయలేదు. కాన పాశ్చాత్య పండితులు వ్రాసినవ్రాతలే పరమ ప్రమాణము లగుచున్నవి. విమర్శించి నిష్పక్షపాత బుద్ధితో చూచినయెడల మనపండితులు నమ్ముచున్న పురాణాది గ్రంథములందు కానవచ్చు ప్రమాణములే నిజములని కనుపించవచ్చును. రానురా నిట్టియభిప్రాయమును బలపరచుట కనేక నిదర్శనములు వెదకి చూచినకొలది కానవచ్చుచున్నవి.

క్రీ. పూ. రెండవశతాబ్దమున అజంత కందర నిర్మాణమును, వాటియందలి చిత్ర రచనయు ప్రారంభమైనవని చరిత్రకారులునిర్ణయించిరి. ఆ చిత్రములందు కానవచ్చు భావ ప్రదర్శనము, ఆధ్యాత్మికచింత, రచనాశైలి, కళాసంప్రదాయములొక్కపరిఅభ్యాసమునకు వచ్చుట యసంభవము. కాన, నంతకు పూర్వ మెన్నివేల సంవత్సరముల క్రిందటనో చిత్ర రచన యాదరమునకు వచ్చియుండుట నిశ్చయము.

రాతియందును, లోహములతోను విగ్రహాద్యలంకారములను మలచకపూర్వముదారు ఫలకములపై రూపములను చెక్కుచుండిరని యు, శిలాగృహములను నిర్మించక పూర్వము కఱ్ఱలతో నిండ్లనుగట్టుకొనుచుండిరనియు పురాతన శిలానిర్మాణములను బరిశీలించిన బుద్ధిమంతులు నిర్ణయించియున్నారు. క్రీ. పూ. రెండవ శతాబ్దమున నిర్మాణము ప్రారంభమై, ప్రపంచమున నంతట బేరుగన్న అజంతశిలాకందరములుతదితరనిర్మాణములు నిట్టిపరివర్తనమును సూచించుచున్నవి. క్రీ. పూ. ఐదారు శతాబ్దములలో నిర్మితములై, హిందూ కళాసంప్రదాయము ననుసరించి యున్నవని పాశ్చాత్య పండితులచే సైతమంగీకృతములైన శిల్పరాజములు కలవు. ఇటీవల పంజాబులో హారప్పా యందును, సింధు దేశములో మహెంజొదారొవద్దను, ఇటుకలతో గట్టబడి కాలప్రవాహమున భూస్థాపితములై మరుగుపడిన పెద్ద నగరములు కానబడెను. ఇచ్చట గనబడిన శిలావిగ్రహములును బంగారు మొదలగు లోహములతో జేయబడిన చక్కని నాణెములు, నగలు, మణులు మొదలగునవి యుత్కృష్టమైన నాగరికమును తెలియజేయుచున్నవి. ఇది క్రీ. పూ. మూడువేల యేండ్ల నాటిపై యుండవలయునని చరిత్రకారులు నిర్ణయించిరి. మానవ పరివర్తనమునం దిట్టి నాగరికత పెరుగుట కెన్నియో వేలయేండ్లు కావలెను. గృహనిర్మాణ మీ స్థితికి బెరుగుటకు కొన్నివేలయేండ్లును, అంతకుపూర్వము దారువులపై మలుచుటకు కొంతకాలమును, ఇంక నంతకుపూర్వము చిత్రరచన యలవడుటకు కొంతకాలమును బట్టుట నిజము. ఇటుల జూచిన మనదేశమునందు చిత్రరచన పెక్కు

వేలయేడ్ల క్రిందటనే యభ్యాసమునకు వచ్చి యుండవలెను.

సింగన్పూరునందును, కైమూరుపర్వతములందును, మరికొన్ని స్థలములందును, సనాతన చిత్రములు కొన్ని కానవచ్చినవి. ఇవి క్రీ. పూ. సుమారు ౧౦ మొదలు ౨౦ శతాబ్దముల నాటివని భూతత్త్వజ్ఞులు నిర్ణయించిరి కాని యనేక కారణములవలన నంతకు చాలా పూర్వపువై యుండవలెనని రూపించుచున్నది.

ఇట్టి ప్రబలమైన నిదర్శనములతోపాటు మన వాఙ్మయమునందు భారతీయ చిత్రరచన యొక్క ప్రాచీనతను నిర్ణయించుట కనేక నిదర్శనములు కానవచ్చుచున్నవి.

చిత్రరచనను గూర్చి పెక్కుచోట్ల వేదములు చెప్పుచున్నవి. కాని వేదము లార్యుల వనియు, వారు హిందూదేశమునకు గాంధారము (సుమా రిప్పటి ఆఫ్ఘనుస్థానము) ద్వారా క్రీ. పూ. ౨,౫౦౦ సంవత్సరముల క్రిందట మన దేశమునకు తెచ్చిరనియు, ఆపిమ్మట కొంతకాలమునకు భారతభూమి యందు సర్వజనాంగీకృతము లయ్యెననియు పాశ్చాత్యపండితులు చెప్పుచున్నారు. వేదములందు చిత్రరచనయొక్క ప్రశంస భారతీయులకు చెందదనియు, చెందినను ఆర్యులు మన దేశమునకు ౨,౫౦౦ సంవత్సరములనాటికి వచ్చిరి కనుక మన దేశమున చిత్రరచన యాతరువాత దనియు దీనియర్థము.

వేదములందలి కొన్ని భాగములకు ముఖ్యముగా కృత్తికా నక్షత్ర ప్రశంసకు జ్యోతిశ్శాస్త్రాధారమున నర్థము జెప్పి, భారతభూమికి క్రీ. పూ. సుమారు ౪,౫౦౦ సంవత్సరముల ముం దార్యులు వచ్చియుందు రని లోకమాన్య తిలకుగారు వ్రాసియున్నారు.[౧]

ఎన్నో వేల సంవత్సరములకు పూర్వము భూమియందు హిమప్రళయము నాలుగు మారులు సంభవించె నని భూతత్త్వజ్ఞులు నిర్ణయించియున్నారు. ఆఖరుప్రళయము క్రీ. పూ. సుమారు ౮౦౦౦ సంవత్సరములకు కలిగె ననియు, ఉత్తరధ్రువప్రాంతము లంతకు పూర్వము వాసయోగ్యముగ నుండెననియు వ్రాసి, యాకాలమున నార్యు లా ప్రాంతముల దుండిరనియు, వేదము లంతకుముందటి వనియు, హిమప్రళయమువలన చలిమిక్కుటమగుటచే యచ్చట నుండజాలక దక్షిణగమనము ప్రారంభించిరనియు వేదమునందలి నిదర్శనములను జూపుచు లోకమాన్యులు మరియొకచోట వ్రాసిరి.[౨] కాని యా హిమప్రళయము సుమారు ముప్పదివేల సంవత్సరములకు పూర్వమే సంభవించియుండవలె నని భూతత్త్వజ్ఞు లిప్పు డనుచున్నారు. కృత్తికా నక్షత్రనిదర్శనములు సుమారు ౨౬,౦౦౦

౧. Orion.

౨. The Arctic home in the Vedas.

సంవత్సరములకు కూడ వర్తించునట. అటులైనయెడల వేదములు ౩౦,౦౦౦ సంవత్సరములకు పూర్వపువే యనియు, ౨౬,౦౦౦ సంవత్సరముల క్రిందటనే యార్యులు భారత భూమికి వలస వచ్చిరనియు, చెప్పుట నిరాధారము కాదు.

భారత భూమి వేదభూమి యనియు, నార్యభూమియనియు నిప్పు డనేకులు మరల ననుచున్నారు.[1] ఇటుల జెప్పుటకు వేదములం దనేకములైన నిదర్శనములు కలవు.

ఈ రెండభిప్రాయములను మేళవించి, వేదములను వెదకినయెడల ఆర్యుల యాదిమ వాసము భారతభూమియే యనియు, ఉత్తర ధ్రువఖండమునకు వలసపోయి, యచ్చట కొంతకాలము వసించి మరల వచ్చిరనియు చెప్పుటకు తగిన ఆధారములు కానరాగల వని నా నమ్మకము. ఈ యూహయే నిజ మైనయెడల వేదములు కనీసము ౫౦,౦౦౦ సంవత్సరములకు పూర్వము నాటివేయగును.

పురాణములందు కానవచ్చు నిదర్శనము లీ లెక్కలకు కొంత తోడ్పడగలవు. కలియుగ పరిమాణము ౪,౩౨,౦౦౦ సంవత్సరములనియు, ద్వాపరము ౮,౬౪,౦౦౦ సంవత్సరము లనియు, త్రేత ౧౨,౯౬,౦౦౦ అనియు, కృతయుగము ౧౭,౨౮,౦౦౦ అనియు, పెరసి నాలుగు యుగముల పరిమాణము ౪౩,౨౦,౦౦౦ అనియు, వేదము లంతకు పూర్వపువే యనియు గలదు. తక్కిన శాస్త్రపరిశోధన ఫలితములతో నీలెక్క సరిపోదనియు, నిన్ని సంవత్సరముల క్రిందట మానవుని నాగరికత ప్రారంభ మయ్యె ననుట తాము నమ్మజాల మనియు పాశ్చాత్యపండితులును వారి ననుసరించు హైందవవిద్యావంతులు ననుచున్నారు. దిన దినమును మారుచున్న భూతత్త్వవేత్తల యభిప్రాయములు మానవుని నాగరికతను వెనుకకు నెట్టుచున్నవి. ఎనిమిది లక్షల సంవత్సరములకు ముందు నీగ్రోలకు సంబంధించు మనుష్యు లుత్పన్నమైరనియు, ౪౦,౦౦౦ సంవత్సరములకు పూర్వము మధ్య ఆసియాలో ఆర్యు లేర్పడి రనియు గ్రిఫిత్తు టెయిలరుగారు వ్రాసిరి. ఈయభిప్రాయముతో హంటింగ్టనుగా రేకీభవించుచున్నారు. ఆఖరు హిమప్రళయము ౧౦,౦౦౦ సంవత్సరములకు పూర్వము సంభవించియుండవలెనని యొకరు వ్రాసిరి. మానవుడు సుమా రేబదిలక్షల సంవత్సరములకు పూర్వము పుట్టియుండవలెనని మరికొందరు పండితుల యభిప్రాయము. రాను రాను మన పురాణములలోని లెక్కయే నిజమని యొప్పుకొందురని తలంపవచ్చును. ఈవిషయమై విమర్శ జేయువా రందరు సనాతనహైందవుల లెక్కలను మరువకుందురుగాక. ఏది యెట్లున్నను ఈయభిప్రాయము లన్నియు మననాగ

౧. అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు వ్రాసిన "వేదభూమి" యను విమర్శన గ్రంథమున నీ చర్చ చాలవరకు గలదు.

రికతయొక్కయు తద్ద్వారా చిత్రలేఖనము యొక్క అద్భుతమైన ప్రాచీనతను సూచించుచున్నవి.

సింగన్వారునందు లభించిన సనాతన చిత్రములవంటివి స్పెయినునందు లభించినవి. వాటిలో కొన్ని ౫౦,౦౦౦ సంవత్సరములకు పూర్వపునాటివట !

మనచిత్రరచన యతిప్రాచీనమైన దనియు నప్పటికే మిగుల ఉత్కృష్టదశకు వచ్చె ననియు చెప్పుట కాదికావ్య మనబడు రామాయణమే చాలును. కాని రామాయణ మేనాటిది ? రాముని జాతకము ననుసరించి లెక్కపెట్టిన బెంట్లీగారు రాముడు క్రీ. పూ. ౯౬౧ సం. న జన్మించెనని వ్రాసెను. జాతకాధారము ననుసరించియే మనలో నిప్పటివారు కొందరు రాముడు క్రీ. పూ. ౫,౦౦౦ ౬,౦౦౦ సంవత్సరముల నాటివాడని చెప్పుట కలదు. అనేకు లనుదినమును పఠించుచున్న సుందరకాండమునందు రావణుని నివేశనపు ద్వారము వద్ద హనుమంతుడు చతుర్దంతగజములను చూచెనని కలదు. "త్రిజట యను రాక్షసి నాలుగుదంతముల యేనుగును కలలో చూచెను." అనేక దంతముల యేనుగులు ప్లీస్టొసీను, ప్లయొసీను (Pleistocene' Pliocene) అనబడు ఆదియుగములందు హిందూదేశమున గూడనుండెనని భూతత్త్వజ్ఞులు చెప్పుచున్నారు. ఆరుదంతముల యేనుగు హిమాలయపర్వతములం దుండెనని చెప్పు బౌద్ధవాఙ్మయమునందలి షడ్దంతజాతకకథ యీయభిప్రాయమును బలపరచుచున్నది. రామునికాలమున నిట్టి గజము లుండినయెడల నామహావీరుడు చాల ప్రాచీనుడై యుండవలెను. వానరు లనబడు మనుష్యజాతివిశేషము కూడ నట్టి సూచననే చేయుచున్నది. రాముడు త్రేతాయుగమునాటివాడని, అనగా సుమారు ౮,౬౯,౦౦౦ సంవత్సరములకు పూర్వపువాడని మనపురాణములు చెప్పుచున్నవి. ఇంతటి ప్రాచీనతను నమ్మజాల మనియు, ప్రాచీనుడైనను వాల్మీకి యిటీవల రామాయణము వ్రాసె ననియు, నందువలన రామాయణమునం దనేక విషయములు కవియొక్క యూహాజనితము లనియు, నుత్ప్రేక్షలనియు నొకవాదము కలదు. రాముడును, వాల్మీకియు సమకాలీను లనియు రామాయణముననే అనేకస్థలముల నుండి సీవిషయమై సంశయించుటకు తగినంత బలమైన నిదర్శనముల నటుల వాదించువారు చెప్పుట లేదు.

---

౧. "రథై ర్యానైర్విమానైశ్చ తథా హయగజైశ్శుభైః,
వారణైశ్చ చతుర్దంతై శ్శ్వేతాభ్ర నిచయోపమైః
భూషితం రుచిరద్వారం..............."

—సుందరకాండము, నాల్గవసర్గము.

ఉత్తమం రాక్షసావాసం హనుమా నవలోకయన్,
ఆససా దాథ లక్ష్మీవాన్ రాక్షసేంద్ర నివేశనమ్.
చతుర్విషాణై ర్ద్విరదై స్త్రివిషాణై స్తథైవచ,
పరిక్షిప్త మసంబాధం రక్ష్యమాణ ముదాయుధైః.

—సుం. కాండము, తొమ్మిదవసర్గము.

౨. ఆరుహ్య శైలసంకాశం మేఘస్తనితనిస్స్వనమ్,
చతుర్దంతం గజం దివ్య మాస్తే తత్ర విభీషణః.

—సుం. కాండము, ఇరువదియేడవసర్గము.

తక్కినపురాణములందు ఇట్టివిషయము లనేకములు కలవు. కాని యీగ్రంథము లన్నియు నిటీవల వ్రాయబడిన వనియు, తత్కారణమున విశ్వాసార్హములు కావనియు త్రోసి పుచ్చుచున్నారు. ఈవాదము నిజమైన నగుగాక. అవి వ్రాయబడిన కాలమున ప్రజలందు వాడుకలో నున్న యనేకములగు ఇతిహాసములును, దేశచరిత్రము, చరిత్రయే కవనమునకు తగినటుల మార్పు జెందియు జ్యోతిష సాంఘిక ప్రాకృతిక వేదాంతాది విషయములు వ్యక్తీకరణబద్ధములై కథలరూపమునను పురాణములందు విరివిగ కలవని యొప్పుకొనక తప్పదు. ఇవన్నియు విమర్శన కాధారములని పండితులనుచున్నారు. వీటన్నిటిని బరిశీలించియర్థము జెప్పి ప్రపంచమును గూర్చియు, ప్రత్యేకముగ సనాతన భారతదేశమును గూర్చియు ననేక విషయములను గ్రహింపవలసియున్నది. వివిధ పురాణములందుగల విషయములకు భేదము లున్నయెడల వాటి యర్థమును గ్రహించి, యేది నిజమో తెలిసికొనవలసి యున్నది. ఈ పనియంతయు ప్రయాసమునకు హేతువని భయపడి యీమహాగ్రంథములలో నేమియు లేదనియు, నందు కానవచ్చు సనాతన భారతీయ సంప్రదాయములు, ఔన్నత్యము నమ్మ తగినవి కావనియు జెప్పుట భావ్యము కాదు.

ఆర్యులు పూర్వము మన దేశమున కెచ్చటనుండియో వచ్చిరని చెప్పుచు, పర్షియా ఆఫ్ఘనిస్థానములందును, మహెంజొదారో హారప్పాలందును కానవచ్చెడి నిదర్శనములనుబట్టి మన నాగరికత పశ్చిమదేశముల నుండి భారతదేశమునకు వచ్చియుండవలెనని చెప్పుట కలదు. సనాతన నాగరికతా చిహ్నములు ఆర్కియాలజీ పండితులకును, తక్కిన యైరోపీయులకును మొదట పశ్చిమదేశములందు కానవచ్చెను. తరువాత హిందూదేశమున నిప్పుడు వెదకినకొలది కానవచ్చుచున్నవి. పూర్వము తా మలవాటుపడి యున్న యభిప్రాయములను మార్చుకొనుట దుర్లభము. హిందూదేశముల ఆర్కియాలజీ శాఖవారు చాలాపరిశ్రమతో అనేకములైన చక్కని విషయములను విజ్ఞానమునకు చేకూర్చుచున్న వీరిప్రయత్నము లింకను ప్రారంభదశయం దున్నవి. పురాణాది సనాతన గ్రంథములందు బేర్కొనబడిన నగరము లెచ్చట నుండెనో సరిగా తెలియుటలేదు. ఇవన్నియు వెదకి, త్రవ్వి, పరిశీలించి కనుగొనిన పిమ్మట భారతదేశపు సనాతన ప్రతిభకు కళంకము నాపాదించుచున్న యభిప్రాయము లన్నియు మారగలవు.

మహెంజొదారో వద్ద కనబడిన సనాతన నాగరికతాచిహ్నములను బరిశీలించి, యవి సింధునదీ ప్రాంతములందు బెరిగిన ప్రత్యేక నాగరికతాచిహ్నములనియు, మెసపొటేమియానుండి వచ్చిన నాగరికత కాదనియు సర్ జాన్ మార్షల్ గారు వ్రాసిరి." మెసపొటేమియా యందలి సనాతన నాగరికత యీదేశ

౧ Archaeological survey of India, —Annual Report, 1923 - 24.

ములకు పరదేశములనుండి వచ్చిన దన్న వారి వాదమే నిజమైనయెడల భారతభూమినుండి యచ్చటికి నాగరికత వ్యాపించి, యచ్చటినుండి యితర పశ్చిమదేశములకు ప్రాకెనని నిస్సంశయముగ చెప్ప వీలగును. ఈజిప్టు, మహెంజొదారొ మొదలగు స్థలములందు దొరికిన సనాతన భాషా చిహ్నములకు మూలాధార మొకటియే యనియు, అట్టిది మొదట భారతభూమియందు పుట్టి తక్కిన దేశములకు వ్యాపించియుండు ననియు కాశీ విశ్వవిద్యాలయమున నున్న యొక్క పండితుడు చెప్పుచున్నాడు. దీనికి తోడు భారతదేశపు గ్రామముల, దేవతల నామములు ప్రపంచమునం దంతటను పూర్వకాలమున నుండినటుల తెలియుచున్నది. హైందవ నాగరికతా వ్యాప్తియే దీనికి కారణ మని పండితులు ఒప్పుకొనియున్నారు.

ఆర్యులు భారతభూమియందు కాలు పెట్టకపూర్వము "దస్యులు", "అసురులు" మొదలగు అనాగరికులైన యాదిమవాసులిచ్చట నుండిరని చరిత్రకారులు వ్రాసియున్నారు. "ఆర్య" శబ్దమునకు సాధువనియు, చదువుకొనినవా డనియు, సర్వజనులు తను డాయదగినవా డనియు నర్థము కలదు. "దస్యు" లనగా వ్రతముల నాచరించని వారనియు, దొంగ లనియు, కర్మరు లగువారందరిని వేధించు దుష్టు లనియు, అన్యవ్రతులనియు, అమానుషు లనియు, కర్మవిరోధులనియు నర్థము. కర్మభ్రష్టులై క్రూరకార్యముల నాచరించుచుండినవారు రాక్షసు లనబరగుచుండిరి.[1] వీ రార్యులు కా రనియు, నార్యాచారములను స్వీకరింపకపోవుటచే నార్యులు వీరి నిటుల బిలిచి రనియు చెప్పట కలదు. రాక్షసుడైన రావణు డతినాగరికుడుగా, నార్యకర్మలయందు ప్రవీణుడుగా వర్ణింపబడెను.[2] ద్రావిడభూమి యని పిలువబడుచున్న దక్షిణ హిందూదేశము నాగరికత కాటపట్టై యున్నటుల ననేకములైన నిదర్శనములు కానవచ్చుచున్నవి. క్రీ. పూ. సుమారెనిమిదివేల సంవత్సరములకు ముందు "తమిళ సంఘములు" మిగుల నున్నతదశయందుండెను. క్రీ. పూ. ౨,౨౦౦ సంవత్సరములకే దక్షిణదేశములతో పరదేశీయులు ఓడవర్తకము విరివిగ జరుపుచుండిరి. ఆర్యులు పరదేశీయు లని యొప్పుకొనినను ఆర్యప్రోద్బలము లేకయే యిచ్చట చిత్రరచన మిగుల నున్నతదశయం దుండె ననుట నిర్వివాదాంశము.

ఈవిషయమై భూతత్త్వశాస్త్రమును కొన్ని నిదర్శనముల నర్పించుచున్నది. ఆదిమ యుగములందు భూమి హిమప్రళయములు,

౧. "వేదభూమి", ౧౦-వ ప్రకరణము (ఆర్యజాతులు, ఆర: వృత్తులు, ఆర్యదైవతములు).

౨. రావణుని నివాసమైన "లంక" యిప్పుడు "జావా" యని పిలువబడుచున్న ద్వీపమని కొందరి యభిప్రాయము. ఇది నిజమైనను ఈ వాదమునకు లోటులేదు.

జలప్రళయములు, అగ్నిపర్వతముల ప్రమాదములకు లోనయ్యెను.'' ఈ ప్రమాదమునందు మనుష్యాది జీవరాసులు, మనుష్యుల పరికరములు, గృహములు హిమ-భూ-పాషాణగర్భితము లైపోయినవి. త్రవ్వి చూడ నివి కొన్ని యిప్పుడు కానవచ్చుచున్నవి. ఇవి లభించు భూమిపొర లేనాటివో నిర్ణయించి, యప్పటి మనుష్యుల జీవనవిధాన మెట్టిదో, అప్పు డెట్టి జంతువులు నివసించుచుండెడివో మొదలగు విషయములను కనుగొనిరి అట్టి పరికరములును జంతువుల చిహ్నములు మరియొకచోట కానవచ్చినయెడల నవి యాప్రాంతములందు తొలి నిక్షిప్తములైన కాలములలోనుండినవని యనుకొనవచ్చును. పూర్వకాలమున లోహములు వాడుకకు రాకముం దాదిమవాసులు చెకుముకి రాళ్లను చెక్కి నాటిని కత్తులుగను, బల్లెములుగను ఉపయోగపరచుచుండిరి. ఇట్టివి ఇటీవల గోదావరి, గుంటూరు, రాయలసీమ నర్మదాప్రాంతములందును కానవచ్చెను. ఇట్టి పాషాణపరికరము లుపయోగపడిన కాలమును పనిముట్ల భేదము ననుసరించి, పురాతన పాషాణయుగము (Paliolithic age), మధ్యమ పాషాణయుగము (Mesolithic Age), నవీన పాషాణయుగము (Neolithic age) గ భూతత్త్వజ్ఞులు విభాగించిరి. భారతదేశమున ఇనుము, కంచు, రాగి, క్రీ. పూ. ౫౦౦–౮,౦౦౦ సంవత్సరములలో నుపయోగపడుచుండె ననియు, నవీనపాషాణయుగము క్రీ. పూ. ౨,౦౦౦ - ౧౦,౦౦౦ సంవత్సరములలోనిదనియు, మధ్యమ పాషాణయుగము ౧౦,౦౦౦ - ౧౮,౦౦౦ లోనిదనియు, అంతకుపూర్వము పురాతనపాషాణయుగమనియు నెల్సను పండితుడు వ్రాసియున్నాడు. మధ్యమ పాషాణ యుగమును ౨౦,౦౦౦ సంవత్సరములవరకు వెనుకకు నెట్టవచ్చునని కొందరి యభిప్రాయము. నేను పైన వ్రాసిన నిదర్శనములనుబట్టి చూడ నీలెక్క యెంత తప్పుగ నున్నదో తెలియును. క్రీ. పూ. 3,౦౦౦ సంవత్సరములనాటి దని నిర్ణయింపబడినట్టియు, మహెంజొదారొవద్ద కట్టబడినట్టియు, సుమారు ౨౫౦౦ ఎకరముల విస్తీర్ణముగలట్టియు చక్కని నగరమున నతిసుందరములైన నగలు కానవచ్చుచుండ, నాటికి భారతీయులలో ననేకులు పాషాణ పరికరములను వాడుచుండెడి యనాగరకు లని చెప్పుట యసందర్భముగ నున్నది. మన దేశమునందిప్పటికిని మహానాగరికులతోపాటు అనాగరికులైన భిల్లులు, తోడాలు, కోదులు, సవరలు మొదలగు తెగ లెందరో కలరు. వీరిని జూచి భారతీయు లందరు నిట్టివారే యని చెప్పుట యెట్టి విమర్శనపద్ధతియో యోచింపుడు. మనము దైనిక జీవనమునందు మరచిన యాచారముల నెన్నిటినో వివాహాది శుభకార్యములందును, మతవిషయములందును,

౧. వివరములు కావలెనన్న మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు విపులముగ వ్రాసి తమ కల్పలతయందు ప్రచురించిన "భూమితత్వము"ను జూడుడు.

మరువక యున్నాము. ఇటులనే పూర్వ కాలపు పనిముట్లు నా ప్రాచీనులు వాడుకయం దుంచుట సంభవము. అండమాను దీవులందు పాషాణపరికరములు నేడును వాడుకయం దున్నవట. ఈ కారణములవలన భూతత్త్వ జ్ఞులు చెప్పిన యుగములను భారత దేశమున నెంతయో వెనుకకు నెట్టవలసియుండును.

కర్నూలు౧ ప్రాంతములందు బిల్వ స్వర్గ మనబడు (భిల్లస్వర్గము?) గుహాలు కానవచ్చినవి. ఇచ్చటనే ముప్పదివేల సంవత్స రములనాడో, యంతకుపూర్వమో మాన వులు నివసించుచుండి రనియు, నీ గుహాలందు పూజలు మొదలగునవి జరుపుచుండి రనియు, శాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. ఆంధ్ర దేశమునందు కానవచ్చిన పాషాణపరికర ములు బహుపురాతనము లట! ఇవి యాస్ట్రే లియా మొదలగు ప్రాంతము లందు లభించిన పరికరములను పోలియున్నవి. ఇత్యాది కార ణములవలనను పూర్వము జావా, ఆస్ట్రేలి యా, హిందూదేశముల మధ్య సముద్రము లేదని తెలియుచున్నది. దక్కను పీఠభూమి మాత్ర మెన్నడును జలముక్రింద నుండినటుల లేదు. కాన మనుష్యజాతి యవిచ్ఛిన్నముగ నిచ్చట మొదటినుండియు వసించుచుండుట కలిగెను.

పురాతన మానవుల పుణికలు కొన్ని యిటీవల లభించెను. పంజాబు మొదలగు ప్రాంతములందు దొరకిన పుణికలకంటె దక్షిణ దేశమున అదితనల్లూరునందు దొరకినది పురా తన మైనదట.

ఇట్టి నిదర్శనములకొరకు కింకను బాగుగ వెతుకవలెను. కాని ఇపుడు లభించినవాటినిబట్టి చూడ ప్రపంచమున మానవుని జన్మము దక్షిణ హిందూదేశము ఆస్ట్రేలియాలయందు గానవచ్చు ననియు, జనసంఖ్య పెరిగినకొలది వీ రుత్తర దేశమునకు పోయి, యచ్చటినుండి ప్రపంచమునందంతటను వ్యాపించిరనియు చెప్పుటకు వీలగుచున్నది. ఇట్టి జనవ్యాప్తి యనేకపర్యాయములు జరిగియుండవచ్చును. ఈ మూలమున భారతీయ నాగరికతయే ప్రపంచపు నాగరికత కావచ్చును. కొంచెము కాలభేదములతో మానవు డనేక స్థలము లందు ప్రపంచమున నుద్భవించియుండవచ్చు నన్న వారివాదము భారతీయుల వ్యాప్తివాద మును నీరసము చేయచాలదు.

ఆర్యులే యుత్తర ధ్రువఖండమునుండి యో, కాస్పియను సముద్రప్రాంతముల నుండి యో, మధ్యఆసియానుండియో మన దేశము నకు వేదములను తెచ్చిరనియు, వారి నాగరిక తతోపాటు ఉత్కృష్ట చిత్రరచనా విధాన ముల ప్రవేశపెట్టి రనియు, అంతకుపూర్వ మిచ్చట చిత్రరచన లేదనియు, ఉన్నను మానవుని తొలిప్రయత్నము లగుటచే బాగుగ లేదనియు నన్నవారి వాదము నొప్ప

౧. Chapter VI, Prehistoric India, by Panchanan Mitra.

కొనినను మన చిత్రరచనయొక్క ప్రాచీనతకు కొరత కలుగదు. ఆర్యుల మతము, భాష, ఆచారములు తక్కిన దేశములందనేకములైన మార్పులను జెంది, పోల్చుటకు కూడ వీలు లేనటుల మారిపోయినవి. ఒక్క హిందూదేశమునందే సర్వజనాంగీకృతములై గౌరవమును పొంది మలినములు కాక యందరిచేతను పోగడ్త గన్నటుల వర్ధిల్లెననుట నిర్వివాదాంశము. ఆర్యుల నాగరికతయే మన నాగరికతగ నిప్పటికి నున్నదని దీనియర్థము. అందువలన వేదములందు చిత్రలేఖన మెప్పటినుండి కానవచ్చుచున్నదో యప్పటినుండియు మన చిత్రరచనయు గలదని నిరాతంకముగ జెప్పవచ్చును.

మన చిత్రరచనయొక్క ప్రాచీనతను నిర్ణయించుటకు వేదములు పురాణములు మొదలగు సనాతన గ్రంథములందు గానవచ్చు నిదర్శనములు మిథ్యకావని చెప్పుటకో యనునటుల, భారతభూమియం దనేకస్థలములందు పురాతన చిత్రము లిటీవల కానవచ్చుచున్నవి. రాయఘర్ దగ్గర సింగన్పూరు, బళ్లారి జిల్లాయందలి కాపుగల్లి వైనాడుదగ్గర నున్న ఎడకల్లు, సింగభూము జిల్లాయందలి ఘటశీల, వింధ్యపర్వతములవద్ద కానవచ్చునవి వీటిలో కొన్ని.

అనాదినుండియు చిత్రరచన యెడల మనవారు మిగుల ఆదర గౌరవములతో నుండిరి. మయ వాస్తు శాస్త్రమున,

"శిల్పిపూజా శిలాపూజా శిల్పిదుఃఖేన దుఃఖితా
శిల్పినా కల్పితం దైవం శిల్పిబ్రహ్మమయం జగత్"

అని కలదు.

చిత్రరచన దేవదత్తమని వీరి నమ్మకము. 'నారాయణుని తపస్సును భంగపరచుట కప్సరసలు వచ్చిరి. వారి నవమానము చేయుట కాముని తనయూరువులందు చక్కని నారీచిత్రమును రచించి ప్రాణమును బోసెను. ఈ యూర్వశిని పురూరవుడు వివాహమాడెను' — అని ఋగ్వేదమున గలదు.

ఈ కథనే వ్రాయుచు ఊర్వశీ చిత్రము మామిడి రసముతో చిత్రితమైన దనియు, పురందరు డీమెను స్వర్గమునకు గొనిపోయెననియు విష్ణుధర్మోత్తరకర్త వ్రాసెను.

పూర్వ మొక బ్రాహ్మణపుత్రుడు మరణింప నాతని తండ్రి దుఃఖము నాపజాలక పుత్రభిక్ష నిడుమని యముని ప్రార్థించెను. యముని హృదయము కరగలేదు. అంత నా బ్రాహ్మణుడు బ్రహ్మను ప్రార్థించెను. సృష్టికర్త యగు నా వేల్పును పంచభూతములతో లీనమైన దేహమును మరల సృజింపలేక యాకుమారుని రూపమును వ్రాయుటనునేర్పి, కుంచెలను, రంగులను ప్రసాదించెను. బ్రాహ్మణుడు తన ప్రియకుమారుని స్మరించి యొక విగ్రహమును వ్రాయ, దానియం దాదేవుడు ప్రాణముబోసెను. — అని మరియొకకథకలదు.

ఇవి భారతభూమియం దీకళ చిరకాలమునుండియు నాదరణకు వచ్చెనని సూచించుచున్నవి.

ఇట్టి ప్రబల నిదర్శనములు కానవచ్చుచుండ భారతీయ చిత్రరచనగూర్చి సంశయించుట యనవసరము. బాగుగ విమర్శించినకొలది ఈ విషయమును నిశ్చయముగ నిర్ధారణ చేయవచ్చును. అవకాశము చాలక సూచనా మాత్రముగ వ్రాయవలసి వచ్చెను. మన దేశమునందు గల మహా పండితులీ విషయమై సనాతన గ్రంథములను వెదకి సహేతుకముగ నిదర్శనములను జూపి, యనుమానములను తొలగించి భారతీయ నాగరికతయొక్కయు, చిత్రరచనయొక్కయు ప్రాచీనతను ప్రపంచమునకు చాటెదరు గాక.

---

## ముక్తజ్యోతి

కుందుర్తి నరసింహారావుగారు

ఇంతటి దుర్గమాటవి దహింపఁగఁజాలు మహాగ్నికీల క్ర
క్కింతువు దృష్టిలోనని గ్రహించితి నేఁటికి; నిర్నిమిత్త వి
భ్రాంతికి లోనుగా వికృతభావములంది నటించినాఁడ నం
చంతయు మించిపోయినపుడా, అకటా, కనువిప్పఁజాలుటల్?

విశ్వజ్వాలవు నీవు: నీవెలుఁగు గాన్పింపన్ మహాభాగ్యమున్
విశ్వాసం బది నాహృదంతరగతిన్ వేధించునేగాని, స
ప్తాశ్వున్ జూచి కనుల్ మొగుడ్చు నసమర్థప్రాణినైయుండి నీ
నిశ్శ్వాసధ్వనిఁ గాంచి నీకడకు రానేవచ్చిన క్లైంచెదన్.

నవ్వెద వీవు నావికట నాట్యము కన్నుల విందు సేయ లే,
వివ్వనవాటియెల్ల నొకటేపనిగా నను గేలిసేయు; నే
నెవ్వఁడ? నంత నేర్పి కరుణించిన నీపలుకెల్ల వీడి యే
చివ్వకు వచ్చినట్లొ వికసించిన సంతసమందిపోదువే!

అందము నీవు నాకొరకునై సృజియించితి విన్నిచోట్ల చ
క్కందన మేర్పడం దొలిచి కట్టెద ఱాతిపగుళ్లగోడలన్
మందిర మొందు నీకు: కొఱమాలిన భౌతికరూపకాంతి ని
న్నొందునటంచు, నవ్వెద వయో! సుగుణాత్మత లేదు నాకిటన్.

ప్రేమకు నీవు మూర్తి వని విన్కిడి; సన్నని జాతిపూవులో
కామవికారకారణ వికాస దిగంత విలీనవాయువుల్
నా మెయిఁ జొక్కఁజేయుటఁ గనన్ మది నువ్విళు లూరిపోదు నం
తే, మఱి నీ వొసంగిన దదే బహుమానమటం చెలుంగనే!

విలయధ్వాంతము క్రమ్ముకొన్న జగతిన్ వేదండఘీంకార సం
కులఘోరాటవి దద్దరిల్లు నిశలన్ ఘూకారవాభీల సం
చలితోర్వీజవితాన మూగిపడఁగా ఝుంఝూమరుద్వీచిపై
నిలువంజాలిన నీదు వాక్కు వినలేనే ప్రాణినై యుండియున్.

నాగీతావళి పాడుకొందునటు కొన్నాళ్లిట్టులే నేను ది
గ్భాగాలంకృత విశ్వమోహనముగా గంధర్వభోగంబుగా:
నాగండం బిసుమంతయుం గడవ దన్నా! చెట్ల రాపిళ్లలో
రాగం బీ విటు లాలపించుసొగ సెల్లన్ నేర్వలేకున్నచో.

లెక్కకు రాని తీగ లగలించితి నీవనవాటి ; నాకు మ
త్తెక్కిన మూఁడునాళ్లును గతించె; వినోదపు నాట్యరంగ మె
ల్లెక్కితినో, నటించితినొ, యేమొ,—సమస్తము విస్మరింపఁగా
నిక్కడనైన వేసము త్యజించెద నార్య, అనుజ్ఞ యీఁగదే—

ఇది నా సొత్తటె! యెంత గర్వపడినా నిన్నాళ్లు క్రొవ్వెక్కియు
న్నదిపో; నాతలపాగ అంచులకు గంతల్ బొంత లెక్కించి యూ
డెద, ముత్యాలసరాలు గ్రుచ్చుకొని యీడేరెన్ మనోభీష్టమం
చెద నూహించెద ; నేమియయ్యె నకటా యీనాఁడ వెల్లన్ ద్యజిం
చెద దుర్వార తమస్తతిం బడుచు భాషింతున్ విముక్తాత్మతన్.

# కాఫీ

కొంచనపల్లి వెంకట రంగారావుగారు

కాఫీ మొదట జన్మించింది అరేబియాలో. అరబ్బులు ఎడారులలో బడలిక తీరుటకు పానీయముగా యీ కాఫీనీటిని పుచ్చుకొనుట యాచారము. అబిసీనియా ప్రాంతములందు కాఫీమొక్కలు అడవులవలె దట్టముగా పెరిగియుండును. అబిసీనియను జాతివారికి కొన్ని శతాబ్దములతరబడి యీపానీయము అలవాటై యున్నది. సామాన్యముగ కాఫీ చెట్లు ఆప్రాంతముల ౧౫ మొదలు ౨౦ అడుగుల వరకు పెరుగును గాని యెప్పటి కప్పుడు వాటిని ౫,౬ అడుగులకు మించి యెత్తుగా పెరుగనీయక కత్తిరించివేయుచుందురు. కాఫీ చెట్టు గుబురుగా నొక పొదవలె నుండును. కాయలు కండపుష్టి కలిగి పండినపిమ్మట ముదురు యెరుపురంగును లేక బాదంపండు రంగును దాల్చును. కాఫీ తేయాకు మొదలగు పానీయములయందు నిద్రను భంగపరుచు గుణము కలదు. చీనాదేశస్థులకు తేయాకుత్రాగుడు యెంత అభిలాషో, అరబ్బులకు యీ కాఫీత్రాగుడు అంత. చీనాదేశస్థులు తేయాకుపంటను, అరబ్బులు కాఫీ పంటను విపరీతముగా పండించుటలో నేర్పరులు. మొట్టమొదటి కాఫీ హోటలు లండనునందు ౧౬౫౨-వ సంవత్సరమున తెరువబడెను. మరి కొలదికాలముననే దీని విలువ మిక్కుటమై ఒక్కదుకాణము చాలకుండెను. పిమ్మట మరికొన్ని తెరువబడుటయు, కల్తీ కాఫీ తయారుచేయుటయు, ఆరంభము కాజొచ్చెను. అది ప్రభుత్వమువారు చూచి, యీ దురాచారమును అరికట్ట యత్నించి ప్రతికాఫీదుకాణముమీదను కొంత పన్ను విధించుట ఆరంభించిరి. పన్ను బిగించుట జాస్తీ యగుచున్నకొలది, దొంగతనముగా అమ్ముట, కల్తీ చేయుట పెచ్చుపెరుగ జొచ్చెను.

కాఫీ పంట ఇండియా, సిలోన్, జావా, సుమత్రా, మారిషస్, ఆఫ్రికా మొదలగు సమశీతోష్ణ ప్రదేశములయందును విరివిగా పండింపబడుచున్నది. ఇంకను బాల్‌జాక్, బీథోవెన్, డ్రైడన్, ప్రాంతములందు సహితము యీతోటలు విరివిగా చూడనగును. ఈ కాఫీగింజలు ౧౮-వ శతాబ్దప్రారంభములో అరేబియానుండి అన్నిదేశములకు మొత్తము ఎగుమతి ౩౦౦,౦౦౦,౦౦౦ పౌనులు అయినట్టుగా అంచనా వేయబడెను. కాని ౧౮౫౪-వ సంవత్సరము లగాయతు ౧౮౬౯ వరకూ బ్రిటన్‌దేశములో యీ కాఫీవాడుక కొంచెము తగ్గుదలను సూచించెను. దీనికి పోటీగా తేయాకు, చికరీ (Chicory) అను వ్రేళ్లగుండతో కూడిన కల్తీకాఫీ, ప్రబలముగా అమ్మకమునకు ప్రతి వత్సరము మారుపేరులతో, నూతనములగు రిజిస్టర్డు ట్రేడుమార్కులతో, దిగుమతి యెగుమతులు కాజొచ్చెను. వ్యాపారస్థులు ఘనముగా కొనియాడు ఆయా కాఫీ రకములను, గింజయొక్క ఆకృతి, వాసన, పుష్టి, యీ మూటిమూలమున నాణ్యమగు గింజలైనది లేనిది గ్రహింపవచ్చును. రంగు అంత ప్రధాన పరీక్షావిషయము కాదు గాని అదియు చూడవలసినదే. ఈగింజలలో ఖరీదు ఎక్కువగా నుండు రకము పఠాణీగింజల వలె రెండుబద్దలు కలిసి గుండ్రనై యుండును. ఇవే శ్రేష్ఠములైనవి.

ఈకాఫీపంట నిమిత్తము కొండప్రాంతములలో ౧,౦౦౦ మొదలు ౪ వేల అడుగులవరకు ఆ ప్రదేశమును పిల్లపారునట్లు దున్ని, వర్షములు పడక మునుపు, పడిన పిమ్మటను కూడ, మంచి యెరువువేసి సారవంతము చేయుదురు. చిత్తడినేలలో యీపంట అభివృద్ధికరముగా నున్నట్టు గానబడదు. కాయలు బాగుగా పండి, ముదురు ఎరుపురంగు దాల్చినపిమ్మట, అవి కొట్టి, ఒలిచి గింజలను పోగుచేయుదురు. ఒకప్పుడు సిలోన్‌నందు బ్రిటిష్ కాఫీ విత్తులకు చాల ప్రచారము కలిగి, తక్కిన కాఫీ రకములను అణగద్రొక్క నంతటి విపరీత వ్యాప్తి నొందెను. కాని ఆ అదృష్టము ఎంతో కాలము నిలువలేదు. కారణము, తరుచుగా ఆ ప్రదేశముల నొకవిధమగు చీడపురుగులదండు పంట సమ

యమునకు బయలుదేరి పంటను నాశము చేయుటయే. చికరీ కల్తీ పదార్థమని చాలమంది . యుపయోగించరు గాని, కొందరుమాత్రము అసలు కాఫీపొడియందు ఇది మిశ్రమముచేసి వాడుచుందురు. ఇందుమూలమున ప్రమాదము ఏమియు లేదు. అసలు కాఫీగుండలో, వ్యాపారస్థులు మాడ్చిన గోధుమనూక కల్తీచేసి అమ్మకము చేయు చుందురు. *తేయాకువలె గాక కాఫీ త్రాగుట నెమ్మదిగా నలుముఖములా వ్యాప్తి నొంది, అన్ని జాతుల- అన్ని దేశముల వారిచేతను, ఘనత నొందుచున్నది. దీనివాసన, రుచి అందరికిని ఆకర్షకములే. ఈజిప్టుదేశమున కాఫీకషాయములో ప్రత్తిగింజల గుండను కలుపుచు, ఇందుమూలమున హెచ్చగు రుచి, సువాసన, సుగుణము కనబడుచున్నట్లు కొలదికాలము క్రిందటనే పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు గ్రహించినట్లు తెలియుచున్నది. మన భారతదేశములో కొన్నిభాగముల ఆవులకు, గేదెలకు ఈ ప్రత్తిగింజలను కుడితిలో కలిపియు, ఉలవలతోపాటు నానబెట్టి రుబ్బియు నొసంగుదురు. ఆకారణమున అవి విశేషముగా పాల నొసంగుటయే గాక అట్టి పాలయందు వెన్న ఎక్కువగా వచ్చుచున్నట్లును అనుభవవేద్యమే. తేయాకువలె కాఫీ వలనను ఒకవిధమగు చురుకుదనము కలుగును గాని, ఆచురుకుదనము ఎంతోకాల ముండదు. ఆలోచనాపరులకు కాఫీ యొక సహాయకారి కావచ్చును. ఈరోజులలో కాఫీ త్రాగుడు ప్రతివానికిని అలవాటై పోయినది. త్రాగనివారిని 'పల్లెటూరి బైతురా, కాఫీ మొగమేనా యెరుగడు!' అని తూలనాడుచుందురు.

కాఫీ త్రాగుటవలన మూత్రవిసర్జన మధికమగును. శరీరమునకు చెమట పట్టును మితిమీరి త్రాగుచెడల గుండెలు కొట్టుకొనుట క్రమక్రమముగా తగ్గిపోయి, ఆకలి మందగించి, అజీర్తి ప్రారంభమై, మలబద్ధము మొదలిడును. ఉదయములందును, ఆఖరుసారి భోజనానంతరమును, ఎవరికాల ననుసరించి వారు తగుమాత్రము కాఫీ పుచ్చుకోవచ్చును ఇట్లు చేసిన, నిద్రకు భంగముండదు. డికాక్షను చిక్కగా కలిపి త్రాగుటవలన్న, విశేష శరీరపరిశ్రమ లేనివారికి చెడుగా పరిణమించును గాని, బాగుగా పరిశ్రమచేసి బడలిక చెందినవారికి, భుజబలము, బుద్ధిబలము విశేషము వినియోగించినవారికి త్వరితముగ ఆయాసరాహిత్యమును కలిగించును. రుచికరమగునట్టియు, ఆరోగ్యకారియు నగు కాఫీని త్రాగవలయునన్న, యెప్పటికప్పుడు కొలది మాత్రము గింజలు ఎర్రగా వేగించి, అవి నలుపురంగుకు దిగేసమయములో దించి, అమాందస్తాలో వేసి బాగుగా దంచి, అట్టి పొడితో వెంటనే కాఫీ చేసుకొనవలెను. 'గింజలను మాడ్చినపక్షమున కాఫీ రుచి చెడుటే గాక మలబద్ధకమునకును కారణ మగును. కాఫీగింజల వేపుడు తగ్గినను, హెచ్చినను అట్టిగుండయొక్క కాఫీ రుచిగా నుండక చురుకుదనము కలిగించక మానసోల్లాసమునకు భంగమొనగూర్చును. కాఫీని పింగాణీ (Porcelain) గిన్నెలలో పోసి త్రాగిన, రుచియు సువాసనయు తగ్గిపోవు. వెండి, కంచు, ఇత్తడి మొదలగు పాత్రలలో పోసుకొని త్రాగుటకన్న పింగాణీపాటిలో త్రాగుటే కడు నుచితము. కాఫీయొక్క వేడిగుణము చలికాలమందును, శీతప్రాంతములందును — కాఫీవలన కలుగు చెమటయొక్క చల్లదనము వేసవికాలమందును, ఉష్ణప్రదేశములందును — ఆయాజాతులచే గౌరవనీయముగా కొనియాడబడుచున్నవి.

అత్యద్భుతముగ, అనతికాలములోనే లెక్కకు మిక్కిలిగా పెరిగిన కాఫీహోటళ్లయొక్క సంఖ్యను దక్షిణయిండియాలో చూచిన, ఇది యెంత మాహాత్మ్యము కలదో తెలియవచ్చును. రాత్రి, పగలు అను వివక్షలేక, బజారులందు, పార్కులందు, క్లబ్బులందు, సినీమా-నాటక భవనములందు, వర్కుషాపులందు, పబ్లిక్ అండ్ ప్రైవేట్ ఆఫీసులందు, ఎక్కడ అక్కడ అవ నేల, సర్వాంతర్యామియై వెలయు నీకాఫీయొక్క మాహాత్మ్యము విన్నను, ఇట్టి కాఫీని రుచిచూచినను ఆశ్చర్యము కలుగుట లేదా?

---

* తేయాకునుగూర్చి 'భారతి' గత నవంబరు సంచిక చూడుడు.





## ఆంధ్రసాహిత్య పరిషత్తు

మనకును సాహిత్యపరిషత్తు ఉన్నది.

అది జాతికంతకును సంబంధించినది; గాని ప్రత్యేక వ్యక్తులకు గాదు.

దానికిని సార్వజనీన సంస్థల కుండవలసిన కట్టుబాట్లన్నియు నున్నవి.

మూలధనముగూడ దానికి తక్కువగా లేదు.

ఏటేటను దానికి వార్షికోత్సవములును జరుగుచున్నవి. ఏలాంఛనములకును లోటు వచ్చుట లేదు.

కాని యిన్నియోగ్యతల సమ్మేళనము మన సాహిత్యమునకు వికాసము కలిగింప జాలునదిగా లేదు.

ఏల?

దాని యునికి నెరిగినవారి సంఖ్య చాలస్వల్పము.

ఎరిగిన వారిలో నైన బహుసంఖ్యాకులు దాని యెడల ముగ్ధులుగా లేరు.

వారి నాకర్షించుట కది యేవిధముగను ప్రయత్నించుట లేదు.

అందు నిరంకుశత్వమే; గాని ప్రజాస్వామికత కాన్పింపదు.

ఈ పరిస్థితులు పరిషత్తుయొక్క అభ్యుదయమునకు ప్రతిబంధకములు. ఇంతే కాదు: ప్రతిష్ఠాపకుల అపారపరిశ్రమకు నిష్ఫలతాపాదకములున్ను.

పరిషత్తు నిష్ప్రయోజనము కావలయు ననుట ప్రతిష్ఠాపకుల యుద్దేశమని యెవరును చెప్పరు. అట్టి హ్రస్వదృష్టు లిట్టి సంస్థను నెలకొల్పజాలరు.

దానియెడల ప్రతిష్ఠాపకులకే సార్వకాలిక ప్రాజాపత్య ముండవలయు ననిన నందు కెవ్వరు నాక్షేపింపరు. అయితే: అది జనరంజకతవలన సిద్ధించును; గాని లౌక్యమువలన గాదు.

పరిషత్తున కిరువదిరెండేండ్లు నిండినవి. ఇది మూడుపువ్వులు, నారుకాయలుగా నుండదగిన వయస్సు; గాని అట్టి సన్నివేశ మేమియు కాన్పింపదు. పైగా క్షయ పట్టుకొన్నది.

"సభ్యులయొక్కయు, చం (జం ?) దాదారులయొక్కయు సంఖ్య నానాటికిఁ దగ్గుచున్నది" అని కార్యదర్శి నివేదిక.

ఇదీ గాక: ఇరువదియొకటవ వార్షికోత్సవము జరుగనే లేదు. ఇరువదిరెండవ దయిన రాజమహేంద్రవరమునగూడ నిక లాభము లేదన్నంతవరకును వచ్చిన పిదప జరిగిపోయినది.

ఇరువది మూడవ వార్షికోత్సవము నేయూరి వారును ఆహ్వానింప లేదు.

ఇది యంతయు దేశీయులకు పరిషత్తునెడల సుముఖత లేదనుటకు నిదర్శనముగా నున్నది.

ఈక్షీణత యింతటితో నిలిచిపోవు ననుటకుగూడ సూచనలు లేవు.

తమ సాహిత్యపరిషత్తునకు పుష్టి కూర్చుకొన లేని యాంధ్రులవలన నిక నేమగును ?

పరిషత్తు నిట్లు గుప్పిట నిరికించుకొనినవారు కొలదిమందియే; గాని దానివలని కళంకము జాతి కంతకును సంక్రమించు చున్నది.

ఛాగంగి

అయితే: ఇందున్న దోషమేమి? అది యెట్లు పోవును?

ప్రకృతపు కార్యనిర్వాహకవర్గమువారు దీనిని బాగుగ యోచించుకొనవలయును.

ప్రతిష్ఠాపకులగు జయంతి రామయ్య పంతులు గారు నిష్కల్మష హృదయులే, సమర్థులే, పండితులే. ఇట్టి యపూర్వ ప్రతిష్ఠాపనమును నెలకొల్పినందుకు జాతియంతయు వారియెడల కృతజ్ఞతాబద్ధ మయియే యున్నది; గాని దేశీయులయెడల వారు సంశయాత్ములై యున్నారు.

"ఇం దెవరిని జేర్చిన నేమి చేయుదురో? ఇంత కష్టపడి తయారుచేసిన దీనిని వా శేయ గాధమున దింపుదురో?" ఇదీ వారి సంశయము.

ఉరకలు వేసికొనుచు వచ్చుచున్న వ్యావహారిక భాషాభిమాన మెప్పుడు దీనిని ముంచినేయునో యని వారు పడుచున్న జాగ్రత్త అనంతముగా నున్నది.

అయితే: వ్యావహారిక భాషావాదులను చేర నీయకుండుటవలన పరిషత్తున కేమయిన శోభ చేకూరినదా? లేకున్న గ్రాంథికభాషావాదులవలన నింతకంటె నేపనియు కాదా? వారిలోగూడ సమర్థులకు, నుత్సాహవంతులకు నింగు స్థానమే లేదా?

పరిషత్తున నికముందుగూడ కార్యనిపుణులకు స్థానము లేకుండ జేయబడినచో నందు కెవరును చింతింపరు.

కాలము గడచిన కొలది, ప్రపంచమును జూచిన కొలది, ఆత్మగౌరవ మేర్పడిన కొలది, భాషావాఙ్మయముల యెడల ప్రీతి యుత్తరంగితమైన కొలదిని దేశీయులు మరియొక పరిషత్తును నెలకొల్పుకొనక జాలకపోరు. అయితే: చిరప్రతిష్ఠితమై యున్నదీని భవిష్యత్తు ఏమి కావలెను?

ఇదీ విషయము.

ఇందు బెదరింపులేదు. హేళనము లేదు. నిరసనము లేదు. కృతఘ్నతయు లేదు.

రామయ్యపంతులుగారి యడుగులలో నడుగులు వేయుటకు యువకులు కటిబద్ధులై యున్నారు; గాని పంతులుగారు మాత్రము పరిస్థితులను గమనించి మరీ కాలు కదల్పవలెను.

ఇరుగు పొరుగు సాహిత్యము లన్నియు పూర్వాలంకారములను దృఢపరుచు కొనుచు, నవీనాలంకారములను సమకూర్చు కొనుచున్నవి.

ఇది ఆంధ్రయువకులను ఉద్రిక్తచిత్తులను గావించుచు కార్యరంగముల నరికించు చున్నది.

కొన్ని పొరపాటు లేర్పడినను ఈ క్షీణతకంటె వృద్ధి మంచిది. కొన్ని తప్పులు కలిగినను ఈ స్తంభనము కంటె చలనము శ్రేష్ఠము. కొన్నియిబ్బందులు వచ్చినను ఈసంకోచము కంటె వ్యాకోచము ఉత్తమము. కొంత యధికారము సన్నగిల్లినను ఈ విమర్శనముల కంటె పరిశీలనములు శ్రేయస్కరములు.

ఓపిక పట్టి, సహనము పూని యిన్నియంతరములు దాటగలిగినచో కార్యపరతంత్రున కిక తరువాతి మెట్టు విజయమే, ఆనందమే.

—శాస్త్రి.



థేమ్సు తపాలాబంట్రోతు

(థేమ్సునదిగుండా పోవు నౌకలకు జాబులను బట్వాడాచేయుట హెచ్. యల్. ఇవాన్సుగారి కుటుంబము నకు తాతలనాటినుండి వచ్చిన వృత్తి. ఇందు ఇవాన్సుగారు ఒకానొకనౌకపైకి తపాలుసంచితో నెక్కుచున్నాడు.)

E. N. P.



ప్రాణరక్షిణి

ఈతగాండ్ర కిది పరమోపకారకము. దీనిని ధరించి, ప్రక్కనున్న చక్రమును త్రిప్పుచుండిన నేమాత్రము అలసటచెందక గంటకు పదిమైళ్లు పోగలుగుదురు.

E. N. P.




## ఎక్సు రేదృష్టి

హీలా మే ఆట్లీకన్య (Miss Hila may Atlee) ఒకపాశ్చాత్యయువతి ఆమెవయస్సు ఇరువదియారు సంవత్సరములు. సుమారు అయిదుసంవత్సరముల క్రిందట ఒకరోజున ఆమె ఒక శిశువుకు స్నానముచేయిస్తూ ఉండగా ఆశిశువు ఎముకలు మొదలైనవి చర్మము ద్వారా ఆమె దృష్టికి స్పష్టముగా కనిపించినవి. అది ఆమెకు అద్భుతముగా తోచి ఇదేమిచెప్మా అని ఆలోచిస్తూ లోపలికిపోయి తన పెంపుడుపిల్లిని పైకెత్తి నిమురుతూఉండగా బొచ్చుగుండా దానిపుర్రె, వెన్నెముక మొదలైనవి కనిపించినవి. అంతటితో సరిపోక ఆమె ఎవ్వరితో మాట్లాడుతూఉన్న ఎదుటివారి దౌడ ఎముకలు మొదలైనవి స్పష్టముగా కనిపించేవి. ఇవన్నీ వినేవాళ్లకు ఎంతవింతగా తోచినా అనుభవించే ఆమెకు మాత్రం చాలాబాధగా ఉండేది. కాని అందులోను ఒక్క సుగుణం ఏమిటంటే, ఆమెదృష్టి చర్మంద్వారా ప్రసరించ కలిగేదే కాని దుస్తులు మొదలైన వస్తువులద్వారా ప్రసరించలేకపోయేది. ఆమెకు కలిగిన ఈబాధవల్ల ఆసుపత్రికిపోయి ఈసంగతులు డాక్టర్లతో చెప్పి కళ్లు పరీక్షచేయించుకుంటే నేత్రాల్లో దోషము ఏమీలేదని వాళ్లు చెప్పినారు. కాని పాశ్చాత్య శాస్త్రవేత్తలకు ఇది ఒక మహాసమస్యగా పరిణమించింది. ఈ "ఎక్సురే" దృష్టి ఈమెకు కలగడానికి గల కారణము ఏమయిఉంటుందో కనిపెట్టడానికి వాళ్లు ఎంతప్రయత్నంచేసినా ప్రయోజనం లేకపోయింది. ఈమె జీవించిఉండగా ఈవిషయము తేలితే సరేసరి, లేకపోతే ఈమె మృతిచెందినతరువాత శవాన్ని శాస్త్రోక్తంగా ఛేదించి పరిపరివిధాల పరిశోధించి ఆమర్మంఏమిటో కనిపెట్టకుండామాత్రం వదలరు. పట్టుదలకు, కార్యదీక్షకు మాత్రం వారినిచెప్పిగాని మరియొకరిని తలపెట్టడానికి వీలులేదు. ఆపైని వారి మేధావిశేషాన్నిబట్టి ఎక్సురేదృష్టి స్త్రీపురుషులకు కలిగించే ఉపాయమే కనిపెడతారో, లేకపోతే ఎక్సురేకంటి జోళ్లు తయారుచేసే పద్ధతే కనిపెడతారో చూడవలసి ఉన్నది.

ఈ విషయమై సైకిక్కు రిసర్చి సొసైటీ (Psychic research Society) వారికి తెలిస్తే ఈమె ఏ ఎక్సురే ఇన్‌స్టిట్యూటులోనో పనిచేసి ఉండడంవల్ల కలిగిన పూర్వ జన్మవాసనవల్ల ఈజన్మలో ఈవిచిత్ర దృష్టి లభించిందనో, లేకపోతే ప్రాచీనకాలంలో ఈమె హిందూదేశంలో పుట్టి యోగదృష్టివల్ల సమస్తమూ చూడగల ఐచ్ఛికశక్తి ఉంటూంటే ఆదృష్టిని దుర్వినియోగం చేయడంవల్ల కలిగిన పాపం ఈవిధంగా పరిణమించిందనో తేలుస్తారు.

ఎవరేమి సమాధానములు చెప్పినా, మానవకోటికంతకూ సామాన్యమైనశక్తులు మాత్రమే హెచ్చు తగ్గులలో మనుష్యుడు భరించగలడేకాని ఇతరుల కెవ్వరికీ లేని వింతశక్తివలన తనకూ లోకానికీకూడా సుఖంలేదు. పైపెచ్చు ఒకరిని చూచి ఒకరు భయపడతారు. అందుచేతనే కొన్నికొన్ని అమానుషశక్తులు తపోబలంవల్ల యోగులు సాధించి అవసరమైనప్పుడు లోకకల్యాణం కొరకు ఉపయోగించేవారు. వారికి కలిగేశక్తులు ఐచ్ఛికములు కాని నిర్బంధములుకావు. జీవాత్మకు, పరమాత్మకు శ్రుతి కలిసిందంటే మానవుడికి దివ్యదృష్టి అబ్బుతుంది. అప్పుడు అతడు గ్రహించలేని విషయం ఉండదు. అందుచేత దివ్యదృష్టి అన్నా, యోగదృష్టి

అన్నా ఏమిటో తెలిసికొని అది సాధించడానికి ప్రపంచకల్యాణంకోరే ప్రతివ్యక్తి ప్రయత్నం చేయడము అవసరము. ప్రతివిషయము సమన్వయ దృష్టితో గ్రహించడమే అందుకు ప్రథమసోపానము. ఈకాలంలో ఏదిమాచినా ఛేదించి ఛేసించి చీల్చి చెండాడడం అనేది ఆబాలగోపాలం అలవాటైపోయింది. "సత్యం వద", "ధర్మం చర" అంటే "కస్మాత్ కారణాత్" అనే ప్రశ్న బయలుదేరుతోంది. కనుక సమన్వయభావం యొక్క అవసరం సందర్భం కలుగచేసికొని ఇంతగా చెప్పవలసి వచ్చింది.

—కనగాల లక్ష్మీనరసింహారావు

---

## ఘోషా

స్త్రీలకు ఘోషా ఆచారము స్వదేశీయమా అన్యదేశీయమా అను విచారము పలుమారు గల్గుచున్నది. ఘోషా అను శబ్దము పార్శిభాషలోనిదిగ నున్నది. ఆ భాషయం దాశబ్దమునకు 'మూల' (Corner) అని యర్థము అనగా బహిరంగముగ విచ్చలవిడిగ తిరుగక యింట నొకమూల నొదిగియుండువారగుటచే ఘోషా వారని పేరు వచ్చియుండవచ్చును. సాధారణముగ స్త్రీలకందరికిని కించిత్తు ఘోషాతనము అనాదిగ నున్నటుల తోచుచున్నది. 'అవరుద్ధా' యిత్యాద గోషా సూచకమగు శబ్దములు స్త్రీలనుగూర్చి మనధర్మశాస్త్రములలో నగపడుచున్నవి. అవరుద్ధాశబ్దము మనుస్మృతియందును, యాజ్ఞవల్క్యస్మృతియందును దగులుచున్నది.

ఈధర్మ ప్రవచనములుకాక లోకానుభవమునను పూర్వకాలమునందు ఘోషావంటిపద్ధతి యున్నటులే తోచుచున్నది. రావణవధానంతరము సీతాదేవిని శ్రీరాముని సన్నిధికి గొంపోవునపుడు 'ఆరోప్య శిబికాం దీప్తాం పరార్ధ్యాంబరసం వృతాం'* అని వాల్మీకి వర్ణించి యున్నాడు. గొప్పవారికది మర్యాదకాబోలు. కిష్కింధాకాండలోను లక్ష్మణుడు అంతఃపురమునందు సుగ్రీవునిజూడబోయినపుడు వర్తమానము లోనికిబంపినంతట అచటనుండి ప్రత్యుత్తరముగొనివచ్చినమంత్రులు 'దారదర్శినా' అని వర్ణింపబడిరి. అనగా అంతఃపురమున రాణివాసమునందు రాజపత్నిని చూచుటకు అర్హులయినవారు అని అర్థము. దీనివలన ప్రతివారును స్వేచ్ఛగ అంతఃపురస్త్రీలమాడజాలరని గోచరించుచున్నది.

ఒకవేళ స్త్రీలనంతిపురంబుల అసూర్యంపశ్యలగ నుంచుటగాకపోయినను తాపసస్త్రీలు బయట వచ్చునపుడు ఘోషా కాకపోయిన నొకముసుగు లేక బుర్కా వేసికొను ఆచార ముండినటుల తోచుచున్నది. ఈ ఆచారమును కాళిదాసు శాకుంతలమున నుద్ధరించినాడు. గౌతమీసహితయై శకుంతలదుష్యంతుని కడకేగినపుడు ఈమె అవగుంఠనము (ముసుగు) వేసుకొని యుండినటుల పంచమాంకములోని ఈక్రింది శ్లోకము సూచించుచున్నది—

శ్లో॥ కాస్విదవగుంఠనవతీ
నాతిపరిస్ఫుట శరీరలావణ్యా......

ఇత్యాది విధమున దుష్యంతుడు శకుంతలను వర్ణించి యున్నాడు. ఈయవగుంఠన మర్యాద ఆంధ్రద్రావిడులలోదప్ప సామాన్యముగ హిందూదేశమందలి స్త్రీలందరు ఇప్పటికిని ఆచరించు చున్నట్లు కనబడుచున్నది,

'దారదర్శినా' అనుటలో యింకొక అభిప్రాయమును పొడగట్టుచున్నది. ఈనాటికిని ఘోషా నాచరించు మహమ్మదీయులు పెండ్లిండ్లలో పెండ్లి అయిన పిదప ఆ నవవధువు ఎవరియెడ ఘోషానాచరించవలసినదియు, ఎవరియెడ యక్కర లేనిదియు వరుడు నిర్ణయించునట.

ఈచిన్న వ్యాసము ఘోషాయొక్క గుణదోషముల విచారమునకై ప్రసక్తించినది గాదు. కేవల చారిత్రాత్మకమని మనవి.

(తత్త్వదర్శి)

---

* యుద్ధకాండ ౧౧౬-౧౪



దారుమయము



దంతమయము

ఈ పటమున కనబడు మనుష్య-అస్థిపంజరములు నిజమయినవిగావు. వానిలో నొకటి దంతముతో చేయబడినది. ప్రస్తుత మవి విశాఖపట్టణ వైద్యకళాశాలయం దున్నవి.

తంజాపురరాజులలో నొకరగు శర్ఫోజీ యను నాతడు గొప్ప పండితుడు, కళాభిమాని. ఇతనికాలమున తంజాపుర సరస్వతీమహాల్ గ్రంథాలయము చాల వృద్ధికి వచ్చెను. ఇతినికి శారీరకశాస్త్రమం దభిమానము మెండుగ నుండెను. కావున గ్రంథాలయమునకు చేరువ నున్న మరియొక గొప్ప మహాలునందు మనుష్యుని అస్థిపంజరము నొకదాని నుంచెను. ఇది అశుభమనియు, రాచనగరునం దుండదగని దనియు రాణివాసమువారు

పలుకగా రాజు వారి అభిప్రాయముల ప్రకారమే మనుష్యుని అస్థిపంజరమును తీసి వేయించి దానివలెనే దంతముతోను, కర్రతోను రెంటిని తయారుచేయించి అచట నుంచెను. ఆరెండు అస్థిపంజరములు క్రీ. శ. ౧౭౦౫-౧౭౧౦ ల మధ్యకాలమున తయారు చేయబడినవి. ఇవి మనుష్యుని అస్థిపంజరమును సరిగా పోలియున్నవి. ఎంతధనము వ్యయముచేసినను ఈకాలమున ఇటువంటి వస్తువులను చేయుటకు సమర్థులగువారు లేరని శిల్పులు కొందరు చెప్పిరి. అదిగాక వీటినిచేయుటకు కావలసిన వస్తువులు చాల ధర గలిగినవి. ఇందులో దంతముతో చేయబడిన అస్థిపంజరము 5-అ. $6\frac{1}{2}$ అం. ల పొడుగు గలిగి ౨౩ పౌనుల తూనిక గలిగియున్నది. తీర్చి దిద్దినతర్వాత యింతబరువు గలిగిన దంతము తొలుత ఎంత ఖరీదుగలిగి యుండునో ఊహించుకొనవచ్చును. దంతముతో చేయబడిన అస్థి పంజరమునందు కొన్ని భాగములు అతుకులేక యున్నవి.

ఇటీవల ఆమహాలునందున్న వస్తువుల నన్నింటిని అమ్ముచుండగా వీటి నొకరు రు. ౭౫-౦-౦ లకు కొనిరి. తర్వాత ఇవి రెండును డాక్టరు ఆర్. కే. రావుగారికి లభించగా వారు విశాఖపట్టణ వైద్యకళాశాలవారి అనుమతిమీద ఆకళాశాలయందుంచిరి.

(ఆంటిసెప్టిక్ పత్రిక ౧౯౩౨, జనవరి సంచికనుండి)

---

## తలిదండ్రుల ప్రథమశిక్ష

తలిదండ్రులు పిల్లలకు ప్రథమగురువులు. నిష్కలుషములయిన వారి హృదయక్షేత్రములయందు తలిదండ్రులు నాటెడు వివిధ విజ్ఞానబీజము లంకురించి క్రమముగ వారికనంతఫలదములు కాగలవు. తలిదండ్రుల సద్బోధనమువినా పిల్లలు కుమార్గగాములగుదురు. వా రటుకాకుండజేయుట తలిదండ్రులకు విధి. ఈవిషయమును చర్చించుచు శ్రీ బంగారు స్వామిగారు 'దిఎడ్యుకేషనల్ రివ్యూ' లో నొక వ్యాసము ప్రకటించినారు. అందు:

"తలిదండ్రులు పిల్లలకు తెలియరానివని కొన్ని విషయముల వారికి తెలియకుండ దాచుటవలన చాల కీడు గలుగుచున్నది. తాము మంచినడతల కలిగియుండకపోవుటచేత వారికి గౌరవహీనమగు చేష్టలు పట్టుపడుచున్నవి. తాము శుభ్రముగ నుండకపోవుటవలనే వారు సోమరులును, ఆరోగ్యహీనులును అగుదురు. అందువలనే వారు అన్నిటను చెడుత్రోవల ద్రొక్కుచున్నారు. తలిదండ్రులు బిడ్డల యెదుట హేయమగు మాటల మాట్లాడగూడదు. డాక్టరు ఆలిసుశ్రీడ్మానుగారు అన్నట్లు పసిపిల్లల ననరానిమాటలు చాలగలవు—'ఒరే నీ వెంత బుద్ధితక్కువ వాడవురా!', 'మీ నాయనకెంత భయమో నీకూ అంతభయము!', 'నీచేత ఆపనికాదుపో', 'పిల్ల లెప్పుడూ కులాసాగా ఉండవలెనురా!', 'ఛీ నీదెక్కడో ఆడజన్మ!', 'నీది పనికిమాలిన జన్మ!', 'మీ నాయన్ను రానీ చెప్తా నీపని!', 'అబ్బబ్బ నీవంటి దుర్మార్గుణ్ణి నే చూడలేదురా!', 'నన్ను చంపుతావట్రా', 'ఛా ఏమిపాడు జాతకంరా నీది!', 'నీవు వట్టి పనికిమాలినవాడవే!', 'నీకు కొంచెంకూడా జ్ఞానం లేదు కదా!' ఇట్టిమాటల పిల్లల ననగూడదు. అంతేగాక, 'ఓరే నిన్ను పోలీసుకు పట్టిస్తా!', 'నిన్ను ఏపిశాచమయినా తినిపోనీ', 'ఎట్టి కులనాశకుడివి పుట్టినావురా!', 'నీవు చావనైనా చావగూడదూ!' మొదలగు మాటలగూడ పిల్లల ననగూడదు.

ఆదర్శప్రాయమగు విద్యాబోధన విధానమున ఉపాధ్యాయునకు తలిదండ్రులకు, పాఠశాలకు గృహమునకు సామ్యము గలదు. అవి అన్యోన్యపూరకములు గావలయును గాని అన్యోన్య ప్రతిబంధకములు కాగూడదు. తలిదండ్రులు పిల్లలకు ప్రథమగురువులు. గురువులు తలిదండ్రులకన్న గొప్పస్థానమును పొందుచున్నారు. గృహము సుఖముల గూర్చునదేగాక జ్ఞానసంపాదన స్థానమును, జీవయాత్రయందలి యొడుదుడుకులను సహించుటకు తగిన శిక్షణము నొసంగునదియును

కావలెను. ఈ విధముగ పాఠశాల గృహమువలె సకల సుఖములను, సకలవిషయములను జ్ఞానమును క్రీడాద్వ్యవసాయమున సమకూర్చి అన్నిటను పిల్లలను దిట్టలను చేయగలదియై ప్రపంచమందలి కష్టసుఖముల బోధించునదియై యుండవలయును."

తలిదండ్రులు పై విషయములను మనముల నిడికొని తమ పిల్లలయెడ సముచితరీతిని ప్రవర్తించుట లగ్గు.

---

## కాలవైపరీత్యము-అతిచిత్రము

ప్రపంచమునందెల్ల అమెరికా ఖండములోని యునైటెడ్ స్టేట్సు అనుసంయుక్త రాష్ట్రముల భాగము మిక్కిలి భాగ్యవంతమనుట ఖ్యాతి. వర్తకపు ఓడలన్నియు ఆయారేవులలో నిల్చి తుప్పు పట్టుచున్నవి. సరకులరైలుబండ్లు యెక్కడి కక్కడ నిల్చియున్నవి. జనులు ప్రయాణముచేయుబండ్లు యెక్కడ జూచినను ఖాళీగా నిల్చిపోయినవి. ఒకకోటి పదిలక్షల జనులు చేయుటకు పనిలేక అల్లాడుచున్నారు. కూడుగుడ్డలు గడించుటకు సాధనముగానుండిన వృత్తులన్నియు నిల్చిపోయినవి. ఇది యిట్లుండ సర్కారుబొక్కసమో బంగారుతోనిండి బరువుతో మూల్గుచున్నది. కాంగ్రెస్ వారు (Government) తమ బడ్జెట్టున వెచ్చమును రాబడికి సరిపెట్టుకోలేక కోట్ల కొలది రొక్కము గుంతపడియున్నది దీనికిమూలము మితిమీరిన ఖర్చు. గోధుమవంటి ధాన్యముల కణజములు ఎక్కడచూచినను నిండియున్నవి. పండిన ప్రత్తికి గిరాకిలేదు. ఆహారపదార్థములు కొండలైకూడి కొనువారు లేక మురుగుచున్నవి. ఇట్లున్నను లక్షలకొలది ప్రజలు తినుటకుకూడు లేక తిరిపమెత్తుకొను చున్నారు గనులన్నియు మూతబడియున్నవి. నూనెచేయు పరిశ్రమలన్నియు తీవ్రమై నష్టముకుచిక్కి పాడగుచున్నవి. సేద్యపుకాపులు తమ అప్పులను తీర్చుకొనలేక దేశపు చట్టములనే ధిక్కరించి యెదిరించుటకు మొనసియున్నారు. ఫ్యాక్టరీలు పనిలేక నిలిచియున్నవి. ద్రవ్యార్జనమునకు మూలమగు పరిశ్రమలు సాగించుటకు మార్గమే లేదు. లక్షలకొలది యువకులు పనిలేక వీధులవెంబడి యల్లాడుచున్నారు. ఇట్టి ప్రమాదమును యేతీరున అమెరికా దేశస్థులు దాటుకొనగల్గుదురో యాశ్చర్యము.

(ఒకానొక అమెరికాదేశపు పత్రికనుండి)

---

## మోహిని

శ్రీ వైష్ణవ దేవాలయములలో బ్రహ్మోత్సవ కాలములలో నొకనాడు శ్రీస్వామివారికి మోహిని అవతార మనుపేరుతో సుందరమగు స్త్రీవేషము వేసి ఆయవతార ప్రయోజనమున కొప్పినట్లుగ ఒక వెండి చెంబును, ఒక ఉద్ధరణియు చేత నుంచి ఊరేగింపు చేయుచు ఊరిపై వారివారికి తోచిన కానుకల కైకొందురు. అనగా ఈ యుత్సవము డబ్బువసూలునకై యేర్పడినటుల తోపగలదు.

శ్రీ మహావిష్ణువు దేవదానవుల కమృతము పంచిపెట్టు నెపమున మోహిన్యవతారము ధరించినటుల భాగవతాది పురాణప్రశంస గలదు. అయితే, ఈ మోహిన్యుత్సవమునకు ఆగమ ప్రామాణ్యము కలదా? ఈ ఉత్సవమునాడు ఒక కట్టడిగ డబ్బువసూలు చేయుట చూడగ ఏరాజుల కాలముననో, ఏనవాబుల కాలముననో ఆయా యూళ్లలోని విష్ణుదేవాలయములకు ఇలువరసగా కొంతడబ్బును ఒక పన్నువలె కట్టడిగా యిప్పించు ఆచార మేర్పడి యుండవచ్చునని తోచుచున్నది. ఇట్టి కట్టడులు మరికొన్నియు తురకల ప్రభుత్వమున యేర్పడి యుండగల వనుటకు కొన్ని ఆధారములు గలవు. ఎట్లనగ, కొన్నియూళ్లలో మల్లామేరలు, మసీదుమేరలు అనునవి గలిగియున్నటుల తెలియ వచ్చుచున్నది. మరియు కొన్ని కొన్ని పరగణాలలో ఫకీరులకును ఇట్టికట్టడు లేర్పడియున్నవి. కొన్నియూళ్లలో కొందరు తురకఫకీర్లు ఇలువరసగా డబ్బు (అనగా నాలుగు దమ్మిడీలు), రెండుడబ్బులు (అనగా ఎనిమిది దమ్మిడీలు) వసూలుచేసుకొను ఆచారము కలిగియుండిరి.

ఈవిధముగానే నవాబుల కాలములో దేవాలయముల కున్న యిట్టి యేర్పాట్లు అయియుండవచ్చునని తోచుచున్నది. అట్లగు నెడల దీనికి మోహిని అను పేరు రా గారణ మేమని అడుగవచ్చును. ఈపేరు పొరపాటుగ నుండ గలదు. సరియైన పేరు 'మోయను' అనునదిగా నుండును. 'మోయను' అనుమాట తెలుగుజిల్లాలలో వాడుకయందున్నది. ఎవడయిన బ్రాహ్మణునకు భోజన సామగ్రినిచ్చునపుడు మోయను నిచ్చినారని చెప్పుటకలదు. (ఇట్టిదానినే కొన్ని తెలుగుదేశములలో సాహిత్యమందురు) మోయను అనునది ముఅయ్యన్ అను అరబ్బి భాషలోని శబ్దవికారముగ నుండగలదు. 'ముఅయ్యన్' అనగా నియతముగ ఏర్పాటుచేయబడినది; ఇంగ్లీషులో ration వంటిది. ఇట్లగుటచే ఆయాగ్రామములలోని దేవతలకు ఒక మోయను ఇలువరసగ ఏర్పాటుచేయబడియుండును. కాలక్రమమున ఈ మోయను అను మాటే మోహినిగ మారియుండ వచ్చును.

మోహిని ఉత్సవము అనునది యొకటి ప్రసిద్ధముగ ఆగమములలో నుండినదను కొన్నను అమృతమునో లేక తత్తుల్యమైన ప్రసాదమునో భక్తులకు వినియోగము చేయుట ఆయుత్సవప్రయోజనమై యుండవలయునే గాని యింటింట పైకమువసూలుజేయునదిగయుండ జాలదు. కనుక ఈ మోహిని, మోయనుల తత్త్వము విమర్శింప దగియున్నది.

శ్రీ మహావిష్ణువున కిట్లాయె. ఇక శ్రీమహాదేవుని కెట్లందురేమో ఆయనకు కపాలభిక్షు అనాది ప్రసిద్ధమైయున్నదిగదా! కాబట్టి ఆయనకు మోయనలకై మోహినిరూపము దాల్ప నవసరముండదు. అంతియగాక మోహినింజూచి ఈయన మోహపరవశుడైనటుల పురాణప్రాశస్త్యము గలదు. మరియు పరమశివుడు యోగనిష్ఠాపరుడై తపస్సంపన్నుడని ప్రసిద్ధిగలిగియుండుటచే ఈయనకు మోహినీత్వము పొసగదు.

ప్రసంగవశమున యింకొకమాట చెప్పవలసియున్నది. శ్రీ మహావిష్ణువున కేర్పడిన మోహిన్యంశ శ్రీ ఆంజనేయులవారికి తిరునాళ్లు జరుగు గ్రామములలో ఆయనకును ఒకనాడీ రూపము కట్టబెట్టి డబ్బు వసూళ్లకు ఊరేగించుటయు గలదని తెలియుచున్నది.

(జిజ్ఞాసువు)

---

## రాధానాథ సిక్ దారు

(ఎవరెస్టు శిఖరమును తొలుదొల్త కనుగొనిన యాతడు)

అపుడపుడు హిమాలయపర్వతపంక్తియందు నత్యున్నతమయిన 'ఎవరెస్టు' శిఖరము నధిరోహింప నెందరో యూరపియనులు సాహసించి ప్రయత్నించుచుండువారు. వారిలో పలువురు ప్రాణములనయితము కోలుపోయినారు. ప్రకృతము కొందరందులకు తలపెట్టియున్నారు. ఈప్రయత్నము సుసన్నద్ధము; సఫలముకాగలదను సూచనలు పొడకట్టుచున్నవి.

ఎవరెస్టును తొలుదొల్త కని దానియెత్తును నిర్ణయించినది పదునెనిమిదవ శతాబ్ది మూడు నాల్గు దశకముల ప్రాంతముల ఇండియా సర్వేయర్ జనరల్ పదవి నుండిన సర్ జార్జి ఎవరెస్టుదొరయని యొక ప్రతీతి కలదు. అది పొరపాటు. ఆగౌరవ మొక భారతీయునికి చెందవలసినది. అతడు రాధానాథసిక్ దార్ అను వంగీయుడు.

రాధానాథుడు బ్రాహ్మణుడు. ౧౮౧౩-వ సంవత్సరమున నతని జననము. కలకత్తానగరమున నివాసము. ౧౮౨౪-వ సం.ము మొదలు తొమ్మిదేండ్లతడు హిందూ కళాశాలయందు చదివినాడు. ఆంగ్లభాషా సాహిత్యములయం దతనికి మంచి పాండిత్యము కుదిరినది. ఆకాలమున నాతడు స్వయముగ గణితవిద్యను నేర్చుకొనుచుండెను. కళాశాల గణితపండితునివద్ద 'న్యూటను' సిద్ధాంతములను కొంతకాలము నేర్చుకొనెను. ఆపండితుని పలుకుబడిచేత రాధానాథునికి జార్జి ఎవరెస్టుదొర 'Great Trignometrical Survey of India' కార్యాలయమున నుద్యోగము నిచ్చెను. వేతనము నెలకు ముప్పదిరూపాయలు. ౧౮౩౨-వ సం. అక్టోబరు ౧౯-వ తేదినా డాయుద్యోగము నతడు స్వీకరించెను.

రాధానాథుడు నిరంతరము గణితశాస్త్రాధ్యయనము చేయువాడు. అతని నిశితప్రతిభ దానికి బాసటయైనది. అచిరకాలమున గణితశాస్త్రమున నద్వితీయ పాండిత్యము చేకూరినది. ఎవరెస్టు దొర రాధానాథుని విజ్ఞానసంపదను చాల మెచ్చుకొన్నాడు; కార్యాలయమున నతని యునికి తప్పనిసరి యని నిశ్చయించినాడు.

౧౮౩౩-వ సంవత్సరమున రాధానాథుడు డిప్యూటీకలెక్టరు ఉద్యోగమునకు ప్రయత్నము చేసి ఎవరెస్టు దొరసాహాయ్యమును గోరెను. సాహాయ్యమును చేయ నిరాకరించుచు ఎవరెస్టుదొర అతడు కార్యాలయమును విడిచి పెట్టకుండుటకు వలసిన ఏరుపాటు చేయ ప్రభుత్వమును గోరెను. 'రాధానాథుని సామర్థ్యము వేనత్యధికముగా చెప్పజాలను. గణితమున నాతనిమించిన చేతులు భారతీయులలోనేమి, యూరపియనులలోనేమి భారతదేశమున కానరావు. యూరపుననుగూడ నతని సామర్థ్య ముత్తమగణ్యము .........రాధానాథుడు లేకున్న ఈ సర్వేశాఖవారు చేయుచున్న కార్యమంతయు నిరుపయోగము...... అతని బుద్ధియుగు గణకు లింగ్లాండున దినమున కొక్క గినీకి తక్కువ జీతమునకు దొరకరు. అతనివలె గణితశాస్త్రతత్త్వమును చక్కగ గ్రహించినవా రున్నచో వారెట్టులు నుద్యోగము నంగీకరింపరు!' అని ఎవరెస్టు తనలేఖయందు రాధానాథుని సామర్థ్యమును ప్రకటించెను.

౧౮౪౩-వ సంవత్సరమున ఎవరెస్టుదొర ఉద్యోగము మానుకొనెను. ఆ పదమున కర్నల్ వాఘ్‌దొర నియమితు డయ్యెను. రాధానాథు డాతని ప్రశంసకును పాత్రు డయ్యెను.

రాధానాథుడు కలకత్తాలో నొక న్యాయాధికారి యుద్యోగసంపాదనమునకు తోడుపడ వాఘ్‌దొర నడిగెను. అత డందులకు సమ్మతింప డయ్యెను. మరియు రాధానాథు డాకార్యాలయమును వీడి పోనీయగూడదనియు, ఆతనికి వేతనము నధికముగా నీయవలయుననియు పై వారికి వ్రాసెను. "అతిమాత్ర గణితశాస్త్రజ్ఞానము కలవాడు. ఇతని రచనములు సుస్నిగ్ధ మగు శైలి, భాషాసౌష్ఠవము గలిగి యుండునవి అని పత్రికలు కొనియాడినవి" అని యందు రాధానాథుని ప్రశంస కలదు. సర్వేశాఖవారి నివేదిక (౧౫-౮-౧౮౫౧) యందుగూడ రాధానాథుని సామర్థ్యము ఎన్నబడినది.

రాధానాథుడు ప్రధానగణకు డయినాడు. జీత మారువందలు. ఇరువదేండ్లకు పయిగా నాతడు హిమాలయప్రాంతముల దిరిగితిరిగి అచటి మంచిసెబ్బరలను చక్కగ దెలిసికొనెను.

౧౮౫౨-వ సంవత్సరమున 'ఎవరెస్టు' ప్రపంచమున సర్వోన్నత పర్వతశిఖరమని రాధానాథుడు ప్రకటించినాడు. '౧౮౫౨-వ సంవత్సర మొకనాటి యుదయమున వాఘ్‌దొరగదిలోని కొకబాబు (రాధానాథుడు) అత్యుత్సాహముతో పరువిడివచ్చి 'అయ్యా, సర్వోన్నత పర్వతమును నేనుకనుగొంటిని' అని యుచ్చైస్స్వరముతో చెప్పెను.' యథార్థ మిటులుండ నీశిఖరమును ఎవరెస్టుదొర కనుగొనెనని కొందరు తలచుచున్నారు. అది కేవలము పొరపాటు. సర్వేయుద్యోగులెల్లరు తాము గుర్తించిన క్రొత్తవాని కాయాప్రదేశముల వాడుచున్న పేరులనే పెట్టుటాచారము. అట్లుకాక, వాఘ్‌దొర తనకుమున్నుండిన ఎవరెస్టుదొరపే రాశిఖరమున కిడెను. ఆకాలమున రాధానాథుడు హిమాలయ శిఖరమును కనుగొనినసంగతి ఎవరికిని తెలియదు. కాని అతనిపనిపాటులెల్ల మిక్కిలి గణనకెక్కినవి. అతడాయేటిమలిసగముచివర కలకత్తాలో ప్రభుత్వనక్షత్రపరిశోధనాలయమున సూపరింటెండెంటు పదవిని బడసెను. ఆయుద్యోగమును చక్కగా నిర్వహించి ౧౮౬౨-వ సంవత్సరము మార్చినెలలో పించనుపుచ్చుకొనెను. ౧౮౭౦-వ సంవత్సరము మేనెల ౧౭-వ తేదినాడు విజ్ఞానఘనుడగు రాధానాథుడు కీర్తిమూర్తిని మిగిల్చినాడు.

రాధానాథుని రచనములు చాలలేవు. సర్వేమాన్యువలున శాస్త్రభాగముల నతడు వ్రాసెను. అందలి విషయములు పరమప్రమాణముగా నంగీకృతములయినవి.

* * * * *

రాధానాధుడు తనకు లభించినదాని తత్త్వమును కష్టించి తాను తెలిసికొని తృప్తుడయి యూరకుండువాడు గాడు. తరువాతివారి కావిషయములు సుగ్రహము లగునట్లు వివరించుటకయి తనసర్వశక్తిని వినియోగించువాడు.

'సర్వేమాన్యూలు' ఇండియాలో ప్రకటితములయిన సర్వేగ్రంథములలో మొదటిది. క్షేత్రమానమున నది గొప్పప్రమాణగ్రంథము. అందనేకాధ్యాయములు రాధానాధుడు రచియించినవి. ఈయంశమును ప్రకాశకులు ప్రథమ (౧౮౫౧) ద్వితీయ (౧౮౫౨) ముద్రణముల పీఠికయందు పేర్కొని కృతజ్ఞులయిరి. తృతీయ ముద్రణము (౧౮౭౫) న నాభాగము లోపించినది. దీనికి కారకుడు ఇండియా సర్వేయర్ జనరల్ తుయినియర్ దొర. అప్పటికి రాధానాధు డీలోకమున లేడు. డిప్యూటీ సూపరింటెండెంటు T. S. I. మెక్డనాల్డుదొర, రాధానాధునియెడ గావించిన యీగొప్పఅన్యాయమును తీవ్రముగా ఖండించెను. తుయినియర్ దొర కీఖండనము కోపకారణ మయ్యెను. రాజద్వేషము నాతని నెత్తిని బెట్టి యందుల కాతని దండింప ప్రభుత్వమును గోరెను. మూడునెలలు అతనిని పనినుండి తొలగించుటయు, రెవిన్యూ సర్వేశాఖలో రెండవతరగతి సూపరింటెండెంటుగా నియమించుటయు మెక్డానల్డు సత్యప్రియతకు, న్యాయకథనమునకు ఫలముగ పరిణమించినవి. కాని యాతనిగుణము, కార్యము పలువురు విద్యాధికులయు, పత్రికలయు ప్రశంసను బొందినవి.

రాధానాధుడు 'ఆగ్జిలరీ టేబిల్సు' అను పుస్తకమును కూడ రచియించెను. అది సర్వేశాఖవారికి చాల యుపయోగకరము.

రాధానాధుడు దేశసేవా పరాయణుడు. ఉచిత విద్య, ప్రజాసామాన్యవిద్య, స్త్రీవిద్య, విధవా వివాహము మున్నగు కార్యములయందు వీరిచేయి కలిసి యున్నది. ఇత డొకమాసపత్రికను ప్రకటించుచుండినాడు. అది స్త్రీలకు, ప్రజాసామాన్యమునకు నుపయోగించునది.

(మాడరన్ రివ్యూ, ఏప్రిలు (౧౯౩౩) సంచికనుండి.)

## స్పెయినువిద్యాభివృద్ధి

స్పెయిను ప్రభుత్వ విద్యాశాఖామాత్యుడు స్పెయినుపార్లమెంటులో స్పెయిను విద్యాభివృద్ధినిగూర్చి ఇట్లు తెలియచేసెను:—"నిరుడు 2000 పాఠశాలలను, ఈ సంవత్సరము ౨౫౮౦ పాఠశాలలను నెలకొల్పితిమి. క్రొత్తగా పాఠశాలలను స్థాపించదలచుచో పురపాలకసంఘమువారు స్థలమును ఇచ్చుటయేగాక, ఆ పాఠశాలల కగు ఖర్చులో నూటికి ౨౫ చొప్పున భరించవలెనని శాసించితిమి.

డబ్బులేని 'పురపాలకసంఘమువారుకూడ అధమము నూటికి ౫ చొప్పున వ్యయమును భరించవలెను. సిరిసంపదలతో తులదూగుచున్న "బిల్బావో" మున్నగు నగరములు నూటికి ౬౦ చొప్పున వ్యయమును భరించుచున్నవి.

ఉపాధ్యాయుల సమస్యయే గొప్ప చిక్కుగ నున్నది. ఉపాధ్యాయులు కావలసినంతమంది కలరు. వారికి ప్రత్యేకముగ బోధనపాఠములు నేర్పబడును, అందుకొరకు ౧౫౦౦౦ మంది దరఖాస్తులు పెట్టిరి. ౫౦౦౦ మందికి స్థానములు లభించినవి."

ఒకమూల గ్రేటు బ్రిటను అమెరికా ఫ్రాంసు మున్నగు దేశములలో ఉపాధ్యాయులసంఖ్యను, వారి జీతములను తగ్గించుచుండ, స్పెయినులో ఉపాధ్యాయుల సంఖ్యను హెచ్చించి, వారిజీతములనుకూడ యభివృద్ధి చేయుచున్నారు.

విద్యాశాఖావ్యయమును తగ్గించినను విద్యాభివృద్ధిమాత్రము విస్తారముగ సాగుచున్నది.

గ్రామములయందు పుస్తక భాండాగారములు నెలకొల్పబడినవి. ఇట్టి గ్రంథాలయములు ౧౧౮౩ గలవు. వానిలో మొత్తము ౧౮౬౦౦౦ గ్రంథములున్నవి. ౮౦౦ వాయువార్తాప్రచారక యంత్రములున్నవి. గ్రామఫోను రికార్డులు ఫిల్ములుకూడ పంచిపెట్టబడెను.

సంచార చిత్రవస్తు ప్రదర్శన కార్యాలయములు సంచారనాటకశాలలుకూడ గలవు. విశ్వవిద్యాలయముల విద్యార్థులే ప్రదర్శనములయందు పాత్రధారణము చేయుచున్నారు.

ఈ కార్యక్రమము చక్కగ సాగుచున్నది. ఆక్స్ఫర్డు, కేంబ్రిడ్జి, ప్యారిస్, బోర్డోపట్టణముల వారీనటులను తమ నగరములకు ఆహ్వానించి నాటకములను ఆడించుచున్నారు.

ప్రాథమిక పాఠశాలలు విస్తారముగా కావలసియున్నవి. విశ్వవిద్యాలయముల సంఖ్యను తగ్గించవలెను. ఉన్నవాటిలో అధమము రెండువిశ్వవిద్యాలయములనైన తగ్గించవలెను. ఈ విశ్వవిద్యాలయ భవనములలో సాంకేతిక కళాశాలలను ఏర్పరచవలెను. సంటాండరులో క్రొత్తగా అంతర్జాతీయ విశ్వవిద్యాలయమును స్థాపించిరి. ఒకరాయబారి ౪౦ లేక ౫౦ విద్యార్థి వేతనములను ఇచ్చెదనని వాగ్దానమొనర్చెను. ఉత్తర అమెరికానుండి ౨౦౦ విద్యార్థులు ఈ విశ్వవిద్యాలయమున చేరిరి. ఉపన్యాసములు పెక్కు భాషలలో నీయబడును. కాన భాషావిషయమై కష్టముండదు.

స్వతంత్రదేశములకు గల తేడా ఇదియే.

——జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.

---

## ప్రాచీన చిత్రములు

### (వర్ణచిత్రములకు ప్రతికృతులు)

### షాఅబ్బాస్ కొలువు

పదునెనిమిదవ శతాబ్ది భారతీయ చిత్రము. షా అబ్బాస్ కొలువు, మిర్జాఖాను ఆలంబర్బర్ దార్ ఆగమన మహోత్సవము నీచిత్రమున దివ్యముగ నిరూపింపబడినవి. జహాంగీరు ౧౬౧౩-వ సంవత్సరమున మిర్జాను పర్షియను రాయబారి (షాఅబ్బాసు కావలయును) తిరిగివచ్చునప్పుడు అతనివెంట రాబంపెను. కాని షాఅబ్బాసు తురుష్కులపయి దండయాత్ర పోయియుండినందున నాతనిని మిర్జా ౧౬౧౮-వ సంవత్సరమువరకు కలుసుకొన జాలకపోయెను. కొలువుకూటమునడుమ షాఅబ్బాసు కూర్చుండి మిర్జాతో మాటాడుచున్నాడు. మిర్జావెనుక అక్బరు విదూషకుడు ముల్లాదు-పియాజా, అతనివెనుక రాజా మాన్ రూఖ్ సింగు మనుమడు మహాసింగు నున్నారు. ఎదుట కుడివైపునుండి వరుసగ మాలర్ అబుల్ కాసిమ్ మిర్జామాన్ రూఖ్, మిర్జాషారూఖ్ గలరు. వీరి చుట్టునున్న గోడలోవైపు నామకొని సామంతులు వరుసగా నిలిచియున్నారు. వెలుపల కాలిబంటులు, గుఱ్ఱపురౌతులు, అంబారిఏనుగులు నున్నవి. కొలువునకు చాలదూరము భటులయు, ఏనుగులయు బాగులు గలవు. దీనివెల 480 పౌనులు.

### షాసెఫీకొలువు ౧, ౨

(౧౬౩౦) పర్షియను చిత్రములు. వీని అసలు చిత్రములు చాలసుందరములు. ఇందొకట పర్షియనురాజు మద్యపాన మధురగానములతో తన సామంతులకు, విదేశముల రాయబారులకు విందుకూర్చుచున్నాడు. ఇంకొకట విజయులయి యేతెంచిన ఆతని సేనాపతులు బందీల బంతులను గొనివచ్చుచున్నారు. శత్రుశిరములను గొందరు ప్రోవులు పేర్చుచున్నారు. చిత్రములు రెండింటను ముప్పదినలుగురు వ్యక్తులు చిత్రింపబడిరి. అందిరువదియొక్కరి పేరులు వ్రాయబడినవి. ఆ పేరులలో ననేకములు షాసెఫీకాలము (౧౬౨౯-౪౨) నాటి వ్యక్తుల పేరులను పోలియున్నవి. కావున చిత్రమునందలి రాజు షాసెఫీయగుట నిక్కము. షాసెఫీ కుడివైపున ఇమాంకూటీఖానుడు (ఆనాడు పరిషియాలో నతిపరాక్రమశాలియనబడిన సామంతుడు) గలడు. అతనిని, అతని యిరువురు కుమారులను షాసెఫీ చంపించినాడు. కుమారులలో పెద్దవాడు తండ్రిప్రక్కను గలడు. వీరికి క్రిందుగ ఉజ్ బేగు పోర్చుగీసు రాయబారు లున్నారు. వీరిలో చివరయాతని కీవల నున్నవాడు మనూచిర్ ఖానుడు. అతనికిక్రిందుగ చిత్రము నడుగున కంమకి అఘుర్లూఖానుడు. షాకు ఎడమ ప్రక్కను కూర్చిబాషి, అతనిప్రక్కను రుస్తుంచిరాఘ్ ఖానుడు చిత్రింపబడిరి. తక్కిన సగమున సాఫిహాలీ

ఖానుకు (బాగ్దాదు), వెన్నాడి యతని యుద్యోగులలో నొకడగు క్వేజాఖానుడు, అతనివెంట బందీలయిన పాచ్చాలు గలరు. రిజా-అబ్బాసి అను చిత్రకారుని చిత్రములయందలి లక్షణము లీచిత్రముల గానవచ్చుచున్నవి. దీనివెల 200 పౌనులు.

## వే ట

అసలుచక్కని రంగులబొమ్మ. అడుగున పిన్నవయసువాడగు జహాంగీరును, అతని యనుచరు లిరువురును గుఱ్ఱములపయి నున్నారు. వేటాడి మరలి వచ్చుచు నేనుగుపై కెక్కించుచున్న దుప్పిని చూచుచున్నారు. నడుమ నొక మహావృక్షము గలదు. దానికి పశ్చాద్భాగమున కొండలనడుమ నొకనగరమును, అందు ప్రవహించుచున్న నదియు చిత్రితములయినవి. అనేక లక్షణములను బట్టి యందమయిన యీబొమ్మ అక్బరు నాస్థానమునందలి పర్షియాను చిత్రకారుని రచనముగ తోచుచున్నది. చిత్రమునందలి నాజూకుదనము పరిష్కరణము, వస్త్రాలంకరణముల కూర్పు నేర్పు మొదలయిన పర్షియను చిత్రముల లక్షణములు వీనికి బట్టినవి. చిత్రమున చెట్టు ప్రముఖముగ నున్నది-చీహాజాద్ మీరకుల చిత్రములయందువలె. వెనుక భాగమున నిండిన నగర రంగము అక్బరునాటి చిత్రములకు గల విశిష్ట లక్షణము. యూరపునుండి దిగబారిన Wood cut చిత్రముల ననుసరించుటయే యీ విశిష్టలక్షణ సంయోగమునకు కారణము. దీనివెల 150 పౌనులు.

## షాజహాన్

పదునేడవ శతాబ్ది నాటిది. భారతీయ చిత్రము. దీని మాతృక దివ్యమయినది. సింహాసనస్థుడయిన చక్రవర్తి జాపర్ ఖానుకు డేగను బహుమతిగా ఇచ్చుచున్నాడు. జాఫర్ ఖానుకు వెనుకవైపున ముగ్గురు సామంతులున్నారు. వారిలో పైన అసఫ్ ఖానుడు, నడుమ ఖలీల్ ఖానుడు, దిగువ సాదుల్లాఖానుడు (కావచ్చును), వెనుకవైపున దివాను అసాలత్ ఖానుడు, యశ్వంత సింహుడు నున్నారు. వారికిదిగువ డేగను బట్టియున్న నౌకరు. అడుగున సాయద్ ఖానుడు కలడు.

దీనివెల 190 పౌనులు.

## వెల్లచిలుక

(౧౬౨౦) పర్షియను చిత్రము. దీని అసలు చిత్రమున జహాంగీరు చక్రవర్తి మున్నదను గనిన మాన్సూర్ అను చిత్రకారుని చిత్రముల లక్షణములు, కళాకౌశలము నిండారియున్నవి. దీని వెల 70 పౌనులు.

## ఏనుగు పోరు

పదునేడవ శతాబ్దారంభము నాటిది. భారతీయ చిత్రము. పోరుచున్న రెండేనుగులలో ఒకదాని కాలి గొలుసులు తెగియున్నవి. వానిపయినున్న మావటీండ్రు వాని పోరాటమును మానుప ప్రయత్నించుచున్నారు. క్రిందిభాగము వేరొకచిత్రకారునిది. అందు పొడవు గడలకొనలగల బాణసంచాతో ఏనుగుల పోరును మాన్ప కొందరు ప్రయత్నించుచున్నారు.

దీనివెల 100 పౌనులు.

## ఒంటెపోరు

(౧౬౨౫) పర్షియనుచిత్రము. దీనిమాతృక సుందరమయినది. పొగరుగొన్న యొంటెలు డీకొని పోరాడుచున్నవి. చిత్రకారుని పేరిందు లేకున్నను ఇది మూ-ఇన్ ముసవ్విర్ అనువాతని చిత్రమగుట నిక్కము. అతనికి మృగచిత్రణమం దాసక్తి మెండు. ఎట్టిచిక్కయిన సన్నివేశమునయిన నతడు సునిపుణముగ చిత్రింపగల కళాకుశలుడు. పదునారవ శతాబ్దిమలిసగ మీతని జీవితకాలము. దీనివెల 120 పౌనులు.

వీని మూలచిత్రములు బెర్నార్డుక్వారిచ్, లిమిటెడ్ కంపెనీ (౧౧, గ్రాఫ్టడ్ స్ట్రీట్, న్యూబాండ్ స్ట్రీట్, లండన్, W.) వారివద్ద కలవు. ఆయాచిత్రముకడ పేర్కొనిన వెల కవి విక్రయింప బడును. వీటి పరిచయము మాకు గలిగించి వీనిని భారతియందు ప్రకటింప నొసంగిన శ్రీ. పి. విశ్వనాథముగారికి వందనములు.




## లెఫ్టినెంటు పి. గోపాలకృష్ణయ్యగారు, యం. యస్. సి.




శ్రీ గోపాలకృష్ణయ్యగారు మదరాసు పచ్చయప్పకళాశాలయందు వ్యాయామ విద్యాశాఖాధికారులు. 'ఇండియాలో ఆహారసమస్య' యను గొప్ప వ్యాసము నొకదానిని నూతనాభిప్రాయములతో రచియించినందులకు వీరి నభినందించుచు యునైటెడు స్టేట్సునందలి కొలంబియా విశ్వవిద్యాలయమువారు ఆరోగ్య, ఆర్థిక శాస్త్రములయందు యం. యస్. సి. పట్టము నొసగిరి. కొలంబియా యందలి ఆరోగ్య, ఆర్థిక శాస్త్ర విజ్ఞానులనేకులు ఈవ్యాసరచనయందు శ్రీ గోపాలకృష్ణయ్యగారికి సహాయపడిరి. ఆహారవిషయములలో యిండియా యెట్టిదుస్థితియం దున్నదియు, అందువలన ప్రజలెట్టి అనారోగ్యము జెందుచున్నదియు మొదలగు విషయముల గూర్చి ఈవ్యాసము వ్రాయబడినది. శ్రీగోపాలకృష్ణయ్యగారు కొలంబియా విశ్వవిద్యాలయమున సహాయపండితులుగ (Fellowship-Scholar) నున్నారు. ౧౯౩౧ అక్టోబరున వీరీవిశ్వవిద్యాలయమున జేరి ౧౯౩౨ జూనున వ్యాయామమందు యం. ఏ. పరీక్షయం దుత్తీర్ణులైరి. ఈవిశ్వవిద్యాలయమున ఈపరీక్షయం దుత్తీర్ణులైన భారతీయులలో వీరు ప్రథములు. వీరు ఆంధ్రులు*. ఆదేశమున జరుగు విద్యావిషయక, ఆరోగ్యవిషయక సభలయందు భారతప్రతినిధిగ నుండి కీర్తిగనుచున్నారు.

---

* వీరి పేరునుబట్టి వీరు ఆంధ్రులని యూహించుచున్నాము.—భా. సం.



పుదుచ్చేరి లైటుహౌసు



పుదుచ్చేరి హార్బరు (మరియొక దృశ్యము)

ఛాయాచిత్రకారుడు: కె. గోపాలుగారు.



వేలూరు దేవాలయ ద్వారపాలకుడు

ఛాయాచిత్రకారుడు: వి. యస్. గోపాలదేశికాచారిగారు.



శివసముద్ర జలపాతము

ఛాయాచిత్రకారుడు: సూర్య గా॥గా॥.



శ్రీ రాజకీయ బోధనాభ్యసన మహిళా పాఠశాల - అనంతపురము
ప్రపంచమునఁ గల వివిధదేశములందలి బాలికా సేవికలు



కుమారి యస్. కె. కన్నమ్మాళ్ గారు

వెల్లూరు వ్యవసాయశాఖోద్యోగి యస్. కుప్పుస్వామి అయ్యంగారి కూతురు.
ఇటీవల వెల్లూరు సంగీతసభవారు నడపిన పోటీపరీక్షయందు పాల్గొని, తన వీణాగాన నైపుణ్యమును ప్రదర్శించి ప్రథమ బహుమతి బంగారుపదకమును గడించినది. వయస్సు ౧౩ ఏండ్లు.

---




## కావ్యమాల

మొదటి భాగము. క్రౌను సైజు. ౧౬౮ పుటలు. వెల ౧౨ అ.

రెండవ భాగము. ౧౫౭ పుటలు. వెల ౧౨ అ.

కూర్పరి: ఉభయభాషాప్రవీణ కొత్త సత్యనారాయణచౌదరిగారు, పండితుడు, బోర్డు హైస్కూలు, నిడుబ్రోలు. భాషాపోషక గ్రంథమండలి, అమృతలూరు, గుంటూరు జిల్లా.

మొదటి భాగము ౮-వ ఫారమునను, రెండవది ౫-వ ఫారమునను ముఖ్య పఠనమునకుగాను (మద్రాసు) పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘమువారు నిర్ణయించిరి. ఇందు పెక్కులు ప్రాచీనగ్రంథములనుండియు, కొలదిగ అర్వాచీన గ్రంథములనుండియు గద్య పద్యఘట్టములు కూర్చియున్నవి.

ప్రతి సంపుటమునను దాదాపు సగమువఱకు పురాణ ప్రబంధ నాటకాదులనుండి ఉద్ధరించిన పద్యభూయిష్ఠ భాగములును, తక్కిన సగమునకు పైగా గద్య రచనాభాగములును గలవు. ఈ గ్రంథముల ముఖ్యమైన ప్రయోజనము భాషాప్రౌఢి విద్యార్థులకు గఱపుట యని తెల్లము. ఈమాట ప్రబంధాది భాగములకంటె 'ధర్మజరాజసూయము' వంటి వచనభాగముల నెక్కువ కొట్టవచ్చును. కావ్యకలారీతులు చవిచూపుటకంటె నీతిబోధవంటి కార్యము చొచ్చివచ్చుచున్నది యీ కూర్పుఫక్కిలో. కూర్పరి శ్రీ సత్యనారాయణ చౌదరిగారే 'మొదటిభాగమున నొకవ్యాసము రచించినారు, 'సుభాషితము' అని. అది ఇరువది యెనిమిది పుటలుగా, ఇట్లు చేయవలెనట్లు చేయవలెనని విద్యార్థికి నడవడికను పట్టిన 'నీతులు', 'బుద్ధులు' బోధించు పూనికలో అంతరించినది. చిన్నయసూరిగారి 'నీతిచంద్రిక' భాగము, నేతి వెంకటసుబ్బరాయ శాస్త్రిగారి 'ధర్మజ రాజసూయము' నందలి నారదాగమన ఘట్టమును (ఇది నారదుడు ధర్మజునకు రాజసూయము సేయుమనుచు రాజనీతి మర్దించిన భాగము) — ఇవి నడచినమీదట 'కూర్పరి' పోనీ విద్యార్థులకు బుద్ధి, బుద్ధులు చెప్పటకే అన్నిపుటలు సాగక, బుద్ధికి పని చెప్పు ఒక చక్కని వ్యాసము రచించియో, కొనితెచ్చియో అదికిన, ఈ గ్రంథముల ఉద్యమము— ప్రయోజనము— ఇంతలో తిరిగి నిలిచినదని నిరూపించుమాటలు మారియుండెడివి. ఈ 'ఫారాల' కు ఇంకను నీతిశతకాలు చదివికొని బుద్ధులు నేర్చుకొను విద్యార్థితకంటె, బుద్ధి నేర్చుకొను—బుద్ధివికాసమునకు విసరుకొను — విద్యార్థిత కలాశాలకు ఎక్కువ యోగ్యత, ఔచిత్యము నిలుపుకొనును.

అయిన, ఈ ఏరికలు అందముగనే ఉన్నవి. ఆధునికులలో చిన్నయసూరి, త్రిపురనేని రామస్వామి చౌదరిగారులు ముఖ్యులు, ఇందుద్ధరణము గాంచుటకు. 'కూర్పరి' తన రచనయందు 'పరస్పర సంసర్గ వశాత్తున', 'తృప్తి' (తృప్తి యను అర్థమున)— ఇట్టి ప్రయోగములయెడ మెలకువ జార్చుకొనకయు, ఇంకను

సమర్థమగు శైలి వాడియుండిన బాగుండెడిది. అయినను, వీరిశైలి చిన్నవాక్యములలో సరళమగు నడక నడచుచున్నది.

తరగతుల తారతమ్యమునకు తగురీతి కూర్చుటలో 'కూర్పరి' నేర్పు కన్పఱచెను. తప్పులు లేని అచ్చు కూర్పును విద్యార్థులలెక్క కొకగుణముగా చెప్పక తప్పదు. 'గ్రేట్ ప్రైమరు' లో ఇంత తేలుచుగా 'ఆంటిక్' అక్షరాలు, ఒత్తులు దొరలకుండినచో ఇంపుకూడ ఇంకను అబాధితముగా నుండెడిది.

కొం.జ.

---

## ఆసనములు (Asanas)

భాగము ౧. డెమీ్మసైజు ౧౫౩ పుటలు, వెల రు. 3-౮-౦. గ్రంథకర్త: శ్రీమత్ కువలయానంద.

ఆసనముల ప్రయోజకతయు, ఆసనముల నెట్లు అభ్యసింపవలసినదియు ఈ గ్రంథమున నింగ్లీషున సులభశైలితో వ్రాయబడి యున్నది. శరీర వ్యాయామము కొరకు ఆసనముల నభ్యసించుట యోగాభ్యాసప్రకరణమం దొకభాగము. గ్రంథకర్తగారి యభిప్రాయము ప్రకారము ఆసనాభ్యాసము చేయువారు యోగమందలి యితర రెండుభాగములగు యమనియమములగూడ నాచరించ వలయును. యమనియమములు మనస్సునకు వ్యాయామతుల్యములు. యమనియమముల నభ్యసింపనిదే ఆసనముల నేర్చిన ప్రయోజనములేదని గ్రంథకర్తగారి యభిప్రాయము. ఈ యోగాభ్యాసము చేయువారు కామక్రోధాదులకు లోనుగారు.

ఈవిధముగ ఆసనముల ప్రయోజకతను చర్చించి ఆసనముల గురించియు వానిని అభ్యసించు మార్గములు సులభముగ బోధపడునట్లును వ్రాసిరి. ఆసనముల నన్నింటిని బొమ్మలయందు కన్పరచిరి.

గ్రంథప్రథమాధ్యాయమున నే మానవశరీర మందలి భాగముల గురించియు, అవి యేవిధముగ పనిచేయునదియు సచిత్రముగ వ్రాసిరి. శరీరజ్ఞానము గలిగించుటకును, ఆసనముల ప్రయోజనాభ్యాసముల నర్థము చేసుకొనుటకు నీ గ్రంథము ఉపకరించును.

ఈ గ్రంథమున మొత్తము ౭౧ బొమ్మలున్నవి. ఇందు శరీరశాస్త్రమునకు సంబంధించినవి ౭. తక్కినవి ఆసనములకు సంబంధించినవి. బొమ్మలన్నియు చక్కగ అచ్చొత్తబడినవి. గ్రంథముద్రణము అందముగ నున్నది.

### i. సుభాషితము

క్రౌనుసైజు, ౭౭ పుటలు, వెల నాలుగణాలు.

సంస్కృతవాఙ్మయమున విరివిగ గల నీతివాక్యములలో, సామాన్యముగ నెల్లరకు మిక్కిలిగ నాదరింపనయినవానిని కొన్నింటి నేర్చి గ్రంథకర్త యీరూపమున తెలుగు వాఙ్మయమునకు జేర్చిరి. ఇట్టి సుభాషితములు నిజమున కెట్టివానినయిన సన్మార్గమున బెట్టును; విజ్ఞానసంపద ప్రసాదించును. భర్తృహరి మొదలయినవారు మన కీసంపదను కూడబెట్టిరి. అభ్యుదయాభిముఖులగు నేటి తెలుగునాటి చిన్నవారి కీరచన అతిమాత్రముపకరింప గలదు. కాని యిందలి శైలిమాత్రము, ఇట్టి రచనలు త్రొక్కదగ్గ దారినుండి తప్పియుండుట కొంత వరకు లోపమనియే యనవలసియున్నది. గ్రంథకర్త దీనిని గుర్తింప దగుదురు.

### ii. కామశాస్త్రము

క్రౌనుసైజు, ౧౭౫ పుటలు, వెల ఒకరూపాయ.

వాత్స్యాయనమహర్షి సూత్రరూపమున సంస్కృతమున వివరించిన కామకళారహస్యములు సంగ్రహరీతి నీతెలుగుకృతిని వెలసినవి. ఏతద్విజ్ఞానమునజేసి దాంపత్యమును లెస్సగ రాణింపజేసుకొనవలయు ననుటే యేతాదృశరచనల యుద్దేశ్యము. వాత్స్యాయనమహర్షి యేడధికరణములును ఈ గ్రంథమున నేడధ్యాయము లయినవి. మహర్షి సూత్రించిన భావములు చాలదనుక తెలుగునకు వచ్చినవి. ఇక నీకృతిని యథోచితముగ నుపయోగించుకొనవలసిన విధి యాంధ్రులది.

ఇసుక మొసలి

(దీనిని రచించిన కళావిదుడు ప్రక్కనే కలడు.) G. S. A.



సాయంసూర్యుని ముసిముసినగవులు



అస్తమయము

ఛాయాచిత్రకారుడు: యస్. జి. కృష్ణస్వామి అయ్యరుగారు.

(గుఱ్ఱముపై ఈమె చేయు సాహసమును చూపుచున్నది.)

E. N. P.

డొరొతీ హెర్బర్టుకన్య (న్యూయార్కు)



గురువు, శిష్యులు

(లండను జంతుశాలయందలి ఎలుగుబంటివద్ద కొందరు మెల్లనివడకను అభ్యసించుచున్నారు.)

E. N. P.

### iii. వైదిక వాఙ్మయచరిత్రము

క్రౌనుసైజు, పుటలు ౪౨౫, వెల. రు. ౨-౮-౦.

నేడు విశ్వవిద్యాలయములు నడపుచున్న ప్రాచ్య పట్ట పరీక్షలకు సంస్కృతవాఙ్మయ చరిత్రపరిజ్ఞానము ఆవశ్యకముగ నిర్ణీతము. పరీక్షలకేకాక ఆర్య నాగరకతా ప్రాభవపరిజ్ఞానమునకును నిది యావశ్యకము. భారతీయుల నిరాదృతియు, పాశ్చాత్యుల యాదృతియు కారణముగా మన సంస్కృతవాఙ్మయమును గూర్చిన విమర్శగ్రంథములు, చరిత్రగ్రంథములును పెక్కులు ఆంగ్లలోకమునసే వెలసియుండుట భారతీయులను పట్టియుండు మాంద్యమునకు నిదర్శనము. సంస్కృత వాఙ్మయమున పాశ్చాత్యులు చేసిన కృషి యింతింతనరానిది. దీనికి ఫలితముగ నెన్నెన్నోరీతుల రచనములు బయలువెడలినవి. అట్టికృషి సల్పినవారిలో మెగ్డానెలు పండితుడు ముఖ్యుడు. సంస్కృతవాఙ్మయమును సమగ్రముగ పరిశోధించి విమర్శించి రచించిన గ్రంథములలో యితని గ్రంథమే నేడుత్తమముగ బరిగణింప బడుచున్నది. వైదికవాఙ్మయమునకు సంబంధించిన, యందలి తొమ్మిదధ్యాయములు నిటీవల సంస్కృతమున ననువదింపబడినవి. ఆ సంస్కృతానువాదమున కిది తెలుగు. వేదములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు నను వైదికవాఙ్మయపు పుట్టుపూర్వోత్తరములు ఇందు చక్కగా విమర్శింపబడినవి. మహోన్నతదశలోనున్న ఆనాటి భారతీయుల విజ్ఞానప్రాభవములు ఇందు తెల్లమగును. ఇందలి తొమ్మిదధ్యాయములలోను మొదటిది వాఙ్మయ సామాన్యమును గురించినది. ఆంధ్రులెల్లరు—ముఖ్యముగ ప్రాచ్యపట్టపరీక్షలకు బోవువారు—మిక్కిలిగ నాదరింపదగిన పుస్తక మిది. సంస్కృతవాఙ్మయ చరిత్ర తెలుగున లేని లోపమును దీర్చినందుకు గ్రంథకర్త నభినందింప దగును.

పైమూడు గ్రంథములను రచించినవారు, కె. సత్యనారాయణచౌదరిగారు, బోర్డుహైస్కూలు పండితులు, నిడుబ్రోలు (గుంటూరు); ప్రకాశకులు : అమృతలూరు భాషాపోషక గ్రంథమండలివారు.

---

### హిందూ జీవనపథము

(The Hindu View of Life)

సర్ డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ, ఎమ్. ఏ. గారు ౧౯౨౬-వ సంవత్సరమున ఆక్స్ఫర్డులో మాంచస్టర్ కళాశాలయందు గావించిన అప్టన్ ఉపన్యాసముల సంపుటీకరణమునకు శ్రీ కామరాజు హనుమంతరావుగారి యనువాదము. రాజమహేంద్రవరమునందలి ప్రాక్ ప్రతీచీ గ్రంథమాలకు శ్రీహనుమంతరావుగారు సంపాదకులు. ఈపుస్తకము ఈ East and West Series లోని ౨-వ ప్రచురణముగ వెలువడినది. "ప్రాగ్దేశీయులయొక్కయు పాశ్చాత్యులయొక్కయు ఉత్తమ జ్ఞానము ఆంధ్రులలో వ్యాప్తముచేయుట" వీరి యాశయము. ఈయనువాదమును గూర్చి శ్రీరాధాకృష్ణన్ పండితుని యభిప్రాయము: "నేను రచించిన Hindu View of Life అను గ్రంథమునకు కామరాజు హనుమంతరావుగారు ఆంధ్రమునందు జేసిన భాషాంతరీకరణము నేను సాంతముగ జదివితిని. హనుమంతరావుగారు కడు జాగరూకతతో తద్గ్రంథమును భాషాంతరీకరించిరని యట్టి కార్యమందలి కష్టమెరిగినవారెల్ల రంగీకరింతురని నమ్ముచున్నాను. మాతృకయందలి భావములను సరిగ ననువదించుటకు వారతిశ్రద్ధతో కృషిసలిపి యుండుటను పుస్తకమునందంతటను కానవగును. ఆంధ్రపాఠకలోకము వారి యనువాద గ్రంథము నాదరింతురని యాశించుచున్నాను."

క్రౌనుసైజున ౨౧౬ పుటలు. చక్కని యచ్చు, మంచి బైండు, పైన రేపరు. వెల ౧-౪-౦.

---

### మహాభాషిత రత్నాకరం

గాంధిమహాత్ముని ఉపదేశములు. నీతికి నిధి, జ్ఞానమునకు గని, నిత్యము (గీతవలె) పఠించువారికి ముక్తి. గాంధీమహాత్ముని ౨౨ ఆజ్ఞలు ఈపాత్రము నలంకరించినవి. ఈపుస్తకముపై అన్నిహక్కులు కొమ్మూరు కాశీవిశ్వనాధంగారివి (తెనాలి, గుంటూరుజిల్లా). క్రౌనుసైజున ౮౪ పుటలుగల ఈపుస్తకము వెల ౦-౫-౦.

ఇందు సత్యము, అహింస, బ్రహ్మచర్యము, పరద్రవ్య విముఖత్వము, స్వార్థవిరహితత్వము, నిర్భయత్వము, అస్పృశ్యతా నివారణము, కాయకష్టము, మతము, వినయము, ప్రమాణము, యజ్ఞము, భగవద్గీతా ప్రాశస్త్యము, ఆత్మారాముడు, స్త్రీలస్థితి, స్వదేశీవ్రతము, కర్మయోగము, ప్రేమ, భగవంతుని యచింత్యాద్భుత శక్తి, ఉపదేశములు, జ్ఞానయోగము, ప్రార్థన అనువాని గూర్చిన మహోద్బోధనలు కలవు.

---

## ఆత్మత్యాగి

జతీంద్రనాథదాసుని జీవిత సంగ్రహము. హిందీ నుండి తెనుగులోనికి అనువాదము. కర్త, మాచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారు. ప్రకాశకులు, కొమ్మూరి కాశీ విశ్వనాథముగారు, తెనాలి. క్రౌను సైజున ౯౨ పుటలు. వెల ౦-౫-౦.

వీరయువకుడయి కారాగారనిర్బంధమున ౬౩ దినములు ఉపవాసవ్రత మవలంబించి శరీరమును త్యజించి కీర్తిశేషుడయిన జితేంద్రియుని — జతీన్‌దాసుని— అద్భుత జీవనకథనముపై విమర్శ యేమని?

---

## సతీనస్తుతి

కర్త, కొత్త సత్యనారాయణ చౌదరిగారు, ఉభయభాషాప్రవీణ, బోర్డుహైస్కూల్ పండితులు, నిడుబ్రోలు, గుంటూరుజిల్లా. ౭౦ కందపద్యముల సంపుటి. బాలికల కుపయోగపడును. క్రౌను ౧౬ పుటలు. వెల రెండణాలు. వలయువారు గ్రంథకర్తను గాని, మేనేజరు, భాషాపోషక గ్రంథమండలి, అమృతలూరు, గుంటూరు జిల్లాను గాని వ్రాయవలెను.

---

## కథావింశతి

ఇదియు సత్యనారాయణ చౌదరిగారి రచనమే. ౨౦ కథల సంపుటి. బాలికాబాలకుల ప్రారంభవిద్య కనువగునటులు ఈకథలు కూర్పబడ్డవి. నీతి, లోకతంత్రము, విద్యాభిలాషము, వినయప్రవర్తనము లోనగు సుగుణములను ఈ కథలు బోధపరుపగలవు. పుస్తకము చివర నొక లఘుటిప్పణమును చేర్పబడినది. క్రౌను ౬౦ పుటలు. వెల ౦-౫-౦.

---

## శృంగార నవరస మంగళహారతులు

గ్రంథకర్త్రి: నల్లానిచక్రవర్తుల వేంకటమ్మగారు; శ్రీమాన్ ముడుంబై వేంకట కృష్ణమాచార్యుల వారి యింట్లో, గోపాలస్వామి గుడిదగ్గర, రాజమండ్రి. గ్రామఫోను పాటలను, త్యాగయ్యగారి కృతులను అనుసరించి మట్లువేసి ఆవరుసను రచింపబడిన పాటలు. స్త్రీల కుపయోగపడవచ్చును. క్రౌను ౬౮ పుటలు. వెల ౦-౧౨-౦.

---

## సుకన్యాచరితము

శ్రీమదాంధ్ర వ్యాసభారత నవనీతమునుండి సంగృహీతము. గ్రంథకర్త, కీ. శే. ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు. కాపీరైటుదార్లు, ఎక్సిక్యూటివ్ సభాధ్యక్షుడు, స్నేహలతాకవితా సంఘము, కొల్లాపురము. ప్రకాశకుడు, చేబ్రోలు రాజగోపాలరావుగారు, నూజవీడు. చిన్నసైజు ౧౦ పుటలు. వెల ౦-౨-౦.

---

## ఆత్మోపదేశము

శ్రీ. సౌ. చేబ్రోలు సరస్వతీదేవీ విరచితము. గవర్నెస్, రాజభవనము, మీర్జాపురంయెస్టేటు; వైస్ ప్రెసిడెంటు, స్నేహలతా కవితాసంఘము, నూజవీడు.

౪౦ పద్యములుగల చిన్నకావ్యము. హితబోధకము. ౩౧ పుటలు. వెల తెలియదు.

---

## దీనపాలనము (హరిజనుల పరిదేవనము)

కర్త, పోలుకొండ పెరుమాళ్లదాసుగారు. 'అగ్రజాతి సోదరులచే మేమనుభవించుచున్న యవమానాది హృదయశల్యములచే గలిగిన యనుతాపమువల్ల పొంగి పొరలిన దుస్సహదుఃఖమే దైవస్తోత్ర రూపమున బ్రవహించినది....దీనిని దయతో సవరించిన...మంగిపూడి వేంకటశర్మగారికి నా... ప్రణామములు' అని గ్రంథకర్త 'తొలిపలుకు'న వ్రాసికొనెను. ఇందు ౧౦౦ పద్యములు గలవు. క్రౌను ౫౮ పుటల గ్రంథము. ఇది హరిజనులకును గ్రంథాలయములకును ఉచితముగ నీయబడునట. వలయువారు, పశ్చిమగోదావరిజిల్లా, తణుకు తాలూకా, దువ్వపోస్టుకు గ్రంథకర్త పేర వ్రాసి, పోస్టేజికొరకు ఒక అణాబిళ్లను పంపవలయును.

---

## కల్లుసారాయి కథలు, భాగము ౧.

## (Temperance Stories)

కర్త, కె. జె. జి. సుందరముగారు, హెడ్మాస్టరు, ట్రెయినింగుస్కూలు, డోర్నకల్. ౧౨ కథల సంపుటి. ౨౮ పుటలు. వెల ౦-౨-౦. రెవ. ఎస్. ఎస్. సుబ్బయ్య, డోర్నకల్, సింగరేణి కొలీరీస్, (దక్కను)కు గాని, రెవ. జి. డేనియెల్, ఎస్. పి. జి: మిషన్, కలశపాడు, బద్వేల్ తాలూకా, కడపజిల్లాకు గాని వ్రాసినచో గ్రంథములు దొరకును.

---

## వైజయంతి

శ్రీకొల్లాపుర స్నేహలతా కవితా సంఘము నుండి వెలువడిన వార్షికపత్రిక. తొలిసంచిక, ౧౯౩౩. సంపాదకురాలు, చేబ్రోలు సరస్వతీదేవి, నూజవీడు. వెల రు ౧-౦-౦. వలయువారికి పుస్తకముచితముగ పంపబడునని స్వవిషయముచివర సంపాదకురాలు వ్రాసియున్నారు.

ఇందు సుమారు ౪౦ గద్యపద్యాత్మకము వ్యాసములు కలవు.

---

## భారవి (ప్రథమభాగము):

భారవి జీవితచరిత్రము. పద్యకావ్యము.

గ్రంథకర్త, భువనగిరి విజయరామయ్యగారు, బి. ఏ., ఆడిటాఫీసు, గుంటూరు.

డెమ్మీ సైజున ౬౦ పుటలు. వెల ౦-౫-౦.

---

## ఆంధ్రీకృత హంస సందేశము

అనువాదకులు: కీ. శే. కల్లూరి వేంకటరామ శాస్త్రిగారు, కోమారి దక్షిణామూర్తి శాస్త్రిగారు; కాకినాడ, ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము.

వెల రెండణాలు.

---

## శ్రీ తిరుమల తిరుపతి మొదలగు దేవస్థానముల శాసనావళీగ్రంథమాలలోని తిరుపతి దేవస్థానపు శాసనముల గూర్చిన నివేదిక

దేవస్థానముల విచారణకర్తలగు శ్రీ మహంత్ ప్రయాగదాస్‌జీవారి యాధిపత్యమున తిరుపతి దేవస్థాన పురాతత్త్వ శాఖోద్యోగియగు శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, బి. ఏ. గారి సంపాదకత్వమున వెలువడిన గ్రంథము.

మదరాసు ఆండర్సన్ వీధిలోని ౨౧ నంబరున తిరుపతి శ్రీ మహంతువారి ముద్రణాలయము నుండి ౧౯౩౨ లో ప్రచురింపబడిన ఈగ్రంథము రాయల్ $\frac{1}{4}$ సైజున మంచి చక్కని అట్టబైండుతోను దళసరి నున్నని కాగితములతోను ౩౬౬ పుటలును ౬౦ కిపైగా చిత్రపటములును కలిగియున్నది.

---

## కర్తవ్యము

ప్రపంచము నూతనోత్సాహముతో నిరంతర పరిభ్రమణశీలమగు కాలచక్రమును ద్రుతతరముగ పురోగమించుచున్నది. విజ్ఞాన సంపదకు వేయితెరగుల విస్తృతి కలుగుచున్నది. ప్రజల అభిరుచులు మారిపోవుచున్నవి. ప్రాతవానిపయి రోత, క్రొత్తవానిపయి కోరిక కలుగుచున్నది. ఎల్లవంకల నభినవత్వము, వికాసము విజృంభించుచున్నవి. ఈ నూతనోత్సాహము కొందరు హ్రస్వదృష్టులు శుభసూచకముగా భావింతురు. అది పొరపాటు. అవశ్యంభావియగు నిఖిలప్రపంచ మహాకల్యాణ పరివర్తనమున కిది వసంతోదయవేళ. దూరదృష్టు లిందలి సత్యమును గుర్తింపగలరు. దేశములు, జాతులు నహమహమికతో నీ నూతనత్వావాప్తికి గట్టిప్రయత్నములు సాగించుచున్నవి; ప్రయోగకౌశలమునకు దగినఫలమును పొందుచున్నవి. భారతీయులు నట్టి యుత్సాహమున నేదేశమువారికిని దీసిపోవువారు కారు. కాని ప్రయత్నప్రయోగములకు దేశకాలము లనుకూలింపకున్నవి. భారతీయులయందు దొక్కతెగవారగు నాంధ్రులకు నంతకన్న ననుకూలించి యుండకపోవుట వింత కాదు.

ఆంధ్రదేశమున నొకపుడు సాహిత్యము, శాస్త్రములు, కలలు నిత్యవికాసము కలిగియుండినవి; వాణిజ్యము, పరిశ్రమలు చక్కగా సాగుచుండినవి; ధనధాన్యాదిసకల సంపదలు నిండారియుండినవి; ఆచారవ్యవహారములు, సంఘసంప్రదాయములు విశిష్టనాగరికతకు నెలవు లయియుండినవి; ప్రజాహృదయము నిరంతరోత్సాహభరితమయి యొప్పుచుండినది. ఇది నాటి స్థితి. నేటిస్థితి తద్విపరీతముగ నున్నది. సాహిత్యాదులు సన్నగిల్లుచున్నవి; వాణిజ్యపరిశ్రమలు వరదగలియుచున్నవి; సకలసంపదలు తనకు గాకపోవుచున్నవి; ఆచారవ్యవహారాదు లవకతవకలగుచున్నవి. ప్రజాహృదయమున నుత్సాహస్థానమున నౌదాసీన్యము కుదురుకొనుచున్నది. ఔదాసీన్య ప్రాబల్యము సర్వానర్థములకు మూలము. దానివలన నపచయము నొందుచున్న దేశోన్నతి సాధనములన్నియు కాలక్రమమున నంతరింపగలవు. తరువాత తత్పునరుజ్జీవనకార్య మసాధ్యము. దీనికి ప్రకృత రాజ్యాంగవిధానము ప్రధానకారణము. దానివలన కలిగిన దారిద్ర్యము, అవకాశప్రాతికూల్యము; ఔదాసీన్యము తరువాతివి. ప్రపంచమెల్ల మహాపరివర్తనము నెదురుచూచుచున్న ఈ సమయమున నాంధ్రులు మందగించుచున్న యుత్సాహము నుద్దీపింపజేసికొని తమ్ము దరుముకొనివచ్చుచున్న దుస్థితిని తొలగించుకొనవలెను. ఆత్మోన్నతి నరికట్టుచున్న బాహ్యప్రతిబంధకముల నతిక్ర

మించి, అభినవమార్గముల నడచి విగళితమగు చున్న తమ ప్రతిష్ఠను నిలుపుకొనవలయును. ఈప్రయత్నము సర్వతోముఖ సంస్కారమువలనగాని సఫలము కాజాలదు. సంస్కారనిర్ణయమునకు వివిధవిషయపరిజ్ఞాన మావశ్యకము. తత్ప్రాప్తి తత్తద్విషయక సాహిత్యాధ్యయనమూలకము. దానికి దగిన యవకాశమును నేటి విద్యావిధానమున లేదు. పఠనలేఖనజ్ఞానమాత్రమే విద్యాశాలల యందు 'విద్యా' శబ్దమున కర్థమయినది. అజ్ఞానమైనను నిర్దుష్టము గాదు. శాస్త్రములయు, కళలయు పేరులుకూడ విద్యాశాలల యందు నేర్పవలసిన వివిధవిషయముల పట్టిక యందు గలవు. తద్విజ్ఞానము తత్తద్గ్రంథముల యందు గలదు. వానిని విద్యాశాలలయందు చదివించుటయు గలదు. ఇక లేనిదనవలసినది అట్లు చదువుటవలన గలుగు జ్ఞానము. ఇది ఆంగ్లవాఙ్మయ సాహిత్యముల విషయము. ఆంధ్రవాఙ్మయ సాహిత్యజ్ఞానమునకు తప్పులు కుప్పలుగా నక్షరములను చదువుట, వ్రాయుట పరమావధి యైపోయినది. ఆంగ్లభాషయెడ నాదరము పెరుగుకొలది (ఒకపు డుదరభరణమున కుపయోగించుచుండెడిది కాన) ఆత్మోన్నతిజ్ఞానమును ప్రసాదించు ప్రాచీనార్య వాఙ్మయము నెడ వైముఖ్యము పెరుగుచుండినది. కాని కొలదికాలమునుండి సౌముఖ్యము కలిగి యావాఙ్మయమును, దేశభాషావాఙ్మయమును చదువుటకు ప్రత్యేకసౌకర్యము లేరుపడినను ఫలమునమాత్రము తక్కినవానికి తమ్మునివరుస యగుచున్నది. కళాశాలలవలన పొందగల కళావైదగ్ధ్యమును పరిమితమే. ఈతీరున జదివినవారలు రచించిన పుస్తకములే విద్యాలయములయందు చదువవలసినవి. వానిని చదువుటకు, చదివించుటకు ప్రయాస మల్పము. అందువలన ప్రాప్తించు జ్ఞాన మంతకన్న నల్పము. బుద్ధిలతకు మారాకు హత్తింపజాలని నేటి విద్యావిధాన దోహదక్రియవలన మనఃకుసుమముల వికాసము గగనకుసుమము. సకలవిధముల విజ్ఞానప్రదమయి దేశమున కభ్యున్నతిని చేకూర్పవలసిన విద్య యిట్లు నిష్ప్రయోజకముగ పరిణమించుట సంతాపకరము. పోనిండు. చదువగలవా రెంద రున్నా రాంధ్రదేశమున? చాల తక్కువ. తక్కినవా రందరు నిరక్షరకుక్షులు; విజ్ఞాన విహీనులు. వారికి సంస్కారావశ్యకత యెట్లు తెలియును? నవ్యత నాణెమెట్లెరుకపడును? వాని జ్ఞానమే శూన్యమయినపుడు వానియెడ రుచి యెట్లు గలుగగలదు? ఇట్టి యునికి నాంధ్రులకు స్వయంసాహాయ్యమే శరణ్యము కాని యన్యమార్గము లేదు. స్వయంసాహాయ్యము ప్రయోజనమును కొంద రిదివరకే గుర్తించినారు; కర్తవ్యమును నిశ్చయించినారు; కర్తవ్యసాధనసామర్థ్యమును గడించుకొనుచున్నారు; అభినవమార్గముల సంస్కరణమును తలపెట్టుచున్నారు. కాని అజ్ఞానావృతమయిన ప్రజాసామాన్యము ప్రాతక్రొత్తల నడుమ నుయ్యాలలూగుచు కర్తవ్యమునకు

కై దండ యొసగకున్నది. సంస్కరణమున కిది గొప్ప యాటంకము. దీనిని తప్పుకొనవలసి యున్నది. దీనికి ప్రజాసామాన్యము విద్యావంతమగు మార్గముల తొలుదొలుత నరయవలయును. ఆరోగ్యము, సాహిత్యము, శాస్త్రములు, కళలు, వ్యవసాయము, పరిశ్రమలు, సంఘసంప్రదాయములు, ఆచార వ్యవహారములు మొదలగునవి తామరతంపరలుగా నభివృద్ధిచెంది దేశీయులనిత్యజీవితమున కుపయుక్తములగుట కనువయిన మార్గములను దెలుపు వాఙ్మయసంపద విరివిగా పెరుగవలయును. ఈకార్యమంతయు కేవలము స్వయంసాహాయ్యమువలననే కావలసి యున్నది కావున తొలుదొలుత దానినంతను వ్యాసముల రూపమున వెలువడజేయుట సుకరము. నిత్యజీవితమున కుపకరించు తత్సంపదను దేశీయులకు బంచియిడ భారతి వినమ్రశిరస్కయై వేచి యున్నది. కర్తవ్యపరాయణులయి ఆంధ్రు లభ్యున్నతిని పడయుదురుగాక!

---

## ఆంధ్రసాహిత్యపరిషత్తు

మార్చినెలలో, బరంపురము ఒడ్డి బురకాలో పడేమండు తెలుగు పండువుగా చేసుకొన్న 'అభినవాంధ్రకవిపండిత సభ' మొన్నమొన్నటిదాకా పత్రికలో మాటాడుతూనే ఉన్నది. ఇప్పుడు 'ఆంధ్రసాహిత్యపరిషత్తు' ౨౧, ౨౨ వత్సరాల ఉత్సవము ఈ ఏప్రిలు ౧౪, ౧౫ తేదులలో రాజమహేంద్రవరములో జరిగినవైనము, దానిపై వ్యాఖ్యాలోకము, వినవచ్చింది. అది కొత్తగా ప్రవృత్తమైనది: ఇది వత్సరాలుగా ఆవృత్తమవుతూ ఉన్నది. సాహిత్యపరిషత్తు ఇన్ని వత్సరాలుగా నిలిచి ఉండగానే అభినవకవిసభలు జరుగుతూ ఉంటే, అవి తమ అభినవత్వమన్నది పేరులో సహా గోడగా మలిచి యెత్తుతూ ఉంటే, ఒక వ్యాఖ్యానము మౌనముగా వచ్చి సాహిత్యపరిషత్తును కదిపి తీరుతుంది. సాహిత్యపరిషత్తు కేంద్రాధికారమువంక నడచి, 'కొత్తపాతల మేలు కలయిక' ఉపదేశించడము ధర్మమని కొందఱు తలచినారు; ఆ అవకాశాలు పరిషత్తుకు కల్పిద్దామని ఉద్యమించినారు కూడా. ఈలాటి కోరికలు, ఆశలు ఈసమావేశమున స్వాగతసంఘాధ్యక్షులు శ్రీ రాజా కాండ్రేగుల శ్రీనివాసజగన్నాథరావు బహాదురువారి మాటలలోని కంటూ చూరబడ్డవి :

'కేవలము భావప్రధానముగ కవన మల్లుచు ననేకయువకు లిపుడు తెనుఁగుతల్లికి క్రొంగ్రొత్త పోకడలు చూపుచున్నారు. భాష యేదైనను భావమే ప్రధానము. కనుక వీరి యభిప్రాయములకు భిన్నము గాకుండునటులును, వీరు నిరుత్సాహవంతులై తమ కార్యమునుండి విరమింపకుండుటకునై యీ సభవారిని, అఖిలాంధ్రప్రపంచమును, భావకవులకుఁ గూడ ఇందు తగుస్థాన మొసంగి ప్రోత్సహింపఁ గోరుచున్నాను. ఇట్లుభయపక్షము లొకటిగాఁ గూడినచో నాంధ్రవాణికి నితోఽధిక సేవ యొనరించినవారము గాఁగలము!'

స్వాగత సంఘాధ్యక్షుని మాటలకు అర్హమైన గౌరవమును ఏమఱకుంటే ఈభావము దేశముగుండా ఎంత ప్రాముఖ్యముతో స్వీకరించవలెనో తెల్లమవుతుంది.

కాని మఱి అధ్యక్షులే అయిన కవిశేఖర వడ్డాది సుబ్బారాయడుగారి ప్రసంగము వేఱు :

"పరిశుద్ధమై, సలక్షణమై, విచక్షణగ్రాహ్యమై యలరారు భాష గ్రంథములయందుండవలె ననునదే యీ పరిషత్తుయొక్క యుత్తమసంకల్ప మగుట గడుం గడు శ్లాఘనీయము. కాలానుసారముగా జనసామాన్యమున కుపయోగించు గ్రంథము లన్నియుఁ బై నియమములం బాటించి సాధ్యమైనంత సులభశైలిని రచియించుట యీనాఁటి రచయిత లందఱాదర్శముగా నిలుపుకొనుట




౨౧, ౨౨-వ ఆంధ్ర సాహిత్యపరిషన్మహాసభ, రాజమహేంద్రవరము

మంచిది. లాక్షణికమైన భాషాప్రయోగములకై పరిషత్తు ప్రయత్నము చేయుచుండుట ప్రశంసనీయము. ఈ ప్రయత్నము సముచితమని తలంచియేగదా పాఠశాలలలో లక్షణవిరుద్ధమైన భాష నుపయోగింపఁ గూడదని యధికారులు శాసించిరి.'

ఇది యెంతవిరుద్ధము. 'భావకవులు,' 'అభినవాంధ్రకవి పండితులు,' బరంపురము పారిషదులు, విద్యాశాలలలో నూతనభాష ప్రకటనార్థము వాడుకభాష విద్యార్థి వాడుక చేసికోగలందులకు విద్యావిధానకల్పముకూడా వ్యాఖ్యానించి డిరక్టరుగారి బల్ల కదుపుతారు వినమని. ఈ విపరీతపురుచులు మేము మేళవింపలేమని పరిషత్తువారు తమ తూష్ణీంవర్తనే నేములు తిరిగితే, నేటి సాహిత్యగతికి పందిరికట్టే కూటము ఏర్పడడము ఒక వ్రాసిపెట్టిన విధి అనిన్నీ, అది వికసించిననాడు సాహిత్యపీఠముగా ప్రాధాన్యము దానిదే అనిన్నీ అప్పుడే ఒక కలరవము ఆ సేమిస్వనాలకంటూ గింగురుమంటూ ఉన్నది.

ఏపక్షమువారికిన్ని సమ్మతమూ పూజ్యమూ అయిన సాహిత్యధోరణి పరిషత్తుగొంతుకగా మాఱు మ్రోగించగల విషయాలనుగుఱించి వ్యాసాలు చదివినారు మొన్న పరిషత్సమావేశములో. అనేకులు మఱి ఆధునికాంధ్రమున్నూ, ఆధునికవాఙ్మయమును గుఱించిన్నీ ముచ్చటించినారు—ఆవంకనూ ఈవంకనూకూడా,—ఆ సాహిత్యపరిషత్తు బల్లపయినే. పరిషత్తు మనస్సులో పూర్వపక్షసిద్ధాంతాలు రేగి తీరినాయి.

'భావకవులు' నిరుత్సాహపడి తెలుగుభాషకు నూత్నరుచులు సంతరించక సన్యసిస్తారని స్వాగతవిభుడు భయపడ్డాడు కాని, ఆవంకనుండి ఎన్నో పిలుపులూ, మానోద్యమములూ కూడా వినవస్తూ ఉన్నాయి,—తాము విరమించడమూ కాదు, ఇంకొక పరిషత్తుగా నిలిచి తీరుతామని,—ఈపరిషత్తే విరమిస్తే విరమించు గాక అని కూడా. అంతటి గడుసుదు వచ్చిందని ఒకరు చెప్పనక్కఱలేదు.

పరిషత్తు ఉద్యోగము ఫలించియే ఇంతమంచి సలక్షణభాషాభిమానులు సిద్ధపడ్డారనీ, పరిషత్తే నభిమానిస్తున్నారనీ అధ్యక్షులు మున్నగువారు సంతసించడము, కేవలమూ అసత్యము కానట్టి ఏ పొగడ్తలో అలరినా చెల్లే సమయాలకు తగి ఉండవచ్చును. ప్రజాపతినుండి ఆంగీరసకు, పరిషత్తుసభ్యులు ౪౪ నుండి ౩౪ కు దిగినారు: పత్రికచందాదారులు ౧౩౭ నుండి ౧౦౪ కి దిగినారు. ఇది కార్యదర్శి నివేదిక. ఆయము నిరుత్సాహకరముగా ఉన్నది. ఈస్థితి కేవలము జనాదరము లేక అని కాని, దేశకాలముల ప్రాతికూల్యవిశేషమువల్ల అని కాని, ఒక్కకారణము నిర్ణయించడము కష్టము కాకపోదు. రెజిస్టరుచేసిన ౨౨ వత్సరాలప్రాయపు రమ్యమైన ప్రజాసంస్థకు దారిద్ర్యమే ఊపిరి అయిన దంటే, ప్రజలే యెక్కువనిందకు హక్కు చూపుతారని చెప్పినా త్రోసివేయ నక్కఱలేదు. కాని, తాటస్థ్యము లేక, అలసత్వము లేక, ఇంత ఉత్సాహముతో, శక్తితో, సదాశయముతో రేగిన మతాంతరము అవజ్ఞాతము కాక సంధికి లాగబడితే సంస్థ భాగ్యగతిలోనూ, అర్థసిద్ధిలోనూ మార్పులు కన్పడి తీరేవి—సందేహము లేకుండా.

ఏది యెటయినా, పరిషత్తు తనదీక్షకు కట్టుపడి నడుస్తూ ఇంతకాలము నిర్వహించిన పని తక్కువకాదు. అది సుప్రసిద్ధమున్ను. అధ్యక్షులు తమ ప్రసంగములో ఉచితముగా ప్రశంసించినారు పరిషత్తుపనిని. లిఖితపుస్తకాల సంరక్షణ సంశోధన పరిష్కార ప్రకాశనములు పరిషత్తుపేరు వేయి ముఖాల శాశ్వతీకరించినాయి. సూర్యారాయాంధ్ర నిఘంటువు దివ్యమైన పూనిక. పత్రిక సంస్కృతివిలసితమయిన పోకడ. అన్నిమార్గాలా పరిషత్తు తేజము దేశము దెసలు తన్నుతూ ఉన్నది,—సందేహము లేదు.

అధ్యక్షులు సూచించిన ప్రయోజనములూ పరిషత్తుకి ఆదరణీయములే. అవును: సంస్కృతసాహిత్యము తెలుగుభాషలోకి ఏమాత్రము వచ్చిం దేమిటి? ఎంత రావలసి ఉన్నది కాదు? అట్టిది సాగించడమునకు పరి

షత్తువంటి సంస్థ పూనవలసినదే. అధ్యక్షులు నేటి మన సాహిత్యభాగ్యగౌరవములు కొంతగా తడవి, విద్యాసంస్థలయందు తెలుగుపండితులకూ, భాషకూ గౌరవమూ మూల్యమూ పెరుగవలె ననిన్నీ, విద్యావిధానములో తెలుగుభాష పెక్కురీతులుగాను, ఎక్కువగాను వినియుక్తము కావలె ననిన్నీ, ఇట్టిపనులకయి కూడా పరిషత్తువారు దేశములో ఆందోళన శేపవలసి ఉంటుందని ఆదర్శములు నిలిపినారు.

పత్రికలో నవ్యవికాసములు చూపక, నిఘంటువులో విలంబాదికముచేతనూ, మచ్చుపదాలలో వడలిన విమృశ్యతల చేతనూ కొంతగా మెప్పు జార్చుకొని, శేమితో కుందుతూ ఉన్నప్పుడు, ఇన్నికార్యాలకు పరిషత్తు తన మనసు ఎంతగా ఆయతము చేసికోవలెనో కనిపట్టడానికి దృష్టి కొంచెము దవ్వులు నడవవలసి ఉంటుంది. మొత్తముమీద, వలసినంత చురుకుగానైనా పనిచేయక పోవడమునకు తలపయిని పడే అక్షింతలు ఆభిజాత్యములో ఉపేక్షించగ తడవుకొంటే, ఈ కార్యమయసమయములో పరిషత్తు తన వలచిన ప్రతిష్ఠను నిలబెట్టుకోగలది కావచ్చు.

తనపూనిన కార్యాల నిర్వాహముమాట అటుంచి, కేవలము, నూత్నమార్గాలకు సమాధానమో సమన్వయమో చూపదని ఒకపక్షమువారు గర్హ వర్షిస్తూ ఉంటే, మొన్నటి సమావేశములో శ్రీ ముద్దుకృష్ణ, సుబ్రహ్మణ్యశాస్త్రిగార్లవంటి 'అభినవుల'కు వేదిక తెఱచినారు, చెవి తెఱచినారు, పరిషత్తువారు. ఇదే ఒక విశేషమేమో: మునుముందు బుజాలు కలపగలదేమో.

ఈ ఆశ ఏమయినా విచారము అక్కఱలేదు గాని,—నేడు దేశములో ఉన్న ఉత్సాహమే చాలు సాహిత్యాభ్యుదయము రచించడానికి,—౨౨ వత్సరాలుగా నిలువద్రొక్కుకొని అపారమయిన గ్రంథ సంచయాది సారస్వతసంపత్తి కూర్చుకొన్న సంస్థ తనకర్తవ్యమును ఒకమూలగా గడికట్టుకోజూడడము శోచ్యమని మాత్రము అనుకొనక తప్పదు.

"...పక్షము లొకటిగా గూడినచో నాంధ్రవాణికి నితోఽధిక సేవ యొనరించినవారము గాఁగలము" అన్న స్వాగతసమితి వచనము మంచి ఒరవడి సుమా!

---

## షేక్స్పియరు నాటక ప్రచురణోద్యమము

అనుత్తమనాటక వాఙ్మయ రచయితయై యాంగ్ల భాష కనన్య సామాన్య గౌరవమును సమకూర్చినవాడు షేక్స్పియరు మహాకవి. కథాకల్పనము, పాత్రపోషణము, భావచిత్రణము, రచనావైదగ్ధ్యము పొందికగా నమరిన యాతని నాటకము లనుపదరసనిష్యందులు. ఈకవి బ్రహ్మ సృష్టించిన పాత్రము లన్నియు సర్వదేశసర్వకాలానురూపములయి సర్వావస్థానుగుణమనుష్య స్వభావచేష్టాసమంచితములయి ప్రత్యక్షము లగుచుండును. పాత్రముల వివిధభావములయు, విరుద్ధ భావములయు సంఘర్షణములను ప్రకటించుటయం దీసుకవి యద్వితీయుడు. ఏకపదమాత్రలోపము నేని సహింపని దీచతురశిల్పి నిర్మాణవిధానము. ఇట్లు నిరుపమ కళాకౌశలమున నిండారి ఈ కవిచంద్రుని రచనములు నిఖిలప్రపంచ సహృదయహృదయంగమము లయినవి. ఎల్ల దేశముల వారును, ఎల్ల జాతులవారును, ఎల్ల భాషలవారును ఈకవిచంద్రుని కొనియాడి ఆరాధించుచున్నారు.

ఈ నాటకముల కనేక ముద్రణములు చెల్లుచున్నవి. వానికి వ్యాఖ్యానములు, వివరణములు, విమర్శనములు, ప్రశంసలు నసంఖ్యాకములు పుట్టినవి; పుట్టుచున్నవి; ఇంకను పుట్టగలవు. వానికిని పెక్కు ముద్రణములు వెలువడుచు చెల్లుచున్నవి. నాటకములయందలి రససంపద యెంద రెన్ని తెరగుల కొల్లగొనినను తరుగునది కాదు. కావున ప్రపంచ మున్నంతకాలము వీని ప్రవృత్తి యిట్లే సాగుచుండ గలదు.

సుప్రఖ్యాతములగు వాఙ్మయము లన్నిటను ఇవి యున్నతస్థానమున కుదురుకొనినవి. చాలకాలదిగ మన్న ఆంగ్లభాషావేత్తలగు భారతీయులలో నేకొందరో మాత్ర మీ నాటకముల గొప్పదనమును గ్రహించి యానం

దింప గలిగి యున్నారు. అత్యధికసంఖ్యాకులగు నాంగ్ల భాషానభిజ్ఞులకు - చాల కొలదిమందికి తప్ప - వీనియునికియే తెలియదు. కావున వీనికి దేశభాషలలో యథామూలములగు నిర్దుష్టానువాదము లావశ్యకములు.

భారతదేశభాషలలోను కొన్ని నాటకముల కనువాదములు, అనుకృతులు గలవు. వానిలో నాంధ్రమున గల యనువాదములు, అనుకృతులు మూలమునకువిసంవాదులు, వికృతులునయి మహాకవిరచనములకు కళంకము నాపాదిల్ల జేయుచున్నవి. ఇవి యిటు లగుటకుమూలము సరిగా నర్థముకాకపోవుట, మూల మర్థమయిననుదానిని మాతృభాషయందు తెలుపుటకు చాలినసామర్థ్యము లేకపోవుట, విదేశాచార సంప్రదాయప్రవర్తన వర్ణనాదులు నచ్చకపోవుట, మూలాధిక సౌందర్య సంపాదనసాహసము మొదలగునవి కారణములు. మరి కొందరీకవిసార్వభౌముని భావములను దొంగిలి తమ పనికిమాలిన సరుకున నిరికించికొని, వానిని స్వకీయములుగా లోకమున ప్రకటించుకొని భావుకతాగౌరవము తమ నెత్తిమీది కొరిగినట్లు మురియుచున్నారు. ఆంధ్రదేశమున చాలమందికిటీవల నీగ్రంథ చౌర్యము నిత్యకృత్యములలో నొకటి యైపోయినది. ఇది యత్యంతము గర్హ్యమగు దుష్కార్యము.

ఆంధ్రలోకము షేక్స్పియరుకవిచంద్రుని కళాకౌశలమును యథాతథముగ గ్రహింపవలయునన్న తద్రచనములకు యథామూలానువాదములు గద్యరూపమున వెలువడవలయును. అది సులభసాధ్యము కాదనుమాట నిక్కమే. భావుకత, ఆంగ్లాంధ్రభాషలయందు మంచి పాండిత్యము, కవికృతనాటకములయు, వానికి గల వ్యాఖ్యాన విమర్శనాదులయు, వాని యితివృత్తముల కుపకరించు చరిత్రాదికములయు సవిమర్శజ్ఞానము, వైదేశికాచారసంప్రదాయవర్ణనాదుల పరిశీలనము, వానియెడ సౌముఖ్యము సరససరళరచనానైపుణ్యము, పదప్రయోగ కౌశలము మున్నగునవి అనువాదకార్యము సుసాధ్య మగుటకు సాధనములు. ఇట్టి సాధనసంపద సమకూడినవారు కావించుననువాదములు సుప్రశస్తములు. మూలమునందలి విదేశీయ విజాతీయవిషయములకు, చరిత్రాంశములకు, ఇతరవిశేషాంశములకు చక్కనివివరణముల ననువాదముల కనుబంధములుగా కూర్పవలెను. ఇట్లు వెలసిన అనువాదములవలన "భువనమాన్యగుణోత్తరమయిన (షేక్స్పియరు) మహాకవి కవితాచాతుర్యము, తన్మహనీయసృష్టియందలి మహోత్తమప్రతిభ, తన్నిర్మాణశక్తియందలి మోదావహమగు నైపుణ్యము" నాంధ్రలోకమునకు కరతలామలకములు గాగలవు; ఆంధ్ర వాఙ్మయము మహోన్నతపదము నధిష్ఠింపగలదు.

"ఈనాటక రాజముల" నన్నింటి "నాంధ్రమునం దనువదించి" ఆంధ్రమహాజనుల కొసంగవలెనను "సంకల్పము"తో షేక్స్పియరునాటకప్రచురణోద్యమ మొకటి నేడాంధ్రదేశమున *మొలకెత్తినది. షేక్స్పియరు మహాకవిప్రతిభాదికము "సమగ్రముగ ఆంగ్లభాష నేర్చి గొప్ప పరీక్షల నిచ్చు నత్యల్పసంఖ్యాకుల కొకింత పొసగియున్నది కాని కేవలాంధ్రభాషను చదువ నేర్చి యున్న జనబాహుళ్యమునకు అందరానిపండ్లవలె నుండుట విద్యాధికు లెఱింగియుండియు నందుల కెవ్వరు ప్రయత్నింపకుండుటచేత తన్నాటకానువాదకార్యభారమును మీద వైచుకొని" దాని "శక్త్యనుసారముగ గొనసాగింప" నీయుద్యమము తల పెట్టబడినది. ఇది యభినందనార్హము. నాటకము లన్నియు "ఆంధ్రచారిత్రక, రాజకీయ, సాంఘికసంప్రదాయానుగుణముగ నాంధ్రమునం దనువదించుట" యీయుద్యమమును తలపెట్టినవారి "ముఖ్యసంకల్పము". ఈ సంకల్పము ననుసరించి

* గంజాము మండలమునందలి ఛత్రపురమున.

కావించిన King Lear నాటకమున ననువాదమునకు మచ్చు* పాత్రము ప్రకటితమయినది. "పాత్రలం

* మచ్చు

కన్నతండ్రి అను నన్నెచోడ భూపాలీయము

ఇందలి పాత్రములు.

పురుషులు.

ఉదయాదిత్యుఁడు:—(King Lear) ఆంధ్ర కర్ణాటచోడ భూపాలుఁడు. ఇతనికిఁ దెంకణాదిత్యుఁడనియు, నన్నెచోళుఁడనియు చోడోదయుఁడనియు నామాంతరములు.

పృథ్వీశ్వరరాజు:—(Duke of Burgundy.) వేంగీమండలమును బాలించువాఁడు.

ఓరుగంటిరుద్రదేవుఁడు:—(King of France.) ఇతనికిఁ బ్రతాపరుద్రుఁడనియు నామాంతరము కలదు.

సోమేశ్వరదేవుఁడు :—(Duke of Albany.) పశ్చిమచాళుక్యప్రభువు. వనవాసి నగరము రాజధానిగఁ గలవాఁడు.

జగద్దేవుఁడు : — (Duke of Cornwall.) కొండవీటిని పాలించువాఁడు.

మధురాంతకదేవుఁడు:—(Earl of Kent.) విక్రమసింహపురాధీశ్వరుఁడు.

భీమచంద్రదేవుఁడు:—(Earl of Gloucester) వర్ధమానపురాధీశ్వరుఁడు.

గోకర్ణదేవుఁడు:—(Edgar.) భీమచంద్రదేవుని కుమారుఁడు.

భీమేశ్వరుఁడు:—(Edmund, theBastard) భీమచంద్రునకు జారత్వమునఁ బుట్టినవాఁడు.

భేతాళనాయకుఁడు: — (Curan) రాజ సభ్యుఁడు.

కిబ్బటుఁడు:—(Oswald.) మాబలదేవి సేవకుఁడు.

విదూషకుఁడు:—(Fool) నన్నెచోడుని పరిచరుఁడు.

స్త్రీలు.

మాబలదేవి, మాచలదేవి, పద్మావతి:—(Goneril, Regan, Cordelia.) ఉదయాదిత్యుని పుత్రికలు.

మఱియు వైద్యుఁడు, పరిచారకులు, చారులు భటులును వత్తురు.

కథాకాలము:—క్రీ. శ. ౧౧౬౩.

ప్రథమాంకము.

మొదటిరంగము—స్కంధపురమున రాజభవనము.

[మధురాంతకుఁడు, భీమచంద్రదేవుఁడు, భీమేశ్వరుఁడుఁ బ్రవేశింతురు. మధురాంతకుఁడును, భీమచంద్రదేవుఁడును, నన్నెచోడుని సామంత గణములలోనివారు. భీమేశ్వరుఁడు భీమచంద్రదేవునకుఁ జారత్వమువలనఁ బుట్టినవాఁడు.]

మధు—సార్వభౌమునకు జగద్దేవునకన్న సోమేశ్వరదేవునియందే యెక్కుడు వాత్సల్యముండెనని నేను తలంచితిని.

భీమ—మనమెప్పుడాలాగుననే తలంచితిమి కాని యిఁకముందు జరుగనైయున్న సామ్రాజ్య విభజనమున నాతఁడెవ్వరిపై నెక్కువ మక్కువకలవాఁడో చెప్పఁజాలము కద! వనవాసినగరమున వనవాసముచేయుచుండు సోమేశ్వరుఁ డొక యల్లుఁడును, హంపాపురాధిపత్యమును గోల్పోయి మనసార్వభౌముని గొల్చియుండు జగద్దేవుఁ డొకయల్లుఁడును కాఁగా తుదకీ సామ్రాజ్యమున నెక్కువభాగ మెవనికిఁబోవునో— అందఱికంటె గాదిలిపట్టియగు పద్మావతి కెంతరాజ్యమిచ్చునో—యెట్లు చెప్పఁగలము? ఈయల్లు రిద్దఱు తమ భూములఁ గోల్పోవు స్వభావముగలవారు. ఇఁక తమ కాంతా క్షేత్రములనైన చేజారిపోకుండఁ బరిపాలింపఁ గలిగినయెడల నంతకంటెఁ గావలసినదేమున్నది. *

* పోఁగొట్టుకొనవచ్చునని సూచన.

మధు — అవునుకాని — వంశక్రమాగతమైన కల్యాణ సామ్రాజ్యమును గోల్పోయి బయట నెక్కడ నుండియో యింటఁ బ్రవేశించిన కుక్కవలె తన యింటనుండియే వెలికిఁ గొట్టఁబడి, తనసేవకుఁడే తన్నుధిక్కరించి తనయింటనే పట్టాభిషిక్తుఁడై తన ప్రాణములకుఁ గూడ నపాయముఁదెచ్చు దురవస్థకుఁ బాలు సేయఁగా క్షత్రియుఁడయ్యుండియు మహాపరాభవమును సహించుచున్న సోమేశ్వరుఁ డెప్పటికైన శత్రునిర్మూలన మొనర్పకుండునా? అందులకుఁదోడు మన సామ్రాజ్యమునఁ గొంతభాగమాతనిచేతఁబడినయెడల నాతఁ డవలీలగాఁ బశ్చిమచాళుక్యసామ్రాజ్యమును పునరుద్ధరించుకొనునుగద!

భీమ—సందేహ మేమి?

మధు—ఇతఁడు తమపుత్రుఁడుకాఁడా?

భీమ—వీఁడు నాసంరక్షణలోనివాఁడే. ఒకప్పుడట్లొప్పుకొనుటకు సంకోచించుటయు సిగ్గుపడుటయుఁ గూడ నైనది. ఇప్పుడు మొఱదువారిపోతిని. ఎట్లు కాఁడనఁగలను?

మధు—మీరు చెప్పునది దురవగాహమై నాకు కనిపెట్టరాకుండ నున్నది.

భీమ—మీరు కనలేకపోతిరికాని వీనితల్లి వీనిం గనితీరినది. అనురాగ బలమున నాపన్నసత్త్వ* యై నన్నుఁ బెండ్లాడకుండ నాకు బిడ్డను గన్నది—డొంక తిరుగుడు మాటలెందుకు?—సూర్యునకు కర్ణునివలెవీఁడు నాకుదయించెనని తామెలెలిసికొనవలెను. †ధర్మపత్నిని జేసికొనకుండ తొందరపడి యాఁడుదానిని జేయిఁబట్టు కొన్నందులకు పరమేశ్వరుఁడెల్ల కాలమును దలపంచు కొనునట్లు నాకీ కుఱ్ఱవానిని దయచేసినాఁడు. కాదు కాదు. ఈశ్వరానుగ్రహమువలన నాకు దలవంపు లేకుండనున్నది. భారతమునందలి కానీనునివలె దుష్టుఁడు కాఁడు. మన చోళరాజచరిత్రమొక భారతముగ మీరు వ్రాయించినను అందు వీఁడు దుష్టచతుష్టయమునఁ జేరఁడు. ‖ అట్టి సాంగత్యమును వీనికి లేను. ఊరకుంటి రేమి? తప్పుపనిఁ జేసితినందురా?

మధు—ఎట్లనఁగలను? దానిఫల మింత మనోజ్ఞమై కానవచ్చునపుడు అట్లుగాకున్న బాగుండునని యెవ్వరును జెప్పరు.

భీమ—వీఁడేకాదు. శాస్త్రసమ్మతముగఁ బెండ్లి యాడిన ధర్మపత్నియందుదయించిన కుమారుఁడును గలఁడు. అట్లని వానిపైనంత యాదరమును లేదు. ఇష్టావాప్తినిబట్టి పుట్టియుండని యీతులువను తల్లినిడలంచి పుత్రునిగా నంగీకరింపవలె. తన్మహోదయ సందర్భమున మహారసికుఁడనై యానందించి యిప్పుడాత్మజుఁడు కాఁడని ద్రోహమెట్లు చేయఁగలను?— భీమా! వీరెవ్వరో యెఱుఁగుదువా?

భీమేశ్వ—ఎఱుఁగను.

భీమ—విక్రమసింహపురాధీశ్వరులగు మధురాంతకదేవ మనుమసిద్ధియను చోడసామంతులు వీరే! వీరి జనకులొకరు కాంచీపురమును జయించి మన సామ్రాజ్యపరిమితిని కావేరీతీరమువఱకును గొంపోయి మనకెల్ల

* ఆపన్నసత్త్వ—గర్భవతి. 'ఆపన్నసత్త్వాస్యాద్గుర్విణ్యాం తర్వత్నీచ గర్భిణీ' అని అమరము. † గ్రంథారంభమునందే షేక్స్పియరు నాటకమునందిట్టి యసభ్యవిషయకమైన ప్రస్తావనయున్నది. సంశయగ్రస్తులు మూలమునందలి యీక్రింది వాక్యములఁ జిత్తగింతురుగాక.

(i) A son for her cradle ere she had a husband for her bed.

(ii) This knave came something saucily into the world before he was sent for, yet, was his mother fair; there was good sport at his making.

‖ దుష్టచతుష్టయమునఁ జేరఁడు — వృథాభ్రాంతి! భారతమునందువలెనే దుష్టచతుష్టయ మిందును కలదు (మాబల, మాచల, జగద్దేవుఁడు, భీమేశ్వరుఁడు—వీరియందుఁ బరస్పరమైత్రియుఁ గలదు). పాఠకులు గమనింతురుగాక.

గూర్చిన చరిత్రాంశములు*" పదునేడుపుటలు మచ్చు పాత్తమున గలవు. మరి యైదునాటకముల పేరులు† నందు గలవు. ఉద్ధృతమయిన నాటకభాగానువాదమును, తదాంగ్ల మూలమును ఒండొంటికి బోల్చి పరికించిన యెడల మూలానువాదముల కయ్యవారికి గోతికి గల యంతరము గల దని షేక్స్పియరు నాటక వాఙ్మయ విశేషఖ్యాతిని దెచ్చియున్నారు. ఇఁకముం దెల్లప్పుడును వీరు నా ముఖ్యస్నేహితు లని జ్ఞాపక ముంచుకొనుము.

భీమేశ్వ—అయ్యా! సేవకుఁడ నభివాదము చేయుచున్నాను.

మధు—మేలగుఁగాక! నిన్నెఱుంగుటకు సంతోషమయ్యెడిని. ఇంకను దెలియవలసి యున్నది.

భీమేశ్వ—తమ సేవకుఁడ, కృతజ్ఞుఁడ.

భీమ—తొమ్మిదేండ్లు. పరదేశములందుఁ దిరిగి తిరిగి వచ్చినాఁడు. కొన్నాళ్ళకు మఱల బంపివైతును.

మధు—తొమ్మిదేండ్లెక్కడకుఁ బోయినాఁడు? ఖండాంతరములకుఁ బోయెనా, ద్వీపాంతరములకుఁ బోయెనా?

భీమ—ఎన్ని యేండ్లకును భరత ఖండమే యున్నది.

సీ. గంగాది నదులతో । గమనీయ తరులతో
వింధ్య హిమాలయ । వితతితోడ
జనపదంబులతోడ । సాంద్రాటవులతోడ
బహుకర్మరతులైన । ప్రజలతోడ

*          *          *          *

## KING LEAR

Act. 1. Scene 1.— A state room in king Lear's Palace. Enter Kent, Gloucester, and Edmund.

Kent. I thought the king had more affected the Duke of Albany than Cornwall.

Glou. It did always seem so to us; but now, in the division of the kingdom, it appears not which of the dukes he values most; for equalities are so weighed that curiosity in neither can make choice of either's moiety.

Kent. Is not this your son, my lord?

Glou. His breeding, sir, hath been at my charge: I have so often blushed to acknowledge him, that now I am brazed to it.

Kent. I cannot conceive you.

Glou. Sir, this young fellow's mother could; whereupon she grew round-wombed, and had, indeed, sir, a son for her cradle ere she had a husband for her bed. Do you smell a fault?

Kent. I cannot wish the fault undone, the issue of it being so proper.

Glou. But I have a son, sir, by order of law-some year older than this, who yet is no dearer in my account: though this knave came something saucily into the world before he was sent for yet was his mother fair; there was good sport at his making, and the whoreson must be acknowledged. Do you know this noble gentleman, Edmund?

Edm. No, my lord.

Glou. My Lord of Kent: remember him hereafter as my honorable friend.

Edm. My services to your lord ship.

Kent. I must love you, and sue to know you better.

Edm. Sir, I shall study deserving.

Glou. He hath been out nine years, and away he shall again. The king is coming.

---

*ఈచరిత్రాంశములాంధ్రదేశచరిత్రకుసంబంధించినవి.

† 1. సంకల్పవిలంబము—Hamlet

2. రాజ్యాపహరణము—Macbeth

3. నరసభూపాలీయము—Henry IV

4. కృష్ణదేవరాజీయము—Henry V

5. కలహప్రియ—The Taming of the Shrew.

తత్త్వజ్ఞులగు సహృదయులకు బోధపడగలదు. ఉద్యమ గౌరవము, అనువాదవిధానము సంతోష సంతాపములకు సమానావకాశ మిచ్చుచున్నది. నాటకముల యనువాదమును యథాతథముగగాక "ఆంధ్రచారిత్రక, రాజకీయ, సాంఘిక సంప్రదాయానుగుణముగ" మార్చి చేయదలంచుట యేల? వాని నర్థముచేసికొనజాలమియా? తద్గత సంప్రదాయాదులయెడ విద్వేషమా? ఈరెండును అనువాదమును పాడుచేయునవి. షేక్స్పియరు నాటకముల వలన దెలియవలసినవి "భువనమాన్యగుణోత్తరమయినమహాకవి కవితాచాతుర్యము, తన్మననీయసృష్టియందలి మహోత్తమ ప్రతిభ, తన్నిర్మాణశక్తియందలి మోదావహమగు నైపుణ్యము"మొదలగునవి. తన్నాటకములయందు గల వైదేశికచారిత్రిక రాజకీయ సాంఘికసంప్రదాయము లందు కడ్డుతగులునా? అట్లుతలచుట యసంగతము. తత్తద్దేశ వాఙ్మయములకు తత్తద్దేశ చారిత్రిక రాజకీయ సాంఘిక సంప్రదాయములే విశిష్ట సౌందర్యసంపాదకములు. వాని పరోక్షమున తత్సౌందర్య మంతరింపగలదు.

మఱియు మహాకవిపాత్రములకు ఆంధ్రదేశచరిత్ర ప్రసిద్ధులగు వ్యక్తులపేరుల నిడి తత్సంబంధిచరిత్రానుగుణములగు మార్పులను గావించుట యవిచారమూలకము. దేశచరిత్ర మేనాటికి నిదమిత్థమని సరిగా నిర్ణయింపరానిది. తత్రాపి, ఆంధ్రదేశచరిత్రము. దానికి గల ఆధారములు, చర్చలు, సిద్ధాంతములు నొండొంటికి పొసగక సంశయవివాదములకు స్థానములయి యున్నవి. ఇట్టి పట్టుల అనువాదకులు కావించినమార్పు శతోధికోపద్రవకారణము. ఎన్నివిధములజూచినను నాటకముల అనువాదవిధానమువలన మహాకవికళానైపుణికిని, ఆంధ్రదేశచరిత్రమునకును తీరనిహాని కలుగుట తప్పనిసరి యగుచున్నది. ఈ విధాన మనివార్యమేని 'కుపుత్రకు డగుటకంటె నపుత్రకు డగుట శ్రేయము' అను వార్యోక్తి ననుసరించుటయే యుక్తమనవలసియున్నది. కావున అనువాదకు లుత్సాహమూరులు కాక వివేచించి యుత్తమమార్గము ననుగమింపదగుదురు. అపుడు వారి పరిశ్రమయంతయు సఫలము కాగలదు; ఆంధ్రవాణి యపూర్వాలంకారసమంచిత కాగలదు.

ఈ యుద్యమము కొనసాగుటకు వేలకొలదిగ ధనమావశ్యకము. "ఆంధ్రులకు ఆంధ్రభాషకు" ఉద్యమమును తలపెట్టినవారు "చేయసంకల్పించిన ఈ యూడిగముయొక్క పరిమితిని గమనించి ఆంధ్రభూమియందలి" "భాషాభిమానులు", "రసికావతంసులు" నగు "ధనికోత్తములెల్లరు" వీరికి ధారాళముగ ధనసాహాయ్యము నొనరింతురుగాక!

---

## ఎనిమిదవ అఖిలభారత గ్రంథాలయమహాసభ

బెజవాడ, ౧౬-౪-౧౯33

జరిగినది అఖిలభారతగ్రంథాలయమహాసభ. సభను జరిపినవా రాంధ్రులు; అలంకరించినవా రాంధ్రులు. ఆంధ్రదేశగ్రంథాలయప్రస్తావన యందు జరిగినది. అం దఖిలభారత గ్రంథాలయప్రతినిధులు కానరారు; అఖిలభారత గ్రంథాలయముల ప్రస్తావనయు గానరాదు. దానికేమి? దేనికిగాని పేరు గొప్పగా నుండవలెనన్నారు పెద్దలు. మహాసభకు అంగముగా గ్రంథాలయప్రదర్శనము జరిగినది. అదియును 'అఖిలభారత'మనుటకు దగినయదిగా కానుపించదు. ఏది ఎట్లయినను మహాసభనుమాత్రము సలక్షణముగ జరిపించినారు కార్యనిర్వాహకులు. వారికి ధన్యవాదములు.

ప్రదర్శనము నుపక్రమించినవారు శ్రీయుతులు కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు. వా రాంధ్రదేశమును తమకుటుంబముగ భావించి తదభివృద్ధికయి యనేకవిధముల "దోహదము"నొసగుచున్నవారు. కావుననే "ఎన్నియాటంకములు తటస్థించినను, వానినన్నింటి నెదుర్కొని జ్ఞానమును సంపాదించి కృతకృత్యులగుటలో ఆంధ్రులు వెనుదీయరు. వారియొక్క యుద్రేకము, ఉత్సాహము కార్యరూపమును తాల్చుటకు ఎన్ని ప్రతిబంధకము లున్నను వానిని లక్ష్యముచేయక విజయమునకయి ప్రయత్నింతురు"అనియు, "అప్పుడు, ఇప్పుడు కూడ ఒకేవిధమయిన ఉత్సాహము, ఉద్రేకము, కార్యశూరత (ఆంధ్రులకు)గలవు"అనియు, "ఒకప్పు డొకరూపమున ప్రకాశించిన ఆంధ్రశక్తి మరొకప్పుడు వేరొక




ఎనిమిదవ అఖిలభారత గ్రంథాలయ మహాసభ, బెజవాడ.

విధముగ కార్యదక్షతను ప్రదర్శించుచున్నది"అనియు, "సకలరంగములయందును ఆంధ్రులు కృషిసల్పి జయ భేరిని మ్రోయించుచున్నారు. ఆదరణ, స్థానబలము, తగి నంత ధనసాహాయ్యము లేకున్నను, అనేకకష్టనిష్ఠుర ములకు లోనుగావలసివచ్చినను ధైర్యోత్సాహములను వీడక కేవలము స్వయంసహాయముమీదనే ఆధారపడి ఆంధ్రులు అనేకమహాత్కార్యములు సాధించియున్నా రు"అనియు పంతులుగారు "నొక్కి చెప్ప"గలిగిరి. అంతే కాదు. "ఇట్టి సుగుణసంపన్నతతో, కార్యశూరతతో పూర్వపు టున్నతస్థితికి రాగలరు"అను "దృఢవిశ్వాస ము"ను వారికి గలిగినది. ఈవిశ్వాసము నాంధ్రులు సార్థక పరుచుకొనదగుదురు.

మహాసభ నలంకరించిన మహాజనులకు స్వాగతము చెప్పిన శ్రీ చల్లపల్లి రాజావారును, మహాసభను ప్రారం భించిన శ్రీ వామననాయకుగారును, అధ్యక్షపీఠము నలంకరించిన శ్రీ డాక్టరు వంగల వెంకటశివరామ నామక మహాశయులును గ్రంథాలయముల ప్రయోజనములను, వానియావశ్యకతను, తదుత్పత్తిపోషణ మార్గములను చక్కగా వివరించిరి. అధ్యక్షులు పేర్కొనినట్లు గ్రంథా లయవ్యాప్తికి బరోడాసంస్థానము ననుకరించుట సము చితము. 'దానికి నాయకులు, ధనము, కట్టుదిట్టములు, సంకల్పము కావలెను.' వీనిలో ధనము, కట్టుదిట్టములు ముఖ్యములు. కాని ధనము నిచ్చువారు,కట్టుదిట్టములకు లో పడువారు నాంధ్రదేశమున నెందరున్నారు? అధ్య క్షులు "మనదేశమునందు (కార్నేజివంటి శ్రీమంతులు) దాతలు లేకపోలేదు"కావున "వారినడుగవలసినవిధముగ నడిగిన వారు ధనసాహాయ్యము చేయకపోరు"అనియు, "దానివలన కార్యసిద్ధి కాగలదు"అనియు సెలవిచ్చినారు. పెద్దలమాటలు శ్రేయస్సంపాదకములు. గ్రంథాలయో ద్యమనిర్వాహకులు తదుపదేశానుసారము నడుచుకొని గ్రంథాలయములు దేశమందంతటను నెలకొనజూడ దగుదురు.

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమునకు జన్మ స్థానము బెజవాడ. తదుద్యమబీజముల నాటినవారు కీ. శే. సూరి వెంకటనరసింహశాస్త్రిగారు. వారి నిరం తరకృషిచే నది యంకురించి చిన్నిచిన్ని రెమ్మలను విడిచినది. శ్రీమ దయ్యంకి వెంకటరమణయ్యప్రభృతులు దానికి పుష్టిని సంతరించిరి. క్రమముగ నది గ్రంథాలయ రూపశాఖలతో మందమందముగ సాగి దేశమున కొం డొక్క దెసల వ్యాపించుచున్నది. ఇది సంతోషింపదగిన విషయము. కాని యది చక్కగా కుసుమఫలభరమయి దేశమంతకు నాశ్రయమొసగజాలకున్నది. ప్రజలకందరకు గ్రంథాలయప్రయోజనము తెలియరానంతవరకు నది యట్టులే యుండగలదు. ప్రజాసామాన్యము విద్యావంత మగునేని తత్ప్రయోజనమును గుర్తింపగలుగును. అపుడు గ్రంథాలయాభివృద్ధి అప్రయత్నసాధ్యము కాగలదు. కావున విద్యాభివృద్ధికి కావలసిన మార్గముల నరయు టాంధ్రులకు ప్రథమకర్తవ్యము.

---

## ఆంధ్రేతిహాస పరిశోధకమండలి

ఆంధ్రేతిహాసపరిశోధకమండలి పదియేళ్ల పండుగ స్వస్థలమయిన రాజమహేంద్రవరములో మొన్న ఏప్రిలు ౧౮-వ తేదిని జరిగింది. డాక్టరు కృష్ణస్వామి అయ్యం గారు వారు సమర్థమైన అధ్యక్షత నిర్వహించినారు.

ఇతిహాసమండలి నిజముగా ఆంధ్ర దేశమునకు గౌరవము కూర్చే సార్థకత చూపుతూ వచ్చిన సంస్థ. సంస్థాపక మూర్తిత్రయము శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, భావరాజు వేంకటకృష్ణరావు, చిలుకూరి వీరభద్ర రావుగార్ల వంటి దీక్షితుల సత్సంకల్పమునకు విలువలు తెలిచే కార్యపటిష్ఠత చూపి, పదివత్సరాలుగా మండలి సాగిన పురోగతి ఆంధ్రులస్మృతివీథిని ఉరుములు ఉరు ముతూ, అన్యప్రాంతీయులయూ, అన్యదేశీయులయూ ప్రశంసలూ, అనుబంధములూ నింపిన తన భండారము ప్రదర్శించుకోగలదు. రాజనరేంద్ర సంచిక, ముఖలింగ కళింగవర్ధంతి, వరంగలు చారిత్రక (కాకతీయ) వర్ధంతి, పత్రిక, గ్రంథభండారము—ఏదిన్నీ కొలదిలో ప్రశంస నుండి జారే పనికాదు. రాబోయే కాకతీయ సంచిక, సరే, పదొకండవవత్సరము మొదలు అప్పుడే రెండవ దశకపు సాఫల్యాలకు ఉదాత్తమైన ప్రారంభ మవుతుంది.

కార్యదర్శులు, పత్రికాసంపాదకులు మున్నగు వారి ప్రత్యేకతాత్పర్యమువల్ల ఈసంస్థ యింతటి అభివృద్ధికి వచ్చిందటు. వ్యస్తముగానూ, సంస్థాంగములుగానూ వీరు ఆంధ్రులకు వంద్యులు.

ఇంతవఱకు సంస్థ కావించిన దేశసేవను ప్రశంసిస్తూ, లోకము మునుముందు అంతము లేని ఆశగా దీనివలన ప్రయోజనములు అర్థిస్తూనే ఉంటుంది. పత్రిక ఉత్తమములైన ఐతిహాసికపత్రికలలో చేరడానికి ఇంకా చాలా మెఱుగులు సంతరించుకోవలెనని తజ్జ్ఞుల అభిప్రాయము. బయట తెలుగువారి ప్రయత్నసాఫల్యాలకు పేరూ పరిచయమూ లేవడమువంటి బోలెడులాభము ఆంగ్లపత్రిక చేయగలదు; కాని, తెలుగున కూడా ఒక ఐతిహాసికపత్రిక నడిపి, అందు, కేవలము తెలుగులో మంచి పరిశోధన వ్యాసాలు వ్రాస్తే అసభ్యముగా కొందఱు ఆంగ్లములో అవి వినియోగించుకొని కీర్తి జుఱ్ఱుతా రన్న అసంతుష్టికీ, సంభవతకూ ఎడము తొలగించి మంచివ్యాసాలు తెలుగున రచింపించి ప్రకటిస్తూ ఆంగ్లముద్వారా కూడా మనవారిప్రతిభకు పన్నె వెలిగించే పని మండలి చేపట్టవలసినదే. దీనికి తోడు మండలి వారు ఒక గ్రంథమాలను నడిపి, ప్రతిభావంతుల వ్యవసాయఫలము పరిణతపఱిచి చరిత్రగ్రంథములు నవ్యరీతిని వెలువఱుస్తూ, దేశములో చరిత్రపరిజ్ఞానము నెడల ఆసక్తి పండించే ప్రయత్నాలు చేయడానికి అవకాశాలు చూచుకోవలె నన్నది సంపర్భము నంటిన మాట కాకపోదు. ఉన్న అవకాశాలు వదలుకొనే మాంద్యము లేక ఈ సంస్థ చుఱుకుదనముతో పనిచేసేది కావడము ఒక భాగ్యము. ఆ చేసేది ప్రశస్తముగా కూడా చేయగల దన్న ఆశ లోకములో ఎంత పరిపుష్ట మయితే దీనిది అంతటిజయము.

---

## మాస్కో కేసు

మాస్కో రషియాదేశమునకు ముఖ్యపట్టణము. ఇచ్చట "మెట్రొపొలిటన్ వికర్సు" అను ఇంగ్లీషువారి యంత్రాలయము గలదు. అది రషియనుప్రభుత్వమునకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేయును. అచటి ఇంజనీరులు కొందరు యుద్ధసమయమున రషియనులకు ఇబ్బంది కలుగజేయవలెననెడి యుద్దేశముతో పనిము ట్లన్నియు పాడుచేయుటకు రషియను పనివాండ్రకు లంచమిచ్చిరనియు, రషియనుసైనికరహస్యములు కనుగొని వారిగుట్టంతయు తెలిసికొనుటకు గూఢచారులుగా ప్రవర్తించుచున్నా రనియు రషియనుప్రభుత్వము వారిపయి నేరము మోపెను.

ఈ నేరమునందు ముద్దాయీలు ఆరుగురు ఇంగ్లీషువారు—థారంటను, మాక్డనాల్డు, మాంకుహౌసు, నార్డ్వైలు, కుష్నీ, గ్రెగరీ. మొదటి యిద్దరికి వరుసగా 3, 2 సంవత్సరముల ఖైదు విధించిరి. మాంకుహౌసును, నార్డ్వైలును, కుష్నీని రషియానుండి వెడలగొట్టిరి. గ్రెగరిగారిని విడిచి పెట్టిరి.

వీరిపై మోపిన నేరములకు వీరికి విధించిన శిక్షలు న్యాయ్యములా, అన్యాయ్యములా అను చర్చతో పని లేదు. కాని ఒకమాట—రషియన్ ప్రభుత్వమువారు కేసు ఘోరమయిన దని వర్ణించి యుండవచ్చును. కాని బ్రిటిషువారు వా రసలు నేరమే చేయలేదని వాదించుట అసందర్భము. ఎందుకన రషియాస్వతంత్రదేశము. నిందితులు ఆదేశములో ఉన్నంతకాలము వారిని తగురీతిని శిక్షించుటకు రషియన్ప్రభుత్వమున కధికారము కలదు. ఇంగ్లీషుప్రభుత్వము దీనిని గమనింపక శిక్ష చెప్పక పూర్వమే వారిని వదలి వేయమనుట అవమానకరము. నిప్పులేనిదే పొగరాదుకదా! ఏమాత్రము నేరముచేయనిదే రషియావారు అనవసరముగా బ్రిటిషువారితో కలహము పెట్టుకొనుటకు సాహసింపరు. అదియుగాక నిందితులలో మాక్డనాల్డు ఒకమారుగాక రెండుమారులు తాను నేరముచేసితి నని ఒప్పుకొనెను.

మాస్కో శిక్షలు ప్రపంచమంతటను అలజడి కలుగ జేసినవి. ఇంగ్లాండు రషియాలకు యుద్ధము సంభవించు ననుకొనిరి. ప్రథమముననే బ్రిటిషువారు రషియనుదిగుమతులను నిషేధించిరి. అందువలన దానిపర్యవసాన మెట్లు తేలు నని ఆదుర్దాతో ఎదురుచూచుచుండిరి.

సోవియటు కఠినశిక్షలకు పేరు మోసినది గాన ఇంగ్లీషువారి కట్టివే విధింపబడు ననుకొనిరి. వీరదృష్ట

యిన క్రిందటి దినముననే ౩౪ గురు కాల్చబడిరి. కాని అనుకొనినదానికంటె తేలికగానే శిక్షలు విధింపబడినవి.

భారతదేశమందు కొన్ని పత్రికలు రషియాదేశ మనాగరికదేశమనియు, నది పోయిన యూరపునకు పీడ వదలుననియు ననినవి. కాని రష్యాప్రభుత్వము భారత ప్రభుత్వముకన్న ఎక్కువ నాగరికత కలదనుటకు వారు ప్రతిక్షుఖైదీలకు ఇచ్చు సౌకర్యములే నిదర్శనము. చదువుకొనుటకు పత్రికలు, శరీరారోగ్యమునకై వ్యాయామము చేయ ననుమతియు వారి కీబడినవి. భారతదేశమున నిట్టి యేర్పాటుకలదా? రాజకీయ శిక్షితులెందరు ఆరోగ్యమును గోల్పోవుచున్నారు? క్రిందితరగతి ఖైదీలకే కాక మొదటితరగతివారికిగూడ నిదేగతి.

## జాయింటు పార్లమెంటరీకమిటీ

భారత రాజ్యాంగ ప్రణాళికను నిర్మించుటకు గాను జాయింటు పార్లమెంటరీ కమిటీ అను సంఘమొకటి యేర్పడినది. ఆసంఘమువారు తయారుచేసిన ప్రణాళిక బిల్లు రూపముగా పార్లమెంటున ప్రవేశ పెట్టబడును. వారియామోదముపై అది యిండియాలో ప్రవేశపెట్ట బడును. కావున ప్రస్తుతము భారతదేశపు భాగధేయము పార్లమెంటు ఇష్టానిష్టములమీద ఆధారపడియున్నది.

ఈజాయింటు పార్లమెంటరీకమిటీకి కామన్సు సభ్యులు ౧౬ మంది, ప్రభువులసభనుండి ౧౬ గురు, భారతదేశమునుండి ౨౫ గురు సభ్యులాహ్వానింపబడిరి. వీరియందు సంస్థానముల ప్రతినిధులు ౭.

కాని యీసందర్భమున రెండువిషయములు ముఖ్యముగా గమనింపవలయును- ౧. భారతప్రతినిధుల యభిప్రాయానుసారము వీరుకార్యమునుకొనసాగింతురా? ౨. భారతప్రతినిధులు నిజముగా భారతప్రతినిధులా?

ఇంగ్లండులోని రెండు పార్లమెంట్లు (House of Lords and House of Commons) కలిసి చేసె డిది కాబట్టి యీకమిటీ కీపేరు వచ్చినది. ఈపేరును బట్టియే భారతీయుల కీకమిటీలో నిజమయిన స్థానము లేదని తెలియు చున్నది. వారికి వోటింగుహక్కుండదని హోరుగారు తెలిపిరి. కోర్టులో అసెసరుల కెంతగౌరవ ముండునో వీరికి నంతేగౌరవ ముండును.

ప్రజాప్రతినిధి యనగా ప్రజల మనసెరిగి వారి యభీష్టముప్రకారము వర్తించువాడని యర్థము. ప్రస్తుతము పై కమిటీకి వెళ్లువారు దేశీయుల అభిప్రాయములను వెలిపుచ్చుటకు అర్హులయి యుండవలెను. కాని యిప్పు డాహ్వానింపబడిన ప్రతినిధులందరు ప్రభుత్వము వారి యిష్టముబడి మెలగెడివారేకాని ప్రజాప్రతినిధులు గారు. దేశమున పలుకుబడి గలది, దేశీయుల ప్రేమాభిమానములను చూరగొనినది కాంగ్రెసుసంస్థ. దాని నాయకుడు మహాత్ముడు. వీరి సహకారములేనిది ఎట్టి సంస్కరణములు భారతదేశమున పనిచేయజాలవు. అట్టి ప్రయత్న మిసుకతో త్రాడుపేనుట.

## కీ. శే. అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు

శాస్త్రిహృదయమునకు సంస్కార మతిమాత్రము. భావుకత మరిని. విమర్శనలయం దారితేరినచేయి. ఆంగ్లమునకలాచార్యత్వ మబ్బినది. ఆంధ్రగీర్వాణముల చక్కని వైదుష్య మలవడినది. తెలుగున కవనమల్ల నేర్పుకూడినది.

పలుచోటుల ఆంగ్లసంస్కృతాచార్యత్వము వీరికి అధికారులయు, విద్యార్థులయు ప్రీతిగౌరవముల నొనగూర్చినది. కాకినాడ కళాశాల వీరి జీవితనాటకమున కుపాంత్యరంగస్థానమయినది. మృత్యుచ్ఛాయ క్షయ వీరిపై బడినది. రానురా నది ముమ్మరముసూపి లాభము లేదనిపించినది. జన్మభూమియందలి గౌరవము వీరిని చివర నాళ్లకు కృష్ణామండలములోని చింతలపాడు జేర్చినది. అక్కడనే అనుజీవులయెదుటనే వీరు కడచినమార్చి౧౪-వ తేదినాడు యశఃకాయమును మిగిల్చి పరమపదమునకు దారితీసిరి. అతనివెనుకనున్న వారి పడుపాట్లసంగతి అతని కెందుకు, అతని మార్గదర్శి మృత్యువున కెందుకు?

భారతికి వీరుకైసేసిననానావ్యాసములు వీరిభావుకతను, విమర్శకతను లోకమునకు నివేదింపజాలును. విధికృతమతప్పరానిదని భారతి స్వయమూరడిల్లి, తనతోటి వారినాశ్వాసించుచు వీరియాత్మకు శాంతినిగోరుచున్నది.

తా. క. 'కర్తవ్యము' 10-వ పంక్తిలో 'శుభసూచకముగా' అనుటకు 'అశుభసూచకముగా' అని సవరించుకొనవలయును.




199

ప్రపంచవ్యవహారములువిచిత్రముగనున్నవి. న్యూయార్కునందు రాజమందిరము లందును, స్టీమరులందును రూజువెల్టు రామ్సె మేగ్డొనాల్డుగారులు, నితరదేశముల ప్రతినిధులు ప్రపంచోద్ధరణమునకు మంత్రాంగములు చేయుచున్నారు. సంపన్నములైన అమెరికా బ్రిటిషురాజ్యములు ద్రవ్యోపార్జన సాధనముల నన్వేషించుచున్నవి. పూర్వకాలమునందు విష్ణుశర్మ ప్రోక్తమైన పంచతంత్ర ప్రయోగము వేయిరెట్లు న్యూయార్కునందు గూడిన రాజ్యతంత్రజ్ఞుల మంత్రాంగమునందు గోచరంబగుచున్నది. అమెరికాపక్షమునను రూజువెల్టుగారప్పుల సమస్యను మినహాయించి వ్యాపారవాణిజ్యార్థికసమస్యలను సంప్రతించుటకు సంసిద్ధులుగ నున్నారు. అమెరికాకీయవలసిన అప్పులను చెల్లించెడివిషయమునకీసమావేశమునందు ప్రమేయము లేదని రూజువెల్టుగారు విస్పష్టము చేయుచున్నారు. పడిపోయిన కోట్లరూప్యముల అమెరికావ్యాపారము నుద్ధరించుట యీ సమావేశమునకు ప్రయోజనము గాని ప్రపంచార్థికస్థితి నుద్ధరించుట యీ సమావేశమునకు ప్రయోజనము గాజాలదు. అప్పులయందు మునిగియున్న దేశముల నప్పులనుండి తేల్చునంతవరకును ప్రపంచమునం దార్థికోద్ధరణము సాధ్యముగాదు. పాశ్చాత్య రాజ్యతంత్రములకు మూలబీజమైన పరాక్రమణతంత్రము సకలానర్థములకును మూలముగ నున్నది. శ్వేతజాతులు పారతంత్ర్యజాతులను రాజకీయార్థికాది పాశబంధములనుండి విమోచనముచేయు పరాక్రమణమార్గమును విడువనంతవరకును ఆర్థికోద్ధరణము దుర్లభము.

అమెరికారాజ్యము ప్రపంచవ్యాపారము నాకర్షించుటకు జూపుచున్న యుత్సాహమును అప్పులను సవరించుటయందు జూపుట లేదు. ప్రపంచమునందుగల బంగారమునందు సగమును అమెరికా పాతరవేసియును, బంగారునాణెముల చలామణీనాపియును వ్యాపారమునందు ప్రతిబంధకములను గలుగజేసినది. కొంతకాలమునకు పూర్వము పర్మనుశాసనానుసారము వెండిని పాతరవేసినది. ఇపుడు తిరిగి బంగారముతోపాటు వెండినికూడా పాతరవేయుటకు పూనుకొనుచున్నది. నాకాయుష్యము నాకారోగ్యము నీతి ప్రపంచమునం దార్థికోద్ధరణమును, శాంతిస్థాపనమును జేయజాలదు. అమెరికా యవలంబించుచున్న రాజ్యతంత్రమే యితర పాశ్చాత్యరాజ్యములందును వ్యాప్తమై, ప్రపంచమునం దార్థికోద్ధరణము దుర్లభముగ

నున్నది. ఆర్థికోద్ధరణసమస్య యూరపు రాజ్యములను, ప్రపంచమును నాశనము చేయుచున్న ఆయుధధారణ సమస్యమీదను, సుంకముల సమరసమస్యమీదను నాధారపడియున్నది. లండనులో నచిరకాలముననుగూడనున్న ఆర్థికసమావేశమును ఆర్థికోద్ధరణమునకు సాధన మగునని నమ్ముటకు సూచనలు గనుపడవు. ఆయుధవిసర్జనమువలె సుంకముల విసర్జనమును నిరాదరణమును బడయుచున్నది. చిరకాలము నుండియును ఫ్రాన్సు సుంకములను విధించుచు స్వీయవ్యాపారరక్షణమును చేసికొనుచున్నది. ఇపు డామార్గమును ఫ్రాన్సు విరమించుట దుర్లభము. కన్సర్వేటివు పక్షబలముతో నిండియున్న గ్రేట్బ్రిటను సుంకములను విరమించునని తోచదు. పరాధీన దేశములకు మాత్రము బలవంత బ్రాహ్మణార్థము గలుగగలదు. అన్యోన్య విశ్వాసము లేకను స్వప్రయోజనపరాయణత్వమునందు మునిగి తేలుచున్న రాజ్యముల సమావేశ మార్థికోద్ధరణమునకును, ధర్మోద్ధరణమునకును నిరుపయోగము.

ఆయుధవిసర్జన సమస్య

హెండర్సనుగారి ఆధిపత్యము క్రింద సమావేశమయిన ఆయుధవిసర్జన సభయం దభివృద్ధి గనుపడుటలేదు. బ్రిటీషువిధానమును జర్మని ప్రతిఘటించుచున్నది. ఫ్రాన్సుదేశము ననేమిరాయను రీతి నాయుధవిసర్జనమును సకలవిధములను ప్రతిఘటించుచున్నది. హిట్లరుగారి నాయకత్వము క్రిందను జర్మనియం దాయుధధారణ విజృంభణము ఫ్రాన్సునందే కాక యూరపునం దంతటను కలవరమును గలుగజేయుచున్నది. గ్రే ప్రభువుగారు పత్రికలందు దెలిపినటులు ౧౯౧౪ సంవత్సరపుటుదంతమును హిట్లరుగారి విజృంభణము సంస్మరింపజేయుచున్నది. కాని కోరలు లేని పామువలెను జర్మని చేయుచున్న బుసబుసలు భయభ్రాంతులను గలుగజేయక పోయినను ఆయుధవిసర్జనమునకును, ఆయుధ నియమనమునకును ప్రతికూలముగ నున్నవి. జర్మని అయిదేండ్లయం దితరమహారాజ్యములతోపా టాయుధధారణమును చేయగోరుచున్నది. అన్ని రాజ్యములును మాటలయం దాయుధవిసర్జనమును సమర్థించుచున్నను కార్యములం దపారముగను నాయుధధారణమును చేయుచున్నవి. రాజ్యాదాయమునందు సగముభాగ మాయుధధారణమునకు వ్యయమగుచున్నపు డార్థికోద్ధరణము దుస్తర మగుచున్నది.

చీనా జపాను సమర మీయుదంతమునకు నిదర్శనముగ నున్నది. ఇప్పటికి నాలుగుమాసములనుండియును జపాను చీనాయందు సంగ్రామప్రస్థానమును చేయుచున్నను నిరోధించుట యెవరికిని సాధ్యము గాకున్నది. చీనా పరాజయమును, జపాను విజయపరంపరలను బడయుచున్నవి. జపాను విజయములు రుష్యా జపాను సంరంభమునకును బీజాంకురములు గావచ్చు నను చిహ్నములు మంచూరియా రైలుతగాదాయందు గోచరం బగుచున్నవి. జినీవాయం దాయుధ విసర్జనసభయును, చీనాయందు మహాసంగ్రామమును ప్రపంచము నావరించిన సందిగ్ధావస్థకు నిదర్శనములు. మాటలయం దాయుధ విసర్జనమును, కార్యములం దాయుధధారణ

మును ప్రమాణములైన విధమును సమావేశముల వ్యవహారములు సర్వత్ర విశదము చేయుచున్నవి. ఆయుధవిసర్జన సమావేశము వలనను వర్తమాన ప్రపంచపరిస్థితులందు కొంత యైనను ప్రయోజనము గలుగునని తోచదు. వివిధరాజ్యములును సంగ్రామ సన్నాహములను పూర్వమువలెనె చేయుచున్న సమయమునందు, చీనా జపానురాజ్యములు ఘోరసంగ్రామమునందు మునిగియున్న సమయమునందు, రుష్యారాజ్యము సంగ్రామప్రయత్నములను జేయుచున్న సమయమునందు, నానాజాతిసమితి నిస్సహాయస్థితియందున్న పరిస్థితులం దాయుధవిసర్జనసభ వలనను ప్రయోజము గలుగునని నమ్ముట కవకాశములు గనుపడవు. ప్రపంచమునందు శాంతిశకము స్థాపనమగుటకు ఘోరమైన దుఃఖానుభవ మవసరమని ప్రపంచపరిస్థితులు విశదము చేయుచున్నవి. రాజ్యతంత్రజ్ఞులు రాజ్యాంగపాశములను నిర్మించుచున్నను ప్రజాహృదయమునందు ప్రవర్ధమానంబగుచున్న ఆత్మవిశ్వాసమును మెయి ప్రథమ దినోత్సవములు విశదము చేయుచున్నవి.

* * * *

'మెయి' ప్రథమదినోత్సవములు

ప్రపంచమునం దంతటను 'మెయి' ప్రథమదినోత్సవము లత్యంతవైభవోత్సాహముతో జరుపబడినవి. సోవియటు రుష్యాయందు ప్రజాస్వామ్యమును, ఆయుధధారణమును సమానప్రతిపత్తిని బడసినవి. వాయువిమానములు, టాంకులు, సైనికదళములు, రక్తధ్వజములు, రక్తవస్త్రములు, జనసమూహములును నీయుత్సవమున కపూర్వమైన మహత్త్వమును గలుగజేసినవి. స్టాలియనుగారి నాయకత్వముక్రిందను నిరంకుశవిధానము ప్రజాస్వామ్య నామమున నప్రతిహతముగను సాగుచున్న విధమును మెయిమాస ప్రథమదినోత్సవము హృద్యముగను విశదము చేసినది. జర్మనియం దీయుత్సవము మార్క్సు జయంతిరూపమును, జర్మనుమహత్వ సంస్మరణరూపమును దాల్చినది. హిండెన్బర్గుగారు "భావియందధికారమును బడయగోరువారు వర్తమానమునందు బాధ్యతలను వహింపవలసి యుందురు" అని జర్మను యువకులకు చేసిన హితోపదేశము భారతీయులకును నన్వయించుచున్నది. ఫ్రాన్సుదేశమునందు ప్రజలు పనిపాటులు చాలించి యుత్సవములను జరిపిరి. అమెరికాయందు బాంబులు ప్రేలినవి. లండనునగరమునందును ఇతర నగరము లందువలెను ప్రశాంతముగను నుత్సవములు జరిగినవి. ఇతర దేశములందువలెను హిందూస్థానమునందునుచాలచోట్లను 'మెయి' దినోత్సవము ప్రశాంతముగను జరిగినది. ప్రపంచమునం దంతటను వ్యాపనమును గాంచిన 'మెయి'దినోత్సవములు దినదిన ప్రవర్ధమానం బగుచున్న కార్మికబలమునకును, కార్మిక ధర్మమునకును నిదర్శనములుగ నున్నవి. స్టాలియను, హిట్లరు, రూజువెల్టు, మాక్డొనాల్డుగారులు మొదలగు రాజ్యాంగ తంత్రజ్ఞుల స్థానబలమునకును, కార్మికుల ధర్మ బలమునకును గలుగుచున్న మహాసంరంభ ఫలము కాలగర్భమునందు గలదు. ఆచార పాశబద్ధమైన ప్రపంచము జ్ఞానప్రదమైన స్వాతంత్ర్యమును బడయుట కపారమైన

దుఃఖానుభవ మవసరమగుచున్నది. ప్రపంచ వ్యాప్తమైన పాశ్చాత్యసంస్కారము స్వాతంత్ర్యప్రాప్తికి బాహ్యసాధనములందు గల లక్ష్యము నభ్యంతరసాధనములందు లగ్నము చేయకున్నది. ప్రజాస్వాతంత్ర్యసిద్ధికి లక్ష్యమైన మెయిదినోత్సవమునందును సైనికులు, సైనికబలచిహ్నములైన విమానములు, టాంకులు, జెపెలునులు, పతాకములు ప్రముఖములైనటులు మానవధర్మము ప్రముఖము గాకున్నది. మానవధర్మసంస్థాపనమునకు పశుబల ప్రయోగ మంతరించి ధర్మబలప్రయోగము సాధ్యమగుటకు ప్రపంచము ఘోరమైన తపస్సును చేయవలసియున్నది. ఆత్మోద్ధరణమునకై వినియోగపడవలసిన రాజకీయమతసాంఘికార్థిక విద్యాదివ్యవస్థలు పరపీడనమునకును ఆత్మనాశనమునకును వినియోగపడుచు ప్రపంచపరిణామమునందు మహాసంక్షోభమును గలుగజేయుచున్న విధమును సకలదేశవ్యవహారములను వేయిముఖములను చాటుచున్నను ధర్మోదయము సాధ్యముగాకున్నది.

* * *

హరిజన దినోత్సవములు

హిందూస్థానమునం దంతటను ఏప్రిలు మాసాంతదినమునందు జరిపిన హరిజన దినోత్సవములును మెయి మాసప్రథమ దినోత్సవములవలెను మానవ ధర్మాభ్యుదయోద్యమమునకు నిదర్శనములు. ఆసేతుహిమాచల పర్యంతమైన దేశమునందంతటను నత్యంతోత్సాహముతో జరుపబడిన భజనలు, ఉత్సవములు, సంతర్పణలు, ఊరేగింపులు, సభలు, దానధర్మములు సవర్ణులహృదయమునందును, హరిజనుల హృదయమునందును గలుగుచున్న ధర్మసంచలనమునకు నిదర్శనముగ నున్నను ధర్మప్రతిపత్తికి నిదర్శనముగ గనుపడవు. చిరకాలాభ్యాసమైన సవర్ణుల యభిమానాధిక్యతలు, హరిజనుల దైన్యన్యూనతలు ధర్మప్రతిపత్తికి ప్రతిబంధకములుగ నున్నవి. రాజకీయోద్యమమువలె హరిజనోద్యమము పరాశ్రయోద్యమముగాకను స్వాధీనోద్యమముగ నున్నది. హరిజనోద్యమమునకు సహాయనిరాకరణ సక్రమాందోళన సాధనములకును హిందూమహామ్మదీయ ప్రయోజనములకును ప్రతిఘటనము లేదు. హరిజనసమస్య హిందూసమస్య. ఈ సమస్య మాటలతోగాక చేతలతో సఫలము గావలసి యున్నది.

ఉపన్యాసములు, దానధర్మములు, ధర్మోపదేశములు, పోషకాభిమానము కార్యసాధకములు గావు. ధర్మనిష్ఠ హృదయపరివర్తనము, పశ్చాత్తాపము, కార్యములు సంకల్పసిద్ధికి నిదర్శనములు. పత్రికలును, సభావేదికలును హరిజనోద్ధరణసంకల్పములతో నిండినను ఫలము స్వల్పముగనున్నది. ఆచారపాశబద్ధమును ప్రజ్ఞావాదపరాయణమునునైన హిందూమత సంఘవ్యవస్థలను హరిజనోద్ధరణమునకై సంస్కరించుటయందుగల ప్రతిబంధకపరంపరలను గతించినఆరుమాసములందును పర్యాప్తంబైన హరిజనోద్యమోదంతము సువ్యక్తము చేసినది. పూనాయొడంబడిక విషయమునను, అంటరానితనమువిషయమునను, దేవాలయప్రవేశాదులవిషయమునను భిన్నపక్షములవారును, వర్ణములవారును, మతములవారును, సనాతనులును హరిజనులును గాంధిమహాత్మునిమీద కురిపించిన నిందాస్తోత్రములు హిందువుల

నిస్సహాయస్థితికిని, గాంధిమహాత్ముని హృదయ సంతాపమునకును నిదర్శనములు.

*　　　*　　　*

నిరశనవ్రతము

గాంధిమహాత్ముని సత్యసంకల్పము సామాన్యులకు దురారాధ్యము. సత్యాశ్రయ విరహితమైన ఆచారాశ్రయమును పరాశ్రయమును హిందూమతసంఘములను సత్త్వవిరహితములను జేసినవి. వర్తమానాచారములకు భిన్నములైన సదాచారములును దురాచారములై ఆరాధనయోగ్యములు గాకున్నవి. గాంధిమహాత్ముని హరిజనోద్ధరణసంకల్పము పరమార్థమైనను నిందాపాత్రమైనది. కాంగ్రెసు పక్షావలంబులు మహాత్ముడు దేశలక్ష్యమును ప్రధానమైన రాజకీయమునుండి నిరర్థకమైన హరిజనోద్యమమునందు లగ్నము చేయుచున్నటులు నిందించుట కుపక్రమించిరి. వర్ణాశ్రమ ధర్మాభిమానులు మహాత్ముడు హిందూమతధర్మమును నిర్మూలము చేయుచున్నాడని ఘోషించుట కుపక్రమించిరి. హరిజననాయకులు మహాత్ముడు స్వార్థపరాయణత్వమును బూనినటు లారోపణలను జేయుచుండిరి. మహాత్ముని సత్యసంకల్పమును గ్రహించక యెవరికి దోచినటులు వారు ప్రమేయము లేక పోయినను ఆరోపణములను జేయుచుండిరి.

గతించిన ఆరుమాసములందును హరిజనోద్ధరణమునకు కొంత ప్రయత్నము జరిగినను మానవ ధర్మారాధన పరాయణుడైన గాంధిమహాత్మున కీ ప్రయత్నము లాత్మశాంతిని గలుగజేయజాలకపోయినవి. హరిజనసమస్య హిందూమత సంఘధర్మసమస్యకు కీలకముగ నున్నది. హిందూసంఘమునం దేడుకోట్లమంది అంటరానివా రుండుట మహాత్మునకు సహింపరాని విషయము. సంకుచితమును, జడప్రాయమును నైన హిందూమతసంఘములను విశాలమును, చైతన్యప్రదమును జేయుట కాత్మోద్ధరణము మహాత్మునకు శరణ్యమయినది. మహాత్ముల త్యాగము సామాన్యులకు తాత్కాలికముగ నైనను స్వధర్మనిర్వాహణమునకును, స్వాత్మావలోకనమునకును సాధనముగ నున్నది.

ఆత్మావలోకనమున కాదికాలమునుండియును నుపవాసము సాధనముగ గ్రహింపబడినది. హిందూమతమునం దుపవాసవ్రతము తపస్సునకు కీలకముగను గ్రహింపబడినది. మహర్షులు, మునులు, దైవసంపన్నులు వేల సంవత్సరములు తపస్సు చేసిన యితిహాసములు హిందూమతేతిహాసము లందనంతములుగలవు.

> "కావున నుపవాసవ్రత
> సేవనము శరీరమునకుఁ జిత్తంబునకుం
> బావన మైహికమహిమయు
> దేవనిలయసుఖము నివ్విధిఁ జనుఁ బడయున్."

హిందూమతధర్మములందు విశ్వాసము గల గాంధిమహాత్ముడు తీవ్రోపవాసవ్రతము నాత్మోద్ధరణమునకై పూనుట సహజము. గాంధిమహాత్ముని గుణగణంబుల నెరింగినవారల కీ యుపవాసదీక్షయందు విచిత్రము గనుపడదు. మహాత్ముడు ఆపత్కాలములం దుపవాసవ్రతము నవలంబించి ఆపదలను గడచినయితిహాసములు లోకమున కనుభవవేద్యములు. సత్యసందర్శనమునకై గాంధిమహాత్ముడు సంకల్పించిన యుపవాసవ్రతము ఘోరమైనను ధర్మాత్ములకు సమాదరణీయముగ నున్నది. ఆంధ్రాసుగారి వలె నితరులును సావధానచిత్తులై మహాత్ముని నిర్ణయము నభినందించుట ధర్మము.

మహాత్ముని నిరశనవ్రతము ప్రపంచలక్ష్యమును బాహ్యసాధనములనుండి ఆంతరంగికసాధనములకు మరల్చుటకు వినియోగపడగలదు. న్యూయార్కు, లండను, జినీవాలందు గూడిన రాజ్యతంత్రజ్ఞుల నిర్ణయములకును యరవడా మందిరమునందు గాంధిమహాత్ముడు పూనిననిర్ణయమునకును గల ప్రయోజనముల ఫలమును ప్రపంచము కాలాంతరమునందు గ్రహింపగలదు. గాంధిమహాత్మునివలె నితర హిందువులును మానవధర్మపరాయణులును వారిలక్ష్యమును ఖండనమండనములందుగాక మహాత్ముని సంకల్పమును సఫలముచేయుటకు వినియోగించుట శ్రేయస్కరము. భారత బ్రిటిషు ప్రభుత్వములకును నీసందిగ్ధస్థితియందు మహాత్ముని ఏవిధమైన షరతులు లేకుండ విడుదలచేయుట ధర్మమైయున్నది. మహాత్ముని తీవ్రోపవాసదీక్ష హిందూస్థానప్రజాలక్ష్యమును నిరుపయోగమైన పార్లమెంటు జాయింటు కమిటీ వ్యవహారములనుండి ఆత్మవిశ్వాస సాధ్యమైన స్వయంసహాయమునందు లగ్నముచేయుటకు వినియోగపడగలదు.

* * * *

జాయింటుపార్లమెంటు కమిటీ

శ్వేతపత్రమునందుగల విధాన మేజాయింటు పార్లమెంటు కమిటీ విచారణయందు స్థిరపడుట సహజము. ఇంతవరకును గూడిన రహస్య సమావేశములందు భావికార్యవిధానము నిర్ణయింపబడినది. హిందూస్థానప్రతినిధులు ప్రతినిధుల యధికారమును గలిగియుండకపోయినను ప్రతినిధులుగను వ్యవహరింపబడుదురు. నేడో రేపో హిందూస్థానప్రతినిధులు లండను చేరుదురు. ఆప్రతినిధులతో సంప్రతించి కార్యవిధానము నిర్ణయింపబడును. ప్రతినిధులనామములును, వారి గుణగణంబులును శ్వేతపత్రమువలెనే నిరాశను గలుగజేయుచున్నవి. వర్తమాన సందిగ్ధావస్థయందు బ్రిటీషు జాతీయ ప్రభుత్వ మవలంబించుచున్న రాజ్యనీతి బ్రిటీషు ప్రయోజనములకును నిరుపయోగమని ప్రాజ్ఞులు తలంచుచున్నను బ్రిటిషు ప్రభుత్వలక్ష్యము మాత్రము మారకున్నది. బాల్డువినుగారొక వైపున సానుభూతిని, చర్చిలుగారొక వైపున తీవ్రకాఠిన్యమును జూపుచు భారతరాజ్యాంగప్రహసనమును రసవంతము చేయుచున్నారు.

పయనీరుపత్రిక యిటీవల వ్రాయుచున్న హితోపదేశములైనను ప్రభుత్వాధికారుల చెవులందు జొరబడకున్నవి. కాంగ్రెసు ప్రతినిధులులేని జాయంటు పార్లమెంటుకమిటి నిర్ణయములును, రాజ్యాంగశాసనమును నాయకుడులేని నాటకమువలె నుండును. కాంగ్రెసును నిర్బంధించి వాగ్బంధనముచేసి అభిప్రాయములను తెలుపగోరుట యసంబద్ధము. గాంధిమహాత్ముని, ఇతర కాంగ్రెసు నాయకులను నిర్బంధితులను విడిచిపెట్టుటవలన నేవిధమైన యుపద్రవమును లేదని పయనీరు పత్రిక సహేతుకముగ నిరూపించినది. అధికారులీ శుభసమయమునందు ధర్మనిర్వాహణమును జేయుటకు భగవదనుగ్రహము గలుగుగాత! ప్రపంచమునందును హిందూస్థానమునందును రాజకీయ సాంఘికార్థిక వ్యవహారములేపరిణామమును పొందినను లోకకల్యాణమూర్తియైన గాంధిమహాత్ముని సంకల్పసిద్ధికి హిందువులును, నితరులును త్రికరణశుద్ధిగ పాటుపడుటకు భగవంతుడనుగ్రహించుగాత! హరిజనసంఘాధ్యక్షులు బిర్లాగారు నిర్ణయించినటుల ప్రజలు మహాత్ముని యుపవాసారంభదినమైన ౮-వ తేది వైశాఖ శు॥ ౧౩ సోమవారముపవాస ప్రార్థనలతో గడపి మహాత్ముని సంకల్పమును సార్థకము చేయుదురుగాత!

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.